# హైదరాబాదు స్వాతంత్ర్య పోరాటం

## అనుభవాలు, జ్ఞాపకాలు

ఆంగ్లము :

స్వామి రామానంద తీర్థ

తెలుగు సేత :

హరి. ఆదిశేషువు

ప్రచురణ :

స్వామిరామానంద తీర్థ స్మారక సంఘం

ప్రభాతప్రచురణ సమితి

1984

# ప్రకాశకుల నివేదన

ప్రభాత ప్రచురణసమితి పునరుద్ధరణ తలవని తలంపు. సమితిని పునరుద్ధరించడం జరిగినప్పటికీ ఆర్థిక వనరులుసరిగా సమకూర్చుకోవటం జరుగలేదు

సమితి పునరుద్ధరణ ఎంత ఆకస్మికంగా జరిగిందో అంతే ఆకస్మికంగా కృష్ణాజిల్లా స్వాతంత్ర్యోద్యమ చరిత్రప్రచురణ జరిగింది దాని ముద్రణ వ్యయాన్ని ఆంధ్రదేశములోని సుప్రసిద్ధ వదాన్యులు శ్రీ చింతలపాటి వరప్రసాదమూర్తిరాజుగారు భరించి సమితికి ఎంతో ఉపకారంచేశారు అట్లే "హైదరాబాద్ స్వాతంత్ర్యపోరాటం- అనుభవాలు- జ్ఞాపకాలు" అనే స్వామిరామానందతీర్థ రచన తెలుగు అనువాదాన్ని రెండవ ప్రచురణగా ప్రచురించే భాగ్యం సమితికి కలిగింది స్వామిరామానందతీర్థ స్మారకసమితివారు అందుకు కావలసిన ఆర్థిక సహాయం చేశారు వారికి మేము ఎంతయో కృతజ్ఞులము స్వామి రామానందతీర్థ కేవలం ఆధ్యాత్మిక జగత్తుకు సంబంధించిన సన్యాసి కాడు. ఆయన ఆధ్యాత్మికత వ్యక్తి ముక్తికి మాత్రమె పరిమితమైనదికాదు దానితోపాటు తనతోటి సోదరులను కూడా బానిస బాధలనుండి విముక్తిని కలిగించి స్వేచ్ఛా పథంలో తమ కృషి సాగించే అవకాశాన్ని కలిగించడం ఆయనధ్యేయం సమాజ శ్రేయస్సే మోక్షగామి అనుకున్న మహాతపస్వి ఆయన. ఆయన నాయకత్వం లేకపోతే హైద్రాబాదు ప్రజానీకానికి స్వాతంత్ర్య వాయువులు

పిల్చుకొనే అవకాశం ఇంతత్వరగా లభించేదికాదేమో! అటువంటి మహా పురుషుని రచనను ఆంధ్రలోకానికి పరిచయంచేసే మహద్భాగ్యం మాకు వచ్చింది.

తెలుగు అనువాదాన్ని గురించి చెప్పవలసివస్తే అది యాంత్రికంగ జరిగిన అనువాదంకాదు. స్వామీజీపట్ల శ్రీహరి ఆదిశేషువుగారిలో నెల కొన్న భక్తి ఈ అనువాదంలో ఉట్టిపడుతుంది. ఆంధ్రలోకానికి స్వామిజీ వ్యక్తిత్వాన్ని ఈరచనద్వారా పరిచయంచేయాలనే తపనతో అనువాదాన్ని చాలా సరళంగాను, అవసరమైనచోట్ల విశదంగాను కూడా చేశారు, అను వాదకులు అనువాదకుల కృషిని ప్రశంసిస్తూ వారికి మా అభినందనలు తెలుపు కుంటున్నాము.

ఉపోద్ఘాతంలో శ్రీ పి వి నరసింహారావుగారు తెలపిచ్చినట్లు స్వామి రామానందతీర్థను విద్యారణ్య సమర్థ రామదాసులతో పోల్చవచ్చు. ఒక విధంగా వారికంటేగూడా స్వామీజీ హెచ్చు ఆధిక్యత కలవారనిచెపితే అతిశ యోక్తి కాదు. అనేకమంది హరిహర బుక్కరాయలను, శివాజీలను, సృష్టిం చిన ఘనత స్వామీజీది ఆయనపట్ల ప్రజానీకానికి కల భక్తి విశ్వాసాలు అపరిమితమైనవి అట్టి మహనీయుని పట్ల మాకు గల భక్తిని వెల్లడిస్తూ వారికిశ్రద్ధాంజలిగా ఈపుస్తకాన్ని ఆంధ్రలోకానికి అందిస్తున్నాము. ఇది ఆంధ్రుల అభిమానాన్ని చూరగొని త్వరలో పునర్ముద్రణ పొందుతుందని ఆశిస్తున్నాము

ఊపిరిసలపని పనులలో నిమగ్నులైయుండికూడ, మేముకోరగానే స్వామీజీపట్ల తమకుగల భక్తి ప్రపత్తులను పురస్కరించుకొని, 'ముందు మాట'ను వ్రాసిన శ్రీపి.వి నరసింహారావుగారికి మాకృతజ్ఞత.

అట్లే ఈపుస్తక ప్రచురణకు అవసరమైన ధనసహాయాన్ని అందించి, మమ్ముల ప్రోత్సహించిన ,స్వామి రామానందతీర్థస్మారక సమితికి, ముఖ్యంగా, కార్యదర్శులు సర్వశ్రీ గోవిందదాస్ షరాఫ్, దామోదరరావ్ పాంగ్రేకర్ గార్లకు మాకృతజ్ఞతా వందనాలు

ఈపుస్తకాన్ని సకాలంలో చక్కగా ముద్రించిఇచ్చిన మాధవి ప్రింటర్సువారికి, ముఖ్యంగా శ్రీ ఊట్ల కొండయ్యగారికి, ప్రచురణాలయ కార్యకర్తలకు మాహృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ పుస్తకంలోగల లోసగులను, అవసరమైన మార్పులనుపాఠకులు కూడా సూచిస్తే వచ్చే ముద్రణలో సవరించుకోగలము

ఇట్లు

**కోదాటినారాయణరావు.**

అధ్యక్షులు,

ప్రభాత ప్రచురణసమితి,

హైద్రాబాదు
1-11-1984.

# తొలి పలుకు

పూజ్యులు శ్రీ స్వామిరామానంద తీర్థ వ్రాసిన "హైదరాబాదు స్వాతంత్ర్య పోరాటపు-జ్ఞాపకాలు" అనే పుస్తకానికి తెలుగు అనువాదం ఆలస్యంగానైనా ప్రచురితమైనందుకు సంతోషిస్తున్నాను. స్వామీజీ ఇంగ్లీషులో వ్రాసిన ఈపుస్తకం వారి జీవితకాలంలోనే ప్రచురణ కావడమూ, అనతికాలంలో ప్రతులు అయిపోవడంకూడా తటస్థించింది వారు బ్రహ్మైక్యం చెందిన కొద్దికాలానికే రెండవ ముద్రణకూడా వెలువడింది ఆ ప్రతులుకూడా ఇపుడు లభ్యం కావడంలేదు ఇందువల్ల ఈ పుస్తకంయెడ పాఠకులు కనబరచిన అభిరుచి తేటతెల్లమవుతున్నది ఈ పుస్తకాన్ని ప్రాంతీయ భాషలలోకూడా అనువదింప జేయవలెనని స్వామీజీ స్మారక సమితి సంకల్పించింది. మరాఠీ, కన్నడ భాషలలో ఈ అనువాదం ప్రచురించడం జరిగింది ఆలస్యమైనాసరే తెలుగు అనువాదం ఇప్పుడు వెలువడుతున్నది ఉర్దూ అనువాదం త్వరలో వెలువడనున్నదని తెలుస్తున్నది

స్వామీ రామానందతీర్థ వ్యక్తిత్వం విశిష్టమైనది మాత్రమేకాదు విచిత్రమైనదికూడా జన్మతః వైరాగ్య సంపన్నుడైన స్వామీజీ, రాజకీయాలలో ప్రవేశించడమేకాక, స్వదేశ సంస్థానాలలో అగ్రగణ్యమైన, అత్యంత క్లిష్టమైన సమస్యల వలయంలో చిక్కుపడిఉన్న హైదరాబాదు సంస్థాన ప్రజాఉద్యమానికి నాయకత్వం వహించటం, స్వాతంత్ర్యం సాధించి ప్రతిజ్ఞ నెరవేర్చుకోవడం ఎంతచిత్రం! సాధారణంగా తురీ

న్యాసాశ్రమాన్ని స్వీకరించినవారు స్వీయవిముక్తి సాధనలో నిమగ్నులై ఆ సాధనలో జీవితాన్ని గడుపుతారు కాని స్వామీజీ శోషిత జన విముక్తి సాధనకై తమ జీవితాన్ని అర్పించారు. కృతకృత్యులైనారు స్వామీజీ జీవితాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తుంటే విద్యారణ్య, సమర్థరామ దాసస్వాములు స్ఫురణకు వస్తున్నారు వారు హరిహరరాయలు శివాజీల ద్వారా స్వాతంత్ర్య సంగ్రామాలు జరిపిస్తే స్వామీజీ తానే స్వయంగా నాయకత్వం వహించి జనసందోహాన్ని స్వాతంత్ర్య సమరాంగణంలోకి దూకించారు ఈ సంగ్రామపు జ్ఞాపకాలలో కొన్నిటిని స్వామీజీ స్థూలంగా స్పృశిస్తూ ఈ పుస్తకంలో ఉల్లేఖించారు బాల్య వైరాగ్యసంపన్నులైన స్వామీజీ సూక్ష్మంగా వివరంగా ఈ పుస్తకాన్ని వ్రాస్తే ఎన్నో ఉపాఖ్యానాలను వివరించవలసివుండేది ఎందరో వ్యక్తుల చర్యలు విమర్శించ వలసివుండేది స్వభావతః ఇది ఆయనకు గిట్టనిపని అందుకని ఆయన తనజ్ఞాపకాలను గూడా స్థూలంగానే స్పృశించారు

ఇక అనువాదాన్ని గురించి - తెలుగు అనువాదం సరళంగానే కాక సహజమైన భాషలో వివరంగావున్నది చదువుతుంటే ఎక్కడో ఒకటి రెండు సందర్భాలలోతప్ప తెలుగులో వ్రాసిన పుస్తకంలాగే ఉన్నది క్లిష్టమైన సందర్భాలలో, వివరణాత్మకంగాకూడా ఉన్నది ఇంత చక్కగా అనువదించిన శ్రీహరి ఆదిశేషువుగారిని నేను అభినందిస్తు న్నాను

స్వామిజీ రాగద్వేషాలకు అతీతులైనట్లే సంప్రదాయ [illegible], ప్రాంతీయ తత్వాలకు అతీతుడు తాను మధ్వ సంప్రదాయానికిచెందినా ముద్రణ ధారణకు అంగీకరించని ఉదంతమూ, సన్యాసాశ్రమ సంప్ర దాయాలకూ, లాంఛనాలకూ కట్టుబడియుండని వృత్తాంతమూ ఈపుస్తకం

చదివినవారికి బోధపడుతుంది. అట్లే పుట్టుక కర్నాటక ప్రాంతంలో, పెరుగుట, విద్యాభ్యాసమే కాకుండా యౌవ్వనపు ఉత్తమ భాగమంతా మహారాష్ట్రంలో స్వాతంత్ర్య పోరాటమూ, బ్రహ్మైక్యమూ ఆంధ్రప్రాంతంలో, ఈ విధంగా ఆయన జీవితము విచిత్ర పరిస్థితులతో కూడుకొని పోయింది.

ఆజన్మ వైరాగ్య సంపన్నుడైన స్వామీజీ హైదరాబాదు రాజకీయ నాయకత్వం వహించటం ఈ సంస్థాన ప్రజల అదృష్టమని చెప్పవచ్చు. అందునా అస్మదాదులమైన అనేకమందికి, ఆయన సాహచర్య మబ్బటం ఇంకా అదృష్టం మాకు ఆయన కేవలం రాజకీయ నాయకుడేకాదు శీల సంపదను తీర్చి దిద్దిన దేశికోత్తముడు. మౌనముద్రాలంకృతుడైన దక్షిణామూర్తి దర్శనమాత్రాననే, ఆయన శిష్యులకు సందేహాలు తీరేవట. అట్లే స్వామీజీ సాహచర్యభాగ్యంవల్ల మా వ్యక్తిత్వం సుసంస్కృతమైంది.

ఈ పుస్తకం అనేక ముద్రణలుపొంది. ఆంధ్ర యువకులకు స్ఫూర్తి నివ్వవలెనని హృదయపూర్వకంగా ఆకాంక్షిస్తున్నాను.

న్యూఢిల్లీ

పి. వి. నరసింహారావు

—o—

# ముందు మాట

అనేక మంది మిత్రులు ఈ "జ్ఞాపకాలు, అనుభవాలు" వ్రాయవలసిందని ఎంత గట్టిగా చెప్పినా నేను ఆ పని ప్రారంభించలేదు. అవి అన్నీ జరిగి ఇప్పటికి చాలాకాలం గడిచింది. అంతేకాకుండా మరికొన్ని ఇతర కారణాలు కూడా ఉన్నాయి. మొట్టమొదటిది ఆ పని చెయ్యడానికి నన్ను అంతర్వాణి ప్రేరేపించక పోవడమే వీటిలో ఇంతా చేస్తే ఏముంది? వ్రాయడానికి ఏమంత అమూల్యమైనవి ఉన్నాయి? అనే భావం నా మనస్సులో ఎప్పుడు మెదిలేది. అసలు వీటి ఆవశ్యకతను గురించి నాకు నమ్మకం కలగలేదు. మరొక బరువు కూడా నా మనస్సును కిందికి దిగలాగేది ఇప్పుడు నేను నిర్వహించనున్న ఈ పనిలో వ్యక్తిగత విషయాల వివరణ తప్పకుండా వస్తుంది. స్వోత్కర్షాద్యోతకమైన వాక్యాలకు తావు ఉంటుంది. అందుచేత మానవ సాధ్యమైనంత వరకు వాటిని పరిహరించే ప్రయత్నం చేశాను. అందువల్లనే వీటిని వ్రాయడం పట్ల నా వైముఖ్యం మరి కొంతకాలంపాటు ప్రదర్శితమైంది. కాని, భారతదేశం అంతటా వ్యాపించి ఉన్న నా మిత్రులూ సహచరులూ చూస్తూ ఊరుకోలేదు. మొత్తం మీద వారి పట్టుదలా మాటా కాదనలేక పోవడం వల్ల ఇప్పుడు ఈ రచన కావించడం జరిగింది.

ఈ "జ్ఞాపకాలు, అనుభవాలు" ఇటీవలి చరిత్ర లోని ముఖ్యఘట్టాలు. మన దేశ స్వాతంత్ర్య పోరాటంలో చాలా ముఖ్యమైన దశాక్షానికి సంబంధించినవి. భారత స్వాతంత్ర్య సంగ్రామం లోని తుది పోరాటానికి హైదరాబాదు గడ్డ రణరంగమైంది. అక్కడ లభించిన విజయం భారతదేశ స్వాతంత్ర్యమూ ఐక్యతా సంపూర్ణం, సుస్థిరం, అయ్యేటట్లు చేసింది. అందుచేత చారిత్రక ప్రాధాన్యతలో దానికదే సాటి. ఆ సంఘటన అత్యుత్కృష్టమైంది; ఉన్నతమైంది అని అనవచ్చు. అందులో పాల్గొన్న నాయకులు, కార్యకర్తలు ఎవరు అనే అంశం ప్రధానమైంది

కాదు. ఈ ఆలోచనలు ఇట్లా రూపొందగానే నా మనస్సులో అంతవరకు తిష్ఠవేసుకుని ఉన్న వ్యక్తిగతమైన సందేహాలు పక్కకు తొలగిపోయాయి. నా మనసు తేలికైంది. వెంటనే కలం చేతబట్టి ఈ రచనను పూర్తి చేశాను. అట్లా చేసేటప్పుడు వ్యక్తిగత విషయాలు లేకుండా ఉండేటట్లు ఎంత ప్రయత్నించినా కొన్నింటిని పూర్తిగా మాటుపరచడం సాధ్యం కాలేదు వర్ణితమైన విషయాల తోటీ సంఘటనల తోటీ ఉన్న లంకె సహజమైనందువల్ల అట్లా జరగడం తప్పనిసరి అయింది.

ఈ నా కృషి ఫలితము, హైదరాబాదు సంస్థాన ప్రజల స్వాతంత్ర్యం కోసం జరిగిన పోరాటంలో త్యాగాలు చేసి, ఎన్నో కష్ట నిష్ఠురాలకు, బాధలకు గురియైన పరమాత్మ స్వరూపులకు వినయపూర్వకంగా నేను సమర్పించే కానుక. తమ సోదరులు స్వాతంత్ర్య జ్యోతి కాంతిలో సుఖ సంతోషాలతో వర్ధిల్లాలని తమకున్నదంతా పణంగా పెట్టిన త్యాగమూర్తులు, అసంఖ్యాకులు అయిన ఆ దేశ భక్తులకు అంజలి ఘటిస్తున్నాను.

నా ఆప్త మిత్రుడు, సహచరుడు అయిన శ్రీ కాశీనాథ్ జోషి, వ్రాతప్రతిని అచ్చు కోసం తయారుచేయడంలో సాయం చేయకుండా ఉన్నట్లయితే ఈ జ్ఞాపకాలు, అనుభవాలు (ఆంగ్లరచన) ప్రకటన యోగ్యమయేది కాదు. శ్రీ కాశీనాథ్ స్వతంత్ర పోరాటంలో కాకలు తీరిన జాతి రత్నము. ఆయన నాతో కలిసి గత ఇరవై సంవత్సరాలుగా పనిచేస్తున్నాడు. ఎంతో ఓర్పుతో ఆయన నా వ్రాత ప్రతిని ఒకసారి, మరొకసారి, ఇట్లా అనేక మార్లు తిప్పి చెయ్యడం జరిగింది. ఆయన నాకు చేసిన సహకారానికి హృదయపూర్వకమైన కృతజ్ఞత.

హైదరాబాదు
2 అక్టోబరు, 1966

స్వామి రామానంద తీర్థ

# తెలుగు రచన గురించి

ఈ తెలుగు రచనకు

పూజ్యులు, స్వామి రామనందతీర్థ ఆంగ్ల రచన ఆధారము.

స్వామీజీతో నాకు ప్రత్యక్ష పరిచయం లేదు. 1968లో ఆ షష్టి వత్సర కీర్తిమాన్ అభినందన సంచిక చదివాను. ఆ తర్వాత స్వామీజీ కృషితో పరిచయం కలిగింది. హైదరాబాద్ స్వాతంత్ర్య పోరాటము

అనుభవాలు, జ్ఞాపకాలు

అని స్వామీజీ రచించిన ఆంగ్ల రచన చదివాను. స్వామీజీ విశిష్ట వ్యక్తి; ఈ రచన విశిష్ట రచన అని అనిపించింది. ఇది తెలుగులోకి వచ్చిందా? రాకపోతే అది వచ్చే ప్రయత్నం జరగాలి అని కూడ తోచింది.

తెలుగు వారందరూ ఒకటి కావాలి. కలిసి ఉండాలి అని ఆరు వందల ఏండ్ల (1324లో కాకతీయ సామ్రాజ్యం పడిపోయిన నాటి నుంచీ) తెలుగువారు ఆవేదన పొందారు. అది 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడటంతో సఫలమైంది ఈ ఆశయ సిద్ధికి తెలుగువారు ఇరువురి పట్ల సర్వదా కృతజ్ఞతాబద్ధులు.

వారిలో ఒకరు ఆత్మత్యాగమూర్తి,
"ఆంధ్రజ్యోతి" పొట్టిశ్రీరాములు

ఇక రెండవవారు, రాజకీయచతురుడు,
అపర మాధవ విద్యారణ్యులు,
పూజ్యులు, స్వామీ రామానందతీర్థ

హిందూదేశ స్వాతంత్ర్యానికై జరిగిన పోరాటాల్లో చివరి పోరాటం మహాత్మ గాంధీజీ నాయకత్వంలో ప్రారంభమైన "క్విట్ ఇండియా"

ఉద్యమం. ఆ పోరాటంలో తుది రణరంగం హైదరాబాదు సంస్థానం. అక్కడి శాంతిసేనకు దళవాయి పూజ్య స్వామీజీ. స్వామీజీ రధికుడుగా బాపూజీ సారధిగా హైదరాబాదు సంస్థాన ప్రజలు నిజాము నిరంకుశ ప్రభుత్వాన్ని ఎదిరించి పోరాటం సాగించారు విజయం సాధించారు.

హైదరాబాదు సంస్థానం మూడు ముక్కలైంది. ఆంధ్రప్రదేశ్ అవతరణకు దారి ఏర్పడింది అందుకే స్వామీజీ తెలుగుజాతి కృతజ్ఞతకు హక్కుదారులైనారు

భారత స్వాతంత్ర్య పోరాటంలోని తుది ఘట్టాన్ని స్వామీజీ తన రచనలో చక్కగా వివరించారు. అది ఎన్నోసార్లు చదివి ఆనందించాను, స్వామీజీ భావాలను, ఆవేదనను, ఆకళింపు చేసుకునే యత్నం చేశాను. ఆ ప్రయత్నం యొక్క ఫలితమే ఈ రచన. ఇదే స్వామీజీకి నేను సమర్పించే శ్రద్ధాంజలి. కృతజ్ఞతాంజలి. ఈ తెలుగు రచన వివరణాత్మక అనువాదము స్వామీజీ ఆంగ్లరచనా శైలికి జిగి, బిగి, బరువు, తళుకు, వ్యంగ్యరీతి, సహజలక్షణాలు. అందుచేతనే వివరణాత్మక అనువాద విధానమే నాకు శరణ్యమైంది.

శ్రీ కోదాటికి నారాయణరావు, గారి ప్రోత్సాహము నాకు ఈ రచన సాగించేటందుకు, పూర్తి చేయడానికి కొండంత బలం ఇచ్చింది శ్రీ కోదాటికి నా కృతజ్ఞత.

కవికుటీరము
113-బి. సంజీవరెడ్డి నగర్
హైదరాబాదు-500 038

హరి ఆదిశేషువు
29-6-84

# స్వవిషయ పరిచయము

ఇప్పుడు నేను చేపట్టిన కార్యక్రమం వంటిది ప్రారంభించే వారెవరైనా ముందుగా తమ తల్లిదండ్రులు, వంశ వృక్షము, ఆభిజాత్యము మొదలయినవాటిని ముచ్చటిస్తారు, వివరిస్తారు కాని, ఆ విషయంలో నేను నాకు తగిన మార్గాన్నే అనుసరిస్తున్నాను.

చాలా కాలం క్రిందటనే నేను కుటుంబము, ఆనుపూర్వి, తల్లిదండ్రులు, స్వస్థలము, జాతి, రాష్ట్రము అనే వాటన్నిందితోడీ ఉన్న బంధాలు తెంచివేసుకొన్నాను అందుచేత వాటి భావనపూర్తిగా నా మనసులో మిగలకుండా ఇగిరి పోయింది. మరచిపోయిన ఆ స్మృతుల్ని తిరిగి తవ్వి పునరుక్తం చెయ్యడం అనావశ్యకము మెల్లమెల్లగా అడుగులు వేస్తూ నడుస్తూ కాకుండా ఒకచోట నుంచి మరొక చోటుకి గెంతుతూ దూకుతూ ఈనాడు నేనున్న స్థితికి స్థాయికి చెరుకొన్నాను మరొక దృష్టితో చూసిన సన్యాసాశ్రమంలోకి ఇచ్ఛాపూర్వకంగా మొదటిదయిన బ్రహ్మచర్యాశ్రమంనుంచి ప్రవేశించి నందువల్ల, ఆ కుటుంబానికి సంబంధించిన ప్రసంగం చెయ్యడం అనుచితమవుతుంది. అంతేకాదు ప్రతి మానవుడి జీవితంలోనూ అతను ప్రఖ్యాతి చెందినవాడు, సాధారణవ్యక్తి అనే భేదం లేకుండా అతను ఏ తరహావాడు ? అతను జీవించిన పరిసరాల్లో వాతావరణంలో మెలగుతూ తనను తాను ఎట్లా తీర్చిదిద్దుకొన్నాడు ? ఏయే కార్యాలు సాధించాడు ? ఏ కర్తవ్యాలు నిర్వహించాడు ? అనే విషయాలకే ప్రాధాన్యంగాని ఎక్కడ పుట్టాడు ? ఎక్కడ నివసించాడు ? అనే ముచ్చట్లకు ప్రాముఖ్యంలేదు. అందుచేత ఆ విషయాల ప్రసక్తి చెయ్యనందుకు చదువరులు నన్ను మన్నించ వలసిందని మనవి చేస్తున్నాను. అయినా నాకు సంబంధించిన విషయాలలో ఒకటి మాత్రం చదువరులకు

ఆసక్తికరమైనది కావచ్చు. నా పుట్టుక అసాధారణ పరిస్థితులలో* సంభవించిందన్నదే ఆ విషయము. ముగ్గురు సంతానాన్ని కన్న తర్వాత, మా తండ్రి వైరాగ్య భావంతో ఇల్లు వదలి కొంత కాలం సన్యాసిగా సంచరించి, గుర్వాజ్ఞననుసరించి, తిరిగి ఇంటికి వచ్చి, గృహస్థ జీవితం గడపినప్పుడు నేను జన్మించడం జరిగింది. ఆయన ప్రవర్తించిన తీరులో గృహస్థ స్వభావం కంటె వైరాగ్య లక్షణాలే ఎక్కువగా ప్రత్యక్షమయేదని ఆయన గృహస్థు బాధ్యతలలో కాలం గడపకుండా ఎల్లప్పుడు ఐకాంతిక స్థితిలోనే ఉండేవాడనీ నాకు జ్ఞాపకం వస్తుంది. జన్మకు సంబంధించిన ఈ అసాధారణ పరిస్థితిని మినహాయిస్తే నా శైశవము, బాల్యము మనదేశంలో ఆ కాలంలో ఇతర పిల్లల విషయంలో మాదిరిగానే గడిచాయి.

* జ్ఞాన వైరాగ్య సంపన్నులుగా సోదరీ ప్రఖ్యాతి గాంచిన కారణజన్ములు సంత్ శిరోమణి జ్ఞానేశ్వరులూ వారి సోదరీ సోదరులు ముక్తాబాయి, నివృత్తినాథులు సోపాన దేవులు కూడా సన్యాసి - గృహస్థులైన విఠల్ పంత్ - రుక్మిణీ బాయిదంపతుల సంతానమనే విషయము చరిత్ర ప్రసిద్ధము. వారితో జననీ జనక ఆశ్రమ వైపరీత్య సామ్యం ఉన్న స్వామి రామానందతీర్థ కూడ ఒక ప్రత్యేక కార్య ధర్మ నిర్వహణకై పరమేశ్వరుడు నిర్దేశించినట్లు స్ఫురిస్తుంది.

— హరి అనిశేషు.

# విషయ సూచిక


ముందుమాట

తెలుగురచన గురించి

స్వవిషయ పరిచయము

| అధ్యాయము | విషయము | పుటలు |
|---|---|---|
| 1. | జీవన ప్రవంతిలో ఒక మలుపు | 1 |
| 2. | ప్రతిజ్ఞా స్వీకారం | 8 |
| 3. | వివిధ విషయాలు | 19 |
| 4. | సహాయ నిరాకరణోద్యమము-మొదటి అనుభవము | 22 |
| 5. | అమల్నేర్ నన్ను తీర్చిదిద్దింది | 33 |
| 6. | సహాయ నిరాకరణోద్యమము | 42 |
| 7. | పూణేలో | 48 |
| 8. | కార్మిక సంఘ కార్యకర్తగా | 53 |
| 9. | వరం వంటిదైన వ్యాధి | 60 |
| 10. | విద్యాసంస్థ నిర్వహణ | 72 |
| 11. | సన్యాసాశ్రమానికి అభిముఖంగా | 84 |
| 12. | ప్రజా సమస్యల సముద్ర మథనం ప్రారంభమైంది | 100 |
| 13. | తొలి విజయము | 118 |
| 14. | లాటూర్ - రాజకీయాల్లోకి మొదటి అడుగు | 122 |
| 15. | రాజకీయ పరిస్థితులు - తప్పని సరియైన తిరుగుబాటు | 134 |
| 16. | | 149 |
| 17. | వందేమాతరం ఉద్యమంలో ఉపకథ | 160 |
| 18. | ధీరుడైన సత్యాగ్రహి | 166 |
| 19. | నేరంచేసే స్వభావం గురించి ఒక పరిశీలన | 174 |
| 20. | ఉద్యమ విరమణ - సంప్రతింపులు | 177 |

| | | |
|---|---|---|
| 21. | సత్యాగ్రహం - అగ్నిపరీక్ష | 190 |
| 22. | జైలులో ఆధ్యాత్మిక సాధన | 199 |
| 23. | 'క్విట్ ఇండియా' ఉద్యమము | 208 |
| 24. | నాతో స్వాతంత్ర్యోద్యమంలో దూకిన కొందరు మిత్రులు | 222 |
| 25. | ప్రాంతీయ భాషా పరిషత్, సభల అభివృద్ధి | 228 |
| 26. | హైదరాబాదు - కాశ్మీరు | 232 |
| 27. | శిక్షణ తరగతుల ఏర్పాటు - ప్రభుత్వ నిషేధాజ్ఞ | 236 |
| 28. | రాజకీయ ఉద్యమము - ప్రజాబలము | 241 |
| 29. | పరిపాలనా సంస్కరణల నిరాకరణ | 254 |
| 30. | తెలంగాణా అగ్ని పర్వతం పేలింది | 268 |
| 31. | నిజాము కల | 274 |
| 32 | తుది పోరాటము, ముఖ్యమైన ఎత్తుగడ | 285 |
| 33 | చేసిన ప్రతిజ్ఞ నెరవేరింది. | 303 |
| 34. | జైలునుంచి విడుదల- ఆతర్వాత | 329 |
| 35 | కమ్యూనిష్టుల సాయుధ పోరాటం, నా శాంతియాత్ర. | 337 |
| 36. | శాంతిమాత వినోబాజీ | 354 |
| 37. | రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ | 363 |
| 38. | రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ | |
| | హైదరాబాద్ సంస్థాన విభజన | 375 |
| 39. | కాంగ్రెసు- భారతదేశ ప్రజాస్వామ్యము | 378 |
| 40. | మార్పు | 390 |
| | అనుక్రమణిక (Index) | 399 |

# హైదరాబాదు స్వాతంత్ర్య పోరాటము

### అనుభవాలు, జ్ఞాపకాలు

## 1. జీవన స్రవంతిలో ఒక మలుపు

చిన్నప్పటి నుంచీకూడా నాకు సాధువులు, బైరాగులు అంటే ఎంతో ఆసక్తి. వారెవరైనా మా ఇంటికి రావడం తటస్థిస్తే నేను వారి దగ్గరకు చేరేవాడ్ని. వారి హోమగుండం (ధుని, అంటే పవిత్రాగ్ని) దగ్గర కూర్చుని వారిని చూస్తూ కాలం గడిపేవాడ్ని. నాకు అప్పుడు వారు పాడిన తత్వాలుగాని వారు చేసిన ఉపదేశాత్మక వేదాంత గోష్ఠి ప్రసంగాలు కాని అర్థం అయ్యే వయసు కాదు. వారు భోజనంగా స్వీకరించగా మిగిలింది ప్రసాదంగా నాకు తినమని ఇచ్చినప్పుడు నేను పొందిన సంతోషం నాకు బాగా గుర్తు. ఒక్కొక్కప్పుడు వారికి అన్నం వండటానికి వంటకు వాడిన పాత్రలు తోమి శుభ్రం చెయ్యడానికి ఉత్సాహంతో ముందడుగు వేసేవాణ్ని. కాని, వారు నా సేవలు తరచు నిరాకరించేవారు. వారి జీవిత విధానం నన్ను ముగ్ధుణ్ని చేసి కదిలించేది. వారు అక్షరాలా స్వతంత్రులే అనీ జీవన్ముక్తులే అని అనిపించేది. నేను కూడా వారిలో ఒకడిని అవాలని అనేకసార్లు అనుకున్నాను! ప్రాథమిక పాఠశాలలో రెండో తరగతి చదువుతున్నప్పుడు జరిగిన సంఘటన ఒకటి నాకిప్పటికీ బాగా జ్ఞాపకం ఉంది. నాకు

వాగులు, ప్రవాహాలు, నదులు, కొండలు, గుట్టలు, అడవులు అంటే ఎంతో ఇష్టంగా ఉండేది. ఇప్పుడుకూడా వాటిని తలుచుకొంటేనే నాకు ఎంతో ఉత్సాహమూ అంతులేని సంతోషమూ కలుగుతాయి. ఒకరోజున నేను నది ఒడ్డున నిలబడి ఉన్నాను అప్పుడు సాయంకాలం కావస్తోంది. ఒక సాధువు సాయంకాల అర్ఘ్యప్రదానంచేసి జపంచేస్తూ ఉండటం చూశాను. భక్తి పరవశ్యంతో ఆయన కళ్లనుంచి ఆనందాశ్రువులు జాలువారాయి అంతకుముందు ఎప్పుడూ నేను అట్లాంటి దృశ్యం చూడ లేదు. నేను కూడా వినయంగా భక్తి భావంతో ఆయన దగ్గరగా వెళ్లి పక్కనే నిలబడ్డాను. అట్లా ఎంత సేపు ఉన్నానో ఇప్పుడు చెప్పలేను. కాని, చీకటి పడింది అది క్రమంగా ఎక్కువ కాసాగింది. ఇంటికి పోవాలనే తొందరపాటు ఒక వంక లాగుతోంది కాని, నాతో ఉన్న మరోశక్తి ఏదో నన్ను అక్కడే నిలిపివేసింది ఆకాశం నక్షత్రాలతో నిండింది. సాధువు కండ్లు తెరిచి తాను కూర్చున్న చోటునుంచి లేచాడు. నేను ఆయనకు పాదాభివందనం చేశాను. "అరె బాబా ఇక్కడికెట్లా వచ్చావు?" అని ఆయన నన్ను ఎంతో వాత్సల్యంతో అడిగారు. నాకు జవాబు చెప్పేందుకు ఏమీ తోచలేదు. అందుచేతనే నేను మాట్లాడలేదు. అది చూసి ఆయన వెంటనే ఏమి పనిమీద వచ్చావు నాయనా నాదగ్గరికి? అని అడిగారు అప్పుడుకూడా నేను నా మనసులో ఏమున్నదీ చెప్పలేక పోయాను. ఆయన నాముఖంవైపు పరకాయించి చూశారు. నన్ను ఆయన దగ్గరకు ఆకర్షించిన విశేష లక్షణం ఏమిటో తెలుసుకొందా మనుకొన్నట్లుగా ఉంది ఆ చూపు ఆయన కదలి వెళ్లి పోబోతున్నారు. అప్పుడు మరోసారి నాకేసి మాతృ వాత్సల్యంతో చూస్తూ "నీకేం కావాలి? ఏం చెయ్యమంటావు?" అన్నారు. వెంటనే "నేనుకూడా సన్యాసి అయేటట్లు చెయ్యండి" అన్నాను "సరే, అట్లాగే జరుగుతుంది" అని ఆయన మరేమీ అనకుండా వెళ్లిపోయారు. అప్పుడు నాకు "సన్యాసి" అంటే ఏమిటో తెలియదు. దాని అర్థమూ తెలియదు.ఆధ్యాత్మిక సాధనను గురించీ, మానవ జీవితములోని ఉన్నత స్థాయిలగురించీ నాకు తెలిసే

అవకాశమే లేదు. నా వయసు వారైన ఇతర పిల్లలలాగే నేనూ ఆ విషయం పట్ల పూర్తిగా అజ్ఞానంలో ఉన్నాను. రెండు సంవత్సరాల కాలం బడి చదువు చదివిన పసివాడిని. అప్పుడు జరిగిన ఈ సంఘటన జ్ఞాపకం వచ్చినప్పుడు అజ్ఞాతశక్తి మానవుల భవిష్యత్తును ఎట్లా తీర్చిదిద్దుతూ వారి జీవిత విధానాలను మలచివేస్తుందో అవగాహన అయి, ఆశ్చర్యం కలుగుతుంది. ఆ సాధువు చెప్పిన మాటలు నిజమవుతాయని నేను అనుకొని ఉండను. అంతేకాదు ఏమీ తెలియని అమాయకత్వంతో అప్పుడు అన్న ఆ మాటలలో నా జీవితంలోని ఉత్కృష్ట ఆశయ సాఫల్యం ఇమిడి ఉందనికూడా నేను అనుకోలేదు. ఇప్పటివరకూ కొనసాగించిన నా జీవిత యాత్రను సమగ్రంగా పర్యాలోకన చేసినప్పుడు నా మానసాకాశంలో ఎందరి సాధువుల ముఖారవిందాలో ప్రత్యక్షమవుతాయి. నా హృదయంలో నిగూఢమై ఉన్న శక్తి వికాసానికి తోడ్పడ్డ వారందరిపట్లా నాకు కలిగే కృతజ్ఞతాభావంతో తలవంచి వినమ్రుడనవుతాను.

యుక్త వయసు వచ్చేవరకూ నాలో కొంతవరకు నాస్తిక భావాల ప్రభావం ఉండేదనడం చాలా అసహజమైనదీ తర్వాత జీవితంతో పొంతన లేనిదనీ అనిపిస్తుంది. నేను దేవాలయానికి వెళ్ళేవాడినికాను, మత గ్రంథాలేవీ చదివిన వాడిని కాను. పితృపూజాదికములైన శ్రాద్ధంవంటి కర్మలు చేయడానికి నిరాకరించినవాడిని. భగవంతుడనే పేరుతో వ్యవహరింపబడే సర్వాంతర్యామి ఉనికిని నిరాకరించినవాడిని. పూజలు, వ్రతాలు మొదలైన ధార్మిక విషయిక ఆచారాలు నిరర్థకములని అనేటందుకు వెనుదీయనివాడిని. అయినప్పటికీ శ్రీదత్తాత్రేయగురు సంస్థానమై పవిత్రమైన గంగాపూర్ అంటే పులకించి తన్మయత చెందేవాడిని. అది నదీ తీరాన ఉందనే కారణంవల్ల కావచ్చు. లేదా గురువులందరికీ గురువైన దత్తాత్రేయగురు సాధు మహరాజ్ పేరుతో ఆవూరు ముడిపడి ఉందనే కారణంవల్ల కావచ్చు. రెండూ అయినా కావచ్చు. ఏమైనప్పటికీ నేను తరచుగా భీమా అమరజా నదుల సంగమ

స్థావరాలలో గంటలకొద్దీ నిలబడి ప్రవాహాన్ని తిలకిస్తూ గడిపేవాణ్ని. నాకు తెలియకుండానే నా ఆలోచనలతో ప్రయత్నాలతో నిమిత్తం లేకుండానే నాలో మార్పు రాసాగింది. అది నేను గమనించనే లేదు. అందుచేతనే అందరూ ఏ రీతిన తమ జీవితాన్ని గడుపుతారో ఆ దారినే నేనూ నడవసాగాను

బాల్యంలో నా మనఃస్థితి ఎట్లా ఉండేదో వెల్లడించే మరో సంఘటనగూడా జరిగింది అదిగూడా పేర్కొనతగినదే నని అనుకుంటున్నాను ఉత్తరాది మఠానికి చెందిన మధ్వాచార్య గురువులు తమ చాతుర్మాస దీక్షను ఒకసారి షోలాపూర్‌లో నిర్వహిస్తున్నారు మా కుటుంబంలో అందరూ ముద్రధారణపొంది పవిత్ర [illegible]నారు, ఆముద్రాంకితం నాకిష్టం కాలేదు నేను తప్పించుకుని తిరిగాను అయినప్పటికీ మా వాళ్ళు నన్ను వెంటాడి పట్టుకున్నారు. నాకు ఈ ముద్రధారణ అక్కరలేదని స్పష్టంగా చెప్ప[illegible] స్ప[illegible]పోవడంవల్ల నా నోటి వెంట మాటరాలేదు. నాకు ఈ మఠాలలోనూ మత గురువులపైనా సామాన్య మానవుల కల్మషాలను భస్మీపటలంచేసి ఆధ్యాత్మికంగా ఉన్నతులను చేయగలిగిన వారి శక్తిపట్లా విశ్వాసం లేదని స్పష్టంగా చెప్పాలని ప్రయత్నించాను. పెనుగులాడి తప్పించుకో బోయాను నాకు నచ్చచెప్పేటందుకు వారు చేసిన ప్రయత్నాల ప్రభావం నాపై ఏమీ కలగ లేదు చివరికి మధ్వాచార్యులవారి ఎదుటికి నన్ను మీరు బలవంతంగా లాక్కొని పోతే ఆ మఠాధిపతి మొగం ఎదుటే సూటిగా నిర్మొగమాటంగా ముద్ర స్పర్శ వల్ల పవిత్రత సిద్ధిస్తుందనే సిద్ధాంతంలో నాకు విశ్వాసం లేదని చెప్పేస్తాను" అన్నాను. నా మొండి పట్టుదల మాని ఇక బలవంతం చేసినా, ప్రయోజనం ఏమీ లేదని నిశ్చయించుకొని నా హితైషులైన వారు 'వీడిగతి దుర్గతే' అని నన్ను వదలివేశారు ఈ విధంగా నేను ఆ గురువులు వేసే శిక్షనుంచి తప్పించుకున్నాను నాకు నిర్ణీతమైన విధానాలంటే నమ్మకం లేదు. ఒక కచ్చితమైన పద్ధతిని వదలకుండా అభ్యసించాలనీ దానికి కట్టుబడి ఉండాలనీ

నమ్మిన తత్వం కాదు. ఆధ్యాత్మిక సాధన ఒక్కొక్క వ్యక్తిలో ఒక్కొక్క రీతిగా కొనసాగవచ్చు అది ఆ వ్యక్తిలో కూడా ఒక్కొక్క దశలో ఒక్కొక్క రీతిగా మార్పు చెందుతుందనీ నేను విశ్వసించాను. అదే ఇప్పటికీ నా దృఢ విశ్వాసము మానవుడి వ్యక్తిత్వం అత్యంత క్లిష్టమైనది వైవిధ్యంతో పెనవేసుకొని ఉన్నది అట్లా ఒప్పుడు ఒక మూసలో పోసి అచ్చు కొట్టినట్టుండే ఒకేరీతి విధానాలు ఆ బహుముఖ స్వరూపికి ఎట్లా సరిపోతాయి ? అనే నా ప్రశ్న. అందుచేతనే నేను ఆకాశంలో స్వేచ్ఛగా విహరించే విహంగంలాగ స్వతంత్రంగా ఆలోచనలు చేశాను వ్యవహరించాను అదే నాకు ఈనాటికీ అత్యంత సంతోషకరంగా ఉంది

నాకు 16 ఏండ్లు వచ్చేవరకూ భగవద్గీత చూడలేదు. కాలేజీలో మొదటి సంవత్సరం చదువుతున్నప్పుడే అది మొదటిసారి చదివాను. అదికూడా ఏదో ఒక అంధవిశ్వాసంతోనే చేత బట్టాను అందులో ఇమిడి ఉన్న వేదాంత తత్త్వము నాకు ఏమీ కొరుకుడు పడలేదు అయినా దాన్ని పదే పదే అజ్ఞానంతోనే పఠించాను. అందులో ఉన్నది నాకు అర్థం కాలేదు అయినా అది నా భావోన్నతికి తోడ్పడలేదని అనలేను అది కూడా నా అంధ విశ్వాసమే అని మీరనవచ్చు కాని, ఈ మాటలు నేను మనఃస్ఫూర్తిగాను నిష్కపటంగాను చెప్పుతున్నవే ఈ విశ్వాసంలో కృషిచెస్తే ఆధ్యాత్మిక ఉన్నతి ఎందుకు సిద్ధించదు ? అనేదే నా నమ్మకం.

ఆ తర్వాతి దశలో అంటే, నా చదువు పూర్తి అయిన తర్వాత, స్వామి వివేకానంద, స్వామి రామతీర్థ అనే మహాపురుషుల రచనలు అంటే మక్కువ కలిగింది అవి కనిపిస్తే వాటిని వెంటనే అందుకొని చదివేవాడ్ని అవి నాటినుంచి నాకు జీవితంలో బలంఇచ్చి నిత్య సన్నిహిత చిరసహచరులైనాయి. భగవద్గీత ఎప్పుడూ నాలో ఉండే పుస్తకమైంది అది నాకు మనశ్శాంతిని ప్రసాదించింది అన్ని ఇతర మార్గాలూ మూసు

కొని పోయినట్లు కన్పించినప్పుడు అదే నాకు తరణోపాయం చూపించింది. అనేక పర్యాయాలు నేను ఆశాభంగహతుడను కావడం జరిగింది. ఒక్కొక్కప్పుడు "నేను చేయగలిగినది అంతా అయిపోయింది. నేను పూర్తిగా పరాజయం పొందాను" అనికూడా అనిపించేది. కాని అప్పుడు గీత తిరిగి లేచి నిలబడి కార్యరంగంలో దూకి ముందుకు సాగేటందుకు ప్రతిసారీ నన్ను వెన్నుతట్టింది అందుచేత నేనెప్పుడూ అనుసరిస్తున్న పని ఎంత క్లిష్టమై సంకటకారి అయినా ఉత్సాహం కోల్పోలేదు. భగవద్గీత, కర్మ ఫలితాన్ని సర్వేశ్వరార్పణ మొనర్చి కృషిచేసే దృక్పథాన్ని నాకు యిచ్చింది. అందు చేతనే వినయంతో నా పాల బడిన పనుల్ని ఫలాసక్తి లేకుండా నిర్వహించాను ఈ విశ్వాసమే నాకు బ్రతుకుతెరువులో జీవనాధారం అయింది.

చిన్నతనంలో ఒకసారి గడియారాన్ని దొంగతనం చెయ్యబోయాను. వెంటనే ఆ పనియేకాదు ఆలోచన, కూడా తప్పని గుర్తించి ఒప్పుకొని పశ్చాత్తాప పడి పాప పరిహారం చేసుకొన్నాను. మరొకసారి ఏవో కొన్ని అణాలు తీసుకొన్నాను ఆ పాపానికి నన్ను నేనే శిక్షించుకొన్నాను తాను పాపం చేసినట్లు గుర్తించక పోవడము, పాపం ఏదో తెలుసుకొనక పోవడము, తాను చేసిన పాపం ఒప్పుకొనక పోవడము, అనేటటువంటివి అన్ని పాపాలకంటె ఎక్కువపాపం అని నేను భావిస్తాను ఆత్మవిమర్శ చేసుకొంటూ చేసిన పాపాన్ని అంగీకరించి క్షమాభిక్ష వేడుకొనడమే పాప పరిహార మార్గము. ఈ విశ్వాసము ఉండటం వల్లనే చేసిన తప్పులు ఒప్పుకొనేటందుకు నేను ఎప్పుడూ వెనుకాడలేదు. ఈ దృక్పథము నాకు పరిశుద్ధ జీవితాన్ని గడిపేటందుకు చాలా సహాయ పడింది.

తప్పు చెయ్యడం మానవ సహజము అని సామెత ఉంది. అట్లాగని తప్పుచేసి, ఆ తప్పుని ఈ సామెత చాటున కప్పిపుచ్చడమేనా మనం చెయ్యవలసిన పని ? తప్పులు ప్రతి ఒక్కరూ చేస్తారు. వాటి

సుంచి తరణోపాయం ఏమిటి? మానవ ప్రకృతికి సహజమైన లోపాలను సహించి, భరించి కొనసాగ నియ్యడమేనా ? అని, నాలో నేనే చర్చించుకొని వాటికి తల ఒగ్గడం దౌర్బల్యమనే నిర్ణయానికి వచ్చాను. ఆ లోపాలు తప్పించుకో లేనివి, అని అనుకుంటే ఇక ఆధ్యాత్మిక ఉన్నతికోసం ప్రయత్నించడమే ఉండదు ఇట్లాంటి భావాలు ముసురుకొన్నప్పుడల్లా నాకు "నా కంటే పాపి ఎవ్వడు'' అనే సూరదాసు వాక్యం జ్ఞాపకం వచ్చేది.

సూరదాసు తాను పాపం చేశానని ఒప్పుకొన్నాడు అట్లా ఒప్పుకోగలగడమే అతని గొప్పతనము నిస్సంశయంగా వెల్లడించిన పశ్చాత్తాపమే పరిశుద్ధ జీవితానికి పునాది. సూరదాసు వాక్యమే నాకు వెలుగు బాట చూపింది జీవితంలో నేను ఏదో ఒక రీతిగా తప్పులు చేస్తూనే వచ్చాను ఒక్కొక్కప్పుడు వాటిని మిత్రుల ఎదట అంగీకరించాను. తరచు వాటిని గురించి నాలో నేనే పశ్చాత్తాపం చెందాను నాకు నేనే శిక్ష విధించుకొన్నాను నా జీవితాన్ని మెరుగుపరుచుకొనే ప్రయత్నాలు చేశాను పశ్చాత్తాపము, హృదయపూర్వకమైనదైనప్పుడు, మంచి దారిని చూపిస్తుంది. ఈ సందర్భంలో నాకు స్వామి రామతీర్థ వాక్యాలు జ్ఞాపకం వస్తున్నాయి "ఆత్మ పరిశుద్ధికి బాట కన్నీటిలో మునిగి ఉంటుంది'' అని ఆయన అన్నారు. నేను నా పాపాలను కన్నీటితో కడిగివేసుకొన్నాను. అదే నన్ను పాపవిముక్తుణ్ణి చేసింది అయితే ఈ కన్నీటికి కారణం నిస్సహాయతే అయితే దానికి పాప విముక్తి కలిగించే శక్తి ఉండదు ఆ కన్నీటికి ఆత్మోన్నతి సాధన, లక్ష్యము అయినప్పుడే సాఫల్యత సిద్ధిస్తుంది ఆత్మ విమర్శన చేసుకొంటూ అంతర్దృష్టి అలవరచుకొంటేనే ఈ దృక్పథం సాధ్యం అవుతుంది ఆత్మ విమర్శ చేసుకొనడం కష్టమూ క్లిష్టమూ అయినప్పటికీ, అదొక్కటే పరిశుద్ధత, పవిత్రత సాధించేటందుకు దారి అని తెలుసుకొన్నాను తరవాత మరో అధ్యాయంలో ఈ విషయాన్ని గురించి మరికొంత వివరంగా చెప్పాలనుకొంటున్నాను.

# 2. ప్రతిజ్ఞా స్వీకారం

మొదటి ప్రపంచ యుద్ధం జరుగుతోంది. మిత్రమండలి అపజయాలు, విజయాలను గురించిన వార్తలు అప్పుడప్పుడు వినిపించేవి ఒక్కొక్కప్పుడు ఆ వార్తలు నిజమేనా అని శంకించే వాళ్ళము. ఆవార్తలు, లెక్కల వివరాలు, ప్రచారం కోసమూ ప్రజల్ని మభ్యపెట్టేటందుకు తయారు చేసినవిగా ఉన్నాయనే భావాలను చదువు కొన్న వారిలో కలిగించేవి 'యుద్ధస్య కథారమ్యా' అని సంస్కృత భాషలో ఒక లోకోక్తి వుంది. అంటే యుద్ధంకథ చదవడానికి, వినడానికి మనోహరంగా ఉల్లాస కరంగా వుంటుంది. కాని, దాని దారుణ ఫలితాలకు గురియైన వారికి ఆహ్లాదంగనిపించదు. మాకందరికీ యుద్ధ వార్తలు వినటంలో ఎక్కువ ఆసక్తి వుండేది బ్రిటిష సామ్రాజ్య వాదుల పద్ధతులు చాల వింతగా వుండేవి జిల్లా కలెక్టరే స్వయంగా ప్రతివారమూ మాస్కూలుకి వచ్చి వస్తూండే వాడు తనతో పాటు ప్రత్యేకంగా తయారు చేయించిన పటం పట్టుకొని వచ్చేవాడు. అందులో యుద్ధరంగం ఏ రీతిగా ఒకవారం నుంచి తర్వాత వారానికి మార్పు చెందిందీ గుర్తించి చెపుతుండేది మిత్ర మండలి ఏ ఆశయాల కోసం యుద్ధం కొనసాగిస్తున్నదీ ఉపన్యాసం చెప్పేవాడు. జర్మను సైన్యాలు, వారి చక్రవర్తి కైజరు కొనసాగిస్తున్న దారుణ హింసా కాండలు వినేవారి కళ్లకు కట్టినట్లు, వర్ణించే వాడు. ఆ పిన్న పెద్దందరమూ బ్రిటిషువారి హుందాతనాన్ని (nobility) ధైర్యాన్ని ఓర్పునీ మెచ్చుకొనే వాళ్లము. బ్రిటిష జాతీయ గీతమైన 'భగవంతుడు మన రాజుగారిని రక్షించు గాక' అనే మకుటం ఉన్న పాట పాడే వాళ్లము. బ్రిటిషు వారి జాతీయ పతాకపు నీడనే మాకు రక్షణవుంది అనే భావంతో ప్రవర్తించే వాళ్లము. ఆ పతాకానికి వందనము చేసే వాళ్లము.

యుద్ధ నిర్వహణ కోసం ప్రజలకు పంచిన పదిరూపాయల ఋణపత్రాలను ఏడున్నర రూపాయలు ఇచ్చి కొనేవాళ్ళము. చదువు కొంటున్న విద్యార్థులలో అతి పేదవాణ్ని కూడ ఆ ఋణ పత్రాలు అమ్మేవారు వదల లేదు. నిరుపేద నైనందు వల్ల ఒక పైసాకూడ నాది అనేది లేనందు వల్ల నన్ను మాత్రము వదలి వేశారు. ఐదవ జార్జి రాజు పట్టాభిషేకపు ఉత్సవం నాడు మా అందరికీ ఒక్కొక్కరికి యూనియన్ జాక్ పతాకాన్నిచ్చి మా దుస్తులతో కలిపి కుట్టించుకోమన్నారు మిఠాయిలు పంచి పెట్టారు. మాలో కొందరు కొంటె వాళ్లు మిఠాయిలు తీసుకొని యూనియన్ జాక్ పతాకాన్ని పారవేసారు. ఆ రాజరిక వ్యతిరేక చర్యకు శిక్షగా మాలో ప్రతి ఒక్కరికి ఆరేసి బెత్తపు దెబ్బల బహుమతి లభించేది. అది జ్ఞాపకము వచ్చినప్పుడు నాకు బాల్యంలోనే బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకత వెల్లడించే తిరుగుబాటు చర్యలో పాల్గొని దెబ్బలు తిన్న గౌరవం దక్కిందనే గర్వం కలుగుతుంది.

సామ్రాజ్య వాదుల ధోరణులు వెల్లడించే మరొక సంఘటన కూడ నాకు ఈ సందర్భంలో జ్ఞాపకం వస్తున్నది. నేను షోలాపూరులో ఉన్న నార్త్ కోట్ ఉన్నత పాఠశాలలో చదువుతున్నాను అది సర్కారు వారు ఏర్పాటు చేసిన పాఠశాల శ్రీ ఎస్. నాబర్ (Nabar) మా ప్రధానోపాధ్యాయులు. ఆయన సహజంగా దయార్ద్ర హృదయుడు. అయినా ఆయన బ్రిటిషు ప్రభుత్వం అంటే వల్లమాలిన పక్షపాతం ఉన్న వాడు ఒక్కొక్కప్పుడు ఆయన ప్రభుత్వం పట్ల చూపించే విధేయత అసలు బ్రిటిషు వారి విధేయతను మించి పోయిందా అన్నట్లుండేది. మాకు సంవత్సరం చివర జరిగే పరీక్షలు జరుగుతున్నాయి లోకమాన్య తిలక్ (ఇప్పుడు కీర్తి శేషులు) మా పట్నానికి వస్తున్నారని ప్రకటించారు. ఆయనభారత దేశంలోని రాజకీయ అసంతుష్ట వర్గానికి మూల విరాట్టు మా ప్రధానోపాధ్యాయులు పనిగట్టుకొని మా అందరికి తిలక్ ఉపన్యాసం వినేటందుకు వెళ్ల వద్దనీ, ఆయన దర్శనం చేసు కొనడానికి రైలుస్టేషనుకు కూడ వెళ్ల కూడదనీ ఆ పనులు రాజ ద్రోహానికి సమానమని గట్టిగా చెప్పారు.

మాలో చాల మంది లోకమాన్యుడిని చూడలేదు ప్రధానోపాధ్యాయుడు జారీచేసిన నిషేధపుటుత్తరువులు విన్న తరువాత ఆ మహారాష్ట్ర కేసరిని చూడాలని, ఆయన సింహగర్జనలు వినాలని మా అందరిలోను కుతూహలం హెచ్చింది. మాలో కొంత మందిమి గూడుపుఠాణీ చేసి, స్టేషనుకు వెళ్లి ఆమహా నాయకుడి దర్శనం చేసుకొన్నాము. ఈ వార్తను ఎవరో మాప్రధానోపాధ్యాయుడికి చేరవేశారు. ఆ రోజు శనివారం, బడి కార్యక్రమం సాధారణంగా 2 గంటలకు ముగిసేది. ఆ తర్వాత మధ్యాహ్నం అంతా సెలవు. ఆ రోజు ఆఖరి పరీక్ష. అది 11 గంటలకు ప్రారంభం కావలసి వుంది. కాని మా ప్రధానోపాధ్యాయుడు కుయుక్తితో దాన్ని సాయంత్రం 3 గంటలకు మార్చాడు ఆ మార్పు మమ్మల్ని 5 గంటలకు జరిగె మీటింగుకు వెళ్ళకుండా తిలక్ మహాశయ్ ఉపన్యాసం వినకుండా ఆటంక పరచాలనే దురుద్దేశంతో చెసిందే

మా ప్రధానోపాధ్యాయుడు వేసిన ఎత్తు మాకు స్పష్టంగా తెలిసిపోయింది. అది ఆఖరి పరీక్ష అని ఇంతకు ముందే చెప్పానుగదా! పరీక్ష విషయము సైన్సు ఆరోజుల్లో సైన్సు అప్రధానమైన విషయం. ఎవరైనా సైన్సులో పాసుకాకపోయినా పైక్లాసుకు ప్రమోషన్ చేసేవాడు. అందుచేత "మనం ఈ పరీక్షకు వెళ్ళకుండా ఎందుకు మానివెయ్యకూడదు? మనకి ఎట్లాగా ప్రమోషన్ వస్తుంది. మీటింగుకు వెళ్ళి మన దేశనాయకుడి ఉపన్యాసం వినడము" అని. మాలో కొందరు అనుకున్నాము కానీ, ఎవరికీ పరీక్షకు వెళ్ళకుండా ఉండే ధైర్యసాహసాలు కలుగ లేదు మా ప్రధానోపాధ్యాయుని సంగతి మాకు తెలుసు మార్కుల విషయంలో జాలి చూపించని కఠోర శాసకుడు అందు చేత మేము మరో పన్నాగం పన్నాము. 3 గంటలకు ప్రశ్న పత్రము అందుకున్నాము. మాకు బాగా జవాబులు తెలిసిన ప్రశ్నలకు కొన్నిటికి చక చక జవాబులు బొటాబొటిగా పాసు మార్కులు తప్పక వచ్చేటట్లు వ్రాసి, మా ఆన్సరు పేపర్లు యిచ్చివేసి 4 గంటల ప్రాంతములో హాలు వదలి బైట పడ్డాము. ఆరుగురం అట్లా చేశాము. మిగిలిన వాళ్ళలో మరి కొందరు ఆ

ప్రయత్నంలో ఉన్నారు మా ప్రధానోపాధ్యాయుడికి మేము వేసిన ఎత్తుగడా చేసిన పనీ, తెలిశాయి. వెంటనే ఆయన మరో కొత్త ఆర్డరు జారీ చేశాడు. పరీక్ష పూర్తి అయ్యే టైము అవధి "6 గంటల, లోపుగా విద్యార్థు లెవ్వరు పరీక్షహాలు వదల కూడదు." అని. ఈ కొత్త ఆర్డరు రాకముందే బైట పడ్డ మాబోంట్లకు దాన్ని అమలు చెయ్యడం సాధ్యం కాలేదు. మేము మీటింగుకు వెళ్లి ప్రజా సమూహంలో కలిసి పోయాము. అయినప్పటికీ, మమ్మల్ని గుర్తించి మరుసటి రోజున బెత్తపు దెబ్బల బహుమానం ప్రసాదించారు. మేము ఆ శిక్షను ఆనందముతో స్వీకరించాము. దేశం అంతా బ్రహ్మరథం పట్టి పూజిస్తున్న నాయకాగ్రణి ఉపన్యాసామృతం ఆస్వాదించే అవకాశ భాగ్యానికి ఆ బెత్తపు దెబ్బల రూపంగా మేము చెల్లించిన మూల్యం అత్యంత స్వల్పమే అనిపించింది.

తర్వాత, ఆ ప్రధానోపాధ్యాయుడికి ఉద్యోగంలో ప్రమోషనూ, షోలాపూరు నుంచి బదిలీ లభించాయి. అవును అది ఆ రోజుల్లో ఆయన పర ప్రభుత్వంపట్ల వ్యక్తం చేసిన విధేయతకు పురస్కారము! మా చిన్నారి మనసులు మాత్రం ఏదో గొప్ప స్వదేశాభిమానం చూపించి నట్లు పొంగి పోయాయి.

విల్లింగ్డను ప్రభువు అప్పుడు బొంబాయి రాష్ట్ర గవర్నరు. యుద్ధ కార్య సహాయక చాందాలు అంటు గట్టే కార్యక్రమానికి ప్రోత్సాహం కలిగించే టందుకు ఆయన షోలాపూరు వచ్చారు. మెకొనాసి నాటకశాలలో ఏర్పాటు చేసిన సమావేశంలో ఆయన ప్రసంగించ వలసి ఉంది. ఆ మీటింగుకు వెళ్లేవాళ్లందరికీ పాసులు (అనుమతి పత్రాలు) పంచి పెట్టారు. ప్రిటీ[illegible] [illegible]ం నర నరాల జీర్ణించు కొన్నట్టు రుజువైన రాజభక్తులకు మాత్రమే ఆ పాసులు ఇచ్చారు. మా పాఠశాల నుండి నలుగురికి మాత్రమే [illegible] కలిగింది. ఆ నాలుగు పేర్లలో నా పేరొకటి! నేను గవర్నరు గారి ఉపన్యాసాన్ని చాలా శ్రద్ధతో ఆలకించాను. ఆయన మాటలు నేను జీర్ణం చేసుకోలేక పోయాను. అవి వెగటుగా ఉండి నా కడుపులో తిరుగుతూనే ఉండి పోయాయి.

పుర ప్రముఖులు కొందరు ఆ సందర్భంలో ఇచ్చిన ఉపన్యాసాలు వారి బానిస బుద్ధిని ప్రతిబింబించాయి ఆ సమావేశం పూర్తి అయేటప్పటికి నాగుండె జీవంతో స్పందిస్తోందా ? లేక నే విన్న మాటలు కల్పించిన నిరుత్సాహం వల్ల గడ్డకట్టి బిగుసుకుపోయి రాతివలె చైతన్య రహితం అయిపోయిందా? అనిపించింది

ఆ రోజులలో జాతీయ భావాలు వెల్లువలా పొంగి పొర్లుతుండేవి మొదటి ప్రపంచ యుద్ధం మిత్రపక్షాలకు విజయం లభించటంతో పూర్తి అయింది. యుద్ధం నిర్వహించడంలో భారతదేశం ఇంగ్లండుకు ఎంతో సాయం చేసింది. వేల సంఖ్యలో భరతమాత పుత్రులు సైన్యంలో చేరారు తమకూ తమ దేశానికీ ఏ విధంగానూ లాభం కలిగించని యుద్ధంలో వారు తమ ప్రాణాలను ధారపోశారు.

బ్రిటిషు ప్రభుత్వానికి ఏ విధంగానూ అడ్డు తగలని మితవాద నాయకులు భారతదేశానికి స్వపరిపాలన ఇవ్వవలసిన అత్యావశ్యకతను గురించి బ్రిటిషు ప్రభుత్వానికి నచ్చచెప్పే ప్రయత్నాలు చేయసాగారు. జాతీయ వాదుల్లో ఉద్రేక పూరితులై సామరస్య విధానంవల్ల లాభం ఉండదనే వర్గంవారు లోకమాన్యతిలక్ నాయకత్వం క్రింద 'స్వపరిపాలన' (Home Rule) కోసం ఉద్యమం కొనసాగించారు 'స్వపరిపాలన' అనే మాటవల్ల అసలు సూచితమైన దేమిటో అవగాహన చేసుకొన్నవారు చాలా కొద్ది మంది మాత్రమే అనవచ్చు. తన ఆంతరంగిక వ్యవహారాలు తానే నిర్వహించుకొనే అధికారం భారతదేశానికి ఉండాలి అనే భావాన్ని నాయకులు తమ ఉపన్యాసాలలో, చర్చలలో కొంత అస్పష్టంగా వెల్లడించారనవచ్చు దేశవ్యాప్తంగా వెల్లడి అయిన ప్రజాభిప్రాయపు ఒత్తిడి వల్ల బ్రిటిషు పార్లమెంటు ఒకజాయింటు పార్లమెంటరీ కమిటీని నియమించి విషయాలన్నీ సమగ్రంగా పరిశీలించి నివేదిక ఇమ్మని కోరింది ఆ సందర్భంలోనే బ్రిటిషు ప్రజల ఆశయాన్ని విశదీకరిస్తూ "భారతదేశం బ్రిటిషు సామ్రాజ్యంలో అంతర్భాగంగా ఉంటూ ఉండగానే క్రమక్రమంగా ఆ దేశీయులు, తమ దేశంలో బాధ్యతాయుత పరిపాలన నిర్వహించు

కొనేటట్లు అభివృద్ధి చెందేటందుకు తోడ్పడటమే మా ఆశయం అని, పార్ల మెంటు ఒక ప్రకటన చేసింది ఆరోజుల్లోనే బ్రిటిషు ప్రభుత్వం కొనసాగి స్తున్న హింసా కాండలను గురించి కూడ వినే వాళ్ళము. మహాత్మాగాంధీని గురించీ ఆయన అరెస్టు అయిన వార్తనూ విన్నాము. లోకమాన్య తిలక్, ఆయన అనుచరులు స్వపరిపాలనకోసం కొనసాగించిన ఉద్యమాన్ని గురించి తెలుసుకొనే వాళ్ళము. వీటన్నింటి ప్రభావంవల్లా నా మనస్సులో ఏదో రీలగా మనం మనకగా కోట్లాది భారతీయులు రకరకాల అవరోధాలను కష్టాలను ఎదుర్కొంటూ ఒక సంపూర్ణమైన జాతిగా రూపొందేటందుకు ప్రయత్నాలు చేస్తున్నట్లు కనిపించేవి. దేశం అంతటా ఈ మూలనుంచి ఆమూలవరకూ ఒక నవచైతన్యం ఆవిర్భవించి వ్యాప్తి జెందుతున్నట్లు వ్యక్త మయ్యేది యుగాల తరబడి నిద్రాణమై వున్న జాతీ, ప్రజా మేల్కొన్నట్లు బుజువైంది. అయితే ఈ రూప చిత్రణ పట్న వాసాలకు మాత్రమే పరిమిత మైంది సమాజంలో పైస్థాయిలో వున్న వారిలో ఏదో కొంత మంది మాత్రమే ఈ కదలికకు వశులైనారు ఒక శక్తివంతమైన వర్గం, బ్రిటిషు ప్రభుత్వం ప్రతిపాదించి అమలు చేస్తామంటున్న మాంటి ఫర్డ్ సంస్కరణలు నిరుపయోగ మైనవనీ వాటితో తామేమీ ప్రమేయం పెట్టుకోమనీ పూర్తిగా నిరాకరించారు ఆరోజుల్లోనే బొంబాయిరాష్ట్ర రాజ కీయ వాదుల సమావేశం షోలాపూరులో కీర్తిశేషులైన జోసెఫ్ బాప్టిస్టా అధ్యక్షతన జరిగింది ఆసభలో విన్న ఘాటైన ఉపన్యాసాలు ఉద్రేకపూ రితమైన వాదోపవాదాలు నాకుఇప్పటికీ కన్నులకు కట్టినట్లు కన్పిస్తున్నాయి. వీనుల్లో ప్రతి ధ్వనిస్తున్నాయి ఆ సంస్కరణలు ఆమోదించాలని వాదిం చిన మితవాద నాయకులు పూర్తిగా పరాజితులైనారు

విద్యార్థి దశలో ఉన్న మా అందరికీ కూడా ఆ వేడి వంటబట్టి అందుకున్నది. సమాజానికి గుండెకాయ వంటి యువతలో మార్పు వస్తోంది. అప్పుడు రాజకీయ సమస్యలను గురించి నాకు స్పష్టమైన అవ గాహన ఏమీ లేదనే అనుకొంటాను. జాతి అభ్యుదయం కోసం, ఉడతా భక్తిగా యథా శక్తిగా నేను చెయ్యగలిగిన కృషి చెయ్యాలనే భావన

నాలో అస్పష్టంగా ఏర్పడింది. అది క్రమంగా వృద్ధి చెందసాగింది. అప్పుడు నేను మెట్రిక్ తరగతిగదిలోకి ప్రవేశిస్తున్న విద్యార్థిని మాత్రమే. ఏ మాత్రమూ పూర్వానుభవమూ పరిణిత విజ్ఞత లేని వాడిని.

నా యువ హృదయము ఆవేశంతో ఊగిపోయేది. మొత్తం మీద చదువులో ఎక్కువ శ్రద్ధ తీసు కొంటున్నప్పటికీ పాఠ్యపుస్తకాలతో పాటు ఎన్నో ఇతర విషయాలను గురించిన పుస్తకాలు కూడా విరివిగా చదివే వాడిని ఈ అలవాటు నా చుట్టూ ఏమి జరుగుతున్నదో తెలుసు కొనే ట్టు చేసింది. మాతృదేశ విముక్తి కోసం అంకితము కావాలనే తీవ్రమైన వాంఛ నాలో ఏర్పడి క్రమ క్రమంగా పుంజుకొని బలపడ సాగింది. ప్రతి సంఘటనా ఏది పెద్దదైనా చిన్నదైనా నా మనస్సును ప్రభావితం చేసి ఒక దృక్పథాన్ని రూపొందించేది. విద్యార్థి దశలో నేను తరచుగా సినిమాలు చూసే వాడిని. ఆరోజుల్లో టాకీలు లేవు అప్పుడున్న వల్లా మూకీలే. దేశాభిమాన దృష్టి ఆ అలవాటుని మటుమాయం చేసింది. క్రమంగా సినిమాలంటే అయిష్టం కలిగింది. నాటి నుంచి నేటి వరకు సినిమాలు చూడలేదు నాకు టాకీ అంటే ఏమిటో తెలియదు.*

నాలో, వ్యక్తిగతమైన అవసరాల పట్ల అనాసక్తి క్రమంగా పెరగ సాగింది. ఎప్పుడూ నాలోనేనే [illegible] సేవాడిని. లోతుగా ఆలోచించే వాడిని నా చుట్టూ ఉన్న ఇతర విద్యార్థులు తమతమ భవితవ్యాల గురించి తాము ఆశిస్తున్న పెద్ద పెద్ద ఉద్యోగాల గురించి ఆసక్తితో మాట్లాడుకొనే వారు వారిలో కొందరు ఐ. సి. ఎస్. (కలెక్టరు గిరి) పరీక్షలకు వెళ్ళాలనీ ఆ తరువాత క్రమ క్రమంగా మెట్లెక్కి అత్యున్నత స్థాయిలందు కోవాలని తలపోసేవారు మరి కొందరు విదేశాలలో ఉన్నత విద్యల ప్రాశస్త్యాన్ని గురించీ వాటిపైన తమకున్న మోజు, అవకాశాల గురించి

* మహాత్మ గాంధీకి కూడ సినిమాలపట్లా నటులపట్లా ఆసక్తి తక్కువే. ఒకసారి ప్రఖ్యాత హాస్య నటుడైన చార్లీచాప్లిన్ ప్రసక్తి వచ్చిందట. అప్పుడాయన చార్లీచాప్లిన్ ఎవరు? ఏమిటాయన ప్రత్యేకత అన్నారట.

మాట్లాడేవారు, నాకు అట్లాంటి కోరికలేవీ ఎప్పుడూ కలగలేదు. వేదవాడు అట్లాంటి బాటను ఎన్నుకోగూడదు పైకి అందరిలాగే నేనూఅందరూ నడుస్తున్న నలిగిన దారినే నడుస్తున్నాను కాని, నా అంతరాంతరాల్లో మార్పు వస్తోంది. నేను కూడా అందరి వలెనే ఐహిక సాధన కోసం అనుసరించే పద్ధతిలోనే నడిచేనా? లేక, నాజీవితాన్ని భరత మాతను సేవించేటందుకే అంకితం చేసేదా? గృహస్థుడినై పెండ్లాడి, పిల్లలను కని దారా పోషణ అభివృద్ధులకోసమే కాలంగడిపేదా? లేక బ్రహ్మచర్యంలోనే ఉండి ఉన్న శక్తినంతా దేశంకోసం వినియోగించేదా? పిల్లల్నికని సంతాన వంతుడనై పిల్లలను పెంచడం వాంఛనీయమా? అది దేశసేవఅవుతుందా? అనేభావాలు నాలో ఏదోతిరుగుబాటు రేకెత్తించెవి మనోమథనం జరుగుతోంది. మనస్సు సంక్షోభంగా ఉంటూ ఉండేది ఒక నిర్ణయానికి వస్తే గాని శాంతి లభించనట్లుండేది

మానవ జీవితంలో, ఆ మానవుడు గొప్పవాడైనా అల్పుడైనా ఆతని జీవితాన్ని సంపూర్ణంగా మార్చివేసిన ముహూర్తమో సన్నివేశమో ఏదో ఒకటి ఉంటుంది. ఆ సమయముగాని సన్నివేశం గాని హఠాత్తుగా సంభవించింది కావచ్చు లేదా క్రమక్రమంగా పరిణతి పొందినటువంటిది కావచ్చు ఒకసారి ఆ స్థితి వచ్చినప్పుడు అప్పటి నుండి జీవితమె మారి పోతుంది జీవిత దృక్పథంలో మార్పు వస్తుంది ఏ లక్ష్య సాధన కోసం ఆజీవి నిర్దేశింపబడినాడో దానికనుగుణమైన నూతన మార్గంలో అతని జీవితం నడుస్తుంది ఈ మార్పు ఫలితంగా లతను సంపూర్ణంగా భిన్న నూత్న వ్యక్తి అవుతాడు నా లోఅట్లాంటి మార్పువస్తున్నట్లు అనిపించింది ఆ మార్పు ఏదో ఎప్పుడు వస్తుందో అంతు పట్టలేదు. అంతకు ముందున్న మామూలు మనిషిగాలేను అదిమాత్రం నిజం.

ఎవరికి నిర్ణీతమైన సమయం వచ్చిందనవచ్చు. లోకమాన్యతిలక్ జబ్బుపడి ఎట్లాగైతేనేమి మరణాసన్నులై బొంబాయిలోని సర్దార్ గృహంలో ఉన్నారు.ఆయన ప్రాణ ప్రమాదావస్థలో ఉన్నవార్తతో దేశమంతా విషాద

మేఘాలు ఆవరించినట్లు అనిపించింది. ప్రజలు ఒకరితో ఒకరు గుసగుస లాడుకొనేవారు,అంతటా నిశ్శబ్దం,నాయకులందరూ చిన్నలూ పెద్దలూ కూడా ఆయనని సందర్శించాలని బొంబాయి నగరానికి ప్రయాణమైనారు. వచ్చిన ప్రతివ్యక్తీ తిరిగి వెళ్ళడానికి కాళ్ళురాక ఆయనను ధ్యానిస్తూ [illegible] చేయగలిగిన చికిత్స ఏమీ లేదు అని వైద్యులు ఆశలు వదులుకొని పెదవులు విరిచారు ప్రజలందరూ లోకమాన్యుడు అవతారం చాలించనున్నాడని దుఃఖితులైనారు మహాత్మాజీ తిలక్‌కు సన్నిహిత వర్తిగా ఉన్నాడు. లోకమాన్యుడికి ఆరోగ్యం కలగాలని అశేషజనం ప్రార్థనలు జరిపారు.కాని సంభవించక తప్పనిది [illegible] కనిపెట్టుకొనిఉంది. మరణాసన్నుడైన లోకమాన్యుని పరిస్థితిని తెలుపుతూ కరపత్రాల ప్రకటన సాగింది. నగరంలో అన్ని ముఖ్యమైన స్థలాల్లోనూ జనం వేలాది సంఖ్యలలో మూగి వార్తల కోసం తపించేవారు [illegible] 31 జూలై 1920 అర్ధరాత్రి తెల్లవారితే ఆగష్టు 1 వ తేది నాడు [illegible] భారత మాతకు దాస్యశృంఖలాల వల్ల కలిగిన ఆవేదనను స్పందింప చేసిన విప్లవమూర్తి తుది ఊర్పు వదలి అమరుడైనాడు. ఆవార్త వెదుళ్ళవలె వ్యాపించి దేశమంతటినీ విషాదంలో నింపింది.

ఈ వార్త నాకు సాధారణమైనదిగా అనిపించలేదు. అది నామీద అసామాన్య ప్రభావం కలిగించింది 'లోకమాన్యుడు వెళ్ళిపోయినాడా?' అని నన్ను నేనే పిచ్చివాడిలా ప్రశ్నించుకొన్నాను అయితే ఆయన ఇచ్చిన సందేశం, చేపట్టి నిర్వహిస్తున్న ప్రచారకార్యక్రమం సంగతి, గతి ఏమిటి? ఆయన జీవితం మాతృభూమి పాదారవిందాల వద్ద పూర్ణార్పిత మన్నది నిస్సందేహమైన సత్యమే కదా? భారతమాత స్వాతంత్ర్య[illegible] ఆయన తనతోపాటు ఎందరో అంకితమైన వ్యక్తుల్ని ఉత్తేజపరిచారే! నాకు కూడా భారతమాతను సేవించవలసిన బాధ్యత లేదా? అది నాధర్మం కాదా? ఏమిచేసేది? ఏదిదారి? అని కింకర్తవ్యతా మూఢుడనై ఆరోజంతా ఉపవాసం చేసి, ఏకాంత ధ్యానంలో పట్నం పరిసరాలలో ఉన్న ఒక సరస్సుతీరంలో గడిపాను.

సరోవరం నీళ్ళలో కాళ్ళుంచి పెట్టుమీద కూర్చుని కన్నీరు కారుస్తూ ఎంతకాలం గడిపానో నాకే తెలియదు. బహిః పరిసరాల గురించీ అక్కడ ఏమి జరుగుతున్నదీ నా దృష్టిలోనే లేదు. అపనన్యస్థితి సిద్ధించింది. ఏ ఆలోచనా ఏ ఆవేశమూ ఏ భావమూ లేవు. సాయంకాలమైంది. సూర్యాస్తమయం కావచ్చింది. ఉన్నవాడిని ఉన్నట్టుగా లేచి నిలబడ్డాను. సరోవర జలాలు దోసిలిలోకి గ్రహించాను. భక్తిభావంతో కర్మసాక్షియైన సూర్య భగవానుడితో చెప్పుతున్న "ధారణిలో ఈ క్షణంనుంచి నా జీవితాన్ని మాతృదేశ సేవకు అంకితం చేస్తున్నాను. యావజ్జీవం బ్రహ్మచర్య వ్రతదీక్షలోనే ఉంటూ ఐహిక వాంఛలనుండి విముక్తుడనై సన్యాసిగా కాలం గడుపుతాను" అని, నా దోసిలిలో ఉన్న జలాన్ని అర్ఘ్యంగా అర్పించాను.

ఆ నిమిషంనుంచి నా జీవన స్రవంతి గతిమారింది, అంతర్వాణి సందేశం స్పష్టమైన రూపం ధరించింది. అనంత సంతోషానుభవం కలిగింది. అన్ని సందేహాలూ విచికిత్సలూ మాయమైనాయి. నా జీవితాన్ని సేవా కార్యక్రమాలనే మూసలో పోసి తీర్చిదిద్దటానికే ప్రయత్నం చేస్తున్నాను. కార్యక్రమం ఒక్కటే నాకున్న పని. త్యాగశీలమే నా ధ్రువతార.

ఈ నా కార్యక్రమం రూపుదిద్దుకోవడంలో నా సహచారియైన మిత్రుడొకడు తోడ్పడ్డాడు. మా అనుబంధము కేవలం స్నేహితుల నడుమఉండే అనుబంధం మాత్రమే కాదు. అతను నాకు మార్గదర్శి. నేను తడబడినప్పుడు సరిదిద్ది ఊతం ఇచ్చి ఎన్నుకున్నదారినే నడిచేట్లు చేసినవాడు. అతనుకూడా నాతోపాటే తన జీవనయాత్ర సాగిస్తే ఎంతో బాగుండేది! కానీ, విధి నిర్ణయము మరొకతీరైంది. భావసామ్యము, దృక్పథాలూ మమ్మల్ని సన్నిహితులుగా చేసినా మా జీవిత పథాలు వేర్వేరు మార్గాల ననుసరించాయి. ఈనాడుకూడా నాకు గాఢమైన కోరిక కలిగినప్పుడు అతని దగ్గరకు వెళ్ళి ఒకరోజు గడపివస్తాను. అయితే అది తరచుగా కాదు. సకృత్తుగా జరిగే సంఘటన; కొన్ని ఏండ్లు గడిచిన

తర్వాత ఏదో ఒకసారి అయినా అతన్ని నేను ప్రాణప్రదుడుగా గణిస్తాను. నా హృదయ కల్మషాలను క్షాళనం చేసుకొని పరిశుద్ధుడిని ఆవడంలో ఎంతో సహాయకారి అయిన నిజమైన మిత్రుడు. ఆయన ఇప్పుడు మనలో ఈ లోకంలో లేడు. ఆయన్ని నేను ఆదర భావంతో 'నాథ్' అని పేర్కొనేవాడ్ని.

---

# 3. వివిధ విషయాలు

బడి లోను, కాలేజీ లోను, చదువు తున్న రోజుల్లో నేను నా చదువు కొనసాగించే టందుకు ఇతరులు చేసే సహాయంపైన ఆధార పడే వాణ్ని. నా సంరక్షకులు నాకు తగినంత ఆసరా ఇచ్చే స్థితిలో లేరు. వారు చెయ్య గలిగింది చేశారు. ఇవ్వాలనే కోరిక వారిలో ఎంత బలంగా వున్నా వారికి వచ్చే రాబడి మరీ తక్కువ. అందు చేత నాదారి నేను చూచుకో వలసి వచ్చింది. తరచు నేను స్వయం సహాయానికే ప్రయత్నాలు చేసే వాణ్ని. కొంత కాలం పాటు స్కూలు మెస్ (భోజనశాల)లో పని వాడుగా ఉన్నాను. అప్పుడు నాకు ఖర్చు లేకుండా భోజనం దొరికేది. పుస్తకాలు ఉచితంగా బడి పిల్లల కోసం ఏర్పాటైన ఉచిత గ్రంథాలయం నుంచి తెచ్చు కొనేవాణ్ని. కాలేజీలో ప్రవేశించి నప్పుడు నాకు ధరించేటందుకు ఒకే ఒక చొక్కా (అంగీ) ఉండేది. ఒక పేద వితంతువు పెట్టే భోజనంతో తృప్తి పడ వలసి వచ్చేది. ఆమెకు నెలకు మూడున్నర రూపాయలు ఇచ్చే వాణ్ని. ఆమె రెండు పూటలా పప్పు తిన పెట్టేది. తర్వాత కాలేజీ లైబ్రరీలో ఖాళీ వేళలో పని చేసే వాణ్ని. దానితో వచ్చిన వేతనం ఇతర చిల్లర ఖర్చులకు ఉపయోగ పడేది

చదువు కొంటున్న రోజులలో కాలం వృథాగా గడిపే వాణ్ని కాదు. ఆరోగ్యం దుర్బలమైనదైనప్పటికీ అలవాట్లలో క్రమం పాటించే వాణ్ని. నేను ఎప్పుడూ బలిష్టంగా లేను. ఎట్లాగో ఒకలాగ రోగం రాకుండా జాగ్రత్తగా ఉండే వాణ్ని. అప్పుడప్పుడు నేను చేయవలసిన పనులు చేసేవాణ్ని. నాకున్న సంపదల్లా మిత్రుల అనురాగం ఒకటే. అది నాటి నుంచి నేటి వరకు సమృద్ధిగా లభిస్తున్నది. నేను బాధల్లో ఉన్నప్పుడు వారనుభూతితో చేయూత ఇచ్చి నందు వల్లనే నేను గట్టెక్కి ఉపశమనం పొందగలిగాను.

ఉదయం నేను నా చదువు కోసం కొన్ని గంటలు [illegible] వాణ్ని దేహ పరిశ్రమ గురించి పూర్తిగా ఉశ్రద్ధ చేశాను అదే నా ఆరోగ్యానికి భంగకారి అయింది భాషల అధ్యయనంలో, ముఖ్యంగా ఇంగ్లీషులో, నేను ప్రావీణ్యం చూపించి అందరి కంటె వున్నత స్థాయిలో వుండేవాణ్ని. సాధారణంగా నాది మొదటిస్థానమో రెండవస్థానమో అయేది కాని, నేను లెక్కలలో గట్టెక్కలేక పొయేవాణ్ని ఈ నాడు కూడా నేను లాభ నష్టాలకు సంబంధించిన లెక్కలు సరిగా చెయ్యలేను. కాలము-పని. వేగము మొదలైన వాటిమీద ఇచ్చిన లెక్కలు నాకు చిక్కు సమస్యలు నాకు లెక్కల్లోకనీసం పాసు మార్కులు కూడ వచ్చేవి కావు. బీజగణితము (ఆల్జీబ్రా), రేఖా గణితము (జామెట్రీ) నేర్చుకోవడం ప్రారంభమైన తర్వాతనే నేను లెక్కలలో పాసవ గలిగాను ఈ సందర్భంలో నాకు ఒక తమాషా అయిన సంఘటన జ్ఞాపకం వస్తోంది ఒకనాటి ఉదయం మాకు లెక్కల పరీక్ష వుంది మధ్యాహ్నం బీజపూర్ హైస్కూలు జట్టు, షోలాపూర్ హైస్కూలు జట్టు నడమ క్రికెట్ ఆటపోటీ ఏర్పాటైంది నేను ఎప్పుడూ క్రికెట్‌బాల్ చేతబట్టిన వాణ్ని కాకపోయినా ఎందుకోగాని నాకు క్రికెట్‌మాచ్‌లో ఆసక్తి కలిగింది అట్లాంటిపెద్ద ఆటల పోటీలలో నేను స్కోరర్‌గా వుండేవాణ్ని. అందు చేత క్రికెట్ ఆటపోటీలకు సంబంధించిన నియమావళి శ్రద్ధగా చదివి, ఆ విషయంలో ఘనుడు అని అని పించు కొన్నాను. నా మనస్సు పూర్తిగా చూడ బోయే ఆట పోటీపై లగ్నమై వుంది. లెక్కల పరీక్షలో లెక్కలు ఎట్లాచేశానో నాకు తెలియదు; పరీక్ష ఎట్లాగో పూర్తి [illegible], ఆటస్థలానికి పరుగు పెట్టాను. పరీక్ష ఫలితాలు తెలిసి నప్పుడు నేను చేసిన అన్ని లెక్కలూ తప్పులే ననీ నాకు వచ్చిన మార్కులు 'సున్న' అనీ తెలిసింది.

పేద నైనందు వల్ల నాకు పేదరికపు బాధలు వాటిలోనూ ముఖ్యంగా చదువు కొనే వారికి వుండే బాధలు, బాగాతెలుసు నాకు లభించిన స్వల్పాన్నీ నేను వారితో పంచు కున్నాను. లేమి వున్నా పరవా లేదు కాని పేద విద్యార్థులు ఎదుర్కొనే దుస్సహ అవమానాలు నాకు బాగా గుర్తున్నాయి. ఒక విద్యార్థి నా కంటె చిన్న తరగతిలో వున్నాడు. అతను చెయ్యని

నేరం మోపి అతనిని బడిలో నుంచి వెళ్ళ గొట్టారు అసలు కారణం విచారించగా ఆతరవాత వెల్లడి అయింది.

అతనిని వారాని కొకరోజు భోజనం పెట్టే వుపాధ్యాయుడు తన పిల్లల మల మూత్రాల మురికి గుడ్డలు వుతక మంటే నిరాకరించాడని అతనిపై నేరంమోపి నాడనే విషయం మాకు తెలియగానే మేమంతా కలసి శాంతి యుతంగా వుద్యమం నడిపి ఆ విద్యార్థి శిక్ష రద్దు చేయించాము. ఈ వుద్యమం మూలంగా మాలో చాలా మంది విద్యార్థులము, క్రమ శిక్షణ పాటించ లేదనే సాకు వన్ని మా విద్యార్థి వేతనాలు నిలిపి వేయడం జరిగింది. ఈ మా ప్రవర్తన ఆ నాటి ప్రభుత్వ పాఠశాల నియమావళి ననుసరించి క్రమ శిక్షణ వ్యతిరేకము!

# 4. సహాయ నిరాకరణోద్యమము - మొదటి అనుభవము

గాంధీశకం ప్రారంభమైంది. సహాయ నిరాకరణోద్యమము ప్రారంభించే ఆలోచనలు తీవ్రంగా జరుగుతున్నాయి. కలకత్తాలో లాలా లజపతిరాయి అధ్యక్షతను జరిగిన జాతీయ కాంగ్రెసు మహాసభ ప్రత్యేక సమావేశంలో సహాయ నిరాకరణోద్యమాన్ని కార్య రూపంలో పెట్టడానికి నిశ్చయమైంది. దేశం అంతా చైతన్యవంతమై కదిలింది. నాలుగు అంశాల బహిష్కరణ కార్యక్రమం సూచించ బడింది. విద్యార్థులుగా మాకు కూడా ఒక కర్తవ్యం ఉంది ప్రభుత్వ విద్యా సంస్థలను బహిష్కరించి, ప్రఖ్యాత కాంగ్రెసు నాయకులు ప్రారంభించి నిర్వహిస్తున్న జాతీయ పాఠశాలల్లో చేరవలసిందని పిలుపు ఇచ్చారు నాయకులందరూ భారతీయ విద్యార్థులు నిర్వహించ వలసిన కర్తవ్యాన్ని గురించి నొక్కి చెప్పి కార్య రంగంలోకి దూకవలసిందని ఆదేశాలిచ్చారు.

ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో చదువుతున్న విద్యార్థులుగా మేము ఎన్నో అవమానాలకు గురి అయ్యాము. మేము గాంధీ టోపీ ధరించడానికి వీలులేదు. ఆ రోజుల్లో అది చేతి నూలుతో చేతి మగ్గంమీద నేసిన ఖాదీ టోపీకూడా కాదు. అది తెల్లని గుడ్డ టోపి మాత్రమే! కేవలం అంతే అయినా దానితో గాంధిజీ పేరు ముడిపడింది గాంధీజీ పేరంటే ప్రభుత్వానికి భయం. వారు ఉలిక్కిపడే వారు. ప్రధానోపాధ్యాయుడు తెల్లని గుడ్డ టోపీలు ధరించిన వారిని వేలెత్తి చూపించి బ్రిటిషు ప్రభుత్వం పట్ల ద్రోహ చింతన కలవారని పేర్కొని వార్నింగులు ఇచ్చేవారు. ఎందరో విద్యార్థుల్ని బెదిరించి అన్యాయంగా శిక్షలకు గురి చేశారు. నేను

అప్పుడు మెట్రిక్యులేషను క్లాసులో చదువు తున్నాను. పాఠశాలలో అత్యున్నత తరగతిలో చదువుతున్న విద్యార్థులుగా మాకు ఆ అన్యాయాన్ని ప్రతిఘటించ వలసిన ధర్మం ఉందనిపించింది అధికారులు విసిన ఈ సవాలును ఎదుర్కోవడం మా కర్తవ్యమని తోచింది రెండు వందలమంది విద్యార్థులము సమావేశం అయ్యాము. నిప్పులు కక్కేటటు వంటి ధోరణిలో ఉపన్యాసాలు చేశాము, అది ఆ రోజుల్లో ఉన్న ఆచారము. సంప్రదాయము, ఆ తర్వాత మరుసటి రోజున అందరమూ గాంధీ టోపీలు ధరించి క్లాసుల్లో కూర్చోవాలని ఏకగ్రీవంగా తీర్మానించాము. వెంటనే ప్రతి ఒక్కరూ గాంధిటోపి కొనుక్కున్నాము.

మరునాడు మెట్రిక్యులేషను క్లాసులో ఉన్న రెండు డివిజన్ల వారూ గాంధీ టోపీలు ధరించి హాజరైనాము. ఈ విషయాన్ని గురించి అధికారులకు రిపోర్టు వెళ్ళింది ప్రధానోపాధ్యాయుడికి ఈ రాజద్రోహకరమైన విషయం తెలిసేటప్పటికి కొంత ఆలస్యం అయింది. ఆయన దండధారుడు. ఎప్పుడూ పొడుగుపాటి పేము బెత్తం చేతబట్టి ఉండేవాడు. ఆయన ఉగ్రుడై బెత్తం ఝుళిపిస్తూ వచ్చి కంఠస్వరంతో ఆ టోపీలు తీసి పారెయ్యండి అని ఆజ్ఞ జారీ చేశాడు. ఆయనకు జవాబు ఇయ్యవలసిన అదృష్టం నాపాల బడింది. ఎందుచేత నంటే నేను మా క్లాసు విద్యార్థులకు (Prefect) నాయకుడిని. గాంధీ టోపీ ధరించడం ఏమీ తప్పుకాదనీ అది తీసివెయ్యము అని స్పష్టంగా చెప్పాను అందువల్ల ఆయన కోపానికి నేను మొదట గురి అయ్యాను ఆయన తన బెత్తంతో నన్ను ఎన్నో దెబ్బలు కొట్టాడు. నా తర్వాత మిగిలిన విద్యార్థులందరిని కూడా అదే రీతిగా వరసగా కొట్టాడు. ఎవరూ టోపీలు తీయలేదు. ప్రధానోపాధ్యాయుడు అలసిపోయి బుసకొడుతూ వెళ్ళిపోయాడు. ఇంకా ఏదో చేస్తాడు, మరే తీవ్ర చర్యను ఎదుర్కోవలసి వస్తుందో అని మేము ఎదురు చూస్తూనే ఉన్నాము. కాని, మరేమీ జరగలేదు. ఆయన కోపం తగ్గి శాంతంగా ఆలోచించి ఇంక మరే శిక్షా అవసరం లేదని అనుకొన్నాడు కాబోలు.

ఈ చిన్న సంఘటన ఆనాడు దేశంలో ఉన్న రాజకీయ పరిస్థితినీ ప్రజ్వరిల్లుతున్న ప్రజా ఉద్యమ స్వభావాన్నీ సూచిస్తుంది. మేము ఒక యూత్‌క్లబ్ (యువకుల సంఘాన్ని) ఏర్పాటు చేశాము. అందులో నగరంలోని రెండు ఉన్నత పాఠశాలల్లోనూ మెట్రిక్యులేషను క్లాసులో చదువుతున్న విద్యార్థులందరూ సంస్థాపక సభ్యులు మేము ప్రతి వారమూ సభలు జరిపే వాళ్ళము చర్చలు జరిపే వాళ్లము. వార్తలు, విషయాలు రాజకీయ పరిస్థితులు గురించి చర్చలు జరిపే వాళ్లము. ఉపన్యాసాలు ఏర్పాటు అయేవి. ఒకరు ఇటాలియను దేశభక్తుడు మాజినీ (Mazzini) గురించి చెప్పేవారు. మరొకరు ఐరిష్ విప్లవకారుడు డివెలెరా (Devalera) గురించి వివరించే వారు ఇంకొకరు మన దేశంలోని విప్లవకారుల సమాచారం గురించి ముచ్చటించే వారు. మా యువక హృదయాలు ఆ వీరుల పట్ల అభిమానంతో వారి త్యాగశీలత పట్ల మెప్పుతో వారు ఎదుర్కొంటున్న కష్టాల గురించిన భయాందోళనలతో ఉప్పొంగి పులకించేవి. నేను శివాజీని గురించీ ఆయన గురువు, మార్గోపదేశకుడు అయిన (రామదాస స్వామిని) గురించీ మాట్లాడాను. ఇట్లాగే కొన్ని వారాల పాటు చర్చా గోష్ఠులు నిర్వహించిన తర్వాత, మనదేశ నాయకుల పిలుపును అంగీకరించి పాఠశాల చదువులు మానివేసి జాతీయ ఉద్యమంలో పాల్గొనాలని నిశ్చయించు కున్నాము

షోలాపూరులో విద్యార్థుల సభ ఏర్పాటు చెయ్యాలనీ, కాంగ్రెసు అగ్ర నాయకులలో ఎవరినో ఒకరిని ఆ సభకు ఆహ్వానించి కర్తవ్యం ఉపదేశించ వలసిందిగా కోరాలనీ నిర్ణయించాము. ఆ సమావేశంలోనే దేశ సేవా దీక్ష గ్రహించాలను కున్నాము. మేము కలుసుకొన్న ప్రతి విద్యార్థీ పాఠశాల బహిష్కరించేటందుకు మాతో ఏకీభవించాడు. కాని, వారి సంరక్షకులు, తల్లిదండ్రులు, అలజడి పొందారు. వారు విద్యార్థుల్ని తమ తమ వారిని బెదిరించారు అయినప్పటికీ మా ఉత్సాహం తగ్గలేదు ఎట్లాగైతేం తుది నిశ్చయం జరిగింది. మహారాష్ట్ర నాయకులు శ్రీ ఎన్. సి. కేల్కార్ పూణే (పూనా) నుంచి వచ్చి సభలో ప్రసంగించారు.

జాతి స్వతంత్రతం కోసం, పరపాలనా దాస్యవిముక్తి కోసం కొనసాగు తున్న మహోద్యమంలో మేము (విద్యార్థులు) నిర్వహించ వలసిన ముఖ్య పాత్రను గురించి ఆయన నొక్కి చెప్పారు. మాలో ఒకరిని మా భావాలు వెల్లడించ వలసిందని ఆదేశించారు. మరెవరైనా ముందుకు వస్తారేమోనని, కొంతసేపు ఆగి, ఎవరూ లేచిరాక పోవడం చూసి నేను నిల బడి కొన్ని మాటలు మాట్లాడి నేను పాఠశాల చదువు మానివేసి మాతృ దేశ సేవ చేస్తానని వాగ్దానం చేసాను.

విద్యార్థులందరూ హర్షధ్వానాలు చేసి చప్పట్లు కొట్టారు. కాని, మరెవ్వరూ ముందుకు రాలేదు వెయ్యిమందికి మించి సమావేశం అయిన ఆ విద్యార్థుల సభలో ఒక్కరు మాత్రమే దేశ సేవా వ్రతదీక్ష గైకొనడం జరిగింది.

జీవితంలో కఠోర పరీక్ష ప్రారంభమైంది కష్టాలు ఒకదాని వెంబడి మరొకటిగా అనుసరించాయి ఉత్సాహంగా కబుర్లు చెప్పి మద్దతు ఇచ్చిన మిత్రులే నా నిశ్చయాన్ని ఉపసంహరించుకో వలసిందని సల హాలు ఇవ్వసాగారు ఇదంతా ఆవేశం. లా —పు మంట వంటిది. ముందు ముందు పశ్చాత్తాప పడతావు అన్నారు. నీ భవిష్యత్తు అంతా నాశనం అయిపోతుంది, అని విరివిగా సలహాలు ఇచ్చారు. ఉపన్యాస వేదికలనుండి బహిరంగంగా పాఠశాలల బహిష్కరణ ఆవశ్యకతను గురించి ప్రచారం చేసిన కాంగ్రెసు నాయకులే ఇష్టాగోష్ఠి ప్రసంగాల్లో దానికి వ్యతిరేకంగా మాట్లాడేవారు. తమ పిల్లల్ని గవర్నమెంటు పాఠ శాలలలో చదివించడం మానలేదు మా ప్రధానోపాధ్యాయుడు నన్ను పిలిచారు. నేను ముందుకు వచ్చే విద్యార్థినని ఆయన అభిప్రాయము. గతించిన సంఘటనలతో ముడిపెట్టకుండా ఆయన అంతరంగంలో నా పట్ల ఒకరకమైన అభిమానం ఉన్న సహృదయుడు. అందుచేత ఆయన నన్ను పిలిపించి పాఠశాలనుంచి వెళ్ళిపోవద్దని, యూనివర్సిటీ (విశ్వ విద్యాలయపు) పరీక్షలకు హాజరు కావలసిందని చెప్పారు. ఆ పరీక్షలకు వెళ్ళేటందుకు అర్హతకల వారిని ఎన్నిక చేసే పరీక్షలు అయిపోయాయి.

వాటిలో నేను ఎన్నికయాను. పరీక్షకు అభ్యర్థిగా ఉన్నానని ఫారమ్ పూర్తి చేసి పంపడం ఒక్కటే జరగవలసి ఉన్నదని. పరీక్షకు కట్టవలసిన ఫీజులు, ఇతర ఖర్చులు గురించి నన్ను బాధపడవద్దని అవి తాను ఏర్పాటు చేస్తానని కూడా అన్నారు కాని, ఆయన అనురోధము, కల్పించిన ప్రలోభము నా నిశ్చయాన్ని సడలించ లేదు. ఆయనతో నా నిర్ణయమునుంచి వెనుదిరిగేది లేదని ఆ ప్రతిజ్ఞ భగవంతుని సాక్షిగా మానవ సమాజ శ్రేయస్సుకోసం గైకొన్నదనీ ఏమి జరిగినా ఎన్ని కష్టాలు ఎదురైనా అది నిలబెట్టుకోన వలసిందేననీ చెప్పి సెలవు తీసుకున్నాను.

భగవంతుడు దయామయుడు. నా ప్రతిజ్ఞ పాటించు కొనేట్లు చేశాడు. నా మాట నిలబెట్టు కొన గలిగినందుకు నాకు ఎంతో సంతోషంగా ఉంది ఆ ప్రతిజ్ఞ తీసుకొన్నప్పుడు అది నిలబెట్టు కొనడం నిజంగా ఎంత కష్టమో నాకు తెలియదు దేశభక్తి పూర్వక కార్య క్రమాలలో నాకేమీ అనుభవం లేదు. లోపల నుంచి ఏదో ప్రేరేపణ వచ్చింది దాన్ని అనుసరించి ముందు అడుగు వేశాను ఆ దిశలో నడిచేటందుకు అంతర్యామి నెంటు తున్నట్లూ నేను ఊరికే మరో మాట చెప్ప కుండా ఒప్పుకొన్నట్లూ అనిపిస్తుంది. అంతరాత్మ ప్రబోధం కలిగింది. నా దారే మారింది అందు కోసం ఉద్రేక పూర్వకంగా చేసిన ప్రయత్నం ఏమీ లేదు. హృదయ కుహరంలో సన్నిపిష్టమైవపిత్రమైనదేదో ఉందనీ దాని ఆజ్ఞలుపాలించ వలసిందనే విశ్వాసమూ ఈకార్యాచరణకు ప్రేరకాలైనాయి.

స్నేహితులు తరచు చెప్పినట్లు అది కేవలం తాత్కాలికమైన ఆవేశం మాత్రమేనా? ఏ ఆవేశాలకూ వశులు కాని అనుభవజ్ఞులు చెప్పిన సలహా నా మీద పని చేయ లేదు. ఏదో నాకు తెలియని అజ్ఞాతశక్తి ముందుకు నెంటింది నేను తుదినిశ్చయం తీసుకొని ఒక్కదూకు దూకాను.

ఈ నిర్ణయం తీసుకున్నప్పుడూ ఇతర ముఖ్య విషయాలను గురించి కార్యనిశ్చయం చేసినప్పుడూ అవి ఎంత అసాధారణంగా కన్పించేవైనప్పటికీ నా కుటుంబములోని పెద్దలు నా సంరక్షణ బాధ్యత

ఉన్న వారు నన్ను వెనక్కు లాగడంగాని నిరుత్సాహ పరచడం గాని చెయ్య లేదు. అది వారికి నా పట్ల వున్న నమ్మకాన్ని నేను తప్పు దారిని నడవటం లేదనే విశ్వాసాన్ని వెల్లడిస్తున్నాయి. అంతేకాదు వారు ఎప్పుడూ నా దగ్గర నుంచి ఆర్థిక సహాయం ఆశించనే లేదు నా వైరాగ్య భావాన్ని, ఆధ్యాత్మిక సాధనను ప్రోత్స హించారు

మహాత్మాగాంధి షోలాపూర్ మీదుగా బొంబాయి నగరానికి వెడు తున్నట్లు వార్తతెలిసింది నేను అప్పటికి అయనను చూడ లేదు. ఆయనను గురించి వినడం, వార్తా పత్రికలలో ప్రకటితమైన ఫోటోలను గౌరవ భావంతో సేకరించి, పటం కట్టించుకొన్నవారి ఇండ్లలో చూడటం మాత్రమే జరిగింది. అందు చేత ఆమహా నాయకుడి దర్శనం లభిస్తున్న దని నా హృదయం సంతోషముతో ఉరకలు పెట్టింది. నేను స్టేషనుకి వెళ్లాను. ప్లాట్ ఫారమ్ మీద జనం కిక్కిరిసి ఉన్నారు. నేను ఆ గుంపులో నిలబడ్డాను వారందరిని ఎట్లాదాటుకుంటూ వెళ్లి ఆ మహానుభావుడి పాద స్పర్శ చేసుకొన గలను! అని ఆలోచన చెయ్య సాగెను. నా కోరిక తీరే టందుకు అవకాశం లేదనే అనుకున్నాను. ఎట్లాగైయితేనేమి రైలు వచ్చింది. జనం సమ్మర్దం కదలికలు మరింత ఎక్కువైనాయి గాంధీజీ ఏ రైలు పెట్టెలో కూర్చున్నారో ఎవరికీ తెలియదు. అందు చెత అందరూ ఎవరికి తోచిన రైలు పెట్ట ముందు వారు మూగారు గాంధీజీ ఉన్న బోగి అదృష్టవశాత్తు సరిగ్గా నేను నిలబడి ఉన్న చోటనే ఆగింది అందు చేత ఏ కష్టము లెకుండా నేను ఆయన పాదాభివందనం చేసుకొని, ఆనందంతో పొంగిపోయాను.

నేను ఏమి మాట్లాడ లేదు. ఆయనే ఆప్యాయతతో నా వీపు మీద తట్టారు. అంతే, నేను విజితుడనై ఆయన మనిషినై పోయాను. ఆయన నిరాడంబరత, ప్రతి క్షణమూ ప్రతి విషయంలోనూ కష్టపడ్చేట్లు వ్యక్తమై చూసిన వారిని ముగ్ధుల్ని చేసింది స్వచ్ఛమై
కొన్ని మాటలు మాత్రమే మాట్లాడారు. నాకా హిందీ ఏమి తెలియదు.

అయినప్పటికీ ఆయన మాటల సారాంశము అవగాహన అయింది. మన దేశానికి స్వేచ్ఛ లభించె వరకూ విశ్రాంతి తీసుకో వద్దని ఆయన ఉద్బోధించారు. అందుకోసం ఏ త్యాగం చెయ్యవలసి వచ్చినా వెనుకాడ వద్దనీ ఎంత త్యాగం అయినా లక్ష్యం సాధించేటందుకు కావాలసినదానితో పోల్చి చూస్తే స్వల్పమేనని అన్నారు విద్యార్థుల్ని ఈ బానిస చదువులు మాని వేసి గ్రామాలకు పోయి అక్కడ ఖాదీ ప్రచారం చేయ్యవలసినది, స్వయంగా రాట్నం తిప్పమని ఆదేశించారు.

నేను ప్రభుత్వ పాఠశాల వదలి వేసి జాతీయ విశ్వవిద్యాలయం వారు నిర్వహించే మెట్రిక్యులేషన్ పరీక్షకు వెళ్లాను. అందుచేత ఏ పని చేసేటందుకైనా స్వతంత్రం ఉంది.పట్నంలో వున్న కాంగ్రెసు నాయకుల దగ్గరకు పోయి నాకేదైనా పని చెప్పండని అడిగాను ప్రజాహిత కార్యక్రమాలలో చేసే పనికి నాకేమి జీతం బత్తెం ఇవ్వనక్కరలేదన్నాను. నేను నడిచి ప్రయాణాలు సాగిస్తాను. గ్రామంలో ఎవరో ఒకరు భోజనం పెడతారు. వసతి ఇస్తారు. నాకు కాంగ్రెసు సందేశాన్ని గ్రామగ్రామానికీ అందించే కార్యక్రమం నిర్వహిస్తున్న కార్యకర్త అని పరిచయం చేస్తూ ఒక ఉత్తరం ఇవ్వండి అని అడిగాను. వారు అట్లాంటి ఉత్తరాన్ని ఇస్తూ నా ఉపన్యాసాలలో సంభాషణలలో ఏయే విషయాలు నొక్కి చెప్పవలసి ఉంటుందో వాటిని గురించి సూచనలు ఇచ్చారు.

నే నొక్కడనే బైలు దేరాను. పది మైళ్లు నడచిన తర్వాత నాకు ఎదురైన గ్రామంలో ఆగాను ఎవరిని ముందుగా కలుసుకోవాలో నాకేమి తెలియదు. అందు చేత సూటిగా (అంగడి) బజారుప్రాంతానికి వెళ్లాను. అక్కడ మధ్యన నడి బొడ్డుగా ఉన్న ప్రాంతంలో కొంత ఎత్తుగా ఉన్న చోటు చూసుకున్నాను. అక్కడ నిలబడి నా ఉపన్యాసం ప్రారంభించాను. ఎవరి పనులలో వారు నిమగ్నులై ఉన్నా ప్రజలందరూ ఉలిక్కిపడి నా మాటలు వచ్చిన వైపు చూసి ఒక చిన్నకుర్రవాడు భారతదేశంలో కొన సాగుతున్న బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా రకరకాల విషయాలు చెపుతూ ప్రజల్ని రెచ్చగొడుతున్నట్లు గుర్తించారు. విదేశీ వస్త్ర బహిష్క

రణ నుంచి సాత్విక నిరోధము వరకు మాట్లాడి పన్నుల నిరాకరణ ఉద్యమం నడిపించండి అంటూ రెండు నిమిషాల్లో ఉద్రేకపూరితంగా గడ గడా చెప్పాను. పిన్న వారిమీద నా మాటల ప్రభావం ఏమైనా పడిందో లేదో నాకు తెలియదు. తమ తమ పనులు చూసుకొంటూ ఉన్న వారిని చూసి, వారు నా మాటల్ని ఏమీ పట్టించుకోలేదనీ, పిట్ట కొద్దీ కుత ఘనము కబోలు అని నా కర్మాన్ని నేనేపోతాను అనీ భావించి వారు ఊరుకున్నారు!

ఆ గ్రామం వారికి నాసంగతి అక్కరలేదని గుర్తించి నేను ముందు గ్రామానికి నడిచిపోయాను. అక్కడ ఆనాడు సంతరోజు. జనం ఎక్కువ మంది చేరారు నేను ప్రజల మధ్యనే నిలబడి నా ఉపన్యాసం మొదలు పెట్టాను నేను విప్లవకారులను గురించే మాట్లాడాను. మహాత్మాజీ దౌర్జన్యంకూడదన్నాడని అహింసాత్మక ఉద్యమం సాగించడమే తన లక్ష్యమనీ చెప్పిన విషయం నాకు తెలియనే తెలియదు. ఆనాడు ఉషారుకి పరిమితిలేదు. అందుచేత స్వతంత్రం హింసాయుతంగా అయినా సరే సాధించాలన్నాను ఉపన్యాసం పూర్తి అయింది. ఎవరైనా భోజానానికి రమ్మని పిలుస్తారేమో అని చూశాను. ఎవరూ ముందుకురాలేదు. ఎవరికైనా పరిస్థితి అర్థం అయిందా అనివాకబు చేశాను. ఎవరోఒకరు ఒక పెద్దఇంటివైపు చూపించారు నేను ఆఇంట్లోకి వెళ్లాను. అది ఆ గ్రామంలో వారందరికీ దేవుడివంటి వాడైన పట్వారీది. ఆయన నా ఉపన్యాసం విన లేదు. లోపలికి రమ్మని, నాదగ్గర ఉన్న పరిచయపు ఉత్తరం చూశాడు. నాకు భిచ్చగాడికి పెట్టినట్లుగా రెండు రొట్టెలు తెచ్చి ఇచ్చి ఇంక అక్కడ ఉండకుండా పొమ్మన్నాడు. ఇంకా ఉండనిస్తే రాజద్రోహికి నిలవ నీడ ఇచ్చిన నేరం చేసిన వాడవుతానని బెదిరించిపోయాడు!

ఈ అనుభవం నాకు సరిక్రొత్త అనుభవం. అపూర్వమైంది నాకు అతను ఆరాత్రి పడుకొనేటందుకు ఎందుచేత చోటు ఇయ్య కూడదు? మిన్ను విరిగి మీదపడుతుందా? పడుకొనేటందుకు కాస్తచోటు ఇస్తే ఏమవుతుంది? గ్రామానికి పెద్ద, అధికారి అట్లాపొమ్మని దారి చూపిస్తే మరెవరైనా చోటు ఇస్తారని ఆశించడం తెలివి తక్కువ అవుతుంది అందుచేత

హనుమంతుడి గుడి దగ్గరికి నడిచిపోయాను. అది శిథిలావస్థలో ఉంది నేను, ఆరాత్రి అక్కడే గడిపి మరునాడు నాప్రయాణం ముందుకు కొనసాగించాను.

నేను ప్రచారం చేస్తున్నది రాజద్రోహకరమైన చట్టరీత్యా నేర మనీ నాకు కొంచెంకూడా తెలియదు. నేను అట్లాగ వెడుతూ ఉండగా మరో ఇద్దరు యువకులు కలిసారు. మేము ముగ్గురమూ బ్రిటిషు వారి పాలన గురించి విమర్శిస్తూ వ్యతిరేకంగా మాట్లాడే వాళ్లము. ఇట్లా రెండు వారాలో ఎంతో గడిచింది. మా ఉపన్యాసాలను గురించిన నివేదికలు జిల్లాలో ముఖ్య స్థానానికి వెళ్లాయి. ఆ సంగతి కూడా నాకుతెలియదు ఆ రోజుకంటె ఆరోజు మాఉపన్యాసాలలో వేడి విమర్శనలలో వాడి, పెరుగు తున్నాయి. ఒక గ్రామంలో రాత్రి, ప్రజలతో మాట్లాడుతూ ఉండగా ఒక పోలీసు కాన్‌స్టేబిలు నావైపు రాసాగాడు వెంటనే నా ఉపన్యాసం వింటున్న గ్రామస్థులందరూ ఒక్క క్షణంలో తుర్రుమని పారిపోయారు. నేను నా సహచరుల్లో ఒకడూ మాత్రం మిగిలాము. మేము ఇద్దరమూ భారతదేశంలో బ్రిటిషు సామ్రాజ్యానికి ప్రతినిధిగా ఉన్న ఆగొప్ప అధి కారి ముందు నిలబడ్డాము. అతను కొంత మర్యాదస్థుడులాగ ఉన్నాడు. మేము మాప్రయాణం కొనసాగించడానికి వీలులేదని చెప్పి, తనపై అధి కారి దగ్గరకు మేము తనతో రావలసి ఉంటుందన్నాడు మేము వెంటనే అంగీకరించాము

ఆ ఫౌజ్‌దార్ అంటే పోలీసు సబ్‌ఇన్‌స్పెక్టరు, తనతాబేదారు కంటె, కరుకైనవాడు. అయన మిమ్మల్ని నిందించాడు బెదిరించాడు. మిమ్మల్ని కొరడా దెబ్బలు కొడతానన్నాడు ఒళ్ళు చీరేస్తానన్నాడు. ఈ చర్యలు ఇట్లాగే కొనసాగిస్తే అరెస్టు చేస్తాననీ మొదటి తప్పుగా భావించి వార్నింగు ఇస్తున్నాను అనీ, చెప్పి, ఇంక ముందున్న గ్రామాలకు పోకుండా నోరుమూసుకొని వెనకకు తిరిగిపొమ్మన్నాడు. మేము పట్నానికి తిరిగివచ్చి జరిగింది నాయకులకు చెప్పాము. వారు కొంతకాలం పాటు

మాకార్యక్రమాన్ని కట్టిపెట్టమన్నారు మా మొదటి సాహసిక కార్య క్రమము ఈతీరుగా మూన్నాళ్ల ముచ్చటగా ముగిసింది!

ఖిలాఫత్ సమస్య హిందు, ముస్లిముల మధ్య ఐకమత్యం రూపొందించి ఒకటిగా ఉండేటందుకు తోడ్పడింది వీరావతారులైన (giant brothers) అలీ సోదరులు మహాత్మా గాంధీకి పార్శ్వ చరులై వుండేవారు హిందూ ముస్లింకీజై అనేనినాదాలు అంతటా ప్రతిధ్వనించాయి. బ్రిటిషు సామ్రాజ్యతత్వాన్ని ఎదిరించేటందుకు భారతదేశంలోని ప్రజ లందరూ ఐక్యకంఠంతో ఒక్కమనిషా అన్నట్లు ఎదిరించెటందుకు నిల బడ్డారు. ఈ ఉద్యమంలో ఒక విధమైన మతావేశం చోటుచేసుకొన్నట్లు ప్రస్ఫుటమైంది ప్రజల మనస్సు విప్లవాత్మకమైంది. పెద్దా చిన్నా నాయకులందరూ దేశంలో వివిధ ప్రాంతాలలో ఈమూల నుంచి ఆమూలకు పర్యటనలు చేస్తూ ఉపన్యాసాల వెల్లువతో ముంచెత్తారు. నిద్రాణస్థితి నుంచి ప్రజల్ని కార్యరంగంలోకి దూకండని ప్రబోధించ సాగారు మా యువ హృదయాలు, భారతజాతి పునరుజ్జీవనము చెందుతోందని గమ నించి హిమఖండసదృశ జడస్థితిలో ఉండిపోకుండా వెచ్చబడుతున్నట్టు భావించి పులకించి స్పందించాయి

లాయర్లు కోర్టులు బహిష్కరించ వలసిందనే ఆదేశం ఇచ్చారు. విద్యార్థులు పాఠశాలలు వదలివేసి బైటికి వచ్చేశారు. బ్రిటిషు ప్రభుత్వం వారు ఇచ్చిన బిరుదులు లోగడ ఆబిరుదులు అంగీకరించిన పెద్దలు అనేక మంది తిరిగి వాపసు ఇచ్చివేసారు. అనేక గ్రామాలలో పట్నాలలో రాట్నాలు జుంజుమ్మని ఝుంకారావం చేస్తూ గిరిగిరా తిరగసాగాయి. ఖాదీధరించడము, జాతీయ వాదుల సంప్రదాయము, జాతీయతకు చిహ్నము అయ్యాయి. విదేశీ వస్త్రాలు అగ్నిజ్వాలలలో ఆహుతి అయ్యాయి. నవ భారతదేశము మేల్కొన్నట్లు, నవశకారంభమైనట్లు అనిపించింది ప్రతి వారు ఏదో ఒకపనిచేస్తూ స్వాతంత్ర్యోద్యమాన్ని ముందుకు కొనిపోయే ఆలోచనలలో, కార్యకలాపాలలో, ఐక [illegible]

దేశ మాతృసేవలో పాల్గొనేటందుకు రండంటూ పిలిచిన పిలుపు కాదని అనడం ఎవ్వరికీ సాధ్యంకాదు. అందుచేత నేనుకూడా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనేటందుకు చేరాను. అప్పుడు నాకు మరో సమస్య ఎదురైంది. మా మెట్రిక్యులేషన్ పరీక్షఫలితాలు ప్రకటించారు నేను ఆపరీక్ష రెండోతరగతిలో ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణుడిని అయాను. కొత్తగా ఎన్నో ఉన్నత పాఠశాలల్నీ కళాశాలల్నీ దేశభక్తులూ నాయకులూ ప్రారంభించారు ఆజాతీయ విద్యాసంస్థలు, ప్రభుత్వ విద్యాసంస్థలలో నుంచి బైటికి వచ్చేసిన విద్యార్థుల ఉన్నత విద్యాభ్యాసానికి అవకాశాలు కల్పించాయి అట్లాంటి జాతీయ విద్యాసంస్థలో ఒకదాంట్లో చేరేదాలేక గ్రామాలకు వెళ్లి సేవాకార్యక్రమాల్లో పాల్గొనేదా? ఈసమస్యా పరిష్కారం. వెంటనే చెయ్యడం నాకు సాధ్యంకాలేదు దేశసేవలోనే పూర్తిగా నిమగ్నుడిని అయ్యేటందుకు అవసరమైన మానసిక, ఆర్థిక, తాత్త్విక ఆధ్యాత్మిక బలం నాకు ఉందా? అది సమకూర్చుకోవడము తప్పనిసరి అవసరము అని అనిపిస్తోంది నాలో నేనే ఈవిషయం చర్చించుకున్నాను. అప్పుడు నేను గ్రామాల్లో సంచారం చేస్తున్నాను. గ్రామస్థులకు ఉపయోగించే సమాచారం నేను చెప్పగలగింది చాలా తక్కువ అని కూడా రుజువైంది. అందుచేత కొన్ని సందర్భాల్లో మానసిక వేదన కూడా కలిగేది నేను తీసుకొన్న దేశసేవావ్రతాన్ని అక్షరాలా సార్థకం చేసుకోవాలన్నా సక్రమంగా పాటించాలన్నా నేను మంచి శిక్షణ పొందవలసి ఉంది అని స్పష్టమైంది. అన్ని విధాలా నాకు పోషణ, పుష్టి అవసరము. ఒకరిద్దరు స్నేహితులతో సంప్రతించి, నేను ఉన్నత విద్యాభ్యాసం కోసం జాతీయ కళాశాలలో చేరాలని నిశ్చయించుకొన్నాను. తూర్పు ఖాందేష్‌లో ఉన్న అమల్నేర వెళ్లాను అక్కడ ఖాందేష్ విద్యా సంఘం ఏర్పాటు చేసిన కళాశాలలో ప్రవేశించాను. ఈరీతి కాలేజీ ఇంటర్లో మొదటి సంవత్సరపు చదువులో చేరాను. అప్పుడు నాజేబులో ఏడు రూపాయలు మాత్రమే ఉన్నాయి! అదే నా దగ్గర కళాశాల చదువు కోసం ఉన్న పెట్టుబడి!

ఇట్లాగ జూలై 1927లో అమల్నేరు చేరుకొన్నాను. ఆ తరవాత రెండు సంవత్సరాలలో నాకు మానసికంగా విద్యా
కంగా ఉత్తమ శిక్షణ కల్పించి అభివృద్ధి చెందడానికి ఆశ్రయం ఇచ్చిన విద్యాసంస్థలో ప్రవేశం పొందాను.

# 5. అమల్ నేర్ నన్ను తీర్చిదిద్దింది

జాతీయ కళాశాల వాతావరణం నా అభివృద్ధికి తగినట్లు వుంది. ఖాందేషి విద్యాసంఘం వారు దేశభక్తి పట్ల కలిగిన ఉత్సాహంతో జాతి అవసరాలను గుర్తించి తమ సంస్థాన్ని పూర్తిగా జాతీయ సంస్థగా మార్చి వేశారు, సంఘంలో ఉన్న వారందరూ ప్రఖ్యాత విద్యావేత్తలు. అందుచేత వారు ఏర్పాటు చేసిన విద్యా విధానంలోనూ ఇచ్చిన శిక్షణలోనూ సేవాభావమూ త్యాగమూ ప్రస్ఫుటమయ్యేవి.

శ్రీ జె జి గుణె మా కళాశాల ప్రధానాధ్యాపకులు. వీరు తర్వాత లోనావాలాలో కైవల్యధామ ఆశ్రమాన్ని నిర్వహించిన స్వామి కువలయానందులు. ఇటీవల స్వర్గీయులైనారు. ఆయన బ్రహ్మచారి. వేదాంత చింతనలో నిమగ్నులైనారు. ప్రేమ స్వరూపుడు. గొప్పవక్త. ఆయన మా [illegible] పై చెరగని ముద్ర వేశాయి. ఆయన కాలేజీకి కొద్ది దూరంగా ఒక కుటీరంలో నివసించే వారు. ఆయనను ఆ రీతిగా చూడగానే నేనుకూడ యావజ్జీవ బ్రహ్మచర్య దీక్ష స్వీకరించాలనే అభిప్రాయం దృఢపడింది. హృదయంలో గూఢంగా వున్న పారమార్థిక చింతన, ఆధ్యాత్మిక భావాంకురాలు మొలకెత్తాయి. పరిశుద్ధుడను కావాలనే గాఢమైన కోరిక కలిగింది. ఆదర్శప్రాయమైన పరిశుద్ధ సాత్విక బ్రహ్మచారిని నేను ప్రత్యక్షంగా ఎదుట రోజూ చూస్తూనే వున్నాను. ఆయన హృదయం ఎంతో నిర్మలంగా స్వచ్ఛంగా వుంది! నన్ను నేను విమర్శించుకొని ఆయనతో పోల్చుకొని చూస్తే నా మనస్సు ఎంతో మలినంగా నేను పాప పంకిలంలో మునిగి ఉన్నట్లు తోచింది. నేను అనేక పాపాలు చేసిన వాడ్ని. బ్రహ్మచర్యం అంటే కేవలం స్త్రీలతో లైంగిక [illegible] వుండటం అనేదికాదు. బ్రహ్మచర్యం హృదయ పవిత్రతకు [illegible]. ఈ

దృష్టితో పరిశీలిస్తే నా మనస్సు పూర్తిగా కల్మషంతో నిండి ఉంది. అందు చేత బ్రహ్మచర్య వ్రత స్వీకారానికి నాకు అవకాశం, అధికారము ఎట్లా లభిస్తుంది? నా మనస్సు ఈ భావాలతో సంక్షుభితమైంది.

లోకమాన్య తిలక్ అవతార పరిసమాప్తి అయిన నాడు నేను గైకొన్న ప్రతిజ్ఞ నాకు జ్ఞాపకం వచ్చింది, "నేను ఒక ఇంటి వాణ్ణి అయేది లేదు. దేశసేవ నా ప్రధాన కర్తవ్యము. వ్యక్తిగతమైన సుఖాలు నాలక్ష్యం, గమ్యం కాకూడదు. వాటిని త్యజించాలి. అది నాకు సాధ్యమా? నేను ఈమానసిక బంధాలు లోపాలు అన్నింటిని అధిగమించ గలనా? ప్రయత్నిస్తాను విఫలయత్నుడనైనా చింతించను ప్రయత్నం చెయడం మాత్రం తప్పదు యత్నేకృతే యది నసిధ్యతి కోత్రదోషః అనికదా పెద్దల వాక్యము, నేను ఆవేశంలో గైకొన్న ప్రతిజ్ఞకు ఒక రూపం, ఆదర్శం, ప్రథిమ అమన్నేర్‌లో లభించాయి. దాని నిర్వహణకు దారి కొసం అన్వేషించడం ప్రారంభించాను. హృదయ నైర్మల్య సాధనకు సాధన ప్రారంభమైంది. అందులో ముందుకు సాగితేనే గాని నేను ఎన్నుకొన్న త్యాగమయ జీవితానికి సార్థకతే ఉండదు. అది ఆ జీవితానికీ అంత ముఖ్యమైంది.

యంగ్ ఇండియా (యువభారత్) అనే వారపత్రికలో మహాత్మాజీ ప్రసాదించినరచనలు నాకుక్ర్తవ్యోవదేశకములుగానుఉత్సాహ దాయకములుగాను ఉండేవి ప్రతి ఒక్కరూ పరిశుద్ధ హృదయులు కావాలని ఆయన ప్రబోధించారు. ఆయన ప్రతి వాక్యమూ నా హృదయ వీణను స్పందించేట్లు చేసేది. అత్యంత పాపికూడా తన పాపాన్ని దులిపి వేసుకొన గలడని ఆయన ఒకసారి వ్రాసారు. మానవుడు సహజంగా సుగుణ వంతుడు అందుచేత ఎవరైనా గుణవంతుడు కావాలనే కోరిక కలిగి అందు కోసమై పట్టుదలతో ప్రయత్నం చెయ్యడమూ కొనసాగి వారు అత్యంత పవిత్రులుగా రూపొంది మానవ జాతికే తలమానికము (మాణిక్యము) కాగలరు అని, మహాత్మాజీ తన జీవితం నుంచే ఉదాహరణ లిచ్చారు. అవి చదివిన

మీదప నాలో కలిగిన నిశ్చయము నానాటికీ దృఢ తరమైంది. నేనుకూడా అట్లాగే నన్ను నేను ఓర్చి దిద్దు కోవాలని అనుకొన్నాను.

అమల్నేర్ సంస్థలో ఉన్న వాతావరణము సత్శీలం అలవరచు కొనే టందుకు చాలా అనుకూల మైందని ఇంతకు ముందే సూచించాను. కళాశాల భవనాలు పట్నానికి కొన్ని మైళ్ళ దూరంగా ఉన్నాయి. అందు చేత పవిత్రతకు ఆస్పద మైన ఏకాంత సాధనకు సహజ మైన అవకాశం ఉంది. మేమందరమూ హాస్టల్‌లో జీవితం గడిపే వాళ్ళము. అది స్వచ్ఛంగా నిరాడంబరంగా ఉండేది. చదువు కొంటున్న విద్యార్థుల సంఖ్య కూడా ఏమీ ఎక్కువ కాదు. 29 మంది మాత్రమే. మే మందరము ఒకే కుటుంబము లోని మనుష్యులము ఉన్నట్లుండే వాళ్ళము మమ్మల్ని మా లక్ష్యం నుంచి విముఖుల్ని చేసేదేదీ లేదు. సహవాసము మంచిది ప్రతిఒక్కరూ తక్కిన వారికి ఏదో విధంగా తోడ్పడాలనే ఆసక్తి చూపె వారు వారిలో ఎవరైనా ఒకరు నిరుత్సాహంగా ఉంటే ఉత్సాహం కలిగించే వారు. చిరికి ఎసం చెందితే ధైర్యం చెప్పే వారు

పరిశుద్ధ జీవనం ఆదర్శంగా గ్రహించిన సాధకులు సునిశితంగా ఆత్మవిమర్శ చేసికో వాలని మహాత్మాజీ అన్నారు. తన తప్పును తానే అంతరంగికంగా విమర్శించు కొని గుర్తించే అలవాటు చేసుకోవాలి ఆ దోషాల నుంచి ప్రయత్న పూర్వకంగా విముక్తుడు కావాలి. అది ఎట్లా చెయ్యాలి ? "ఉపవాసము, ప్రార్థన" అనేది ఒకటే తరుణోపాయము.

అప్పుడు నేను తిరిగి భగవద్గీత చేత బట్టాను. భగవద్గీతలో ప్రతి పాదితమైన వేదాంతము నాకు అర్థము కాలేదని ఇంతకు ముందే నేను ఒక సారి చెప్పాను. నేను రోజూ దానిని పూర్తిగా ఒక సారి పారాయణ చేసే వాణ్ని. అది భక్తితో మతాభి మానంతో చేసే వారిని అనుకరించి చేసినట్లే చేసేవాణ్ని. తర్వాత మా కళాశాలా ధ్యక్షులైన శ్రీ గుణే అర్థాలు తెలుసు కొని చదవ వలసిందని సలహా ఇచ్చారు అట్లాగే చేసాను, అట్లా చేసిన ప్పుడు చదివి అర్థం చేసుకొన్న భావం ధ్యానంలోకి లాగేది. మహాత్మాజీ,

దురాలోచనలు కలిగి అపవిత్రుడనైనట్లు భావంకలిగితే ఉపవాసం చెయ్య వలసిందని చెప్పారు మానసిక సంతోషంతో గడుపుతున్న ఆరోజుల్లో నేను తరచుగా అనేక రోజుల పాటు ఉపవాసం (నిరాహారదీక్ష) లో గడుపుతూ భగవంతుడ్ని నాకు పిసి బిడ్డల హృదయ నైర్మల్యం ప్రసాదించ వలసిందని కోరే వాడ్ని, ప్రార్థనా నిమగ్నుడనయే వాడ్ని. "ఆత్మ విమర్శనకు సాధనంగా 'దైనందిన జీవిత చర్య' (డైరీ) వ్రాయడం ఒక పద్ధతి." అని ఎవరో మరొకరు చెప్పారు "ప్రతి రోజూ గత 24 గంటలలో చేసిన ప్రతీపని విమర్శించు కొంటూ వ్రాయటము అవసరము. అందులోని మన తప్పులు ఒప్పుకోవాలి. అంతః కరణే నీ తోడు నీడ, మార్గదర్శి! నీ పాపాలు నీవే కర్మ సాక్షి సమక్షంలో అంగీకరించు, అతని కన్నుగప్పి మోసం చేయ లేవు నీవు పాపం చేశావా? అయితే పశ్చాత్తాప పడు. మనస్ఫూర్తిగా నూటిగా పశ్చాత్తాపం పొందటమే పాప పరిహారానికి సాధనము!" అని, నాలో నేనుచర్చించు కొని నిశ్చయించు కొన్నాను, బుద్ధి పూర్వకమైన ప్రయత్నం ఆ నిమిషాన్నుంచే ప్రారంభ మైంది.

నేను ఎప్పుడూ ఆలోచనలలో ఉండే వాడిని. ప్రతి రోజూ పనులన్నీ ముగించిన తర్వాత డైరీ పుస్తకం చేతబట్టి నాదిల్ల దగ్గర కూర్చుండే వాణ్ని. చేసిన వన్నీ వివరంగా ఒప్పుకొంటూ [illegible] నివేదిక సమర్పించి నట్లుగా వ్రాసేవాడ్ని. నా చుట్టూ ఉన్న అనంతమైన గాఢాంధకారంలో కర్మ సాక్షిగా నాతో ఉన్న ఆత్మస్వరూపుడి ఎదుట ఏదీ దాచలేదు ఏదీ మర్మం పెట్టి చెప్పలేదు. నా చేతిలో ఉన్నవన్నీ ఆయన ఎదుట సమర్పించే వాడిని కొంచెం సేపు వ్రాసి ఆగేవాణ్ని. ఆగి మరల వ్రాసేవాణ్ని ఒకొక్కప్పుడు గాఢమైన ధ్యానంలో మునిగి పోయేవాణ్ని. చేసిన పాపాలకు కన్నీరు కార్చేవాడిని. ఈ స్త్రీ విషయమైన కోరికను ఎట్లా జయించేది? ఈ పశు వాంఛను ఎట్లాగ దహించి ఉత్పతనంచెయ్య (అరికట్ట) గలను? హృదయాన్ని అదుపులో పెట్టుకొనే ప్రయత్నం చెయ్యాలి. మనస్ఫూర్తిగా ప్రయత్నాలు చేసేవాణ్ని.

ప్రతి నెలా ఆరు రోజులు ఉపవాసం ఉండే వాడ్ని. రెండు ఏకాదశులు. ప్రతి గురువారము ఉపవాసం ఉండే వాణ్ని. తరగతులలో ఉన్నప్పుడు తప్ప ప్రార్థనలో ధ్యానంలో గడిపే వాడ్ని. నేను జ్ఞానేశ్వరీ భగవద్గీతపైన వివరణ పూర్వకముగా వ్రాయించిన వ్యాఖ్యానము (జ్ఞానేశ్వరి), తుకారామ్ భక్తి మయమైన కీర్తనల సమర్థరామదాస్ దేశభక్తి ఉద్దీపన రచనలు చదివాను, కార్లైలు ఫ్రాన్సు లో జరిగిన ప్రజా విప్లవమును వివరించి వ్రాయించిన రచనను, భక్తులు, రచయితలు, వీరులను గురించి రచించిన వ్యాసాలను రస్కిన్ సంస్కృతిని గురించీ గాంధీజీ మెచ్చిన ఋషితుల్యుడు టోల్‌స్టాయి నైతిక, ఆధ్యాత్మికవిషయాల గురించి చేసిన రచనలను చదివాను. అవి నన్ను మరచి తీర్చిదిద్ది, నాకు ఒక రూపం ఇచ్చాయి. కాని, ఇంత ప్రయత్నంచేసి నప్పటికీ బ్రహ్మచారి జీవితానికి అవసర మైనంత నాకు సిద్ధించ లేదని భావించాను.

పాపపు ఆలోచనలు నా మనస్సులోకి దడుంగుమని మధ్య మధ్య దూరబడుతూఉండేవి. అట్లాంటప్పుడు నాకు ఏమీ తోచేదికాదు. తగదు అది పిరికితనము. కానియ్యి ప్రయత్నాలు కొనసాగించవలసినదే". అని నన్ను నేనే సముదాయించుకొని పట్టుదలతో ఉండేవాడ్ని. ఒకనాడి రాత్రి ఇట్లాంటి భావావేశముతో పశ్చాత్తాపముతో నా మనస్సు నిండిపోయింది. కన్నీరు ప్రవహించసాగింది నేనుఒక్కడ్నే ఉన్నాను. రాత్రి అంతా విచారంలో కన్నీరుకారుతూ గడిచింది. నేను డైరీవ్రాసి విచారంతో గడిపి ఎంతకాలం గడిపానో తెలియకుండా అట్లాగే నిద్రపోయాను. వేకువ గడియల్లో మా మనస్తత్వ శాస్త్రాధ్యాపకులు తట్టిలేపినందువల్ల ఉలిక్కిపడి లేచాను. ఆయన అప్పటికే కొన్ని గంటల క్రిందటనే వచ్చి, నేను వ్రాసినదంతా చదివి, ఆలోచిస్తూ చాలా సేపు నిలబడి చివరికి నన్ను తట్టి లేపారట. నేను ఆయనను చూసేటప్పటికి ఆయన కళ్ళనుండి సానుభూతి పూర్వకమైన కన్నీరు జాలువారడం గమనించాను ఆయన ప్రేమ పూర్వకంగా నన్ను మరోసారి తట్టి "సోదరా! ఈ పోరాటంలో పోటీలో నీకు విజయం లభించింది" అన్నారు.

నాలో నేను పశ్చాత్తాపపడటమే కాకుండా నా అనుతాపాన్ని మరొక మిత్రుడితో కూడా చెప్పాను. పశ్చాత్తాపరూప ప్రాయశ్చిత్త క్రియపూర్తి అయింది. అప్పటి నుంచి నాకు ఒకరకమైన శాంతి, సమాధానము, నాలో ఒక క్రొత్తవ్యక్తి పెరగసాగాడు బ్రహ్మచారి జీవితం గడపగలననే ఆత్మ విశ్వాసం లభించింది.

మా ప్రిన్సిపాల్ దగ్గరకు వెళ్ళి నా అనుతాపాన్ని తెలియజేస్తూ వ్రాసిన కాగితం అందించివచ్చేశాను. అట్లాచేసిన వెంటనే నాలోనాకున్న విశ్వాసం మరింతపెరిగింది మరునాడు ఆయన నన్ను పిలిచి వాత్సల్య పూర్వకంగా "నీవు సరియైన దారిలోనే పయనిస్తున్నావు. నీ కేదైనా సందేహం వచ్చినా సలహాకావలసినా నాశక్తికొద్ది నీకు ఆసరా అవుతాను" అని అన్నారు. ఆయన మాటలు నాకు ధైర్యం ఇచ్చాయి. ఆయన గొప్ప భక్తుడు. భక్తి పూర్వకమైన గీతాలు అత్యంత మధురంగా పాడేవారు. అవి వింటే నా హృదయ తంత్రులు [illegible] నేనుకూడా పాడేవాడిని. మనసు నిష్కల్మషమై తేటపడేది. పేజీలు మూతపడి ఉన్న పుస్తకం మాదిరిగాఉన్న నాహృదయం తెరిచినట్లు కాసాగింది. క్రమముగా మార్పు వచ్చింది. నేను పూర్తిగా క్రొత్తవ్యక్తిని అయ్యాను.

ఆరోజుల్లో స్నేహితులు నాకు విరివిగా ఇచ్చిన సలహాలు చేసిన సహాయాలూ జ్ఞాపకం వచ్చినప్పుడు నాహృదయంలో కృతజ్ఞతాభావం స్పందిస్తుంది.

బాల్యంలో నిరీశ్వరవాది, నాస్తిక భావాలు కలవాడూ అయిన వ్యక్తి చివరికి ఆధ్యాత్మిక మార్గంలో పయనించే సాధకుడుగా మారాడు! భగవంతుడు తన అపారకరుణాశీలం వల్ల నన్ను నేను మోసం చేసు కోకుండా చేయూత ఇచ్చి రక్షించాడు ఆ కాల రోజుల్లో నాదైనిక చర్య 4గం 20 నిమిషములకు (సుమారు బ్రాహ్మీముహూర్తవేళ) ముందుగానే ప్రారంభమయేది. నేను 4 గంటలకే టప్పటికే చన్నీటి స్నానం చేసే వాడిని 'డస్కు' దగ్గర కూర్చుండి భగవద్గీత పారాయణం చేసేవాడిని.

కబీరు, తులసీదాసు, సూరదాసుల భక్తికీర్తనలు గొంతెత్తి పాడేవాడిని.
మోరోపంత్ వ్రాసిన కేకావళిలోని శ్లోకాలు చదివేవాడిని. ధ్యానం చేసే
వాడిని. మనస్సును అతియుగా నిర్మలంగా ఉండేటట్లు చేసుకొని ఆనాడు
చదువవలసిన పాఠాలు చదివేవాడిని. 9 గంటల వరకు పాఠ్యపుస్తకాలు
చదివెవాడిని అప్పుడు ప్రాతఃకాల భోజనానికి వేళఅయిందని గంట
కొట్టేవారు ఆ తర్వాత రోజంతా కాలేజి, పాఠశాల గదులలో చదువు
సాయంత్రం కొంత దేహపరిశ్రమ చెసే వాడిని, రాత్రి పడగానే ఆనాటి
దిన చర్య వ్రాసిన తరువాత కొంత ముందుగానే నిద్రపోయే వాడిని
దినచర్యవ్రాయడం నాఆధ్యాత్మికసాధనలో అనుతాపప్రకరణ గ్రంథము
ఆ పుస్తకము నాకు నిత్య సన్నిహిత వర్తియైనముని.

అక్కడే, అమల్నేర్‌లోనే నేను మంచివక్తగాకూడా రూపొందాను. మేము ఒక చర్చా వేదిక (డిబేటింగ్ సొసైటీ) ఏర్పాటు చేసుకొన్నాము. మాలో అరడజను మంది ఏదోఒక విషయాన్ని ఎన్నుకొని, దాన్నిగురించి మాట్లాడేటందుకు ఇటూ అటూ చర్చించేటందుకు తయారయ్యేవాళ్ళము. నేను ప్రతివారమూ తప్పకుండా మాట్లాడేవాడ్ని. నేను మొట్టమొదట మాట్లాడిన విషయము. బ్రిటిషువారికి ప్రత్యర్థియై చివరికి పరాజితుడైన "నెపోలియన్ బోనపార్టీ" అనే ఫ్రెంచి సేనాపతి, నాయకుడు, చక్రవర్తి అయిన వీరుడ్ని గురించి నేను ఎంతో చదివి సమగ్రంగా నోట్సు రాసుకొన్నాను. నేను మాట్లాడిన పద్ధతి, విషయము చక్కగా సంతృప్తికరంగా ఉందన్నారు. క్రమముగా నేను మంచివక్తగా రూపొందాను.

నేను క్లాసులో లేని సమయంలో కాలాన్ని కాలేజి లైబ్రరి (గ్రంథాలయం)లో గడిపేవాడ్ని ఆగ్రంథాలయం గొప్పది పరిపుష్టమైనది. అందులో ఉన్న పుస్తకలు నేను చదివేవాడ్ని. నోట్సు వ్రాసుకొనేవాడిని. ఆ నోట్సుమరల చదవేవాడ్ని. ఈ రీతిగా నేను చదివిన ప్రతిదీ జీర్ణం చేసుకొనేటందుకు ప్రయత్నించేవాడిని, ఈపద్ధతిలోనూ నావిద్యావ్యాసంగ

కార్యక్రమంలోనూ గ్రంథాలయ పరిపాలకుడైన మా ఆచార్యులు నాకు తోడ్పడ్డారు.

మాలో కొందరము కలిసిన విద్యార్థి పత్రికను ప్రకటించాము నేను దానికి సంపాదకీయ బాధ్యత వహించాను. అదిపూర్తిగా మా విద్యార్థుల కృషి ఫలితము అది వ్రాత పత్రిక. అందులోనే "పిచ్చివాడి పగటికల" అనే శీర్షిక క్రింద రచనలు కొనసాగించాను. ఆ వ్యాసాల్లో ఆత్మ విమర్శ ఎట్లా పవిత్రతకు తోడ్పడుతోందో వివరించాను అదికొంత హెచ్చుతగ్గులతో నా ప్రయత్నం నివేదిక లనవచ్చు ఆది ఒక రకంగా మిత్రబృందము సమక్షంలో కావించిన ఆత్మ నివేదన అనవచ్చు. దాని వల్ల మరెవరైనా ఏ కొద్దిగానైనా లాభంపొందారో లేదో చెప్పలేను. కాని, నేనే మానసిక శక్తిమాత్రం చాలా ఎక్కువగా పెరిగిందిఅని నిశ్చయంగా చెప్పగలను.

మనలో చాల మందిమి గురువారం నాడు ఉపవాసం ఉంటాము. సాయంత్రం గుమిగూడి భోజనాలు చేస్తాము ఎవరైనా ఒకరు పురాణాలలో నుంచి మంచి ఘట్టము ఒకటి చదువుతారు మరొకరు తన అనుభావాలు విశదీకరిస్తారు. ఈరీతిగా ఒకరికి తెలిసింది ఇతరులతో పంచుకొనడంవల్ల విజ్ఞాన ప్రదానపు దానాలు జరగడం సంభవిస్తుంది కలిసి చర్చలు జరిపి ఒకరికొకరు వారి అభివృద్ధికి తోడ్పడటం జరిగింది. మాలో ప్రతి ఒక్కరి వ్యక్తిత్వమూ గట్టి పునాదులపై నిర్మాణమై అభివృద్ధిచెందేటందుకు మేము అవలంబించి అమలు చేసిన ప్రయత్నమే ఈ పద్ధతి అని అనవచ్చు.

మా కళాశాల ప్రిన్సిపాలు దేహసౌష్ఠవం గురించిన శిక్షణ ఇవ్వటంలో ప్రసిద్ధి గలవారు. ఆయన మాకు ఒక రకమైన సైనిక శిక్షణ ఇచ్చారు. అంటే మాకు ఆయుధాల ప్రయోగంలో శిక్షణ ఇచ్చారని అనుకోవద్దు మేము స్వచ్ఛంద సేవాదళం (వాలంటీర్లుగా ఏర్పడ్డాము) ఒకేరకం దుస్తులు (యూనిఫారమ్) ధరించేవాళ్లము, లాఠీలు ధరించే

వాళ్లము. జాతీయ గేయాలు పాడుతూ తీర్చిదిద్దినట్లు లయక్రమం తప్ప కుండా అడుగులు వేస్తూ బారుతీరి నడిచేవాళ్లము. ప్రతిరోజూ ఒకగంట ఈతీరైన సైనికకవాతు (మిలిటరీ డ్రిల్లు) ఉండేది. మా ప్రిన్సిపాలుకి క్రమ శిక్షణపట్ల ఎంతోపట్టుదల రోజు వారీ కార్యక్రమంలోని అన్ని అంశాల లోనూ ఒకటిగా ఉన్న ఈ అంశానికి మా వ్యక్తిత్వాన్ని రూపొందించటంలో అతిముఖ్యమైన పాత్ర ఉందనవచ్చు.

మాలో చాల మందిమి ఖద్దరు ధరించాలనే దీక్షగైకొన్న వాళ్లం కాదు. మిల్లుబట్టలు కట్టడం మానివేస్తున్నప్పటికి మాలో చాల మంది వాటిని పెట్టెల్లో దాచుకొన్నారు. అంటే వారికి వాటిపట్ల మోజు నశించ లేదన్నమాట మేము ఒక రోజున వారందరి దగ్గరా పెట్టెల్లో దాక్కున్న ఖరీదైన మిల్లు బట్టలు ఆ పెట్టెలు పూర్తిగా దులిపి పోగుచేసి, అగ్నిజ్వాల లకు ఆహుతి చేశాము. ఆ సందర్భంలో పైకి ఉవ్వెత్తుగా ఎగసిన అగ్ని జ్వాలలు మా మనోధైర్యాన్నీ ఆత్మ విశ్వాసాన్నీ స్వరాజ్య సాధన దీక్షనూ దృఢతరం చేశాయి.

మౌనంగా, అస్పష్టమైన పరిమితిలో ఆంతరంగికంగా నేను అభివృద్ధి చెందుతూనే ఉన్నాను అంతకు ముందెన్నడూ లేని నిస్తరంగ సాగర శాంతి, అనుభవంలోకి ప్రవేశించింది. ఆత్మవిమర్శ నాకు సహజ లక్షణమైన అలవాటుగామారింది. ఏది చేసేప్పుడు వెంటనే నా దృష్టి అంత ర్ముఖమయ్యేది. ఆ అలవాటు ఇప్పుడు నా సాధనకు అభిన్నమైన అంశంగా పరిణమించింది ఈనాడు కూడా నేను అనేక దౌర్బల్యాలకు వశుడనై ఉన్నాను. కాని, ఉపవాసం లేదా అనుదిన ఆత్మపరిశీలన, అనుతాప ప్రకటన నాకు బలం ఇచ్చి ముందుకు నడిపించాయి, నడి పిస్తున్నాయి!

# 6. సహాయ నిరాకరణోద్యమము

బార్డోలిని గురించే అందరూ చర్చించేవారు బార్డోలి పేరు వార్తల్లోకి ఎక్కింది సహాయ నిరాకరణోద్యమాన్ని అక్కడ ప్రారంభించాలని స్థూలంగా నిశ్చయమైంది. కాంగ్రెసు మహాసభలు అహమ్మదాబాద్‌లో ఏర్పాటైనాయి. ఉత్తరహిందూ స్థానం నుంచి ఆ సభలకు వచ్చే నాయకు లందరూ అమల్నేరు మీదుగానే వెళ్లారి మా జాతీయ కళాశాల అక్కడే ఉంది. అందుచేత మాకు రోజూ ఎవరో ఒక గొప్ప నాయకుని ఉపన్యాసం వినే అవకాశం లభించేది. మా యువహృదయాలు ఎప్పుడు కార్యరంగంలోకి దూకే అవకాశం లభిస్తుందా అని ఉరకలు వేసేవి.

అత్యంత ఉన్నత వ్యక్తిత్వంగల స్వర్గీయ సి ఆర్.దాస్. (చిత్తరంజన్‌దాస్) రూపం నాకు ఇప్పటికీ కన్నులకు కట్టినట్లు జ్ఞాపకం ఉంది. ఆయన ఆ కాంగ్రెస్ సభలకు అధ్యక్షుడుగా ఎన్నిక అయాడు. ఆయన బార్డోలిలో మహాత్మాజీని సంప్రదించేందుకు వెడుతున్నారు. మేము ఆయన ప్రయాణం చేస్తున్న రైలు అరగంటసేపు ఆపి ఆయన ఉపన్యాసం విన్నాము. మాకు పూజ్య కస్తూరిబా సందర్శనం చేసుకొనే అదృష్టం కూడా లభించింది కార్య రంగంలోకి దూకేటందుకు సిద్ధంగా ఉండవలసి ఉంది ఏరోజున అయినా పిలుపురావచ్చు అని గాంధీజీ ఆదేశాలిచ్చారు. అంతర్వాణి ప్రబోధం వచ్చిన వారందరూ బార్డోలి వెళ్లి అక్కడ ఉద్యమంలో చేరవచ్చు అని అందరూ ఆశతో ఎదురుచూస్తున్నారు.

ప్రతీ రోజూ మేము ఊరేగింపులు, లాఠీఛార్జీలు, తుపాకీ కాల్పులు గురించిన వార్తలు చదివేవాళ్లము. ప్రజలు, స్త్రీ పురుషులు కూడా అందరూ ఈ కఠిన పరీక్షను ఎదుర్కొన్నారు. స్వచ్ఛంద కాంగ్రెసు

కార్యకర్తల సేవాదళాలు చట్ట వ్యతిరేక సంఘాలని ప్రకటించడం జరిగింది. వేలకొద్ది ప్రజలు ఆసేవాదళాలలోచేరి నిషేధాజ్ఞలను ధిక్కరించారు. రాజద్రోహకర ఉపన్యాసాలివ్వడం సాధారణ కార్యక్రమమైంది. హిందూదేశ స్వాతంత్ర్యం సాధించుకోవడం ప్రతివారికీ మతంవంటిదైందని దానికి మతానికి ఉన్నంత ప్రాధాన్యత వచ్చిందని ప్రకటించారు. అహింసాత్మకంగా కృషిచేసే ఈ శాంతి సేనలో చేరిన ప్రతి సైనికుడూ (వాలంటీరూ) తనను తాను పరిశుద్ధుడుగా చేసుకోవాలి. మేము మహాత్మాజీ బోధనలను అక్షరాలా ఆచరణలో పెట్టటందుకు ప్రయత్నిస్తున్నాము. మా ఆశయాలకు అనుగుణంగా సేవచేసేటందుకు తగిన అర్హత సంపాదించుకోవాలనేదే మా ప్రయత్నమైంది.

మేమందరమూ మొత్తం ఇరవై తొమ్మిది మందిమి ఉన్నాము. ఒక నాయకుడి తర్వాత మరొక నాయకుడు అరెస్టు అవుతున్న వార్తలు వింటూ ఏం చెయ్యాలా అని ఉద్రేకపడే వాళ్లము. బాబు చిత్తరంజన్ దాస్‌ని కూడా అరెస్టుచేశారు. స్వర్గీయ హకీమ్ అజ్మల్‌ఖాన్‌ను కాంగ్రెసు మహాసభలకు అధ్యక్షత వహించవలసిందని కోరారు. మా పట్నం మీదుగా కాంగ్రెసు సభలకు వెడుతున్న ప్రతినిధుల నందరినీ కూడా మేము సేవించుకొన్నాము. అదేమాకు మా జీవితాలలో లభించిన అత్యున్నత భాగ్యం అని భావించే వాళ్లము.

చిన్నచిన్న దళాలుగా ఏర్పడి మాలోమేము కార్యాచరణ విధానాలను గురించి చర్చించుకొనే వాళ్ళము. మనం మన పెద్దవాళ్లకు, సంరక్షకులకు, సహాయ నిరాకరణ ఉద్యమంలో పాల్గొనేటందుకు అనుమతి నివ్వండని జాబులు రాద్దామా? అని చర్చించాము. "దేశమాత పిలుస్తోంది. ఆమె అమ్మలకు అమ్మ. అందుచేత ఎవరి అనుమతీ కోరనక్కరలేదు. మన కార్యాచరణ విధానం మనకు మనమే నిశ్చయించుకొందాము" అని ఆలోచనలు చేశాము. మే మెవ్వరమూ మా ఇండ్లలో పెద్దలకు వ్రాయలేదు. ఈవిషయం తేలిన తర్వాత మేము మరొక సమస్య పరిష్కరించు కోవలసి వచ్చింది. మేము విద్యార్థులము. మేము

మా విద్యా సంస్థను వదలి వెయ్యదలచుకొంటే, ఆసంస్థ అధిపతులకు మా ఆలోచనలు ముందుగా తెలియ జేయడం మా విధ్యుక్త ధర్మము. ఎందు చేతనంటే, మా చర్యవల్ల విద్యాసంస్థ కాళీఅయి ఒక సంవత్సరమో ఇంకా ఎక్కువ కాలమో మూతపడే అవకాశం ఉంది. మా చర్చలను ఎన్నోరాత్రులు కొనసాగించాము మాకెత్యంత ప్రీతిపాత్రమైన మా కళా శాల భవిష్యత్తు ఏమవుతుంది ?

మాకు మా జీవితంలో ఉత్యంత అమూల్యమైన విద్యను ప్రసా దించిన మాతృ సంస్థామూర్తికి మా హఠాన్నిర్గమనము గొడ్డలి పెట్టు వంటిది అవుతుందేమో అని ఒక నిమిషము మనస్సు డోలాందోళనాయ మానమైంది మా సంస్థపట్ల ప్రేమ, మా ఆచార్య వర్యులపట్ల ప్రేమ గౌర వాలు మా హృదయము లందంతటా నిండి పొంగిపొర్లుతున్నా యనడంలో సందేహంలేదు కాని ధర్మ నిర్వహణాన్ని, కర్తవ్యపాలన ముందు కొంత వెనకకు గెంటక తప్పదు. చివరకు మేము కళాశాలాధిపతికి (ప్రిన్సి పాల్ కు) మేము సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనాలని నిశ్చయించు కొంటున్నట్లు తెలియజేస్తూ విద్యాసంస్థను ఒక సంవత్సరం సెలవులు ఇచ్చి మూసివేయవలసిందనే కోరిక వెల్లడించాము. ఒక సంవత్సరం అయిన తర్వాత మేము మా విద్యాసంస్థకు తిరిగిరాదలచు కొన్నామనీ మా విద్య కొనసాగిస్తామనీ తెలియచేసాము మేమందరమూ ఒక సంవత్సరం పాటు చదువు లేకుండ దేశసేవ కొనం త్యాగం చెయ్యదలచు కొన్నాము.

ప్రిన్సిపాల్ మాలో కొందరిని పిలవనంపారు మేము తెలియ జేసిన విషయాలను గురించి మరికొంత వివరంగా లోతుగా దీర్ఘంగా ఆలోచించ వలసిందని సూచించారు ఒకసారి చదువు నడుమలో మాని వేసినప్పుడు తిరిగి దానిని అందుకొని కొనసాగించడం కష్టమవు తుందన్నారు ఎట్లాగ ఇష్టమైతే అట్లా నిర్ణయించు కొనేటందుకు మాకు సంపూర్ణమైన స్వేచ్ఛ ఉందని చెప్పారు. ఆ కాంగ్రెసు మహాసభలకు ప్రతినిధిగా వెడుతున్న ఆయనకు కూడా సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన వలసిన బాధ్యతఉంది.

ఏట్లాగైతేం చివరికి మేము కాలేజిచదువు ఒక సంవత్సరం పాటు మానివేస్తున్నామనీ ఇంటికి తిరిగిరావడం లేదనీ మా సంరక్షకులకు జాబులు వ్రాశాము. మాలో చాలమందికి వారి సంరక్షకుల దగ్గర నుంచి కఠినమైన వార్నింగులు వచ్చాయి. కొందరికి మీరు ఇట్లాంటి దుడుకు పనులు, సాహస కృత్యాలు, చేస్తూంటే కాలేజి చదువు ఖర్చులకోసం నెల నెలా పంపిస్తున్న మనియార్డరులు, ఇక ముందు పంపడం జరగదని, ఆపివేస్తామని తెలియచేస్తూ జాబులు వచ్చాయి. ఒక విద్యార్థి సందర్భంలో అతని అన్నగారు సొమ్ము పంపడం వెంటనే మానివేశాడు, అపరిస్థితి మా అందరకూ పరీక్షపండినైంది. మేము భగవంతుణ్ని మాకు ధైర్యము బలము, ప్రసాదించవలసిందని ప్రార్థించాము. మేము ఒకరికొకరము, సాయంచేసుకొని పరస్పరము మానసిక స్థైర్యాన్ని, హృదయ నైర్మ ల్యాన్ని సాధించుకొనే యత్నాలు చేశాము. మా నిశ్చయం సడలలేదు. దృఢతరమైంది. మాకు వచ్చిన సొమ్ములో కొంత భాగము కేటాయించి సంరక్షకుల చేతని స్సహాయ స్థితిలో వదల బడిన ఎద్యార్థికి ఇచ్చేవాళ్లము. మా అందరిలో ప్రతి నిమిషమూ మానసిక బలము, ఉత్సాహము పెంపొం దగా మేమందరము మార్చి నెలకొనం ఎదురు చూడ సాగాము.

"యంగ్ ఇండియా" (యువభారత్)లోని ప్రతి మాటా నిప్పు రవ్వలవలె ఉండి జ్వాలలురేపేది కరాచి నగరంలో జరిగిన అలీ సోద రుల విచారణ బ్రిటిషు ప్రభుత్వంపై తిరుగుబాటు చెయ్యాలనే భావ తరంగాలను దేశమంతటా ప్రచరితము చేసింది. వారితో పాటు సహనేరస్థ డుగా ఉన్న శంకరాచార్యుల వారు కూడ తనూ అట్లాగే ప్రవర్తించి ఉండే వాడన్ను అన్నారు రాజద్రోహం ప్రేరేపించటము ప్రధాన కర్తవ్యమైంది. అది సహాయ నిరాకరణ ఉద్యమ రూపంలో వ్యక్తం చెయ్యాలి. మొత్తం మీద ఇవన్నీ-అంటే రాజద్రోహకర ఉపన్యాసాలు, సహాయ నిరాకరణో ద్యమంలో పాల్గొనడము, మొదలైనవి పవిత్ర కృత్యాలు.

మేము రాట్నం తిప్పేవాళ్లము. నూలు వడుకుతూ పాటలు పాడే వాళ్లము. ఒక విధంగా సంకుచితాభిప్రాయాలతో మూలవాగి ఉన్న మా

చౌరీ చౌరాలో సంఘటనలు జరగగానే సహాయ నిరాకరణోద్యమం హఠాత్తుగా విరమించటం జరిగింది. అది మా అందరికీ ఎంతో నిరుత్సాహం కలిగించింది మాకే కాదు ఉద్యమంలో దూకేటందుకు నిశ్చయించుకొన్న మహానాయకులకో కూడా నిరుత్సాహం కలిగింది. నాయకులు మహాత్మాజీ గైకొన్న ఈ నిర్ణయం సబబుగా లేదని దీనిని తాము ఆమోదించటం లేదనీ ప్రకటించారు కాని, మహాత్మాజీ దృఢ నిశ్చయాన్నుంచి వెనుతిరగలేదు. అందుచేత రాజకీయ వాతావరణంలో కొన్ని సంవత్సరాల వరకు నిరుత్సాహము, స్తబ్ధతచోటు చేసుకొన్నాయి. ప్రభుత్వం మహాత్మాజీని అరెస్టు చేసింది ఆరు సంవత్సరాలు జైలు శిక్ష విధించింది. దేశం తగినదారి చూపించే నాయకుడు లేనిదై విషాదంలో మునిగింది వేము మా చదువులు కొనసాగించాము

బ్రిటిష ప్ర ప్రతి సందర్భంలోనూ వ్యక్త మైంది. అనేక జాతీయ సంస్థలు తమ కార్యక్రమాలను కొనసాగించటానికి ఆటంకాలను ఎదుర్కోవలసి వచ్చింది మాసంస్థ రూపమే మారింది అందులోని జాతీయతా దృక్పథము, వాతావరణము, తొలగిపోయాయి అక్కడ రెండు సంవత్సరాల చదువు పూర్తికాగానే మేము ఆ సంస్థను వదలివేయవలసి వచ్చింది చాల మంది తిరిగి ప్రభుత్వ విద్యా సంస్థలలో చేరడం జరిగింది. కాని, ఈ గాంధేయ నూతన జీవన విధానాన్ని మా జీవితంలో ఒక భాగంగా అంగీకరించిన కొంత మందిమి మాత్రము ఏమీ జంకకుండా చలించకుండా అట్లాగే ఆదారినే నడవ సాగాము. అమల్నేర్ జీవితాధ్యాయం హఠాత్తుగా ముగిసింది. కాని, పవిత్ర జీవిత లక్ష్యంవైపు కొనసాగిస్తున్న ప్రయాణంలో మరొక మజిలీ కొరకు అన్వేషణ జరిగింది.

# 7. పూణేలో*

అమల్నేర్‌లో జాతీయ విద్యాలయం మూత పడినందు వల్ల నేను నా చదువు కొనసాగించే టందుకు పూనాలోని తిలక్ మహారాష్ట్ర విద్యాపీఠానికి మారవలసి వచ్చింది. అక్కడి కార్యకర్తలు అందరూ దయార్ద్ర స్వభావులు. వారే నా చదువుకు ఏర్పాటు చేశారు. నేను చరిత్ర, అర్థిక శాస్త్రము, రాజనీతి శాస్త్రము, అధ్యయనం చేసే వాణ్ణి. అమల్నేర్‌లో చదివిన చదువులకు పూనాలో చదవ వలసినవి నిర్ణయం అయిన వాటికి పొంతన లేనందు వల్ల అధ్యాపకులు నా కోసం ప్రత్యేకమయిన ఏర్పాట్లు చేసి నా ఒక్కడి కోసం బోధనా తరగతులు నిర్వహించారు. ఆ ఏర్పాటు నాకు ఎంతో సదుపాయ కరంగా ఉండేది. మేము ఇద్దరమూ (మా ఆచార్యులు, నేను) మా కార్యక్రమం నిర్ణయించుకొనేవాళ్లము ఒకరోజు రాజనీతి శాస్త్రానికి, మరొక రోజు ఆర్థిక శాస్త్రానికి, మూడోరోజు చరిత్రకు, నాలుగో రోజు ఇంగ్లీషుకి ఏర్పాటు చేసుకున్నాము. ఇట్లాగే వరసగా నా అధ్యయనం కొనసాగేది. ఆ రోజుల్లో నేను పాశ్చాత్య దేశాల్లో ఆయా శాస్త్రాలలో ఉత్కృష్టమైన రచనలు కావించిన రచయితల మనోభావ సంపత్తిని జుర్రుకొన్నాను ఎడ్మండ్ బర్క్ రచించిన "ఫ్రెంచి దేశంలో జరిగిన విప్లవము-పరిశీలన" మాకు ఇంగ్లీషు పాఠ్య గ్రంథము సర్ జాన్‌స్టూవర్ట్ మిల్ రచించిన "స్వాతంత్ర్యము" అనే బృహత్ వ్యాసము మరొక పాఠ్య విషయము. రూసో, హాబ్స్, లాకే ఇంకా అనేక ఇతరులు వ్రాసిన రచనలూ కూడా నేను చదవవలసి వచ్చింది. సామాజిక శాస్త్రముతో పరిచయం కలిగింది. నేను చదివిన పుస్తకాలన్నింటి నుంచీ నేను నోట్సు

*పూణే మనకు పూనా నగరంగా పరిచితమైంది.

రాసుకొనే వాడిని గోపాలకృష్ణ గోఖలేఆధిపత్యంలో పేరు పొందిన సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ (భారతదేశ సేవాసంఘం) వారి గ్రంథాలయము, కేసరి, మరాటా పత్రికల ఆఫీసులకు చెందిన గ్రంథాలయము నాకు అందు బాటులో ఉండేవి. అమల్నేర్, నాకు ఆధ్యాత్మిక మానసిక ప్రబోధం కలిగించింది పూనాలో నా ఉనికి నాకు మేధాసంపదను, వ్యక్తిత్వ వికాసాన్ని పెంచుకొనేటందుకు అవకాశం ప్రసాదించింది రోజంతా ప్రతి నిమిషమూ నేను చదువులోనో దానికి సంబంధించిన పనుల్లోనో గడిపే వాణ్ని. నేను నాకు అవసరమైన పుస్తకాలనే ఏరుకొని శ్రద్ధగా చదివే వాడ్ని. చేతికి అందిన పుస్తకం ప్రతిదీ చదివేవాడ్ని కాను. ఈ రీతిగా నాకు ఒక తరహా పుస్తకాల పట్ల అభిరుచి పెంపొందింది

చదువుతో పాటు దేహదార్ఢ్యము కూడా ఎక్కువ అవసరము అని నేను గుర్తించాను. అప్పుడే 18వ ఏట నేను దేహ పరిశ్రమ ప్రారంభించాను. శరీర దారుఢ్యము పెంచు కొనక పోయినా సాధారణ ఆరోగ్యాన్ని మాత్రము కాపాడు కొంటూ నేను కాలక్షేపం చేస్తుండే వాడ్ని.

పూనాలో నేను మూడు సంవత్సరాలు గడిపాను. "ప్రజాస్వామ్య పరిపాలనా వ్యవస్థ దాని పరిణామము" అనే విషయాన్ని గురించి నేను పరిశోధనాత్మక వ్యాసం రచించాను. అది ఎమ్. ఎ. డిగ్రీకోసం చేసిన కృషి ఫలితము. అదిపూర్తి కావడంతో నాకాలేజీచదువు పూర్తిఅయింది.

ఆకాలంలో జరిగిన రెండు సంఘటనలు నామనస్సుమీద గాఢమైన ముద్రవేశాయి, మహాత్మాగాంధీనియెరవాడ జైలులో నిర్బంధంలోఉంచారు. ఆయనకు 'అప్పెండి సైటిస్' వ్యాధి కలిగిందని ఆయనను శస్త్ర చికిత్స కోసం సెసూన్ ఆసుపత్రికి మార్చారని, హఠాత్తుగా ప్రకటన చేశారు. ఆ వార్త దావానలంలా వ్యాపించింది. పూనా నగరంలో ఎక్కడచూచినా ఎవరిని పలకరించినా గాంధీజీ పరిస్థితి గురించిన చర్చలే. వ్యాధి తీవ్రమై పరిపక్వ దశలో ఉందనీ శస్త్ర చికిత్స చెయ్యడం జరిగిందనీ మహాత్మాజీ

పరిస్థితి ఇటు అటుగా ప్రమాదంతో ఉందని వార్తలు బైటికి పొక్కాయి. ప్రజల దైనందిన జీవిత చర్యలలో స్తంభన ఏర్పడింది ఎవ్వరూ మరే పనీ చెయ్యకుండా మహాత్మునికి ఆరోగ్యం కలగాలని ప్రార్థనలు చెయ్యడం మాత్రమే చేసేవారు దేశంలో అన్ని ప్రాంతాల నుంచీ నాయకులు వచ్చి పూనాలో మకాము చేసేవారు. మహాత్మా గాంధీ, ఆస్థిలో కూడా ఖైదీయే ఎవరో కొద్దిమంది పేరు పొందిన నాయకులకు మాత్రమే మహాత్మాజీని సందర్శించేటందుకు అనుమతి ఇచ్చారు. వారుకూడా మహాత్మునితో మాట్లాడేటందుకు గాని: పలకరించేటందుకు గాని ప్రయత్నం చెయ్యకూడదని నియమం చేశారు ప్రతి నాయకుడూ నగరంలో రాజకీయాల్ని గురించీ, సందర్భోచితంగా మహాత్మాజీ పరిస్థితిని గురించీ ఉపన్యాసం చెప్పడం, అక్కడ జనమూగి పరిస్థితి వివరణ కనుగుణంగా స్పందించడం జరిగేవి నాకు సహనం నశించేది. రోగశయ్యమీద ఉన్న మహాత్మాజీని స్వయంగా చూడాలి, చూడగలనా? ఎట్లాగ? అని ప్రయత్నించేసి విఫలుడ్ని అయాను. చివరకు నాకు ఒక అవకాశం దానంతట అదే చేజిక్కింది. మౌలానా మొహమ్మద్ అలీ పూనా నగరానికి వచ్చారు ఆయన సాయంకాలం ఆసుపత్రికి వెళ్లే ఏర్పాటులో ఉన్నారు. మధ్యాహ్నం ఆయనను మావిద్యార్థి సంఘంలో ఉపన్యాసం ఇవ్వవలసిందని కోరాము. విద్యార్థి సంఘ కార్యదర్శిగా నేను ఆ సభకు అధ్యక్ష స్థానంలో ఉండ వలసి ఉన్నది. సభానిర్వహణ పూర్తికాగానే నేను కూడా ఆయనను ఆసుపత్రి వరకూ అనుసరించి మహాత్మాగాంధీ ఉన్న గదిలోకి నన్ను కూడా వెంట కొని పొమ్మని వినయంగా కోరాను ఆయన 'సరే' అన్నారు నా సంతోషానికి అవధి లేదు.

చిన్న గది తలుపు తెరచు కొన్నది. నేను ద్వారంలోనే నిలబడ్డాను. మహాత్మాజీని నఖశిఖ పర్యంతము చూడగలిగాను. ఆయన అత్యంత నీరస స్థితిలో ఉన్నారు. ఆయన చిరునవ్వు, ఉత్సాహము, తొంగి చూస్తూనే ఉన్నాయి. మౌలానా మొహమ్మదలీ ఆయన పాదాభి వందనం

చేసి దుఃఖము కట్టలు తెగినందు వల్ల కంటనీరొలికించారు ఆయన ఒక్కరే కాదు. ఆదృశ్యం చూసిన నలుగురైదుగురు సర్జన్లు, జైలు ఆఫీసు మొదలైన వారుకూడా ఎంతో సేపు కంటనీరు కార్చారు మహాత్మాజీ కండ్లు తెరిచారు ఒక్కసారి అందరివైపూ చూసి తనను గురించి ఏమీ చిత్రం చెంద వద్దన్నట్లు చెప్పాడు.

నేను మౌలానా వైపు చూస్తున్నాను. ఆయన కళ్లకూడా కన్నీటితో నిండిఉన్నాయి. ఆయన మహాత్మాజీ ముందు సాష్టాంగ నమస్కారం చేస్తున్నారు ఆకస్మికంగా ఉన్న పరిసరాల్లో మౌలానా విశాల అంత రంగము ప్రస్ఫుటమైంది. దేశ సేవకై ఆయన ఎంత భక్త్యా వేశంతో అంకితమయారో గుర్తించ గలిగాను నాకళ్లఎదుట, రూపొందిన దేశభక్తి ప్రత్యక్షమైంది ఆ తర్వాతి కాలంలో మౌలానా మొహమ్మదలీ కొంత మారినట్లు కన్పించినప్పటికీ తన నాయకుడి కాళ్లమీద పడిపోయి భక్తితో అనురాగ పూర్వకంగా కన్నీరు కారుస్తున్న రూపంలోనే నా హృదయంలో సుప్రతిష్ఠితమైన ఆదాద్య మూర్తిగా నిలిచి ఉన్నాడు ఆ సన్ని వేశము నాకు ఎంతో భావావేశము కలిగించింది. అది ఈ నాటికీ నాకు బలం ఇస్తున్నది

మహాత్మాగాంధీని విడుదల చేశారు. ఆయన జుహూఅనే సముద్ర తీర ప్రాంతంలో విశ్రాంతి తీసుకొని పూనా నగరానికి తిరిగి వచ్చారు. అక్కడే ఆరోగ్యం ఆయన స్వర్గీయ విష్ణుశాస్త్రి చిప్లడీకర్ చిత్ర పటాన్ని ఆవిష్కరించే సందర్భంలో మొదటి సారిగా జబ్బుపడి లేచిన తరువాత సభలలో పాల్గొనడం, ప్రజల ముందుకు తిరిగి రావడం జరిగాయి. ఆసభా నిర్వహణలో నేను స్వచ్ఛంద సేవకుడు (వాలంటీరు) గా పాల్గొనడం, వేదిక మీదికి జనం మూగకుండా చూసే బాధ్యత వహించడం జరిగాయి అప్పుడు నేను అతి సన్నిహితంగా ఉండి మహాత్మాజీ మాటలు విన్నాను. ఆయన వైపు ఆపాదమస్తకం రెప్పలార్చ కుండా ఆకలిగొన్నట్లు చూసి, ముగ్ధుడనయ్యాను ఆయన మాట్లాడిన మాటలేవీ నాకు జ్ఞాపకం లేవు. ఎందు చేత నంటే ఆసమయంలో పూర్తిగా నన్ను నేను

మరచి పోయాను. ఆయనలో లీనమై పోయాను. ఆరోజంతా నా మనస్సు అట్లాంటి స్థితిలోనే ఉంది. ఆ రాత్రి మహాత్మాజీ, నగరంలో ప్రజల సమావేశంలో ఉపన్యసించారు. ఆయన చాలా ఆవేశంతో మాట్లాడారు. నేను తర్వాత ఆయన ఉపన్యాసాలు ఎన్నో విన్నాను. కాని, ఎప్పుడూ ఆయన ఆవేశంతో మాట్లాడటం గాని, అంత ఆవేశం వ్యక్త పరచడం గాని ఎరగను. పూనాలో ఉన్న తిలక్ అనుచరులు లోకమాన్యతిలక్‌తో తనను పోల్చి చూడటం తనహృదయానికి ఆవేదన కలిగిస్తుందని అన్నారు. తాను దేశ సేవలో ఒకసాధారణ కార్య కర్తననీ తిలక్ అందులో సిద్ధిపొందిన మహోన్నతుడనీ అన్నారు. అందు చేత తమ ఇద్దరి పేర్లూ జోడించి పోలికలు చూపించాలనుకోవడం తనకు సిగ్గు, దుఃఖము కలిగిస్తా యని వెల్లడించి ఆయన కన్నీరు కార్చారు. సభలో ఉన్న వారందరూ కూడా కండ్ల నీరు పెట్టారు. నేను కూడా ఆ పవిత్ర అశ్రుజలం కార్చిన వారితో కలిసి పోయాను. నా అంతఃకరణ జాగృత మైంది. అప్పుడు నాలో నేనే ఇట్లా అను కొన్నాను. "నేను చలించను. నా జీవితం దేశ సేవకు అంకితం చేస్తాను. నాలో పాంచభౌతిక దేహ సంబంధమైన దౌర్బల్యం ఏదైనా కలిగి నప్పుడు అశ్రుజల నయనాలతో ఆనాడు సాక్షాత్కరించిన మహాత్ముని దివ్య మూర్తినాముందు నిలబడి, నాకు ఆశకల్పించి, కొత్త బలం సమకూరుస్తుంది.

# 8. కార్మిక సంఘ కార్యకర్తగా

శ్రీ ఎన్. ఎమ్. జోషి భారతదేశంలో కార్మికోద్యమ జనకుడు. ఆయన తన కార్యక్రమాలలో సహాయులుగా కొందరు యువకులు కావాలని కోరాడు "పెట్టుబడి - శ్రమశక్తి" గురించి, వాటి నడుమ ఉండవలసిన పరస్పర సంబంధాలను గురించి ఒక వ్యాసం వ్రాసి పంపించ వలసిందని ఆయన ఆహ్వానించాడు. నేను కూడా మరికొందరిలాగే వ్యాసం వ్రాసి పంపించాను. ఆయన నన్ను ఎన్నిక చేశారు.

అందువల్ల నేను బొంబాయి బట్టల మిల్లు కార్మికులయూనియన్ సహాయ కార్యకర్తగా ఏప్రిల్ 1926 న డ్యూటీలో చేరాను. జోషి, నాకు కువాలా (KUALA) ఉన్న మిల్లు కార్మికులను ఒక సంఘంగా సమీకరించే బాధ్యతను, కేంద్ర ఆఫీసు వ్యవహారాల నిర్వహణ బాధ్యతను, అప్పగించారు ఈ రెండో బాధ్యతననుసరించి నేను రకరకాల స్వభావాలున్న కార్మికులతోటీ,వారి యజమానులతోటీ వ్యవహరించ వలసినఆవశ్యకత కలిగేది. ఆ రోజుల్లో బొంబాయి రాజధాని నగరంలోని శ్రామిక జనం అప్పుడప్పుడే కళ్లు తెరుస్తున్నట్లుగా ఉండేవారు. అందుచేత కార్మికోద్యమ చైతన్యం ప్రారంభదశలో ఉందనవచ్చు. ఆ రోజుల్లోనే నాకు అట్టడుగున ఉంటూ యజమానుల కాళ్ల క్రింద తొక్కబడుతున్న కూలి జనం దైనందిన జీవితంతో సన్నిహిత సంబంధం కలిగింది. నాలుగైదు కుటుంబాలవారు మడ తొక్కబడినట్లుగా ఒక చిన్న గదిలో తేమగా చీకటిగా ఉన్న వాతావరణంలో జాలి కలిగించే పరిస్థితులలో మనుష్యులలో జంతువులకంటె నికృష్ట జీవితంగడుపుతూ ఉండటంచూశాను. మరోదారి ఏదీలేనివారు, మరేంచెయ్య

గలరు? నేను కూడా వారిలో ఒకడను అయాను. నేను, బాగారాత్రి అయే వరకూ వారితో సంభాషణలలో చర్చలలో ఆ మురికి పేటలలోనే గడిపి తర్వాతనే ఒక గది పెట్టుగా ఉన్న నా నివాసానికి వెళ్లేవాడిని. నాతో పాటు ఆదోపిడీకి గురి అయిన జనాంగం యొక్క విషాదమయ జీవిత భారం కల్పించే ఆలోచనల బరువును కూడా నా మనస్సులో ఇముడ్చు కొనే వాడిని. నేను యాజమాన్యం ఎదుట బడీ మాట్లాడ వలసి వచ్చిన సందర్భాలు కలిగినప్పుడల్లా వారు ఎంత కరడు కట్టిన కఠిన మనస్సులుగా కన్పించేవారో గమనించే వాడ్ని. వారి దృష్టిలో కార్మికుడు బజారులో కొనుక్కోవడానికి వీలైన వస్తువులాంటి జడ పదార్థ సదృశుడు. ఒక్కొక్కప్పుడు నేను అతి క్లిష్టమైన పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చేది. కార్మికులు ఉద్రేకంతో ఊగిపోతూ ఉండేవారు. వారిని బెదరించడానికి యజమానులు పోలీసులను పిల్పించే వారు. నాకు కబురు వచ్చేది. నేను వెంటనే అక్కడికి పరు గెత్తుకొని వెళ్లేవాడ్ని. నేను హృదయపూర్వకంగా కార్మికుల పక్షాన ఉంటూ నా విధి నిర్వహించాను. అందు వల్ల ఆధ్యాత్మికంగా కొంత ఉన్నతి పొందాను.

ధనము ఆస్తి పాస్తులు అనుసరించీ సమాజాన్ని వేరు వేరు మార్గాలుగా విభజించే పరిస్థితిని గురించీ వాటి యుక్తా యుక్తాల గురించీ నా ఆలోచనలు కొనసాగేవి. ఏ సంపదా లేని పేదలకు ఏహక్కులూ కూడా లేవనీ కనీసం గౌరవంగా బతికే అవకాశాలు కూడా లేవనీ నేను తెలుసుకొన్నాను. యజమాని తలచు కొంటే వారిని ఏ నిమిషంలోనైనా తన కొలువు నుంచి బైటికి గెంటి వెయ్య వచ్చు. ఆడ కూలీలు అన్ని రకాల అవమానాలను భావించి భరించాలి. ప్రతి రోజూ నాకు అనేక పక్షులతోనో ఒక్కొక్కప్పుడు ఆక్కకుమించీ వారివారి కష్టాలఫిర్యాదులు వచ్చేవి. నేను వాటినిగురించి ఆయా యజమానులకు, యూనియన్ తరఫున నిరసన తెలిపినప్పుడు వారు ఏదో సాకులు పన్ని అదునుచూసి ఫిర్యాదులు చేసిన వారిని, మగ ఆడ అనే వివక్షత లేకుండా శిక్షలకు గురి చెయ్యడం సంభ

ఎంచేది అయినప్పటికీ మేము మా పని మానలేదు మొత్తం మీద ఒక సంవత్సరం గడిచే లోపు గానే బొంబాయి బట్టల మిల్లు కార్మికుల యూనియన్ మంచి పేరు సంపాదించు కున్నది

ఆ కాలంలోనే ప్రఖ్యాత కార్మిక నాయకులలో కొందరి సాహచర్యం లభించింది అట్లాంటి వారిలో శ్రీ ఎస్. హెచ్ ఝబ్‌వాలా ఒకరు. మేమిద్దరమూ అనేక సార్లు కలిసి ఎన్నో సమావేశాలలో ఒకే వేదిక మీద నుంచి ఉపన్యాసాలు ఇచ్చాము. నేను ఆయన సంపాదకత్వంలో ప్రకటిత మవుతున్న రైల్వే కార్మికుల వార పత్రిక సంపాదకీయ నిర్వహణలో పాల్గొని ఆయనకు సహాయం చేసే వాడ్ని ఆ పనికై ఆయన నాకునెలకు 10 రూపాయలు ఇచ్చే వాడు ఆ సొమ్ము జీతం కాదు. నా ప్రయాణపు ఖర్చుల కోసమై ఇచ్చింది. శ్రీ ఝబ్‌వాలా అలవాట్లు, స్వభావమూ వింతగా ఉండేవి అందు చేతనే ఆయన తనకు విశ్వాస పాత్రులైన సహచరుల నెవరినీ ఆకర్షించ లేక పోయాడని నాకు అని పిస్తుంది. అయిన ప్పటికీ ఆయనకు ఎంత పని అయినా చేసే అపరిమితమైన శక్తి, అలసి పోకుండా అవిరామంగా పని చేసే ఓర్పూనేర్పూ ఉన్నాయని నాకు తోచింది ఆయన పార్సీ జాతికి చెందిన వాడైనప్పటికీ కార్మిక సంఘాలలోనూ కార్మికులతోటీ మరాటీ భాషలోనే మాట్లాడే వాడు. ఆయన గుజరాతీ భాషలో మాట్లాడి నప్పడు వ్యక్తమయే యాసా, ఉచ్చారణలో వైపరీత్యమూ నాకు నవ్వూ, సంతోషమూ కలిగించేవి. శ్రీ. ఎఫ్. జె జిన్‌వాలా నాకు తెలిసిన మరో కార్మిక నాయకుడు. ఆయన మెల్లని తరహాకు చెందిన వాడు ఆయన ఎప్పుడు ఏ సలహా ఇచ్చినా ఆలోచించి తూచినట్లుండేది శ్రీ. ఆర్ ఆర్. బఖాలే నా పై అధికారి ఆయన స్వభావంచేత ఎప్పుడూ చురుకుగా ఉల్లాసంగా ఉండే రకం వాడు. అని నేననుకునే వాడ్ని

శ్రీ ఎన్ ఎమ్ జోషి అందరికీ గౌరవ నీయుడు ఆయన మాటకు అందరూ ఎక్కువ విలువా, బరువూ ఇచ్చి పరిగణించే వారు ఆయన

మితవాద రాజకీయ వాతావరణ భావాలలో పెరిగి నప్పటికీ ఆయన దృక్పథంలో ఎంతో ప్రగతి శీలం కనిపించేది. నా స్నేహితులలో రాజకీయాలలో చాల మంది, నేనా మిత వాదుల ముఠా రాజకీయాలతో ఎట్లా సర్దుకొని కాలం గడప గలుగుతున్నానో అని ఆశ్చర్య పడే వారు. నేను అప్పుడప్పుడు శ్రీజోషికి కార్య దర్శిగా కూడా పనిచేసే వాడిని. అట్లాంటి సందర్భాలలో కార్మికవర్గ అభివృద్ధికి సంబంధించి నంత వరకు ఆయనకు గల దృఢ విశ్వాసాన్ని, కార్యా చరణ దక్షతను మించ గలిగిన వారు మరొకరు లేరని నేను అనుభవ పూర్వకంగా గమనించాను. అంతేకాకుండా ఆయన నూటికి నూరుపాళ్లూ జాతీయ వాది. కేంద్ర శాసన సభకు ప్రభుత్వంచేత నియమించ బడిన సభ్యుడైనప్పటికీ న్యాయపక్షం వహించి ఒక్కొక్కప్పుడు ప్రభుత్వానికి వ్యతిరేకంగా కూడా వోటు చేసేవాడు. ప్రజల మంచి పట్లా, తనకర్తవ్య పాలన పట్లా ఆయనకున్న అభినివేశం అట్లాంటిది.

నాకు, ఎప్పుడూ ఆయన ఏదో పని చేస్తున్నట్లే కనిపించేది. ఆయన రోజు 16 నుంచి 18 గంటల వరకూ పని చేసే వాడు. ఆయన ఏదైనా చెప్పితే, తనకు కచ్చితంగా తెలిస్తే చెప్పేవాడు. ఊహించి, సుమారుగా చెప్పే తత్త్వం ఆయనలో ఏకోశానా లేదు. అందువల్ల అయన గురి ఎప్పుడూ తప్పలేదు. అయిన తాను తలచినది సాధించే దీక్షకలవాడు. ఆయన నిసలైన కార్మికోద్యమం పట్ల అభిమానం ఉన్న వాడు. రాజకీయ పార్టీలో చొరబడి కార్మికోద్యమాన్ని తమ స్వార్థం కోసం సాధనంగా ఉపయోగించు కొనడాన్ని ఆయన వ్యతి రేకించాడు. తానునిర్వచించిన ఈనియమాన్ని ఆయన తన చర్యలలోకూడా అనుసరించేవాడు. అందువల్లనే కార్మికవర్గం కార్మికోద్యమం పట్ల అభిమానముఉన్న కమ్యూనిస్టులూ మెత్తని మాటలతో వారిని సమర్థించే కార్మికనాయకులూ ఉభయులూ కూడా ఆయనను గౌరవించి ఆయన సలహాలను శిరసావహించే వారు. నేనుఆయన అలవాట్లను -వతనాసక్తిని, అనుసరించేటందుకు ప్రయత్నించే

వాడ్ని. అవి నా తరవాతి జీవితంలో నాకు ఎన్నో కష్టాలు ఎదురైనా. నేను సఫలీ కృతుడననయే బందుకు పునాది అయాయి.

ఆ 1926 లోనే బ్రిటీషు పార్లమెంటులో భారతీయ సభ్యుడైన ఎస్. బి. సక్లత్‌వాలాఅనే కమ్యూనిష్టుబొంబాయి నగరాన్ని సందర్శించేటందుకు వచ్చారు. ఆయనకు ఎదురు వెళ్లి ఓడ దిగీ దిగగానే మహారాజులకు తగిన స్వాగతంఇయ్యాలనిమేమునిశ్చయించాము.ఆయనవున్న రెండురోజుల్లోనూ ఆయన పాల్గొన వలసిన ప్రజాహిత కార్యక్రమాలు ఏర్పాటు చెయ్యవల సిన బాధ్యత కూడా జోషి నాకు అప్పగించారు. ఆ నాయకుడు చూపులకు పొట్టిగా ఉన్నాడు. కాని ఆయన మాటల్లో నిప్పురవ్వలు కురిసేవి. మరే వక్తకూ తన ప్రత్యర్థి భావాలను విమర్శించేటప్పుడు ఇంత సూటిగా మెరుపు దెబ్బల వంటి మాటలువయోగించే శక్తి ఉండదనిపించింది. ఉదా హరణగా ఆయన తన ఉపన్యాసంలో పలికిన వాక్యం ఒకటి చెపుతాను. "ఇంగ్లండులోని బొగ్గు గనులలో పని చేస్తున్న కార్మికులందరూ ఒక రోజున సమ్మె చేస్తే దేశంలో ఉన్న పెద్ద పెద్ద పండితులంత కలిసి ఒక్క- టన్ను బొగ్గునైనాకూడా సేకరించలేరు". ఆయన యుద్ధాన్ని గురించి మాట్లాడాడు. రష్యాలో వచ్చిన విప్లవాన్ని చరిత్రాత్మకంగా వివరించాడు! ప్రజలందరూ అట్లాంటి విప్లవం వచ్చేటందుకు కృషి చేయాలని ఉద్బో ధించాడు.

ఆయన నాడు మాట్లాడినదంతా నాకు పూర్తిగా అవగాహన కాలేదు. కాని, వర్గ చైతన్యాన్ని గురించీ, దాని ఆవశ్యకతను గురించీ ఆయన మాట్లాడినట్లు మాత్రమే నేను గుర్తించ గలిగాను. ఆయన తన ప్రసంగంలో "ప్రత్యేక సదుపాయాలు గుత్తగొన్న వారి" అంత్య కాలమాసన్నమై నట్లూ యముని మహిషపు లోహ ఘంటికా నాదం వారి దరిదాపులకు ధ్వనిస్తూ వస్తున్నదనీ వార్నింగు ఇచ్చినట్లు ధ్వనించింది. శ్రీ సక్లత్ వాలా బోధించిన కమ్యూనిస్టు తత్త్వాన్ని నేను పూర్తిగా ఆమో దించనప్పటికీ సమాజంలో దోపిడీకి గురవుతున్న పీడిత జనాంగానికి సేవ

చేయడంలో నేనప్పుడు పూర్తిగా నిమగ్నుణ్నయాను. ఆ విషయం తర్వాత సంభవించిన కొన్ని సంఘటనల వల్ల రుజువవుతుంది.

జనవరి 1927 లో శ్రీ ఎన్. ఎమ్. జోషి నన్ను ఢిల్లీ రావలసిందనీ కార్మిక సంక్షేమం కోసం వివిధ దేశాలలోని ప్రభుత్వాలు చేసిన చట్టాలకు సంబంధించిన విషయాలు సేకరించ వలసి ఉంటుందనీ అది తాను కేంద్ర శాసన సభలో ప్రవేశ పెట్టదలచుకొన్న బిల్లు తయారు చెయడానికి ఉపకరిస్తుందనీ తాను అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు సభలు ఏర్పాటు చేయాలనే ప్రయత్నాలు కూడ చేస్తున్నానని దానికి కూడ నా సహాయం కావలసి ఉందనీ తెలియ జేశారు. నేను వెంటనే ఢిల్లీ వెళ్లాను. అప్పుడే మన దేశ రాజధాని నగరాన్ని నేను మొదటిసారి సందర్శించాను.

నాకు 'జ్ఞాన ప్రకాశ్' అనే పత్రికా విలేఖరిగా వార్తా విలేఖరుల కూటమిలో [(ప్రెస్ గాలరీ)] లో సీటు లభించింది. అందువల్ల కేంద్ర శాసన సభా కార్యక్రమాలు శ్రద్ధగా పరికించాను. ఆ సభలో ఒక వైపున ప్రఖ్యాతి వహించిన స్వరాజ్య పార్టీ సభ్యులు మోతీలాల్ నెహ్రూ నాయకత్వంలో ఆసీనులై ప్రభుత్వం తరుపున వున్న సభ్యులకు అభిముఖంగా ఉన్నారు. ఆ సభాపతి (ప్రెసిడెంటు)గా ఆసీనులైన స్వర్గీయ విఠల్ భాయి పటేల్ ఆ శాసన సభా గౌరవాన్ని ఇనుమడింప జేశారు. సామ్రాజ్యవాదులు ఆయన తమకు 'కొరకడానికి,మింగడానికి అసాధ్యుడైన భారతీయ రాజకీయ వేత్త' అని భావించేవారు నేను ఆ సభలోనే స్వర్గీయ లాలా లజపతి రాయినీ, మధుర వాగ్మి అని పేరు పొందిన ఎమ్. ఆర్. జయకర్‌నూ, అనుభవజ్ఞుడైన సత్యమూర్తినీ బ్రిటీషు సామ్రాజ్యవాద శక్తులతో శాసన సభల ద్వారా పోరాటం సాగిస్తున్న మరెందరో ఇతర జాతీయ నాయకులనూ చూచి, వారు ఇచ్చిన ఉపన్యాసాలు విన్నాను. ఆ రోజుల్లోనే కేంద్ర శాసన సభ ఎట్లా పని చేస్తుందో కూడ నేను కొంత అవగాహన చేసుకో గలిగాను.

నేను చేబట్టినపని ఇంకా పూర్తి కాకముందే నాకు నా కాళ్లుకొంత చచ్చు పడినట్లూ స్పర్శ జ్ఞానము కొంత తగ్గినట్లూ అనిపించ సాగింది ఢిల్లీలో అంత విపరీతమైన చలి ఉంటుందని నేను అనుకో లేదు అందు చేత నాతో ఒక జత సాధారణ మైన నూలు బట్టలను మాత్రమే తీసుకొని పోయాను. సహించ లేని చలికి, చలి గాలికి, [illegible], అకాల వర్షాలలో తడవడము మొదలైనవన్నీ కలిసి నా వెన్నెముకలో అస్వస్థత కారణ మయ్యాయి నా కాళ్లు బరువెక్కినట్లయి నడవడం కష్టమనిపించింది. ఏదో అసాధారణ పరిస్థితి ఏర్పడిందనీ నా ఆరోగ్యం చెడిందనీ గుర్తించాను నా కప్పగించిన బాధ్యతల నుండి నన్ను విడుదల చేయ వలసిందని శ్రీ ఎన్ ఎమ్. జోషిని కోరాను ఆయన అంగీకరించారు. నేను వెంటనే రైలు ప్రయాణం కొనసాగించి ఆగ్రాలో తాజ్ మహల్ సందర్శించే టందుకు మాత్రమే అక్కడ కొన్ని గంటల పాటు ఆగి, తిరిగి బొంబాయి చేరుకున్నాను బొంబాయి చేరేటప్పటికి నాకు నరాలమీద స్వాధీనం తప్పించి కాలు కదప లేకుండా ఉన్నాననీ గమనించాను, కదల లేని అవిటివాణ్ని అయాను

ఆ స్థితిలో నన్ను, స్వర్గీయ డాక్టర్ కంట్రాక్టర్ పరీక్ష చేసారు. ఆయన లండన్‌లో వైద్య విద్య నభ్యసించి [illegible] లను గురించి ప్రత్యేకంగా అధ్యయనం చేసి బొంబాయి ప్రజలలో మంచి పేరు ప్రఖ్యాతులున్న డాక్టరు. ఆయన నాకు ధైర్య వచనాలు చెప్పి, కొన్ని మందులు సేవించ వలసిందిగా చీటీ వ్రాసి ఇచ్చి, మరొక డాక్టరును చికిత్స గురించి సంప్రతించ వలసిన ఆవశ్యకత లేదని వీలైనంత త్వరగా బొంబాయి నగరం వదలి వెళ్ల వలసిందని సలహా ఇచ్చారు. మరే డాక్టరూ అంత కంటె చెయ్యగలిగిందేమీ లేదు నేను కూడా ఆయన మాటలు నమ్మాను. ఆయన ఇచ్చిన సలహాను విశ్వసించాను. నేను పారాప్లీజియా (parapleagea) అనేనరాల దౌర్బల్య వ్యాధి పాలైనట్లు తెలుసు కున్నాను.

ఆ నాటి నుంచి పద్దెనిమిది నెలల కాలం దీన మొక యుగంగా గడుస్తూ నా అదృష్టాన్ని తారు మారు చేసి, నా జీవితాన్ని ఒక కొలిక్కి తెచ్చిన [illegible] కాలంగా పరిణమించింది.

# 9. వరంవంటిదైన వ్యాధి

స్వామి రామతీర్థ తన రచనల్లో ఒక చోట తాను వ్యాధులకు స్వాగతం ఇచ్చేవాడిననీ ఆ విశ్రాంతి అవకాశాన్ని సదుపయోగం చేసుకోవచ్చునని అనుకొనే వాడిననీ అన్నారు. ఆయన విషయంలో అదెట్లా జరిగిందో నిజమైందో గాని నా విషయంలో మాత్రము, నేను వ్యాధిగ్రస్తుడనైన కాలము గొప్ప వరంగా పరిణమించింది. నేను ఇంతకు ముందు చెప్పినట్లుగా కదలలేని అవిటివాడ్ని అయాను. నా జబ్బు కుదరదు అని కూడా అప్పుడప్పుడు డాక్టర్లు చెప్పేవారు. తాము చెయ్యగలిగిందీ, చేస్తున్నదీ ఆ వ్యాధి ఇంక ముదరకుండా మరింత వ్యాపించకుండా అరికట్టడమే ననేవారు. జీవితంలో అడుగుబెట్టే వయసులో ఐహిక సుఖాలు ఏవీ కోరకుండా త్యాగ బుద్ధితో మానవసేవలు చేద్దామనే కోరికతో అప్పుడే వికసిస్తున్న పుష్పంవంటి మనస్సు గల యువకుడిని ఈ పరిస్థితి ఎంత క్రుంగదీస్తుందో చదువరులే ఊహించ గలుగుతారు.

వానలు రావడంతోటే నా వ్యాధి మరింత తీవ్రమైంది. రోగిగా నేను డాక్టరు ఇచ్చిన సలహాలను అక్షరాలా పాటించాను. అల్పాయుర్దాయవంతుడనై మరణించేటందుకు గాని, దీర్ఘ రోగంతో నిస్సహాయ జీవిగా మంచంమీద పడిఉండి గడిపేటందుకు గాని నేను సిద్ధంగా లేను బ్రతకాలనీ నేను తీసుకొన్న ప్రతిజ్ఞను పాలించాలనీ, పెట్టుకొన్న ఒట్టును నిలబెట్టుకోవాలనీ తీవ్రంగా మనస్ఫూర్తిగా వాంఛించాను. "నేను కొంచెం నా అంతట నేను కదలగలిగితే ఎంత బాగుంటుంది నేను కోరిందల్లా నా పనులు నేను చేసుకోగలగడమే. అంతటితో తృప్తి చెందుతాను. నేను పూర్తిగా కోలుకోవాలనీ నాకు సంపూర్ణ స్వస్థత లభించాలనీ ఎప్పుడూ

కోరటం లేదు నా అంతట నేను నడవ గలిగాలి అంతే. ఓ పరమేశ్వరా! నాకు ఈ వరం ఇయ్యి. నాకు నా దేశాన్ని నా శక్తికొద్దీ సేవించే అవకాశము ఇయ్యి. తృప్తి లభించేటట్లు చెయ్యి." అని నేను మంచం మీద పడిఉండి అనేకసార్లు ప్రార్థించాను.

అప్పుడు అట్లా ప్రార్థించడము, నిశితంగా చర్చిస్తే నాలో ఒక లోపం అనే అనాలి. మనకు ఏమి అవసరమో, ఎవరిచేత ఏయే పనులు చేయించాలో నిర్ణయించడము ఆ సర్వజ్ఞు పని మనలో ఎవరికి ఏ ఆసక్తి సామర్థ్యాలున్నాయో కూడా ఆ పరమేశ్వరుడికే ఎరుక. అట్లాంటప్పుడు ఎవరైనా అన్ని నిర్ణయాలూ ఆయనకు వదలి వేయకుండా నాకు ఇది కావాలి అని ప్రార్థించడము, ఆయనకు మనకేమి కావాలో తెలియదని భావించడం అన్నమాట. అది సర్వేశ్వరుని సర్వజ్ఞత్వాన్ని కరుణాశీలాన్ని శంకించడమే అవుతుంది. నాస్తిక లక్షణం అవుతుంది. ఈ ఆలోచనలు నాకు అప్పుడు అన్నీ. ఆయనను పదే పదే ప్రార్థన చేసేవాడ్ని.

చాలా కాలం ఆ వ్యాధి అట్లాగే నిలబడింది నేను అల్లోపతీవైద్యం నుంచి, యునానీ వైద్యంలోకి మారాను ఆ మార్పు వల్ల రోగం మరింత ఎక్కువైంది. ఈ రెండూ వద్దు, ఆయుర్వేద వైద్యాన్ని ఆశ్రయించ వలసిందని మిత్రులు సలహా ఇచ్చారు. అందుచేత ప్రఖ్యాత ఆయుర్వేద వైద్యుల వైద్యం లభిస్తుందని నేను పూణే (పూనా) నగరానికి వెళ్లాను అక్కడ మా స్నేహితులు నిర్వహిస్తున్న ఆయుర్వేద ఆసుపత్రి (దవాఖానా)లో శ్రద్ధగా నా ఆలనాపాలనా చూస్తూ చికిత్స చేయడం జరుగుతుందని మిత్రులు నన్ను చేర్పించారు నా చేతిలో ఒక పైసాకూడా లేనందువల్ల ఖర్చులన్నీ ఆ మిత్రులే భరించారు ఆ ఆసుపత్రిలో నేను ఆరు నెలల పాటు ఉన్నాను నిపుణులు వైద్య చికిత్స చేసినా నా స్థితి క్రమంగా విషమించింది. ఒక రోజున నాకుస్మృతి తప్పిందట అందరూ నా బ్రతుకును గురించి ఆశలు వదులు కున్నారు ఆ సమయంలో నాచుట్టాలలో ఒకరికి నేను మరణాసన్నుడనై ఉన్నానని తంతివార్తకూడా

పంపినారట. వారు ఆవిషయం నాకుతర్వాతచెప్పారు. కాని, నాకు చికిత్స చేస్తున్న వైద్యులకే ఆశ్చర్యం కలిగే రీతిగా నాలో తిరిగి ప్రాణము, కదలిక కనిపించాయి! అది పరమేశ్వరుడి నిర్ణయమా? పోయిందనుకున్న ప్రాణం తిరిగి ఈ శరీరంలోకి ఎందుకు వచ్చింది? అది కేవలం పరమేశ్వరుడి ఆజ్ఞే. నేను జీవించి, త్యాగమయ జీవితానికి అంకితమై, నా ప్రతిజ్ఞను నిలబెట్టుకోవాలనేదే ఆయన ఇచ్ఛ కావచ్చునని ఈ సంఘటనకు అర్థమనే భావం నాలో కలిగి దాని పట్లా నా విశ్వాసం వృద్ధి అయింది

నాతో కాలేజీలో చదువుకొన్న స్నేహితులకు నా సమాచారం తెలిసింది వారు వచ్చి నన్ను అహమ్మద్ నగర్ తీసుకొని వెళ్లారు. వారు కూడా అక్కడ ఆయుర్వేద కళాశాలలో విద్యార్థులే వారిలో కొందరు తాముకూడా నేను ఎన్నుకొన్న మార్గాన్నే అనుసరించాలని కోరేవారు అందు చేతవారు నన్ను మరణించ [illegible] వారు ప్రేమ పూర్వకంగా నాకు ఆశ్రయమిచ్చారు శ్రీ [illegible] నా పట్ల ఎంతో అభిమానము. నాస్వస్థత కోసం ఆయన ఏమి చెయ్య వలసి వచ్చినా సిద్ధంగా ఉండే వాడు. ఆయిన నా దగ్గరకు వచ్చినప్పుడల్లా నాకు తప్ప కుండా స్వస్థత లభిస్తుందనీ అనారోగ్య స్థితి తొలగి పోతుందనీనమ్మకంగా చెప్పే వారు. అందరికీ విస్మయం (ఆశ్చర్యం) కలిగే టట్లుగా ఎనిమిది నెలలు గడిచే టప్పటికి నేను చేతి కర్ర పట్టుకొని నడవ గలిగాను.

మంచం మీద ఉన్న ఆ పద్దెనిమిది మాసాల అతిదీర్ఘ కాలమూ నా దృష్టిని నా అంతరాత్మ వైపు మళ్లించి ఈ జీవిత పరమార్థంఏమిటి? దీని గమ్యం ఏమిటి? అని అర్థం చేసుకొనే ప్రయత్నం జరిపే టందుకు ఉపకరించింది "నీవు ఈ దేహం కాదు" అన్న గీతావాక్యం నాకు తరచుగా జ్ఞాపకం వచ్చేది. 'అయితే ఎందుకు ఈ వ్యాధిని గురించి నేను మానసికంగా బాధ పడటం?" అనిపించేది. "సర్వేశ్వరుడి నిర్ణయానికే అన్నీ వదలి వేయాలి" అని వివేకానందుని వచనము జ్ఞాపకం వచ్చేది. అట్లాంటప్పుడు నేను నా కళ్లు మూసుకొని పరమేశ్వరార్పణ చింతతో నన్ను నేను మరచిపోయే వాడ్ని. "ఆత్మ నిత్యము. అది నశించదు శాశ్వతంగా

ఎప్పుడూ ఉంటుంది" అని స్వామి రామతీర్థ చెప్పిన మాటలు నా హృదయంలో ప్రతిధ్వనించి ఆత్మావలోకన కృషికి పురిగొల్పేవి. ఈ వ్యాధి పీడిత కాలము నాకొక మహా తపశ్చర్య వంటిదిగా పరిణమించింది. ఆసుపత్రిలో ఆ చిన్న గదిలో నేను తాత్త్విక సన్న్యాస భావాన్ని పొంది క్రమంగా దానిపట్ల గాఢమైన అభినివేశం సంపాదించుకొని సర్వ కర్మ ఫలత్యాగ బుద్ధి అలవరచుకొని సర్వం బ్రహ్మార్పణమస్తు అని భావించ గలిగాను. మరణం అంటే ఏమిటి ? అది ఆత్మ సాక్షాత్కార యాత్రా సాఫల్యంలో మరొక మజిలీ మాత్రమే. ఈ స్ఫూర్తి కలగగానే నాకు తన చివరి నిమిషంలో గోవిందనామోచ్చారణ కావిస్తూ మరణించాలనే కోర్కె ఉన్నదని కీర్తించిన ఫస్తుడు గుర్తు వచ్చాడు. నేనుకూడా అట్లాగే పాడుకోవాలనుకున్నాను. కాని, నేను అట్లా పాడితే నా పాటలో ఆ భక్త్యావేశం లోపిస్తుందనే జంకు కలిగింది భగవద్భక్తుడైనవాడు తనకు మరణం ఎట్లా వస్తుందో అని ఎందుకు భయపడాలి ? "నేను పూర్తిగా నీ వాడిని, దాసుణ్ణి, నన్ను నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యి, నాకు ఏ కోరికా లేదు. నా కోరికలన్నీ నీ నిర్ణయంలో లీనమై పోయాయి" అనే దృక్పథము, భావము సరియైన వనిపించించి ఆ భావం రూపొందిన నాటి నుంచీ నేను ఆ దృఢ మనస్కతతో ఉండే ప్రయత్నమే చేస్తున్నాను. అప్పుడప్పుడు కొంత చలించినప్పటికీ, తిరిగి వెంటనే నాలో ఆ విశ్వాసం క్రమంగా మరింత దృఢతరం అవుతూ ఉంది.

నాలో ఈ తీరుగ వైరాగ్య మానసిక తత్త్వం అంకురించడమూ అది మొలకెత్తి పెంపొందడమూ ఆ చిన్న ఆస్పత్రి గదిలోనే జరిగాయి అప్పటి నుంచీ నేను వ్యాధి పీడితుడనై ఉన్న కాలంలో మంచాన పడ్డాననే చింత తొలిగిపోయింది ఆరోగ్యం బాగా ఉండి నేను హృదయ పరిశుద్ధ్యాన్ని గాని, భగవద్భక్తిని గాని సాధించక పోతే జీవితం ఎట్లా సార్థకం అయేది? శారీరకంగా అవిటితనం కలిగినా మానసికంగా ఆధ్యాత్మికంగా అభివృద్ధిచెందడమే వాంఛనీయమని నా విశ్వాసము. ఇట్లా వ్యాధి మూలంగా నేను శారీరకంగా పోగొట్టుకొన్న బలంకంటె వెయ్యిరెట్లు నైతిక,ఆధ్యాత్మిక

బలాన్ని ఆ కాలంలో సాధించుకొన్నాను. తర్వాత ఎప్పుడైనా ఆ రోజులు నాకు జ్ఞాపకం వచ్చినప్పుడు, ఆ వ్యాధిని నాకు ప్రసాదించి, నా మనస్సు నిజమైన భక్తి భావార్ద్రం అయేటట్లు, కావించి నన్ననుగ్రహించి రక్షించి నందుకు సర్వేశ్వరుడికి ప్రణామాలర్పిస్తూ ఉంటాను. మొత్తం మీద నిజానికి నేను తిరిగి జన్మించాను.

వ్యాధి పీడితుడనై ఉన్న ఆ కాలంలోనే నా మనస్తత్వంలో ఉన్న అనేక లోపాలు సవరణ అయే అవకాశం కలిగింది. నాకు ఏకాంతంగా ఉండటం అలవాటైంది. ఎన్ని రోజులైనా సరే ఒంటరిగా ఉండే శక్తి లభించింది. ఆ రోజుల్లోనే నేను మౌనం వల్ల ప్రభావితుడనై అది ఎంత శక్తి ప్రదాయిని అవుతుందో తెలుసుకోగలిగాను. ఆ దశలోనే ఎన్నో మానసిక వేదనలకు గురి అయాను. ఆయా సందర్భాలన్నిటిలోనూ సునిశితంగా ఆత్మ శోధన చేసుకొని ఆత్మ శాంతి పొందాను. "మనశ్శాంతికి బహిరంగమైన సాధనాల మీద ఆధారపడటం తగదు. సుస్థిర మైన శాంతి అంతరంగంలోనే ఉంది" అని గుర్తించి, క్రమంగా సాధన వల్ల అది పొందాను.

ఆధ్యాత్మిక సాధనలో నాఅంతట నేను ఎట్లా ప్రయోగాత్మక కృషి చేశానో తెలుసుకోవడం చదువరులకు కొంత ఆసక్తికరంగా ఉండవచ్చు. నేను, కొందరు మనుష్యులను గాఢంగా ప్రేమించాను. ప్రేమ సంతోషదాయకమే, అయినా ఒకప్పుడు దుఃఖభాజనము కూడా కావచ్చు. ప్రేమించిని మనిషిని సేవించడం వల్లా ఆ మనిషి కోసం త్యాగం చేసినందువల్లా సంతోషం లభిస్తుంది. స్వార్థ వాసన వ్యక్తిగతమైన కోరికలు ప్రేమను కలుషితం చెయ్యకుండా ఉన్నంత వరకు అంతా సంతోషకరమే. కాని, ఐహిక, శారీరక వాంఛలు ప్రవేశిస్తే అంతా చిరాకే. ఎడ తెగకుండా ప్రయత్నాలు చెయ్యడం వల్ల మానవ సహజమైన దౌర్బల్యాలు నన్ను లోబరచుకొనకుండా ఉండేటట్లు మనో నిబ్బరం సాధించుకొన్నాను. నేను ప్రేమిస్తాను; అభిమానిస్తాను అంతే. నేను ప్రేమించిన వారికి సేవ చేస్తాను. ఆ విషయం అంతటితో ఆఖరు. బాగా ఆలోచన చేసిన తర్వాత నేను ప్రేమించిన వారు తిరిగి నన్ను ప్రేమించాలని ఆశించడం తగదని

కూడా గుర్తించాను. సాధారణంగా మన ప్రేమకు లక్ష్యం అయిన వారు, మనం వారిని ప్రేమించినంత గాఢంగా తిరిగి మనల్ని ప్రేమించడం, అభిమానించడం, జరగక పోవచ్చు. అప్పుడు వారి పట్ల మన ప్రేమాభిమానాలలో మార్పులు, ముఖ్యంగా తగ్గడం అనేది ఉండ కూడదు. ఇట్లాంటి దృక్పథం నిర్లిప్తత సాధించుకొనేటందుకు శక్తి కలిగిస్తుంది. ఏకాగ్రతతో తీవ్రంగా ఒక లక్ష్యాన్ని సాధించాలని తల పెట్టి కృషి చేస్తున్నప్పుడు ఆ కృషి ఫలితం వల్ల కలిగే లాభం గురించి ఆలోచనలు చెయ్య కూడదు. అట్లా ఆలోచనలు చేస్తే ఆ కృషి అనాసక్తమైన కృషి అవదు. అనాసక్తమైన కృషి చేస్తేనే ఇతరుల ప్రేమాభిమానాలకు ఆశించకుండా ప్రవర్తించె దృక్పథం సిద్ధిస్తుంది ప్రేమకు లక్ష్యమైన ప్రతీదీ భగవంతుడి రూపమే అని పరిగణించడం వల్ల ఆ దృక్పథం సిద్ధిస్తుందని నేను నా అనుభవం వల్ల గ్రహించాను అప్పుడు ప్రేమాభిమానాలకు ఆస్పదమైన దాని రూప గుణానక్తులు మాయమై నిష్కల్మషమైన సంతోషం మాత్రమే మిగలడం జరుగుతుంది. అందుచేతనే ఏ విషయాన్ని గురించి అయినా నేను పనిచేస్తున్నప్పుడు ప్రతి నిమిషమూ నేను ఫలాసక్తితో నా చర్యల్ని చేస్తున్నానా అని పిమర్శించుకొంటాను నాలో ఫలాసక్తి పొడ చూపినట్లు తోచినట్లయితే వెంటనే నేను ఆ ఆసక్తిని పక్కకు పెట్టివేస్తాను. అట్లా చేయడం వల్ల ఎట్లాంటి మనో వికారాలూ, క్లిష్ట పరిస్థితులూ నా మనస్సును కలుషితంచెయ్యలేవు. ఇది సాధించేటందుకు నాకు ఎన్నో సంవత్సరాలు పట్టింది.

నేను తప్పుచేసిన వారిపట్ల సానుభూతి చూపించేటందుకూ వారిని క్షమాదృష్టితో ప్రేమించేటందుకూ యత్నించాను. ఈ సందర్భంలో నేను మహాత్మాగాంధీ ఇచ్చిన సూచనల వల్ల ప్రభావితుడనైనప్పటికి ముఖ్యంగా నేను చేసిన పాపాలు, పొరపాట్లు గురించిన పశ్చాత్తాప భావం నాకు మార్గదర్శకమైంది. మర్మం విడిచి చెప్పాలంటే నేను కూడా అనేక పాపాలు చేసాను. కాని, అవి లోకానికి తెలియవు. ఈరోజున కూడా నేను మానసిక దౌర్బల్యాలు ఏవీ లేనట్టి సచ్చరిత్రుణ్ణని గుండెమీద చెయ్యి వేసుకొని చెప్పలేను. అందువల్ల నా తప్పులకు నన్ను లోకం విససించ

వచ్చునా ? ఇతరులు నా పట్ల కొంత సహనంతో ఉండాలనే ఆశిస్తాను. వారి సహనభావమే కనక నాకు లభించకపోతే నా జీవితం వృథా అయి ఎడారి మరుభూమి వంటిదై తుఫానులో చిక్కి ఛిన్నాభిన్నమైన ఓడ వంటిదైపోయేది. నన్ను ఎందరో ప్రేమించి అభిమానించారు. సాను భూతితో నాకు సహాయం చేసారు నా లోపాలను సరిదిద్దుకొని వాటిని నిగ్రహించి నిష్కల్మషుడనయ్యే టందుకు తోడ్పడ్డారు అట్లాంటప్పుడు ఇతరులను పాపులు అని నిరసించేటందుకూ, ద్వేషంతో ఏవగించేటం దుకూ నాకున్న హక్కేమిటి ? మనస్ఫూర్తిగా ప్రయత్నం చెసి, స్వాను భావపూర్వకంగా లనేక ప్రయోగాలు చేసి, నన్ను నేను దిద్దుకొన్నాను. కొంత వరకు విజయం సాధించి నందుచేత నేను కృతకృత్యుడ నయానను కొంటున్నాను. అందువల్ల నన్ను హృదయపూర్వకంగా అర్థం చేసుకొన్న వారు నా చుట్టూ కూడి నా జీవితాన్ని [illegible] ఆమోద యోగ్యము చేశారు. తన్ను తాను ఉద్ధరించుకొనడమే ఇతరులను ఉద్ధరించేటందుకు [illegible] ఈ సత్యమే నేను జీవితంలో నేర్చుకొన్న అత్యు త్కృష్టమైన పాఠము.

అది అమలు చేస్తూ చెసిన ప్రయత్నాలలోనే నా ప్రవర్తనను నేను దిద్దుకొన్నాను నా ప్రయత్నాలు ఎప్పుడూ యావజ్జీవమూ కొన సాగుతూనే ఉండవలసిన అగత్యం ఉండనే ఉంటుంది

అందరు మానవుల లాగే నీవు కూడా పెండ్లి చేసుకోవలసిందంటూ వచ్చిన ప్రతిపాదనలను నేను ఎదుర్కొనవలసిన పరిస్థితి ఏర్పడింది. అంతరంగము, బ్రహ్మచారిగానే జీవితం గడపవలసిందని నిర్దేశించింది ఆ నిశ్చయము మొదట్లో ఏమి పెద్ద ఆలొచన చేసి నిశ్చయించింది కాదు కాని, తర్వాత అది క్రమ క్రమంగా పరిణతి చెంది హృదయ పూర్వకంగా, బుద్ధిపూర్వకంగా చేసిన నిశ్చయంగా రూపు దిద్దుకున్నది. సహజంగా నాకు గృహస్థ జీవితం పట్ల మోజూ ఆకర్షణా లేవు సేవా సక్తితో, త్యాగబుద్ధితో జీవితాన్ని గడపాలనే కోరికతో తీసుకొన్న ప్రతిజ్ఞే నా సహజ నిశ్చయాన్ని దృఢ పరచింది. అందుచేత పెండ్లిని

గురించి వచ్చిన ప్రతిపాదన లన్నింటినీ నేను నిరాకరించాను. మా కుటుంబంలోని పెద్దలు కూడా ఏమీ ఒత్తిడి చెయ్యకుండా నేనే ఆ విషయాన్ని స్వతంత్రంగా నిర్ణయించు కొనేటందుకు వదలినందుకు వారికి నేనెల్లప్పుడూ కృతజ్ఞుణ్ని.

నేను, నా జీవితమంతా బ్రహ్మచారిగానే గడిపాను. అందువల్ల వచ్చే సహజమైన ఒడుదుడుకులు తప్పలేదు మనస్సు చంచలమైనదనీ స్త్రీ విషయకమైన ఆలోచనల వల్ల చలిస్తుందనీ నేను తెలుసు కున్నాను. నేను ఆ ఆలోచనలను నిగ్రహించుకొనే వాణ్ని. ఒక్కొక్కప్పుడు నాకు మనో నిగ్రహం కలిగేది ఒక్కొక్కసారి నా మనస్సు అదుపు తప్పుతోన్నట్లుండేది. ఆధ్యాత్మిక కీర్తనలను పాడటము, ఉత్తమ వేదాంత గ్రంథాలను పఠించడము, దైవ ప్రార్థన ప్రారంభించి మనస్సును దైవం మీద లగ్నం చెయ్యడం, వంటి అనేక మార్గాలు అవలంబించి నా మనస్సును మాలిన్యరహితం చేసేటందుకు ప్రయత్నించే వాణ్ని ఒంటరిగా ఏ స్త్రీతోనైనా కాలం గడపటం గాని, ఆడవారి మొగం వైపు చూస్తూ మాట్లాడటం గాని, వారి మాటలు వినడంగాని చేయకూడదని నిశ్చయించు కొన్నాను నేను నడిచేటప్పుడు నా దృష్టి ఎప్పుడూ క్రింది నేలమీదనే ఉండేటట్లు అలవాటు చేసుకొన్నాను. నా మనస్సు, విషయ వాంఛలనుండి విముక్తం చెయ్యవలసిందని సర్వేశ్వరుణ్ని నిత్యమూ మనసా ప్రార్థించే వాణ్ని నేను నా మనస్సుని పూర్తిగా జయించ గలిగానని చెప్పలేను అప్పుడప్పుడు. ఆజన్మ బ్రహ్మచర్య వ్రతం చేకొంటామంటూ నా దగ్గరకు వచ్చి సలహా అడిగిన వారితో అట్లా చెయ్యవద్దని కూడా చెప్పాను బ్రహ్మచర్య వ్రతం ఆ [illegible] వారు అధిరోహించ వలసిన ఎత్తు చాలా ఎక్కువ పైగా అది నిటారుగా ఉన్న మోకాటి పర్వతమువలె ఉంటుంది. ఈ వ్రతంలో క్రిందికి [illegible] జారే ప్రమాదాలు అనేకము అడు గడుగునా ఎదురవుతాయి అంతరంగంలో ఏదో అత్యంత బలమైన దృఢ నిశ్చయం కలిగివేనేగాని బ్రహ్మచర్య ప్రతిపాలన కష్టసాధ్య మైందని నేనెల్లప్పుడూ భావిస్తూ

ఉన్నాను. అంతే కాకుండా ఆ వ్రతానికి తోడుగా జీవితాన్ని అంకితం చేసేటందుకు ధ్రువతారగా ఉండే మరొక అత్యున్నత ఆదర్శం కూడా అవసరము. ఒక్క మాటలో చెప్పాలంటే ఆధ్యాత్మిక దృష్టి, సాధన ఉండాలి ఇన్నేళ్ళు సాధనలో గడిపిన తర్వాత కూడా నా మనస్సు నిశ్చలమైనది కాలేదనీ చాంచల్యాన్ని వ్యక్తం చేస్తుందనీ ఒప్పుకోవలసి ఉంది. కాని, ప్రార్థన నాకు రక్షణ కవచంగా ఉండి నన్ను అగాధంలో పడిపోకుండా కాపాడు తున్నది. ఇట్లాగ మనోనిగ్రహం కోసం నిరంతర పోరాటం ఒక వంక కొనసాగిస్తూ ప్రయత్న పూర్వకంగా ఏర్పరచుకొన్న నియమాలను కచ్చితంగా పాటించే టటువంటి అలవాట్లు చేసుకొని, నేను నా దేహాన్ని స్త్రీ సంపర్కం నుంచి దూరంగా ఉంచగలిగాను.

ప్రజా సేవలో కార్యకర్తగా ఉన్నందువల్ల, స్వతంత్ర పోరాటంలో పాల్గొనేటందుకు ముందుకు వచ్చిన అనేక మంది స్త్రీలతో నాకు పరిచయం కలిగింది. వారు మానవులలో పవిత్రతకు నిదర్శనంగా పేర్కొనదగిన వారని నా మనస్సుకు తోచింది. అందువల్ల ఉన్నత భావాలు, ఉత్తమ స్వభావము పురుషులలో కంటే స్త్రీలలోనే ఎక్కువగా ఉంటాయనే అభిప్రాయం కలిగింది ఇప్పుడు నేను స్త్రీలంటే భయపడ వలసి వుంటుందని అనను. వారితో నేను నిర్భయంగా సురక్షితంగా ఉండగలను మనస్సులో వైకల్యం కలిగినా నన్ను నేను మందలించుకొని జాగ్రత్త పడగలను సర్వ సాక్షి అయిన, నా అంతరాత్మ నన్ను "జాగ్రత్త" అని హెచ్చరిస్తుంది. వెంటనే చెదిరిన నా మనస్సు పూర్వపు రీతిగా నిశ్చల స్థితిని పొందుతుంది.

"ఒక సాధువు అతను శరీర త్యాగం చేసిన తర్వాతనే అతను సాధువో కాదో పేర్కొన వలసి ఉంటుంది," అన్న స్వామి రామకృష్ణ పరమహంస చెప్పిన వాక్యము నాకు అను క్షణమూ ఎక్కడ ఎప్పుడూ ఏతీరుగానూ కిందికి జారి పడిపోకుండా జాగ్రత్త తీసుకొనే జ్ఞాపకం వంటి దైంది. నన్ను గురించి ఇతరులు ఏ రీతిగా భావించినప్పటికి నేనుమాత్రం ఎప్పుడూ సాధువునని అనుకోలేదు. నేను కూడా సాధారణ మానవుణ్నే.

నాలో కూడా వారిలా సహజమైన అనేక లోపాలున్నాయి. నేను చేసిందల్లా నాలో ఆ లోపాలున్నాయని గుర్తించడమూ వాటిని మనస్ఫూర్తిగా అవిరామంగా భగవద్భక్తి భావనాపూర్వక ప్రయత్నాలతో క్షాళన చేసుకొంటూ స్వచ్ఛత పొందేటందుకు కృషి చెయ్యడమే.

ఈ మాటలన్నీ పూర్తిగా వ్యక్తిగతమైన విషయాలకు సంబంధించినవని అనిపించవచ్చు కాని, నా మనస్సులో ఉన్న వాటిని అందరి ముందూ నివేదించాలనే అంతర్యామి ప్రేరేపణ కలిగింది. అందుకే ఈ నివేదికను ప్రజల ముందుంచడం జరిగింది.

1928 లో నన్ను అహమ్మద్‌నగర్ ఆయుర్వేదీయ ఆసుపత్రి నుంచి విడుదల చేశారు. వ్యాధి కొంతవరకు తగ్గింది నేను చేతికర్ర ఊతంతో కొంచెం నడవగలుగు తున్నాను వైద్యవరమైన చికిత్స పూర్తి అయిందనీ ఇంక మిగిలింది ప్రకృతి కొనసాగిస్తుందనీ కాలం గడచిన కొద్దీ నాకు బలం పుంజుకుంటుందనీ ప్రోత్సాహ పూర్వక వచనాలు చెప్పారు. నాకు పూర్వపు ఆరోగ్య పరిస్థితి తిరిగి వస్తుందని ఆశించడానికి అవకాశం లేదని గూడా స్పష్టంగా చెప్పారు.

ఇంతకు ముందు చెప్పినట్లుగా నేను ఈ వ్యాధివల్ల శారీరకంగా అవిటివాడ్ని అయినా మానసికంగా ఎంతో బలంకలవాడ్ని అయాను.

ఆసుపత్రి నుంచి రోగవిముక్తున్నై బైటికివస్తున్నాననే సమాచారం శ్రీ ఎస్. ఎమ్ జోషికి అందింది. ఆయన నన్ను తిరిగి నా పనిలో చేరమన్నారు. కాని, ప్రస్తుత ఆరోగ్య పరిస్థితిలో నాకు, కార్మికుల యూనియన్ నిర్వహణకు అవసరమైన శారీరక శక్తి లేదనీ అంతేకాకుండా బొంబాయి నగరపు శీతోష్ణ పరిస్థితులు నాకు అనుకూలమైనవి కావనీ ఆయనకు తెలియజేశాను. ఎంత చెప్పినా ఆయన నన్ను వదల దలుచుకోలేదు అందుచేత నన్ను షోలాపూర్‌లో ఉండ వలసిందనీ అక్కడ బట్టల మిల్లు కార్మికులు చేస్తున్న సమ్మెలో వారికి సలహాదారుగా ఉండి కార్మికులను సమీకరించవలసిందనీ కాదన వద్దని ఆయన కోరారు. ఆ బట్టల మిల్లు కార్మికుల

సమ్మెలో ఇరువై వేల మంది భవితవ్యం ఇమిడి ఉంది. అది నాలుగు నెలల పాటు శాంతంగా క్రమ బద్ధంగా కొనసాగింది. ఆ సందర్భంలో నేను ఇతర సహచరులతో అనేక సభలలో మాట్లాడాను చివరకు కార్యాచరణ సమితి పికెటింగు చెయ్యాలని నిర్ణయించింది ఆ కార్యక్రమంలో పాల్గొనేటందుకు వందల కొద్దీ వాలంటీర్లు ముందుకు వచ్చారు. పికెటింగు నిర్వహణ బాధ్యత నాకు అప్పగించారు. షోలాపూర్ నగరంలో ఉన్న జనం యావన్మంది నిరుపహతులైన వాలంటీర్లు ప్రారంభించనున్న ఈ సత్యాగ్రహాన్ని తిలకించేటందుకు మిల్లులున్న పారిశ్రామిక వాడ వైపు కదలి వచ్చారు, అధికారులు మిల్లు యజమానులతో షరీకై ఆ ప్రజా వాహినిని కదలనియ్య లేదు. పికెటింగు చేస్తున్న వారిపై దౌర్జన్యాని-ప్రేరేపించారు. అది మొదట ఫలించ లేదు. కాని, తర్వాత వారి కుయుక్తులు ఫలించాయి నన్ను అరెస్టు చేసి, విచారణ జరిపి కొంత స్వల్ప కాలం విడి ఖైదు శిక్ష విధించారు

నేను ఖైదు నుంచి విడుదల పొంది తిరిగి వచ్చాను. అప్పటికే కార్మికులలో చీలికలు వచ్చి ఐకమత్యం చెడిందని, నేను గురి తప్పానని గుర్తించాను. యజమానులతో చర్చిస్తూ కార్మిక సమస్యల పరిష్కారం చేసే సమయంలో అదను తప్పిపోకుండా గమనించి అదను పాదపెట్టకుండా పట్టుతప్పి పోకుండా రాజీ సాధించడం ఆవశ్యకమని అనుకొన్నాను అప్పటనుకొన్న భావమే నాలో ఈ నాటికీ కూడ నిలిచి ఉంది. ఆ అదను తప్పిపోయినట్లయితే కార్మికుల భవితవ్యము, ప్రగతి తాత్కాలికంగానైనా సరే దెబ్బ తింటాయి.

ఎంతో ధైర్యంగా సాహసంతో పోరాడిన ఆ కార్మిక నాయకుల గతి చివరకు ఏమైంది? వారు బలి పశువులైనారు. నేను వారికి సాంత్వన వచనాలతో ధైర్యం చెప్పాను కాని,చివరికి యూనియన్ ఛిన్నాభిన్నమైంది. ఆరు నెలలపాటు కార్మికులలో తిరిగి ఐకమత్యం సాధించేందుకు ఎన్నో ప్రయత్నాలు చేసి చివరకు శ్రీ ఎన్. ఎమ్. జోషిని నన్ను బాధ్యతల నుంచి విడుదల చెయ్యవలసిందనీ, నాకు శారీరక శ్రమ లేని శాంతి

పవిత్రమైన మరో కార్యరంగంలో కృషి చేసే బలమైన కోరిక కలిగినట్లు తెలియ జేశాను. నాలో నిప్పులు కురిపిస్తూ మాట్లాడే స్వభావమూ, శక్తి తీవ్రతా తొలగిపోయాయి. నేను పూర్వం ఉన్నట్లు లేను, మారిపోయాను. జూన్ 1929 లో షోలాపూర్ వదిలివేశాను హైదరాబాదు సంస్థానానికి చెందిన ఉస్మానాబాదు జిల్లాలో హిప్పర్గి (Hipperge) అనే గ్రామం ఉంది అక్కడి జాతీయ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయుడిగా ప్రవేశించాను

దీనితో సంబంధించిన మరో విషయాన్ని కూడా ఇప్పుడు తెలియ జేయవలసి ఉంది "మీరట్ కుట్ర కేస్" ప్రఖ్యాతి వహించిన కేసు ఎందరో విప్లవకారులు మరణ శిక్షలకు, దారుణ కఠిన శిక్షలకు గురి అయిన కేసు. అందులో నన్ను ముద్దాయిగా ఇరికించే ప్రయత్నాలు జరిగాయి. సమ్మె జరిగిన రోజుల్లో నేనిచ్చిన ఉపన్యాసాల నివేదికలు పై అధికారులకు వెళ్లాయి వారు నాపై తీవ్ర చర్యలు తీసుకోవడం అవసరమని భావించడం జరిగింది. భారత దేశంలో ఎక్కడెక్కడ ఉన్న ప్రముఖ కార్మిక నాయకుల్ని జైళ్లలోకి తోయడం కూడా జరిగింది దానికి ముందు కొన్ని రోజులపాటు ఎందరో అజ్ఞాత వ్యక్తులు నాపై నిఘా వేశారు కార్మిక నాయకుల పెద్ద ఎత్తున అరెస్టులు జరిగిన నాటి ముందు రాత్రి నన్ను కూడ అరెస్టు చెయ్యవచ్చుననే విశ్వసనీయమైన వార్త నాకు చేరింది తప్పించుకొని అజ్ఞాత వాసం గడపాలనే ఆలోచన, కోరిక నాకు కలుగ లేదు. కానున్నది కాక మానదు, అవశ్యమను భోక్తవ్యం అనేతత్త్వంతో అరెస్టు కోసం ఎదురు చూశాను కాని, ప్రభుత్వం నన్ను అరెస్టు చెయ్య లేదు. శ్రీ ఎన్. ఎమ్. జోషితో నాకున్న సాహచర్యానుబంధాల మూలంగా ప్రభుత్వం నన్ను అరెస్టు చేసే ఆలోచనలను విరమించుకొన్నదని ఆ తర్వాత నాకు నా మిత్రులు తెలియ జేశారు. బహుశా నేను ఏమంత ప్రమాదకరమైన వ్యక్తిని కానని కూడ ప్రభుత్వం నిర్ణయించింది కాబోలు. పరమేశ్వరుడు నన్ను మరో పనికి ఉద్దేశించినందు వల్లనే అది అట్లా జరిగింది

# 10. విద్యాసంస్థ నిర్వహణ

విధి విధానాలు ఎట్లా ఉంటాయో ఎవ్వరూ ఊహించ లేరు. నేను విద్యార్థులను అదుపులో ఉంచుతూ పాఠాలు బోధిస్తూ కాలం గడుపుతూ ఉంటానని ఎన్నడూ అనుకో లేదు. కాని జూన్ 1929 లో గ్రామీణ ప్రాంతంలో ఉన్న ఒక జాతీయ విద్యాసంస్థ ప్రధానోపాధ్యాయుడుగా బాధ్యతలు చేపట్టడం జరిగింది.

హిప్పర్గి, హైదరాబాదు సంస్థానం లోని ఉస్మానాబాద్ జిల్లాలో ఉన్న చిన్న గ్రామం. అక్కడ కొన్ని వందలమంది జనం మాత్రమే నివసిస్తున్నారు. ఆ గ్రామం ఏమీ అసాధారణమైంది కాదు కాని, అక్కడి ప్రజలలో ఇద్దరు సోదరులు కావించిన కృషి, గురుకుల పద్ధతిలో వారు ఏర్పాటు చేసిన విద్యా సంస్థ మూలంగా ఆ ఊరి పేరు ప్రతిష్ఠలు కలిగాయి

ఆ ఇద్దరి సోదరులలోనూ పెద్దవాడైన శ్రీ వెంకటరావు తన ఆస్తిలో చాలాభాగం ఆ విద్యా సంస్థకు దానం చేశారు. అంతే కాకుండా లాయరుగా తాను సంపాదిస్తున్న ఆదాయం నుంచి ఆ సంస్థ నిర్వహణకు అయ్యే ఖర్చులో ఎక్కువ భాగం భరించేవారు. ఆయన స్వార్థం అనేది ఏకోశంలోనూ లేని పరహిత చింతనాపరుడు. ఆయన తమ్ముడు సహాయ నిరాకరణోద్యమపు రోజుల్లో బి ఎ తరగతిలో చదువుతూ కళాశాల చదువును బహిష్కరించి వచ్చినటువంటి వాడు ఆయన ఆ విద్యా సంస్థను నిర్వహిస్తున్నాడు. చిన్న గ్రామంలో అవతరించిన ఆ జాతీయ పాఠశాల క్రమంగా అభివృద్ధి చెంది, సంస్థానంలోని ఇతర ప్రాంతాల విద్యార్థులనుకూడా ఆకర్షించే శక్తివంతమైన విద్యా కేంద్రంగా రూపుదిద్దు

కొన్నది. ప్రయోజనకరమైన విద్య నేర్పించాలని తలపెట్టిన తల్లిదండ్రులు అందరూ తమ పిల్లలను తప్పకుండా ఆ పాఠశాలకు పంపేవారు. అది                      న్ని అనుసరిస్తున్నందు వల్ల అక్కడి విద్యార్థులు తమ గురువులతో కలిసి మెలిసి నివసించే వారు. గురువులు శిష్యులు కలిసి పనులు చేస్తూ ఘడిస్తూ చదువుతూ జీవించే వారు వారి జీవితం నిరాడంబరమైంది. ఏ విధమైన దర్జాలూ డాబుసరీ లేనిది. అందుకే వింతలు, విశేషాలు, వర్ణనీయమైనవి ఏమీ కనిపించవు. కాని, అక్కడి ప్రతి అంశంలోనూ గ్రామీణ జీవిత వాతావరణము, సారళ్యము ప్రస్ఫుటమయ్యేవి. గ్రామీణ నివాసాలైన కుటీరాలనే ఆ విద్యా సంస్థ వారు విద్యార్థులు, గురువులు నివసించేటందుకై నిర్మించారు. గురు శిష్యుల నడుమ అంతస్థులూ తారతమ్య భేదభావాలూ లేవు. కొత్తగా వచ్చిన వారు ఎవరు గురువు? ఎవరు శిష్యుడు? అని గుర్తించడానికి వీలులేనంతగా వారు కలిసిపోవడం జరిగింది. అక్కడివారందరూ కాయకష్టం చేసేవారు. దాన్ని తక్కువస్థాయి నీచమైందని అనుకొనే వారు కాదు. మా బోధనా తరగతుల కోసం తగిన వసతిని మేమే చేసుకున్నాము. దానిని రోజూ తుడిచి శుభ్రంగా ఉంచేటందుకు విడిగా పని మనుషులెవరూ లేరు. ప్రతి ఆదివారమూ విద్యార్థులు పేడ పోగుచేసుకొని వచ్చి గదులలోని నేలలను అలికి ముగ్గులు వేసేవారు. విద్యార్థులతో పాటు బోధకులు కూడా చేతులు కలిపి పనులు చేసేవారు ఒక ఖాదీ చొక్కా, ఒక గొంగడి (కంబళీ) ఉండే ఆ బడిలో జీవితం గడిచేది. చదువు చదివే సమయంలో రాత్రి నివాసంగా ఉన్న గది, పాఠశాల తరగతి గదిగా మారిపోయేది. చదివే వారు గొంగడి మడతపెట్టి ఆసనంగా అమర్చుకుని కూర్చుండే వారు పని చేస్తున్నప్పుడు చొక్కా ధరించేవారు కాదు. చదువుతున్నప్పుడు అందరూ చొక్కాలు ధరించే వారు. మా బడిలో కుర్చీలు, బెంచి బల్లలు వంటివి ఏవీ లేవు ఒక్కొక్కప్పుడు బడి చదువులు ఆరుబైటనూ మంచి నీడనిచ్చే చెట్లక్రిందా జరిగేవి.

అక్కడి జీవితం క్రమ బద్ధమైంది. మేమందరమూ తెల్లవారు జామున 4 గం. 30 ని|| లకు నిద్రలేచేవాళ్ళము. సరిగా 5 గంటలకు ఉషఃకాల ప్రార్థన సమావేశం జరిగేది. ఆ తర్వాత ఎవరి పనికి వారు వెళ్ళేవారము. 8 గంటలు అయ్యేటప్పటికి జొన్నరొట్టె, పప్పు, పాలు, అందరికీ పొద్దుటి వేళ ఆహారంగా ఇచ్చేటందుకు తయారయ్యేవి అవి తీసుకోగానే మధ్యాహ్నం వరకూ చదువులు తర్వాత భోజనము, కొంత సేపు విశ్రాంతి. ఆ తర్వాత మధ్యాహ్నం రెండుగంటలసేపు తిరిగీ చదువు సాగేది. సాయంకాలం 5 గంటల నుంచి దేహపరిశ్రమ 7 గంట లకు సాయంకాలపు ప్రార్థన సమావేశము జరిగేది. ఆ తర్వాత రాత్రి భోజనం ముగించుకొని విద్యార్థులు చదువుకునేవారు. రాత్రి 9 గం 30 నిమిషములు కాగానే నిద్రవేళ.

ఆ విద్యా సంస్థలో దైనందిన జీవిత వ్యవహారాలు, చదువుల కార్యక్రమాలు అజమాయిషీ చేయడానికి ప్రత్యేకంగా ఒక మనిషి ఉండటం అవసరమైనాడు. విద్యార్థులు, ఉపని చెప్పచేతల్లో మెలగుతూ ఉండటం, వారికి చక్కని విద్యాభిరుచులు కలిగేటట్లు తీర్చిదిద్దడం, జర గాలి. మొత్తంమీద విద్యార్థుల జీవితంలో అన్ని రంగాలలోనూ అతను సంబంధం కలిగించుకొంటూ వారి అభివృద్ధికి పాటుపడాలి. కేవలం చదు వులు చెప్పడంతో అతని బాధ్యత పూర్తికాదు మానవుని జీవితంలో మానసిక, ఆధ్యాత్మిక రంగాలున్న ప్రాధాన్యతను అవగాహన చేసు కొని, ఆయా రంగాల్లో కృషి చెయ్యడాన్ని, ప్రోత్సహించి, అభివృద్ధి సాధించాలి. అట్లా జరిగితేనే విద్యార్థి సంపూర్ణ వ్యక్తిత్వం వికసించేది. సామాజిక జీవితంలోనూ సంసారమనే సాగరంలోనూ తన జీవన నౌకను సురక్షితంగా నడపే శక్తిగల సామర్థ్యాన్ని పూర్ణతను సాధించ గలుగుతాడు. ఇతర విద్యా సంస్థలలోనూ పరిసర ప్రాంతాలలోనూ లభి స్తున్న విద్య అసమగ్రమైన [illegible] దశ [illegible] ఎదురయ్యే సామాజిక జీవితంలో అవసరమైన ఏదో ఒక అంశంలో మాత్రమే కొంత నేర్పరి తనాన్ని అలవరచి, [illegible] జ్ఞానంలో మునిగితే మహాహంకారుల్ని

మాత్రమే తయారు చేస్తున్నది విద్యార్థులకు బుద్ధి వైశద్యం మాత్రమే కలిగిస్తే హృదయ కాఠిన్యం అట్లాగే గడ్డకట్టి ఉంటుంది గురువు శిష్యుడి దేహబలాన్ని, మనో ధైర్యాన్ని మాత్రమే ప్రోత్సహిస్తే అతని బుద్ధి బలమూ విమర్శనాశక్తీ అందుకో వలసినంత స్థాయిని అందుకోలేక పోవచ్చు. సమాజానికి కావలసింది దాసపెట్టెలు, బొదకాళ్లు వంటి వికార రూపాలను గుర్తుచేసే ఎగిడి దిగిడి అసమగ్ర విజ్ఞానవంతులు కాదు. సర్వాంగ సౌష్ఠవంతో సుందరంగా కన్పించే ఒంటి సామాజిక జీవితంతో ఉదయ కలిపి సామరస్య భావంతో జీవించేటందుకు తగిన విజ్ఞానాన్ని ప్రసాదించే బోధకులూ వారివలె రూపొందాలనే విద్య సఫలమైనే సాధకులూ కావాలి

సమాజంలో అట్టడుగున ఉండి నికృష్ట జీవితం గడుపుతున్న వారి అభివృద్ధి కోసమై సేవా భావంతో కృషి చేస్తూ తమ జీవితాన్నంతా పేదల పట్ల సానుభూతి చూపించే ప్రజా సేవకే అంకితం చెయ్యడానికి సంసిద్ధులయ్యేటట్లుగా యువకుల్ని తీర్చిదిద్దే లక్ష్యంతో ఈ విద్యా సంస్థను సంస్థాపకులు ఏర్పాటు చేశారు త్యాగశీలము, పవిత్ర జీవనము అనేవి రెండూ ఇందులో విద్య నభ్యసించేవారికీ వారి బోధకులకూ జీవిత లక్ష్యాలుగా ఉండాలని నిశ్చయించారు. అందుచేత తమ ఆశయ సాధనకు అనుగుణమైన సమర్థతలు కల వ్యక్తికోసం ఆ గురుకుల సంస్థాపకులు అన్వేషిస్తున్నారు. ఎట్లాగో ఒకలాగ వారి దృష్టి నామీదే పడింది. నేను అత్యంత సామాన్య మానవుణ్నని చెయ్యవలసిన పని అత్యంత ఉన్నతమైనదనీ చెప్పాను. కాని, వారు నన్ను హిప్పర్గి వచ్చి ప్రధానోపాధ్యాయ కులపతి పదవి స్వీకరించ వలసిందని కోరారు. నేను అంగీకరించాను. ఆ తర్వాత, వారు నాకెంత జీతం ఇవ్వవలసి ఉంటుంది ? అని నన్ను అడగగానే నేను నిశ్చేష్టుడి నయ్యాను శ్రీ ఎన్. ఎమ్. జోషి అంత పెద్దవాడి దగ్గరే నేను నెలకు 60 రూపాయలు మాత్రమే గౌరవ వేతనంగా తీసుకొనేవాణ్ని. "జీతం ఆశించి పనిచేసే అలవాటు ఎప్పుడూ నా మనస్సులో కలుగ లేదు అందుచేత, నిరాడంబర జీవితం

గడిస్తే నాకు చాలు. అందుకోసం ఏమేమి అవసరిమో అట్లా చెయ్యండి నా మీద అధారపడిన వారెవ్వరూ లేరు నేను ఒంటరి వాడిని" అన్నాను. నెలకు 50 రూపాయలు నాపెర బ్యాంకులో జమ చేస్తామనీ ఆ సొమ్ములో నుంచి కావలసినప్పుడు వాడుకోవచ్చుననీ గురుకులంలోనే భోజన భాజన వసతులు నిర్ణయమనీ తెలియ జేశారు. నేను అంగీకరించాను. వారు జమ చేసిన సొమ్ముతో నాకు అవసరమే కలుగలేదు. ఒకసారి వ్యాధి పీడితు డైన చుట్టాన్ని చూసేటందుకు వెళ్ళుతూ రాకపోకలకు మాత్రమే అందులో నుంచి ఖర్చు పెట్టవలసి వచ్చింది. అందుచేత ఐహిక సంబంధాలన్నీ తెంచివేసుకొని, ఆస్తిపాస్తులేవీ నాకు అక్కరలేదని నేను నిర్ణయించుకొన్ననాడు ఆ సొమ్మంతా అట్లాగే జమచేసిన వారికి తిరిగి ఇచ్చేశాను ఆ సందర్భాన్ని వివరంగా మరోసారి ప్రస్తావిస్తాను.

'మతం ఒక హృదయం నుంచి మరొక హృదయానికి ప్రచారం అవుతుంది' అని పెద్దలన్నారు ఆమాట, విద్య పట్లకూడా వర్తిస్తుంది బోధించే బోధకుడి హృదయం నుంచే ఆయన బోధించే విజ్ఞాన దీధితులు ప్రసారం అవుతాయి. వాటివల్ల హృదయ స్పందన కలిగితేగాని శిష్యుడు పరిణామం చెందడు ఆ స్పందన కలిగించాలంటే శిష్యుడి హృదయ స్పందనలన్నింటినీ సానుభూతితో అవగాహన చేసి, మంచి చెడ్డల నేర్పాటు చేసి తీర్చి దిద్ద గలిగిన స్వచ్ఛమైన హృదయం కల గురువు ఉండాలి. అప్పుడే గురు శిష్యులలో భావసామ్యము, పరస్పర ప్రేమగౌర వాలు, సహానుభూతి సిద్ధిస్తాయి పీఠాధి పతిగాకాకుండా శిష్యులతో కలిసిపోయి వారిలో ఒకడు అయి మిత్రుడుగా సహయాత్రికుడుగా ప్రవర్తించె గురువే గురువు. అట్లాంటి గురువే మంచి విద్యాబోధకుడు. అందు చెత, నన్ను నేను ఈ రీతిగా ప్రశ్నించు కొన్నాను. "నేను ఈ విద్యార్థుల్ని నన్ను నేను ప్రేమించు కొంటున్నట్లుగా నాతో సమానంగా ప్రేమించ గలనా? నాలోపాలను నన్ను నేను క్షమించు కొన్నట్లుగా వారిలో కన్పించే లోపాలు క్షమించ గలనా? వారి సుఖ సంతోషాలలో సమా నంగా పాలు పంచు కొనగలనా? నా జీవితంలో అన్ని విషయాలలోనూ

వారిలో ఒకడుగా ఉండ గలనా"? ఈ ప్రశ్నకు సమాధానంగా "ఉండ గలను" అని అంతర్వాణి పలికింది. అందు చేతనే ఆబాధ్యతను వినమ్ర భావంతో సేవా సక్తితో స్వీకరించాను.

అప్పటికే నేను ఖద్దరు ధరించే దీక్ష వహించాను. నా జీవిత విధానం కూడా సాధ్య మైనంత నిరాడంబరంగా ఉండేది. కాని అప్పటి వరకు నా వేషంలో లాగు ధరించడం ఒక అంశంగా ఉండేది. అ లాగులు విసరి పారేసి నా కొత్త జీవితానికి తగినట్లు మారాను నాకు నావి అనేవి ఏవీ లేవు నేను కూడా మిగిలిన అందరి లాగే విద్యార్థిని. నా పరుపు దూరంగా పారేసి రెండు గొంగడీలు తీసు కొన్నాను. వాటిలో ఒకటి పరచు కోడానికి రెండోది కప్పుకొనే టందుకూ ఉపయోగించే టీ, కాఫీలు, సేవించడం మానివేశాను. ఇట్లా పైకి కనిపించే వన్నీ విసర్జించ గానే మనస్సులో రావలసిన మార్పు గురించి చేయ వలసిన కృషి ప్రారంభం అయింది.

పైకి కనిపించే విషయాలను గురించిన మార్పులు తేలికగా చేయ గలిగాను. కాని, మనస్సులో రావలసిన మార్పు కష్ట సాధ్యంగా ఉండేది. నేను చేసే ప్రతి పనీ నిశితంగా నా మనస్సులోనే పరిశీలించుకొనే వాణ్ని. ప్రధానోపాధ్యాయుడుగా ఎ విద్యార్థినైనా శిక్షించ వలసిన అవసరం ఏర్పడగానే, వెంటనే చర్య తీసుకొనే వాణ్ని కాదు; వాయిదా వేసేవాణ్ని. ఆ కుర్ర వాడు తన తప్పు తాను గ్రహించి పశ్చాత్తాప పడి, తన తప్పు తానే సరిదిద్దు కొనేటట్లు, అతనికి నచ్చ చెప్పే ప్రయత్నం చేసే వాణ్ని తరచుగా ఆ కృషిలో నాకు జయం లభించేది. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క విద్యార్థి మొండి పట్టు పట్టడం తాను ఏ తప్పూ చెయ్యలేదని వాదించడం కూడా జరిగేది. అప్పుడు నేను దెబ్బలశిక్ష అమలు చెయ్యక తప్పేది కాదు. నాజీవితంలో ఎప్పుడూ బెత్తంతో దెబ్బలుకొట్టలేదు శిక్షలు వెయ్యడంలోనేనుఅసమర్థుణ్ని. "మంచితనంరూపొందించడము శిక్షించడం వల్లా ఆజ్ఞాపించడంవల్లా సాధ్యంకాదు. మార్పు సహజంగారావాలి. బలవం

తంగా సాధించ లేము. బలప్రయోగం సహజమైన అభివృద్ధిని అరికట్టి బుద్ధి వెర్రితలలు వేసేటట్లు చేస్తుంది. మానవుడి వ్యక్తిత్వాన్ని, స్వేచ్ఛా [illegible] పెంపొందించడం సాధ్యంకాదు. దానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఆవశ్యకము, జీవము వంటివి. తన తప్పులు తాను తెలుసుకొనడమే అభివృద్ధి సాధనకు కీలకము. చేతిలో బెత్తం ధరించినట్లయితే నేను మంచి సాధకుడనూ కానూ సాధనమూ కాను" అని భావించే వాణ్ణి. ఇట్లాంటి దృక్పథంతో మెలగుతూ ఉండటం చేతనే నేను బెత్తం ఎప్పుడూ వాడనే లేదనవచ్చు ఒక సారి మాత్రం బెత్తం వాడక తప్పదని నిశ్చయించుకొని, ఎన్ని దెబ్బలు కొట్టాలో ముందుగానే నిర్ణయించి, ఆ శిక్షను అసలు వెయ్యడానికి ముందుగా అన్ని దెబ్బలు నన్ను నేను కొట్టుకొన్నాను. ఆ దెబ్బల వల్ల కలిగే బాధ స్వయంగా అనుభవించాను శిక్షవల్ల కలిగే మానసిక వైకల్యం ఊహించు కొన్నాను. తర్వాత శిక్షించ వలసిన కుర్రవాణ్ణి మూడు దెబ్బలు వేసి, మరి కొట్టడానికి మనసురాక, చేతిలో ఉన్నబెత్తం పారవేసి వాణ్ణి కౌగలించుకొని నా క్రౌర్యానికి పశ్చాత్తాపంగా నేనే వెక్కి వెక్కి ఏడ్చాను.

కాఠిన్యం చూపేటందుకు అసమర్థుడనైనందు వల్ల హృదయ పరివర్తన తెచ్చేటందుకై నేను ఆ తర్వాతి రోజుల్లో మరొక పద్ధతి చేపట్టాను. విద్యార్థులు చేసిన తప్పులకు పరిహారంగా నేను ఉపవాసం చేసే వాణ్ణి. నా ఉపవాస దీక్షను గురించి ప్రకటన, ప్రచారం ఉండేవి కావు. ఒకసారి ఒక విద్యార్థి నీతితప్పి ప్రవర్తించాడు నేను ఒకవారం రోజులు ఉపవాసం ఉన్నాను. అతనిలో నిగూఢమై ఉన్న నైతిక శక్తికి ఉద్దీపనం కలగాలనే నన్ను నేను బాధించు కున్నాను అది నాకు నిజంగా బాధ అనిపించిందా? అంటే 'లేదు' అనీ అది తపస్సు [illegible] పరోపకారి పాప పరిహారానికి ఉపయోగించే సాధనము వంటిదేనని అనిపించింది ఈ ఉపవాసం వల్ల నా హృదయం సంతోషంతో తేలికైంది.

ఎవరికైనా ఏదైనా రోగం వస్తే వారికి ఉపచారం చేసే అలవాటు చేసుకొన్నాను. విద్యార్థు లెవరికైనా అస్వస్థత కలిగితే వారిని నిద్రబుచ్చే

ఎందుకు వెన్నుతట్టుతూ రాత్రంతా గడిపేవాడ్ని. అప్పుడు జోలపాటలుగా దేశభక్తి, దైవభక్తి గేయాలు పాడేవాడ్ని. ఒక విధంగా వారికి మాతృస్థానంగానే వాడ్ని. నేను మందులు, చికిత్స గురించి కూడా కొంత తెలుసుకొన్నాను. అందువల్ల వారికి బాగా సన్నిహితుడను కాగలిగాను. నేను విద్యార్థుల్ని మనస్ఫూర్తిగా ప్రేమించాను. వారుకూడా నన్ను అట్లాగే గాఢంగా అభిమానించారు వారు ఎప్పుడైనా తాత్కాలికంగా గాని, సెలవులప్పుడు గాని వారి ఇండ్లకు వెళ్లుతున్నప్పుడు నన్ను సజల నయనాలతో వీడ్కోలంటూ త్వరగానే తిరిగి వస్తామని మాటలు చెప్పేవారు. నాకు, ఆ రోజులు జ్ఞాపకం వచ్చినప్పుడు, చిన్న వయసుల్లో ఉన్న ఆ అమాయక బాలురతో గడిపిన నిరాడంబర ప్రేమ నా జీవితంలో లభించిన అత్యున్నతమైన అవకాశమనిపిస్తుంది ఆ తర్వాత రోజుల్లో నేను వయస్సులోనూ అనుభవంలోనూ ఎదిగినప్పటికీ ఆసుఖమయ కాలం తిరిగి లభిస్తే ఎంత బాగుంటుంది? అనే చింతకలుగుతుంది. దృఢనిశ్చయము మరోరకమైన శక్తి సామర్థ్యాలు, అవసరమైన రాజకీయ కార్య నిర్వహణలలో నేను నిమగ్నుణ్ని కావలసి వస్తుందనే , ఆలోచన ఆరోజుల్లో ఎంత మాత్రమూ కలగ లేదు.

హిప్పర్గిలో కొన్ని నెలలు గడిచే సరికి హైదరాబాదు సంస్థానం అంతటినీ ఆవరించుకొని ఉన్న పరిస్థితినీ సమస్యనూ నేను ఎదుర్కొనడం సంభవించింది. నేను, నా చిన్నతనం హైదరాబాదు సంస్థానంలో గడిపాను కాని, ఆ తర్వాత చాలకాలము చదువులో బైట, అక్కడా ఇక్కడా, గడిపాను. ఆ కాలం అంతా జాతీయోద్యమాల ప్రభావం కల్పించిన వెచ్చదనం లో గడిచింది జాతీయతాభావాలే జీర్ణించుకొని ఉత్తేజితుడవుతూ ఉన్నాను. అందు చేత, స్వదేశ సంస్థానాలలో నివసిస్తున్న ప్రజలు భూస్వామ్యవ్యవస్థలో నిరంకుశ పరిపాలకుల పరిపాలనలో ఎట్లాంటి బాధలుఅనుభవిస్తున్నదీ నాకు ఎంత మాత్రమూ తెలియదు హైదరాబాదు సంస్థాన ప్రజలు అనుభవిస్తున్న కష్టనిష్టురాలలో నాకు తెలిసింది సున్న. నా బుర్రలో వాటిని గురించిన తెలివి శుద్ధ పూజ్యం; పూర్తిగా ఖాళీ.

సంస్థానంలో వేర్వేరు ప్రాంతాలనుండి వచ్చిన మా విద్యార్థు తల్లిదండ్రులు తమజీవిత పరిస్థితులు ఎంత అవమానకరంగా ఉన్నాయో చెప్పే వారు. అధికారుల వల్ల తాము పడుతున్న బాధలను గురించి వారు చెప్పుతున్నప్పుడల్లా రహస్యం చెవిలో చెప్పుకున్న ధోరణిలో భయం భయంగా గుస గుస లాడుతున్నట్లుగా చెప్పేవారు. తమ పరిపాలకుల మెప్పుకోసం వారు కుచ్చు టోపీలుకూడా ధరించె వారు. వారి సంస్కృతి, మాటలు ఉర్దూమయం. మాతృ భాషకు బదులు వారు ఉర్దూ భాషనే నేర్చు కున్నారు వారికి బహిరంగంగా ప్రార్థనలు, భజనలు, దేవుడి ఊరేగింపులు జరిపే అవకాశాలు లేవు. పండుగలు చేసుకుంటే నిషేధం. వ్యాయమశాల లేర్పాటు చేసుకోవాలంటే సర్కారు అనుమతి పొందాలి. లేకపోతే అది సాగదు. సభలు సమావేశాలు నడప కూడదు వ్యక్తులు, ప్రజా సంఘాలు స్థాపించే విద్యాసంస్థలకు ప్రోత్సాహం లభించదు. ఇన్నినిర్బంధాలూ కట్టు బాట్లూ చుట్టుముట్టి ఉన్నందు వల్ల ప్రజా జీవితం ఊపిరాడని స్థితిలో ఉన్నట్లుగా ఉక్కిరి బిక్కిరి అవుతోంది. ఈ స్థితిలో నుంచి బైట పడే టందుకు వారికి ఏమీ దారి లేదు, దారికన్పించటం లేదు కూడా.

హైదరాబాదు సంస్థానంలో ప్రజా జీవితాన్ని ముస్లిము మతావేశ పూరితమైన అధికార వర్గం అణిచిపెట్టి ఉంచింది. హిందువు అయితే సరి, అవమానానికి గురి; అనుమానితుడు. ఉన్నతాధికారాల్లో ఉన్న ధనిక వర్గపు ముస్లిములు అన్ని సదుపాయాలూ అనుభవిస్తున్నారు. కాని, పేదరికం, అజ్ఞానాల్లో మునిగి తేలుతున్న ముస్లిములు తమ మతం వారు అధికారం చెలాయిస్తున్నారనీ తాము పాలక వర్గానికి చెందిన వారమనీ భ్రమపడి మానసికంగా గర్వపడు తున్నారు. పేద తురక తాను చిరిగిన పేలికలు ధరించినా తనవారు గొప్ప వారనే దురభిమానం ప్రదర్శిస్తాడు. ఎంత అసహజము! కళ్లు పూర్తిగా తెరవని కుర్రవాడైనా హిందువుల్ని అవమానం చేసి 'థూ' అంటూ హిందూ స్త్రీలతో పొగరు మోతుతనంగా ప్రవర్తిస్తాడు పరిపాలనా యంత్రాంగంలో ఎక్కడ చూచినా ముస్లిములే. ఉన్నతాధి కారులందరూ నవాబుల చుట్టాలే. ఎంత స్థూలంగా చూసినా

సంస్థానంలో అధిక సంఖ్యాకులైన ముస్లిములు అణగ ద్రొక్కుతున్నట్లు స్పష్టమవుతుంది. ఇట్లాంటి పరిస్థితుల్లో హిందువులలో దాస్య భావం అంకురించి వృద్ధి పొందిందనడంలో ఆశ్చర్యం లేదు. 'భయం' వల్ల వారిలో సహజంగా నిగూఢమై ఉన్న ధైర్య సాహసాలు గ్రహణం పట్టిన సూర్య చంద్రుల మాదిరిగా, తెరచాటు అయాయి. ఇదీ ఆనాడు హైదరాబాదు సంస్థాన ప్రజల పరిస్థితి.

మా విద్యా సంస్థ సందర్శించేటందుకు వచ్చిన వారందరూ ఎన్నెన్నో విషాద గాథలు చెప్పేవారు మాతో ఉన్నప్పుడు కొంత ఊరడింపు పొందేవారు. మా సంస్థ వైపు ఆశా పూరిత నయనాలతో చూసేవారు. ఏదో కాంతి చూసినట్లూ ఉత్తేజం పొంది నట్లూ కన్పించే వారు. దేశం అంతటా వ్యాపిస్తున్న ఈ నవచైతన్యాన్ని తమ పుత్రులు పొందాలని, [illegible]. తమ తరవాతి [illegible] తమ రీతిగా అవమాన భారంతో క్షీణించ కూడదనీ తమకు లేని అదృష్టం వారికి రావాలనీ వాంఛించేవారు తాము నిస్సహాయులు తమ బిడ్డలు అట్లా కాకూడదు! ఇదే వారి కోరిక.

మా విద్యా సంస్థ చిన్న[illegible] అయినప్పటికీ, దానికి, ఇనుప పాదాల క్రింద అణగ ద్రొక్కబడి ఉన్న ప్రజల విముక్తి కోసం కృషి చేసే స్వచ్ఛంద సేవకులను తీర్చిదిద్దే అదృష్టం లభించింది మా సంస్థ దర్శించేటందుకు వచ్చిన వారందరూ తాము పడుతున్న కష్టాలు వివరించేవారే కాని, వాటిని ఎదిరించి నిలబడి పోరాడాలంటే మాత్రం తమ సంసిద్ధతను వెల్లడించే వారెవరూ కనిపించ లేదు. అందుచేత ఏమీ చడీ చప్పుడూ చేయకుండా మేము మా కార్యక్రమం సాగిస్తూ స్వార్థరహితులూ, త్యాగమూర్తులూ తమ సర్వస్వాన్నీ పణంగా పెట్టి సంస్థాన ప్రజల్ని నిరంకుశ ప్రభుత్వాన్నుంచి విముక్తి చేసే కృషికి అంకితమైన దళాధిపతుల్ని తయారు చెయ్యవలసిన అవసరం కలిగింది.

మేము విద్యార్థులకు, బోధకులకు శిక్షణ ఇచ్చాము. వారందరికీ కూడా దేశభక్తే ఊపిరి. ప్రజా సేవే ఆశయము ఇది మేము వారికి

మాటల ద్వారా మాత్రమే చెప్పలేదు. కార్యక్రమాల ద్వారా అలవాటు చేశాము. వారు ప్రతిరోజూ గ్రామాల్లో రాత్రి పాఠశాలలు నడిపేవారు ఇతర గ్రామాభివృద్ధి కార్యక్రమాలు నిర్వహించేవారు. ప్రతిరోజూ సాయంకాలం మేము వారికి ప్రఖ్యాత రచయితల రచనలలో నుంచీ, జాతీయ నాయకుల జీవితాలను గురించీ వివిధ స్వాతంత్ర్యోద్యమ ఘట్టాలను గురించి, చదివి వినిపించే వాళ్ళము జానపద గేయాలు, జంగం కథలు, బుర్రకథలు, కాలక్షేపాలూ ఏర్పాటు చేసే వాళ్లము. ఈ సాంస్కృతిక కార్యక్రమాల్లో మైథిలీశరణ్ ఉపదేశాలు విరివిగా చెప్పించే వాళ్ళము. మా సంభాషణల్లో "మీరు చిన్న వాళ్లము అల్పులము అనుకోకండి. మీకంటె చిన్న వాళ్ళను, అణగద్రొక్కబడిన వాళ్ళను ఉద్ధరించేటందుకు జీవించండి అవసరమైతే త్యాగం చెయ్యండి అంతే కాని ఆ అల్పుల్లో కలిసిపోయి నశించి పోకండి' అని తరచు ముక్తాయింపు మాటలుగా చెప్పేవాళ్ళము. వారు లందరూ కలిసి బృందగాన రూపంలోను విడిగాను, కూడా ఉత్సాహావేశాలతో పాటలు పాడేవారు. ఈ రీతిగా వారికి మానసికంగా ఆధ్యాత్మికంగా శిక్షణ ఇచ్చి ప్రజలనూ, వారినీ, కూడా నూతన శకోదయానికి కృషిచేసే సైనికులుగా, దళాధిపతులుగా తీర్చిదిద్దడం జరిగింది

మా విద్యాసంస్థ, యథార్థంగా చూస్తే ఒక పారిశ్రామిక కర్మాగారం, అంటే ఫ్యాక్టరీ వంటిది అందులో తయారవుతున్నది అగ్ని పర్వతాల వలె చైతన్య వంతులైన యువ విప్లవ వీరులు. ప్రభుత్వం మా ప్రయోగం తమకు ప్రమాదకరమైందని త్వరగానే గుర్తించింది. అందుచేత మా చుట్టూ వల లాగా చారుల వ్యూహాన్ని ఏర్పాటు చేసింది

మేమందరమూ సనాతన కాంగ్రెసు మనుషులం సహాయ నిరాకరణ ఉద్యమంలో ప్రాదుర్భవించిన జాతీయభావాన్ని జీర్ణించుకొన్నవాళ్లం, ప్రతి నెలలోనూ ఆఖరి ఆదివారంనాడు మేము కాంగ్రెసు

పతాకానికి వందనం చేసేవాళ్ళం. ఆ రోజుల్లో అది ఉత్తమ సంప్ర
దాయంగా, నియమంగా పాటించబడేది. బహుశా హైదరాబాదు సంస్థానం
మొత్తంమీద కాంగ్రెసు జెండాను ప్రతిష్ఠించిన చోట్లలో అదే మొదటిదని
నా నమ్మకము. మా పతాక వందన కార్యక్రమాన్ని గురించిన వార్తలు
అధికారులకు వారి చారులు, పంపించినట్లున్నారు. వెంటనే ఆ అధికారులు
మమ్మల్ని ప్రమాదకరమైన మనుష్యులుగా పరిగణించారు. దీని ఫలి
తంగా ఆ గ్రామంలో మా కార్యక్రమాలను అనుక్షణమూ ఒక కంట
కనిపెట్టుతూ ఉండేటందుకు పెర్మనెంటుగా పోలీసుదళాన్ని నియమిం
చడం జరిగింది. మా సంస్థను సందర్శించే ప్రతివారూ తామెవరో ఏ పని
మీద వచ్చారో అక్కడ ఉన్న పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరుకు గాని, అతని
సహాయకుడికి గాని నివేదించుకోవాలి. మేము ఈ ఎత్తుగడలకు జంక
లేదు. వాటిని గుర్తించినట్లుకూడా ప్రవర్తించ లేదు. వాటిని, వాటి ఫలి
తాలను లెక్క చెయ్యకుండా మా కార్యక్రమాన్ని మేము మామూలుగా
కొనసాగించాము.

ఆ గ్రామ వాతావరణమంతా సేవాభావంతో పులకరించింది. మా
ఉపాధ్యాయులు అందరూ ఇతరులకు ఆదర్శ పురుషులయ్యారు. సొంతం
అనదగినదేదీ వారి దగ్గర లేదు. స్వంత ఆస్తి, వస్తువులు అనదగిన వాటి
నన్నింటినీ మేము ఎప్పుడో విసర్జించి వేసాము. బోధనలలో కంటె ఆచర
ణలో వ్యక్తం అయిన ఈ అనాసక్త సూత్రము ఇతరుల్ని ఎక్కువ
ప్రభావితం చేసింది. మేము ప్రతి క్షణమూ ఆధ్యాత్మికంగా ముందడుగు
వేయసాగాము. మాతోపాటు విద్యార్థులు కూడా ఎదిగారు. మేమందరమూ
సేవా, త్యాగధార్మిక గుణాలు పెంపొందించు కొంటున్న సహధర్మ
చరులు (కామ్రేడ్స్)గా రూపొందాము.

ఇట్లా ఆరు సంవత్సరాలు తీవ్రంగా అవిరామంగా పని చేసిన
తర్వాత మా మిత్రబృందము తగినంత పరిమితికి విస్తరించిందనీ,
ఏదైనా ఒక కఠిన పరీక్షకు గురి అయ్యేటందుకు అవసరమైన సామర్థ్యము
సంపాదించిందనీ మాకు విశ్వాసం కలిగింది. అయితే, ఆ కార్యక్రమానికి
తగిన పథకాన్ని ఎట్లా ఆలోచించి, రూపొందించినదీ వివరించడానికి
ముందుగా నాలో పూర్తిగా విప్లవాత్మకమైన మార్పు తెచ్చిన మరొక
దశపరిణామాన్ని గురించి తెలియజేయాలని అనుకుంటున్నాను.

# 11. సన్యాసాశ్రమానికి అభిముఖంగా

విద్యార్థులతో సాంగత్యము స్వచ్ఛమైంది, నిష్కల్మషమైంది. అది నా ఆత్మజ్ఞానాభివృద్ధికి దోహదమైంది. వారికోసం చేసిన కృషివల్ల నాకు భగవంతుణ్ని సేవించినంత తృప్తి కలిగేది. అంతకంటె దైవత్వం ఏముంటుంది? భగవంతుడు విశుద్ధుడంటారు కదా! నిష్కల్మష మనస్కులైన ఈ పసిపిల్లల రూపంలో ఆయన ఇక్కడ నాకు ప్రత్యక్ష మవుతున్నాడు. అని నాకు నేనే చెప్పుకొనే వాణ్ని. భగవంతుడు ప్రేమ స్వరూపుడు. నేను అనుక్షణం ఆయన ప్రేమామృతాన్ని చవిచూస్తున్నాను. ఈ రీతిగా అస్పష్టంగా నాకు తెలియ కుండానే నాలో ఆధ్యాత్మిక చింతన అభివృద్ధి కావడం జరిగింది. విద్యాలయ వాతావరణం అంతా స్వచ్ఛమై దైవీ సంబంధ మైనట్లు కనిపించేది. ఆ నిశ్శబ్ద గ్రామీణ పరిసరాలు నాలోని ఆధ్యాత్మిక తరంగాలను మరింత తరంగితము చేశాయి. చీకటి రాత్రులలో నేను ఏకాంత పారవశ్యం పొందే వాణ్ని. నాలో ఏదో అంకురిస్తోంది. అది కూడా అతిశీఘ్రంగా, మనంతో విస్తరిస్తోంది. నాలోనికి నేనే ఆత్మానుసంధానం చేస్తూ గంటలు అవిదిత యాములు గడిపే వాణ్ని. ఎంత పని చేసినా నాకు శ్రమ అనిపించేది కాదు. అంత మధుర భావన. అంతా సేవ. అంతా దైవ నిర్ణయ పాలన.

ప్రతి రోజూ ఆ నాటి కార్యక్రమం పూర్తి అయిన తర్వాత నేను సమీపంగా ఉన్న ఏటి దగ్గరకు వెళ్లేవాణ్ని. నీటి ప్రవాహపు గుసగుసల, గలగలల సవ్వడి ఆలకిస్తూనో, దగ్గరే ఉన్న మామిడి తోటలో చెట్లపైన నివసించే పక్షుల కలకలారావం వింటూనో కాలం గడిపే వాణ్ని. నేను క్రమ క్రమంగా మరింత లోతుగా ఆత్మాన్వేషణ సాగించే వాణ్ని.

నా హృదయ గ్రంథ గ్రంధి విడిపోవడం ప్రారంభ మైంది. ఒకపుట తర్వాత మరోపుట విప్పి చదువుతూ ఆత్మ జ్ఞానం పెంపొందించుకో సాగాను.

"నాకు ఎవరి మీదా ద్వేషమూ అసూయా లేవు.

నన్ను ఎవ్వరూ ద్వేషించే వారూ, అసూయ పడే వారూ లేరు" అన్న ఆంగ్ల కవి సూక్తి నానోటి నుంచి వెలువడేది. 'సర్వం ఖల్విధం బ్రహ్మ' అన్న భావం నాకు అన్న భావం గోచర మయేది ఆస్థితిలో ఉండగా ఏదైనా ఒక పక్షి కుహు కుహూ రావం వినపడగానే 'అన్ని ఒంధాలూ తెంచుకో' అని అది ప్రబోధించినట్లై వెంటనే ఒక్క నేనే అంతా వ్యాపించినట్లు అనిపించేది మరుక్షణం నీవునిజంగా ఆత్మ సాక్షాత్కారం కోసం తపిస్తున్నావా?" అని నన్ను నా అంతరాత్మ ప్రశ్నిస్తున్నట్లూ నేను తడబడి, ధైర్యం తెచ్చుకొని "ఆ, అవును" అని, జవాబు చెప్పినట్లూ అనుభవం కలిగేది ఒక్కొక్కప్పుడు మీరాబాయికి కలిగిన భక్త్యావేశము, మాధవ సందర్శనంతో తన చేతివేలు కాలినా తెలియని గోపిక పారవశ్యమూ నాకు కూడా కలిగినట్లు భ్రమించే వాడ్ని. సూరదాసుతో పాటు భక్త్యావేశంతో నేను కూడా రోదించాను రామకృష్ణపరమహంసతో పాటు సమాధి స్థికి పొందాను. వివేకా నందుని భావ తీవ్రత నా మనస్సును పరి శుద్ధ మొనర్చింది. ఒక్కొక్కప్పుడు బైరాగిలాగా ఒళ్లంత బూడిద పూసుకొని ధుని (నెగడి) వెలిగించి, నా వ్యక్తిత్వాన్ని,కాల్చి బూడిద చేసినట్లూ, నాలోని మలినాలన్ని భస్మమయినట్లు అను కొనే వాణ్ని. మొత్తంమీద ఆ రోజులన్నీ తీవ్ర ఆధ్యాత్మిక సాధనలో ఒకదశ

కొందరి స్నేహితులతో లభించిన సత్సంగము నాకు మంచి అనుభవం ఇచ్చేది. నా అదృష్టవశాత్తూ అక్కడ ఒక భక్త బృందం "మానవ సేవే మాధవ సేవ" అనే లక్ష్యంతో ఏర్పడటం జరిగింది. మానవ సేవ ద్వారా ఆత్మజ్ఞానం పొందగలం అనే విశ్వాసంతో వారు కృషి చేస్తున్నారు. నేనుకూడా వారితో చేరనా? వారు నన్ను తమతో

చేర్చుకుంటారా? వారితో, అంటే ఒక సంఘంతో, చేరడం అవసరమా? ఆత్మజ్ఞాన సాధనకు గుంపుగా చేరడం అవసరమా? ఒక్కొక్కప్పుడు ఏకాంత సాధనే ఉత్తమ మనే భావం కలిగేది "జీవిత పథంలో చివరిదశ ఒంటరిగానే సాగాలి. ఆ దారిచివర జంటగా గుంపుగా నడవడానికి అవకాశం లేదు అంటూ ఆచార్య డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ తత్త్వవేత్త నిగ్గు తేల్చిచెప్పారు ఆయనసలహా ఎందుకు అనుసరించ కూడదు? కాని సత్సంగము, భగవత్పాదార్చకుల తోడి నెయ్యము, కూడ ఉత్తేజ కరమైనవే. కొన్ని నెలల పాటు ఒక కుటీరములోనే జరిగిన సత్సంగములో ఏమి జరిగెదో కూడా నాకు తెలియదు. నాకు ఆ కుటీరములోకి ప్రవేశం లేదు. బహుశా నేను వారితో కలిసి ఉండే స్థాయికి చేరలేదే మో. కాని, ఆ సంఘంలోని వారు అమూల్యమైన ఆధ్యాత్మికానుభవం పొందినట్లు మాత్రం విన్నాను.

కొంత కాలం పాటు నేను ఆధ్యాత్మిక పథంలో ఒంటరిగానే నా దారిని నేను నడిచాను. అదృష్టవశాత్తు వారునన్ను ఒక రాత్రి ఒక్కడినే ఆహ్వానించారు. నాకుఎంతో సంతోషం కలిగింది "భగవత్సాక్షాత్కారం కోసం నీవు సర్వసంగ పరిత్యాగం చేయడానికి సంసిద్ధంగా ఉన్నావా ?" అనివారు అడిగారు వెంటనే నన్నెదో ముందుకు తోసినట్లై "ఆ,ఉన్నాను" అని జవాబు చెప్పాను. వెంటనే వారు "అయితే భిక్షాశనుడవై జీవితం గడపాలి." అని చెప్పారు నేను సరే అని ... సంక్రాంతినాడు నా సన్న్యాస స్వీకారానికి నిర్ణయ మైంది నాటి నుంచి, భిక్షాశనుడవై పూర్తిగా సన్న్యాసి జీవితం గడిపేటందుకు తయారుచు కావాలి.

ఆ నాటి నుంచి నేను సన్న్యాస పథాన్ని అనుసరించే ధోరణిలో పడ్డాను వివేకానందుని రచనలు చదివాను ఆయన నా కళ్లలో మెలిగి పోయాడు ఆయన నుంచి ప్రకాశ వంతమైన కాంతి ... నాలో నుంచి దూసుకొని పోతున్నట్లు అని పించెది ... వసవ దారి అయిన స్వామి రామతీర్థ సందర్శనం కలిగేది ఆయన నా

హృదయంలో ప్రతిష్ఠించుకొన్నాను. భారత దేశపు అర్ధ దిగంబర సన్న్యాసి అని పేరు పొందిన మహాత్మా గాంధీ జ్ఞాపకం వచ్చి ఉత్తేజం పొందేవాడ్ని. సర్వవస్తు పరిత్యాగానికి నా మనస్సు పరిపక్వం అయ్యే భావనలు చేసే వాణ్ని.

పనిలో ఉన్నప్పుడూ, కొన్ని క్షణాలు విరామం లభించినప్పుడూ కూడా

"ఎవరు ఈ నశించే వస్తువుల్ని సేకరించుకుంటారు ?
ఎందుకు భవనాల్లో నివసించాలి, కుటీరవాసం అంతకంటె
మంచిదైనప్పుడు ?
చింకి పాతలు, బొంతలు కట్టుకొనేటందుకు,
కప్పుకొనేటందుకు చాలు.
భగవంతుడు ప్రసాదించింది, యథాలబ్ధమైంది భుజిస్తాను.
అమృత స్థితి పొందినవాడే భిక్షాపాత్రలో పడిన భిక్షాశనంతో
తృప్తి పడతాడు
అమర ప్రేమ తరంగాలపై తు"

అనే అర్థం వచ్చే ఈ క్రింది మరాఠీ కీర్తనను నాకు అన్వయించుకొంటూ పాడుకొనే వాణ్ని. అదే ఎప్పుడూ నా పెదవుల మీద నాట్యంచేస్తూ ఉండేది.

అశాశ్వత సంగ్రహ కోణాకరీ ?
చిరగుట చింధ్యా జోడుని కంథాగో ఘడే
హే చిబరీ :
కోణాకరీ ఘరసాపే మార్ఘ్యా, ఝోపడే హే బిబరీ :
నిత్యనవేం జేందే ఇల మాధవ, భక్తాంతే బిబరీ ;
అమృతపణే మజ భిక్షా దోహళే, యేతి ఆశా
లహరీ :

నాకు ఉన్నవన్నీ వదలుకోవాలి. అయినా నాకు 'నాది' అని చెప్పతగినదేదీ లేదు. చాలాకాలం నుంచీ నాకు చిరుగులు పట్టిన ఒక కోటు తప్ప ఏదీ లేదు. అదొక్కటే నేను మీద వేసుకునేవాణ్ని. ఒక విద్యార్థి నాకు ఒక గొంగడి ఇచ్చాడు. ఆ మకర సంక్రాంతి నాడు జనవరి 14, 1930 నాడు మా పాఠశాల జమాఖర్చు పుస్తకంలో నాపేర నిలవ ఉన్న సొమ్ము పేద విద్యార్థుల సహాయనిధి ఖాతాకు మార్పిడి చేయించాను. ఇంక నాది అనేది ఏదీ మిగలలేదు "శూన్యస్థితి" సిద్ధించింది నా ఖాతాలో ఏమీ మిగలలేదు. "మాఝీ శిల్లక శూన్య ఆహే" అని నా పూర్వ విద్యార్థి స్నేహితుల్లో ఒకరికి నా ఆనందం తెలియజేస్తూ జాబు వ్రాశాను.

ఆ శుభదినం నాడు ఉదయం 3 గంటలకు లేచి, ధ్యానం చేసుకొన్నాను తిరిగి నన్ను నేను మరోసారి, నేను స్వీకరించ బోతున్న నూతన జీవిత విధానం పట్ల నాకు అవ్యాజమైన ఉత్సాహం ఉందా ? అని ప్రశ్నించుకొన్నాను మిత్రులందరమూ 7 గంటలకు కలిశాము. అందరమూ కలిసి సంకీర్తనం చేశాము. వారిలో ఒకరు నా చిరిగిన కోటు తీసుకొని పారవేసి ఒక ఖద్దరు శాలువా కప్పారు. అందరమూ కలిసి ఏకకంఠంతో అమృతాధికరణ గేయం పాడాము. నేను భిక్షపాత్ర చేతబూని నాతోడి సోదరులందరూ వెంటనంటి వస్తుండగా గ్రామంలోని కొన్ని ఇండ్లకు భిక్షార్థినై నడిచాను, ఆధ్యాత్మికంగా మరో మెట్టు ఎక్కినట్లైంది. ఈ రీతిగా కొన్ని సంవత్సరాలు గడిచింది. ఆధ్యాత్మికంగా నేను మరి కొంత ఎదిగాను

హిప్పర్గి లోని ఆధ్యాత్మిక వాతావరణము, నా సాధనకు ఎంతో అనుకూలమైంది అంతకుముందు అనుభవంలో లేనిదేదో క్రమ క్రమంగా నాకు అనుభూతమయ్యేది. పొద్దున్నే బోధన కార్యక్రమం పూర్తి కాగానే నేను జోలి కట్టుకొని భిక్షాశనం కోసం గ్రామ సంచారం చేసేవాణ్ని. తర్వాత దేవాలయం దగ్గర ఉన్న తటాకపుటొడ్డున కూర్చుండి అక్కడ

మరెవరైనా ఉంటే వారితో పంచుకొని భుజించేవాడ్ని. అది పూర్తి కాగానే నేను తిరిగి నా పనిలో పడేవాడ్ని భక్తి గేయాలు పాడుకొనే వాడ్ని ధ్యానం చేసేవాడ్ని. గాఢంగా ఆత్మ పరిశీలన కావించుకొనే వాడ్ని. నాకు యోగం, ప్రాణాయామం అనేవి ఏమీ తెలియవు. నిజం చెప్పాలంటే అవి నాకు ఇప్పుడూ తెలియవు నేను వేదాంత గ్రంథాలు చదివే శ్రమ పడినవాడ్ని కాదు. నేను చదివిన పుస్తకాలన్నింటిలోనూ పేర్కొన తగినది 'భగవద్గీత' ఒక్కటే. ఉపనిషత్తులు 1941 లో నిజామాబాద్ జైలులో ఉన్నప్పుడే చదివాను. నేను నేర్చుకొన్న వేదాంత పాఠాలన్ని నిశ్చలంగా ప్రవహిస్తున్న నీటినుంచీ, కలకలారావం చేసిన పక్షులనుండీ సంపూర్ణ ఏకాంతాన్ని మౌన నిశ్శబ్దాన్ని ప్రసాదించిన చీకటి రాత్రులనుండీ గ్రహించినవే ప్రకృతి మాతే నాకు, ఇతరులందరికంటె మిన్నగా, గురుత్వం వహించి దారి చూపింది.

ఆ రోజుల్లోనే కొందరు సాధువులు అక్కడకు వచ్చారు. వారేమీ పెద్ద పేరున్నవారు కారు. అంతేకాకుండా వారెవరూ ఇప్పుడు సశరీరులు కారు. వారిలో ఒక సన్యాసిమాత్రం నామనోఫలకం మీద చెరగని ముద్ర వేసాడు. ఆయన తన పేరును ఎప్పుడూ చెప్పనేలేదు. "ఈ శరీరపు పేరులో ఏముంది? అంతా పరమాత్మస్వరూపమే" అంటూ ఎప్పుడు అడిగినా ఆ ఒకేమాటే చెప్పేవాడు. ఆయన అప్పుడు సుమారు 75ఏండ్ల వయసువాడు. కానీ బాల్యంలోనే సన్యాసం స్వీకరించినవాడు. ఆయన ఏవాహనాల్లోనూ ప్రయాణాలు చేసేవాడుకాడు. పాదచారిగానే ప్రయాణం సాగిస్తాడు. ఆయన ఒక కుటీరంలో ఉండేవాడు. ఆరుబైట ప్రకృతి మాత ఒడిలో శీతవాతాతపాలలో కాలంగడిపేవాడు. ఆయన అతి తక్కువగా మాట్లాడేవాడు. అయినప్పటికీ ఆయన నన్నుఎంతో అభిమానించాడు. ఆయన సాహచర్యంలో ఎక్కువ కాలం మౌనంలోనే గడిచినప్పటికీ, సూటిగా నా అంతరంగంలోకి ఆయన ఏదోశక్తిపాతం చేస్తున్నట్లు అనుభవంకలిగేది. అదేదో ఏమిటో విశ్లేషణ చేసి తెలుసుకోలేకపోయాను, ఆ పనిచెయ్యాలనే ఆలోచనకూడా ఆ సమయంలో నాకు కలగలేదు ఆయన

సత్సాంగత్యము లభించే అదృష్టం కలిగినందుకు నాకు ఎంతో సంతోషం కలిగింది. ఆయన వెళ్ళిపోతూ తన కఫాని (Kafani) నాకు ప్రసాదించారు. అది ఆ తర్వాతి కాలంలో నా అభివృద్ధికి తోడ్పడింది. కాని అది ఇప్పుడు నా దగ్గర లేదు. కాలవశం వల్ల జీర్ణించి పోయింది.

మరొక సాధువు (గోసాయి) నన్ను ప్రతి సంక్రాంతి నాడూ వచ్చి చూసేవాడు ఆయన పేరు 'బాల్యా'. ఆయన నిరక్షరాస్యుడు. ఎక్కడా నిలకడగా ఉండని అవధూత. కాని, ఆయన ఎన్నో పద్యాలు చెప్పాడు. అవి అన్నీ ఆయన ఆత్మానుభూతినుంచి పైకి ఉబికినవే. ఆయనకు ఉబ్బసవ్యాధి వల్ల పీడ కలిగేది అది వచ్చినప్పుడు ఎప్పుడూ ఊపిరి అందక ప్రాణం పోతుందో ఎవరూ చెప్పలేరు అయినప్పటికీ, ఆయన ఎక్కడో ఒకచోట ఆశ్రమ నివాసం ఏర్పాటు చేసుకోలేదు. ఆయన తాను ఈ జీవితంలో అనుభవాలు పొందుతున్నట్లూ అవి, తనకు పెద్దజన్మ అంటూ ఉండే, ప్రజాసేవకు ఉపయోగించడమే తన ఆశయమనీ చెప్పేవాడు. ఉత్తర జన్మ కలిగే అదృష్టం పట్టినట్లయితే ఆ జన్మలో హిప్పర్గిలో విద్యాసంస్థ వంటిది స్థాపించి నిర్వహించాలని ఉందని అనేవాడు. ఇప్పటి జీవితము, సాధన అంతా దానికి పూర్వరంగం వంటి అధ్యయనమని అనే వాడు. ఆయనకు నా పట్ల ఉన్న ప్రేమాభిమానాలు సాటి లేనివి ఆయన నాకు ఒక దండాన్ని ప్రసాదించాడు. దాన్ని ఆయన పట్ల నాకున్న గౌరవ చిహ్నంగా పూజించాను

ఈ సందర్భంలో ఆధ్యాత్మిక సాధనలో గురువు పాత్రను గురించి కొంత చెప్పవలసి ఉంది స్వభావ సిద్ధంగా నేను, గురువు అనుగ్రహం కేవలం ఆధ్యాత్మిక సాధనలో పురోగతికి నిమిత్తమాత్రమనే విశ్వాసం ఉన్న వాణ్ని. సరియైన గురువు తటస్థిస్తే ఆయనే అనన్య సాధ్యమైన తీరులో శిష్యుడికి ఉత్సాహం కలిగించి తోడ్పడతాడు. కాని, ఆయన శిష్యుడ్ని తన దాసానుదాసుడిగా చేసుకొనే ప్రమాదం ఉంది. గురువు దారి చూపించే మార్గదర్శి మాత్రమే అని దానిని అనుసరించి శిష్యుడు తానే నడవ వలసి ఉంటుందనీ స్పష్టంగా తెలుసు కొనడం అవసరము.

గురువు ప్రయోజనము తాత్కాలికము చివరికి ప్రతి సాధకుడూ తనకు తానె గురుత్వము వహించ వలసి వస్తుంది. శిష్యుడి భావనలో శాశ్వతమైన గురు పీఠము అనేదే ఉండ కూడదు. అది అట్లాతిష్ఠ వేసుకొని ఉండటమే కనక జరిగితే, మానవ సహజ మైన ఇతర విధాలైన పరిమితులకు లోబడి ప్రవర్తిస్తూ శిష్యుడి అభివృద్ధిని పరిమితం చెస్తుంది. గురువు భౌతికంగా మానవ రూపంలోనే ఉండ నక్కర లేదు సాధకుడు చైతన్యంతో లోపలికిన లాడతో ఉంటే ఆగురుత్వం అతనికి ఏదో ఒక రూపంలో లభిస్తుంది. ఆది ప్రకృతిలో ఉన్నది ఏదైనా కావచ్చు. లేదా అంతర్యామే కావచ్చు. అట్టిదే తటస్థిస్తే మార్గదర్శకత్వం అడుగు తీసి మరొక అడుగు వేసే టప్పుడు ప్రతి సందర్భంలోనూ, లభిస్తూనే ఉంటుంది. ఒక సందర్భంలో నేను గురువుగ ఆయన లొటుపాట్లను పట్టించు కోనకుండా, భక్తితో ఆశ్రయించి ఉండటమా, లేక మరొక దారి అనుసరించటమా అనే ద్వైదీ భావంలో పడ్డాను. నా మనస్సులో సంప్రదాయ సిద్ధంగా ఉన్న ఆదర్శ ప్రాయుడైన గురువుతో పోల్చిచూస్తే నాకు ఎదురు పడి లభించిన గురువు పూర్తిగా మరో తరహా వాడు. అందు నేత నేను దారి తెలియని అగమ్య స్థితిలో పడ్డానని అను కొన్నాను కాలానుగుణంగా మార్పు చెందిన ఈ గురువునే నా అంతరాత్మ నిర్దేశాన్ని అతిక్రమించి వదలకుండా పట్టుకొని ఉండేదా? అది ఆధ్యాత్మిక వ్యభిచారం అవదా? అని కొట్టు మిట్టాడాను. కొన్ని నెలలు ఆ మనోవేదనలో గడిపాను. ఆ ఆలోచన లతో బుర్రవేడెక్కి చిన్న వయస్సులోనే తల వంకీ జుట్టు తెల్ల బడింది. నేను ఆనందాశ్రమ నివాసియైన స్వామి రామదాసుని నా సందేహ నివృత్తి చెయ్య వలసిందని అర్థించాను. ఆయన గురువులకు గురువైన అంతర్యామి మన హృదయాంతర వర్తియై నిరంతర సన్నిహితుడై ఉన్నాడనీ ఆయన ఉపదేశించిన రీతిగా నడచు కోవడమే తగిన పని అని బైటనున్న గురువుల మీద ఆధార పడవలసిన పని లేదనీ తెలిపారు నాటి నుండి నేను మరే ఆధ్యాత్మిక సాధకులనూ ఆశ్రయించ లేదు. సిద్ధులు, సాధువులు అందరికీ అంజలి ఘటించి నేను నా అంతరాత్మ నుంచే ఉత్తేజం పొంది

ముందుకు సాగి నడిచాను. అందువల్ల నా ఆధ్యాత్మిక సాధనలో నాకు నిరాశ, నిస్పృహ, ఒడుదుడుకులు అనేవి కలగ లేదు, స్వామి రామకృష్ణ పరమహంస ప్రవచించిన ఈ క్రింది వాక్యాలు ఎంతో అర్థవంతము లనిపిస్తుంది. "ఎవరినైనా సాధువు అని కీర్తించ దలచుకొంటే ఆపని ఆయన అవతారం చాలించిన తర్వాత చెయ్యాలి". "ఆత్మానుసంధానానికి స్వేచ్ఛ అవసరము గనుక నిర్ణయించె కట్టుబాట్లు, రూపంలోని బంధాలు శిష్యుడికి ఎన్నడూ ప్రతిబంధకాలు కాకూడదు"

మన దేశంలో అనేక ప్రాంతాలలో గురు పీఠాల నధిష్టించి ఆడంబరంగా, జనాన్ని ఆకర్షిస్తూ గడుపు తున్న వారిని చూస్తే నా హృదయం ఆక్రోశిస్తుంది. మతం ఇంత అధోగతికి దిగజారిందా? ఆధ్యాత్మిక చింతన, సాధన, వ్యాపారంగా మార్చ వలసిన అవసరం ఏర్పడిందా? కుళ్లి కంపు కొడుతున్న ఈ పరిస్థితిని ఎవరు ఆపగలరు? లెక్కకు మించి ప్రచారం పొందుతున్న ఈ ఆధ్యాత్మిక కిరీట ధారులు, వేలు, లక్షల సంఖ్యల్లో తమ దగ్గరకు మూఢవిశ్వాసంతో అమాయక భక్తితో వచ్చిన ప్రజలను ముంచి వేస్తున్నారే. ఈ గురువులు ఐశ్వర్యవంతులవుతారు. భక్తులకు తాము బ్రతికినంత కాలము వారిని కుక్కల వలె ఆశ్రయించడమే గతి అవుతోంది. కొందరు వ్యభిచారాన్నీ, తార్పుడునీ, కానుకలు సేకరించడాన్నీ గురు సంప్రదాయపు ముసుగు చాటున కొనసాగిస్తున్నారు ఇటువంటి పరాశ్రయ జీవుల్ని భారత దేశం ఎంత త్వరగా వదల గొట్టుకొన గలిగితే నిసలైన సాధకుల సాధనకు అంత ఎక్కువ అనుకూల్యము లభిస్తుంది.

మా ఆధ్యాత్మిక సాధకుల భక్త బృందము భారతీయ ఆర్షకవి స్వామి రామతీర్థ ఉపదేశాల నుండి ఉత్తేజం పొందింది. మా బృందం అధ్యక్షుడు తాను స్వామీజీని సశరీరుడుగా వున్నప్పుడు సందర్శించడం ఎప్పుడూ సంభవించ లేదని అయినప్పటికీ తాను స్వామి రామతీర్థ అంతరంగిక భక్తుణ్ణని చెప్పుకొనే వారు

ఆ తర్వాత కాలయాపన చెయ్యకుండా నేను నాలుగు సంపుటాలలో ఉన్న స్వామి రామతీర్థ ఉపన్యాసాల్ని

ఉపదేశాల్నీ-'ఆత్మా సాక్షాత్కార అరణ్యకాలు' అనే రూపంలో ఉన్న వాటిని శ్రద్ధగా చదివాను. ఆ మహా తత్త్వ వేత్తతో అప్పటికే నాకు కొంత అనుబంధం ఏర్పడింది హిప్పర్గిలో అంతకు ముందేర్పడిన ఆ అనుబంధం మరింత దృఢ పడింది. ఇవన్నీ కలిసి నేను సన్యాసాశ్రమ స్వీకారదీక్షను స్వామి రామతీర్థతో ప్రత్యక్ష సంబంధం కలవారి వద్ద పొందాలనే కోరికకు కారణాలైనాయి. స్వామి రచనలు చదివినప్పుడు వారి ముఖ్య శిష్యులైన స్వామి నారాయణ్ ఇంకా జీవించి ఉండవచ్చుననే విషయం జాడ రీతిగా తెలిసింది కాని, వారున్నచోటు కచ్చితంగా తెలియక పోవడం చేత లక్నోలో ఉన్న స్వామి రామతీర్థ ప్రచురణల సంస్థ వారికి స్వామి నారాయణ్ చిరునామా తెలియ జేయ వలసిందని జాబు వ్రాసాను. ఆ జాబు నారాయణ స్వామీజీయే స్వయంగా అందు కొనడం జరిగింది. వారు వెంటనే ఎప్పుడైనా సరే లక్నో వచ్చి తమర్ని కలుసుకో వచ్చు నని వ్రాశారు వెంటనే నేను లక్నో వెళ్లి పూర్తిగా పది రోజుల పాటు వారి పాద సన్నిధిని గడిపాను. సెలవు గైకొని తిరిగి వచ్చేముందు నేను అర్హుడనని తమరు భావిస్తే నాకు సన్యాస దీక్ష ఇవ్వవలసిందనీ కోరాను వారు ఒక వారం రోజుల తర్వాత తనను హరిద్వార్‌లో కలుసు కోన వలసిందని సూచించారు. ఈ నడుమ నున్న కాల వ్యవధిలో నన్ను కాశీ, అయోధ్య, ప్రయాగ, ఋషీకేశకు అవలఉన్న, స్వామి రామ తీర్థకు ఆత్మసాక్షాత్కారం సిద్ధించిన బ్రహ్మపురి క్షేత్రాన్ని సందర్శించు కోవలసిందని సలహా ఇచ్చారు ఆ క్షేత్రాలన్నీ సందర్శించి నేను హరిద్వార్‌లో స్వామి నారాయణ్‌ల ఆగమనం కోసం నిరీక్షించాను. ఆయన నన్ను కాంచిన వెంటనే నాకు సన్యాసాశ్రమ దీక్ష ఇస్తానన్నారు. నాకు మిన్ను ముట్టినంత సంతోషం కలిగింది. మరి కొంత మట్లాడిన తర్వాత ఆయన హిప్పర్గి విచ్చేసి రానున్న మకర సంక్రాంతి దినం నాడు నాకు దీక్ష ప్రసాదించే టందుకు అంగీకారం వెల్లడించారు.

స్వామి నారాయణ్‌తో గడిపిన పది రోజుల్లోనూ నేను నిజమైన సన్యాసి జీవిత విధానం ఎట్లా ఉండాలో అవగాహన చేసు కొన్నాను.

ఆయన స్వేచ్ఛగా నిశ్చింతగా ఉన్నారు అయినప్పటికీ ఏదో పనిలో నిమగ్నులై ఉండేవారు. ఆయన ప్రతిరోజూ 18 గంటలు పని చేసేవారు "ఈ దేహం గుర్రం వంటిది. రోజంత పని చేసిన తర్వాత దాన్ని వీపు మీద అప్యాయతతో తట్టితేచాలు!" అని అనే వారు. రాత్రి చాలా సేపు వరకు పని చేసిన రోజున ఆయన మరింత సంతోషంగా గడిపే వారు. నేను ఆయన 'కర్మయోగి' అనే విషయాన్ని ప్రత్యక్షంగా గమనించాను. ఆయన అనేక సాంఘిక, విద్యా సంస్థల యాజమాన్యాన్ని నిర్వహించ డంలో ముఖ్య సాధనంగా ఉన్నారు ఆయన ఉన్నతుడు, బలిష్ఠుడు, స్ఫురద్రూపి. ఆయన ప్రతి పనీ కచ్చితంగా చేసే వారు సోమరి తనాన్నీ అలసతనూ ఆయన సహించే వారు కాదు. ఆయన ప్రతీదీ స్వయంగా పరిశుభ్రంగా స్వచ్ఛంగా క్రమ బద్ధంగా ఉంచె వారు. "ఏదైనా పనిచేస్తూ ఉంటే మనస్ఫూర్తిగా త్రికరణ శుద్ధిగా చెయ్యి. యోగః కర్మసు కౌశలం, అదే భగవదారాధన" అనే వారు. ఆయనతో ఆధ్యాత్మిక సంబంధం కలిగి ఉండటం నాకు ఎంతో గర్వదాయకమైన విషయము.

స్వామి నారాయణ హిప్పర్గికి ఒక వారం ముందుగానే వచ్చారు ఆ సమయంలో మేము అనేక సమస్యల్నీ, విషయాల్నీ చర్చించే వాళ్లము. ఆయన తన గురువుకు సంబంధించి ముచ్చట్లెన్నో చెప్పారు. మా బృందం వారు, స్వామి రామ తీర్థ ఆధ్యాత్మిక బోధనలను అవగాహన పూర్వకంగా ఆచరణలో అనుసరించు కోవాలని ఆదేశించారు

దీక్ష గై కొనవలసిన దినం రానే వచ్చింది. స్వామి నారాయణ నా ఆధ్యాత్మిక సాధనకు క్షేత్రంగా ఉపకరించిన ఏటి ప్రాంతానికి వెళ్లి అక్కడ ఉన్న ఒక ఔదుంబర వృక్షపు నీడను నాకుదీక్ష ఇవ్వాలని నిర్ణ యించారు.ఆ దీక్ష ఇవ్వడంలో కర్మ కాండ ప్రమేయం ఏమీ లేదన్నారు. యజ్ఞం ఏమీ అవసరం లేదు అనీ నాకు ఇవ్వదలచిన దీక్ష సాధారణంగా అమలులో ఉన్న విధానాన్ని అనుసరించేది కాదనీ అన్నారు స్వామి రామతీర్థ సంప్రదాయంలో "విద్వత్ సన్యాసము" అమలులో ఉంది. దీక్ష ఇవ్వడానికి ముందు అర్హతా నర్హతలు నిర్ణయించే కాలవ్యవధానం విష

యంలో ఎప్పుడో గడచి పోయింది. ఆయన నాకు ముండనక్రియ జరి పించారు. ఇంక మీదట నేను పరమాత్మకు చెందిన వాడినని నిర్వచించారు. ఈ విశాల విశ్వమే నా కుటుంబం అని ఉపదేశించారు. ప్రవాహం మధ్యకు తోడ్కొని పోయి 'ఓమ్' అని ప్రణవ నాదం చేస్తూ నన్నూ అక్కడ సమావేశమైన మిగిలిన వారిని తనను అనుసరించి ప్రణవం చేయమన్నారు. ఆయన తన చేతిలో నా చేతిని గ్రహించి నాతో పాటు ప్రవాహంలో మునిగి స్నానం చేశారు తర్వాత ఆయన తనతో పాటు లక్నో నుంచి నా కొరకై తెచ్చిన కాషాయ వస్త్రాలను ధరించ వలసిందని ఇచ్చి, ఇంక మీదట నన్ను స్వామి రామానంద తీర్థ అని పేర్కొనడం జరుగు తుందని అనుగ్రహించారు.

తర్వాత ముప్పది రెండు సంవత్సరాలు నేను సన్యాసిగా జీవించడం జరిగింది. ఈ ప్రపంచంలో అందరి మధ్య అన్ని సమస్యలమధ్య ఎన్నో ఒత్తిడులకు లోనవుతూ భగవంతుడు నాకై నిర్దేశించిన పనులు చేస్తూ గడిపాను. పని, పని, ఒక పని తర్వాత మరొక పని, మనస్ఫూర్తిగా ప్రేరణ శుద్ధిగా చేయడమే నా 'తపస్సు' అయింది. ఆదే నాకు తెలిసిన తపస్సు. నేను అడవులలో మౌనధ్యానవృత్తి అవలంబించ లేదు ఏ తీర్థయాత్రలూ సేవించ లేదు వేదాంత గ్రంధాలు, ప్రస్థానత్రయము, పఠించిన వాడ్ని కాను. ఈ అసంఖ్యాక సామాన్య జనుల మంచి కోరడమే నాకు ధ్యేయమై భగవదారాధన రూపం ధరించింది మానవుడిలోనే భగవత్స్వరూప సందర్శన స్పర్శానుభవాలు పొందాను మానవ సేవా కార్య క్రమాల ద్వారా భగవదారాధన చేసాను నాకు అయాచితంగా లభించిన పనులు శక్తి వంచన లేకుండా నిర్వహించాను ఇవి అక్కర లేదు. అది నాకు తగినది కాదు అనే అసంతృప్తి పొంద లేదు నేను నిత్య సంతోషిని. అవధి లేని సంతోష సుఖం పొందిన వాడిని.

ఈ ఘట్టాన్ని ముగించే ముందు నేను అనుభవ పూర్వకంగా నేర్చుకొన్న గుణ పాఠాలను, నాకు ఆచరణలో మార్గదర్శకము లైనటువంటి వాటిని పేర్కొనడం సందర్భో

మానవ సహజ మైన లోటు పాట్లను నిరసన పూర్వకంగా విమర్శించడం అనేది నేను నిగ్రహ పూర్వకంగా మానివేసాను. తప్పు చేసిన వారి పట్ల జాలి, సాహసము కూడిన సానుభూతి ప్రదర్శించే అలవాటు చేసు కొన్నాను. నేను ఈ రీతిగా ప్రవర్తించడం వల్ల ఇతరులు ఎట్లా ప్రభావితులైనారో చెప్ప లేను గాని, నేను మాత్రం ఆధ్యాత్మిక బలం పొందాను.

బహుశా ఆధ్యాత్మిక సాధనలో కూడా, ఇతర రంగాలలో ఉన్నట్లే లక్ష్య సాధనకు అనేక మార్గాలు ఉండటం సహజం నా అభిరుచులు ఇతర సాధకుల అభిరుచుల కంటె వేరైనవి కావచ్చు అందు చేత ప్రతి వారూ ఇతరులు పాటించిన పద్ధతులనే అక్షరాలా అవలంబించ కుండా తమకు మనః పూర్వకంగా నచ్చిన, అనుకూల మైన దారినే నడిచే స్వేచ్ఛ ఉందని నేను గ్రహించాను.

మూడో విషయము. నేను ఇప్పుడు కూడా సాధించదగినది , సిద్ధి పొందాలనే ప్రయత్నాలు కొనసాగిస్తూ ఉన్నటు వంటి వాడినే అని గుర్తిస్తున్నాను. తాను పరిపూర్ణుడనే భావం ఎవరికైనా కలిగితే అదే వారు అధఃపతనమునకు టందుకు ప్రాతి పదిక కావచ్చునని నా విశ్వాసము. ఈ చిన్న విషయాన్ని అవగతం చేసుకొనే జ్ఞానం నాకు ప్రసాదించిన పరమేశ్వరుడికి నేను కృతజ్ఞుణ్ని. సత్య స్వరూపాన్ని అవగాహన చేసు కొనేటందుకు చేసిన ప్రయోగాలు వివరిస్తూ వ్రాసిన రచనలో మహాత్మా గాంధీ ఒక అధ్యాయంలో ఈ రీతిగా వ్రాసారు. "నా ముందు ఇంకా నడవ వలసిన దుర్గమమైన మార్గం ఎంతో దూరం ఉందని నాకు తెలుసు. నేను పరమ శూన్యం(సున్న)తో సమానమైన అల్పుణ్ని అని ప్రతిఒక్కరు గుర్తించాలి. ఏమానవుడైనా తనంతట తాను, తోడి వారిలో చివరి స్థానం తనదని అంగీకరించడో అతనికి ముక్తిలేదు. అహింస వినయ భావానికి పరమావధి." ఈ నియమమే నా ప్రవర్తనను సరిదిద్దు కొనడంలో నాకు గీటు రాయిగా ఉపయోగ పడింది.

నేను పేర్కొన్న ఈ సూత్రాలన్నింటినీ తు.చ. తప్పకుండా ఆచరణలో పెట్టానని చదువరు లెవ్వరూ భ్రమపడకూడదు. ఈదశలో కూడా నేను దౌర్బల్యాలకు వశుడనవుతూ ఉన్నాను. ఒక్కొక్కప్పుడు నా నడకలో తడబాటు కలుగు తుంది.కాని, వెంటనే ధైర్యం తెచ్చు కొంటాను. క్రొత్త నమ్మకంతో పూర్తి అభినివేశంతో అమలు చేస్తాను. మార్గం చూపించే టందుకు, నడిపించే టందుకు నేను పరమేశ్వరుడిదే భారం బాధ్యత అని ప్రవర్తిస్తాను. నేను ఆయనకు కేవలంనిమిత్త మాత్రుడనైన ఉపకారణాన్ని-సానే గురుజీ ఒక పాటలో చెప్పినట్లు

నేను నీ చేతిలో మురళిని అవాలని కోరుతున్నాను
అప్పుడే నా జీవితం ధన్యత చెందు తుంది.
ఊదు. గాలి లోపలికి ఊదు.బైటికి ఊదు. ఓ ప్రభూ నా ప్రభూ!
ఇదే నా ప్రార్థన ఎడతెగని ప్రార్థన.

నేను, నా ఊహకు అందినంత వరకు, హిప్పర్గి లోనే కనీసం కొన్ని సంవత్సరాలైనా కదల కుండా ఉండాలనినిశ్చ యించు కొన్నాను. విద్యార్థులే నా ప్రపంచం. వాళ్లతో కాలం గడపడం కంటె సంతోష కరమైన పనేదీ నాకు కనిపించ లేదు. నా దగ్గరకు వచ్చిన వారందరూ నేను సంస్థానం అంతా సంచారం చెయ్యాలనీ భూస్వామ్య నిరంకుశ ప్రభుత్వ శృంఖలాలను విచ్ఛేదం చేసేటందుకు ఉత్సాహం చూపించే వారందర్నీ సమీకరించాలనీ తరచు చెప్పేవారు. అయినప్పటికీ హిప్పర్గి వదలడం నాకు ఇష్టం లేదని అనే వాణ్ని. అక్కడి నుంచి కదిలేటందుకు అంతరాత్మ అంగీక రించటం లేదని పించేది. పరిమితంగా ఉన్న మిత్ర బృందంతో సుఖంగా కాలం గడుపు తున్నాను. తిరిగి అడుగడుగునా సుడి గుండాలు గడబిడలు ఎదురయ్యే జీవితం గడిపే ఆవేశం కలగడం లేదు. స్వతంత్ర సాధన కోసం, పరమేశ్వరుడు తన సాధనాలను తానే ఎన్ను కొంటాడు. నేనెందుకు ఆలోచనలు చేసి సతమతం కావాలి? "నా మానాన నన్ను వదలండి." అని మిత్రులతో చెప్పేవాణ్ని. ఈ మాటలు విని బహుశా వారు నిరుత్సాహంతో తిరిగి వెళ్లిపోయే వారను కుంటాను.

ఇట్లా మరో నాలుగు సంవత్సరాలు గడిచాయి. నేను నా ఆధ్యాత్మిక సాధన కొనసాగిస్తూ ఉన్నాను.

భగవదిచ్ఛ మరో రీతిగా ఉన్నట్లుంది. ఆయన నన్ను మరో కార్యానికి నిర్దేశించినట్లైంది. నాకు హిప్పర్గితో తెగని అనుబంధం కల్పించిన మా ఆధ్యాత్మిక బృందం చెదరి పోయి అందరూ తలోదారి అయారు. అధ్యక్షుడు మానసికంగా ఒడుదుడుకులలో పడ్డాడు. ఆయన పతనం చెందాడని అనను. ఆధ్యాత్మిక సాధకులకు పతనం లేదు. మనకు స్ఫూర్తిగా ఆ మార్గంలో నడిచే వానికి ఒకసారి ముందుకు వేసే అడుగు మరొకసారి వెనుకకువేసిన అడుగు ఉంటాయని మాత్రమే అనాలి. వెనక్కు వేసిన అడుగు తర్వాత హుటాహుటి నడకకు దోహదం చెయ్యవచ్చు.ఏమైతేనేమి, హిప్పర్గితో ఉన్న ఆధ్యాత్మిక ఆకర్షణ, అనుబంధంలో ఉన్న ఉత్సాహము తగ్గాయి. నా సహచరులలోను, విద్యార్థులలోను అనేకులు ఇతర చోట్లకు వెళ్లిపోవాలని నిశ్చయించుకొన్నారు. వారిలో చాల మంది ఆ మరుసటి సంవత్సరంలోనే వెళ్లిపోయారు. నేను మరొక సంవత్సరం గడిపాను. కాని, నాకు కూడ వెళ్లిపోవాలనే కోరిక కలిగింది. మా సంస్థ వ్యవస్థాపకులు వెళ్ళ వద్దని పట్టుపట్టారు. నేను కాదనలేకపోయాను. చివరికి ఒక రోజున నా క్రమండలు,భిక్షాపాత్రలు చేతపట్టి ప్రపంచం అంతా నాదేఅనే భావంతో నాకు శాంతి ప్రసాదించిన ఆ స్థానాన్ని నమస్కార పూర్వకంగా వీడ్కొన్నాను. స్థాన చలనం కలిగింది. మరొక కార్యక్రమం నా కోసం కని పెట్టుకొని ఉండి నన్ను ఆహ్వానించింది.

హిప్పర్గి ఆశ్రమ పాఠశాల ఉన్న ప్రదేశం తిరిగి పొలంగా మారింది. ఇతర పొలాలు దున్నినట్లే దాన్ని దున్ని వేశారు. అక్కడ నివాస కుటీరాలన్నింటినీ కూలదోసారు. ఒకప్పుడు అట్లాంటివి అక్కడ ఉన్నవన్న గుర్తులు కూడ మిగల లేదు.నేను రెండు సార్లు అక్కడి నిష్కల్మష పవిత్ర వాయువులు పీల్చుకొనాలని వెళ్ళాను. ఆ ఔదుం బర వృక్షము, దాని దగ్గర ఏరు అట్లాగే నిలచి ఉన్నాయి. మామిడి తోట

మరింత ఎత్తుకు పెరిగి తలాడిస్తున్న చెట్లతో తన ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని చాటుతోంది. పక్షులు తమ కలకలారావాలతో భక్తి గేయాలాపన చేస్తూనే ఉన్నాయి. నేను ఇప్పటికి కూడ ఆ సుందర దృశ్యాలు, వాతావరణము కల్పించిన హాయిని, వాటి భౌతిక సాన్నిధ్యం లేక పోయినా, మనసా అనుభవిస్తూనే ఉన్నాను.

# 12. ప్రజా సమస్యల సముద్ర మథనం ప్రారంభమైంది.

నేను హిప్పర్గిలో ఉన్న కాలంలో పరిచయమైన మిత్రులలో అనేక మంది సంస్థానంలో అన్ని చోట్ల వ్యాపించి ఉన్నారు. వారికి ఆ హిప్పర్గి విషయము, ఆ చోటు నేను వదిలిన విషయము తెలిసి నా భవిష్యత్కార్య క్రమాలను గురించి అనేక ప్రతిపాదనలు చేయ సాగారు. భగవంతుడు ఒక మూల చిన్న గ్రామంలో ఉండి పని చేస్తున్న వాడ్ని పైకి లాగి విశాల ప్రపంచంలో విసిరి వేయడం చూస్తే నన్ను మరో ముఖ్యమైన పనికి నిర్దేశించినట్లు తోచింది. నన్ను కలిసేటందుకు వచ్చిన సహచరులు, నా కార్యక్షేత్రాన్ని విస్తృతం చేయ్యవలసిందనీ, సంస్థానంలో అన్ని ప్రాంతాలలోనూ సంచారం చెయ్యవలసిందనీ ప్రజలను సమీకరించి స్వాతంత్రోద్యమం కొనసాగించ వలసిందనీ. సలహాలిచ్చారు. వారందరు చేసిన సూచనలన్నింటినీ పర్యాలోకన చేసి, చివరకు బీడ్ జిల్లాలో ఒక తాలుకా ముఖ్య పట్టణమైన మోమినాబాద్‌లో స్థిర పడాలని నిశ్చయించుకొన్నాను.

అక్కడికి నేను ఒక్కడ్నే వెళ్ళ లేదు నాతో పాటు హిప్పర్గి ఆధ్యాత్మిక బృందంలోని కొందరు సభ్యులు కూడ నన్ను అనుసరించి వచ్చారు. మేమందరమూ ఒక కార్యక్రమం చేపట్టాలని నిశ్చయించాము. అక్కడి ప్రజలందరూ అత్యవసరంగా భావిస్తున్న ఉన్నత పాఠశాలను ఏర్పాటు చేసి నిర్వహించాలని అనుకొన్నాము. మేము దానికి ఆవశ్యక మైన పనులన్నీ ప్రారంభించ వలసి వచ్చింది. మాలో కొందరు గృహస్థులు (వారు నాలా భిక్షాశనులు కారు). మోమినాబాద్‌లో ఉన్న మిత్రులు

ప్రతినెల నూరు రూపాయలు పోగు చేసి ఇస్తామని అంగీకరించారు. మా బృందానికి అయే ఖర్చులన్నింటికీ అది సరి పెట్టుకోవాలి. మేమందరమూ కలిసి పన్నెండుగురమున్నాము. ప్రారంభంలో ఆ సొమ్ముతో సంస్థను నిర్వహించడం జరిగింది.

పని ప్రారంభించడానికి ముందే మేము ఒక వింతైన అసాధారణ పరిస్థితిని ఎదుర్కోవలసి వచ్చింది. ప్రభుత్వ విద్యా శాఖ నియమావళిలో ప్రభుత్వం వారి అనుమతి లేకుండా ఎవరూ వ్యక్తులు గాని, సంస్థలు గాని, విద్యా సంస్థలు ప్రారంభించ కూడదు. ప్రజలు అభివృద్ధి కావడం ప్రభుత్వానికి ఇష్టం లేదన్న మాట. ఈ పరిస్థితుల్లో ఏం చెయ్యాలి? మాకు ప్రభుత్వం అనుమతి ఇవ్వదని ప్రతివారికి తెలుసు. అందుచేత అందరమూ మా ఆలోచనలు కలబోసి చర్చించాము. "మనం ఆ నియమాన్ని ధిక్కరించడానికి సిద్ధంగా ఉండాలి. ఏమి జరిగినా సరే విద్యా సంస్థ ప్రారంభించి నడిపిద్దాము". అని నిశ్చయించుకున్నాము. అంత వరకు బాగానే ఉంది. కాని, ప్రభుత్వపు గుర్తింపు లేని పాఠశాలలో తమ పిల్లల్ని చదివించేటందుకు, తల్లిదండ్రులు అంగీకరిస్తారా? ఇక్కడి చదువులకు ప్రభుత్వ దృష్టిలో నిలువలేదని తెలిసినా వారు ముందడుగు వేస్తారా? ఒక ఇరవై మంది సంరక్షకులు ధైర్యంగా ముందుకు వచ్చినప్పటికి తగినంత మంది ఉత్సాహంగా సహకరిస్తారనుకోవడం అసంభవమేమోనని అనుమానం కలిగింది. అయినప్పటికీ ఆ కొద్దిమంది నుండి వచ్చిన ప్రోత్సాహం వల్లనే మాకు గుండెదిటువు కలిగింది. కాని, నేను మరి కొంత వివరంగా ఆలోచిద్దాము అన్నాను. ఒకసారి హైదరాబాదు వెళ్ళి అక్కడి నాయకులతో సంప్రతించి వచ్చిన తర్వాత నిర్ణయం చేద్దామని అన్నాను. అందరమూ అట్లాగే చెయ్యాలని అనుకొన్నాము. ఎందుచేతనంటే ప్రభుత్వ నియమావళిని ధిక్కరించినప్పుడు చివరి వరకూ గట్టిగా నిలబడ వలసి వస్తుంది. పరిస్థితి అట్లాంటి పోరాటానికి పరిపక్వం అయిందా? ఆ చర్యకు తగినట్లుగా మనం రణరంగాన్ని సైనికుల్ని తయారు చేసుకున్నామా? ఈ ప్రశ్నలకు సంతృప్తికరమైన సమా

ధానాలు లభించ లేదు. నేను సంప్రతించిన నాయకులందరూ ప్రభుత్వ ధిక్కారానికి అనుకూలమైన సమయం రాలేదనే భావాన్నే వెల్లడించారు. ప్రభుత్వ ధిక్కార చర్యలకు వ్యతిరేకత తెలిపారు. వారు నా దృక్పథంతో అంటే సంస్థ ఏర్పాటుకావాలనే విషయం గురించి మాటలలో ఏకీభవించినా తలలు అడ్డంగా ఊపి ప్రభుత్వ ధిక్కారం తలపెట్ట వద్దు అన్నారు. నేను ప్రతి నాయకుడి ఇంటి తలుపూ తట్టాను. కాస్త పేరు, వ్యక్తిత్వము, మార్గదర్శకత్వం వహించగల సామర్థ్యము, ఉన్నాయనుకున్న వారి నందరినీ కలిసాను. మొత్తంమీద నాకు నిరుత్సాహం కలిగింది. ప్రజల్ని ఈ నిద్రాణ స్థితినుంచి, జడత్వం నుంచి జాగృతమొనర్చేటందుకు ఏదో సాహసం చేసి తీరాలి. అదొక్కటే దారి, తరుణోపాయము అనే భావం కలిగింది. ఎట్లాగైనా సరే ఏ నష్టం వచ్చినా సరే ప్రజలలో వ్యాపించి ఉన్న ఈ మానసిక దౌర్బల్యాన్ని, పిరికితనాన్ని దుళ్లగొట్టాలి.

సంస్థానపు సరిహద్దు గ్రామంలో మా విద్యా సంస్థను ఏర్పాటు చెయ్యాలనే ఆలోచన ఒక సమయంలో వచ్చింది. కాని, అదృష్టవశాత్తూ నాకు ఆ శ్రమ తప్పిపోయింది. పెద్దలలో ఒకరిని, శ్రీవామన్ నాయక్ (ఇప్పుడు స్వర్గీయులు)ను, కలుసుకో వలసిందని కొందరు సలహా ఇచ్చారు. నేను సూటిగా బేగంపేట వెళ్ళి వారిని వారి ఇంట్లో కలుసుకొన్నాను. ఆయన నేను చెప్పినదంతా సావధానంగా విన్నారు. తర్వాత "నీవు అరెస్టు అయ్యేటందుకు సిద్ధంగా ఉన్నావా ? చెప్పు." అని అడిగారు. "నేను అన్నింటికీ సిద్ధమే" అని చెప్పగానే ఆయన మా సమస్యకు ఒక చక్కని పరిష్కార మార్గం సూచించారు.

"ప్రభుత్వ నియమావళి కొత్త విద్యా సంస్థల ఏర్పాటు చెయ్యడానికే అనుమతి సంపాదించాలి అని విధిస్తోంది. ఇప్పుడు నడుస్తున్న విద్యా సంస్థలలో ఉన్నత తరగతులు ఏర్పాటు చేసుకొనే హక్కును నిషేధించటం లేదు. మోమినాబాద్‌లో మా మిత్రులు శ్రీ యోగేశ్వరీ నూతన్ విద్యాలయాన్ని గత కొన్ని సంవత్సరాలుగా నిర్వహిస్తున్నారు. దాని

పరిస్థితి ఏమీ బాగాలేదు. మొత్తం విద్యార్థులందర్నీ లెక్కపెట్టితే ఒక డజను మంది ఉంటారేమో. ఆ పాఠశాల ఉన్నా లేనట్లుగానే ఉంది. కాని, విద్యాశాఖ వారి రికార్డుల్లో మాత్రం ఆ పాఠశాల పనిచేస్తున్నట్లే ఉంది. అని లోపాయి కారీ విషయాలు చెప్పి, మీరు ఆ పాఠశాలను బూజు దులిపి పునరుద్ధరించి, ఉన్నత పాఠశాలగా అభివృద్ధి చెయ్యండి. ఈ చర్యల్ని ప్రభుత్వం తమ విద్యాశాఖ నియమావళిని ధిక్కరించినట్లుగా పరిగణిస్తే నేను మీ తరఫున నిలబడి పోరాటం కొనసాగిస్తాను." అని శ్రీ వామన్‌నాయక్ అన్నారు.

నగరంలో ఉన్న పెద్దపెద్ద మనుషులలో ప్రజానాయకులలో పెద్దలైన ఒకరు ఇట్లాంటి మద్దతుఇవ్వగానే నేనువెంటనే మోమినాబాద్ తిరిగి వచ్చాను. మేము సాధక బాధకాలన్నీ ఆలోచన చేసి, ఆ సూచన ప్రకారం కార్య క్రమం నడిపించాలనుకున్నాము. కాలు మోపేటందుకు జాగా సంపాదించి పని ప్రారంభిస్తే అదే త్రివిక్రమస్ఫూర్తితో (వామనావతారంలా) తనం తటతానే పెరిగి అంతట అల్లుకుపోతుంది.

సుమారు ఒక వందమంది తల్లిదండ్రులు తమ పిల్లల్ని మా పాఠ శాలలో చేర్పి కష్టనిష్ఠురాలను ఎదుర్కొనేటందుకు తమ సంసిద్ధతను వెల్ల డించారు. అవసరంవచ్చి తప్పనిసరి అయితే తమపిల్లలు ఒక సంవ త్సరం చదివిన చదువు నష్టం అవుతుంది. ఒకహక్కు సాధించుకొనే టందుకు అంతమాత్రం త్యాగానికి సిద్ధంకావాలి అన్నారు. చివరికి ఫలితం ఎట్లాగుంటుందో ఎవరికీ సికరంగా తెలియదు. బహుశా మమ్మల్ని అరెస్టు చెయ్యవచ్చు. విద్యార్థుల తల్లి దండ్రులు ప్రభుత్వానికి వ్యతిరేకులైన వారితో చేరిపోయినట్లుగా ప్రభుత్వం వారి లెక్కల్లోకి రావచ్చు. అయినా వారు తమ మనస్సులు గట్టిపరచుకొన్నారు. కాని, పనిప్రారంభించడానికి ముందు మరొక అడ్డంకిని తొలగించ వలసి ఉంది. విద్యాసంస్థ వ్యవహారా లన్నీ చూసేటందుకు, యాజమాన్యం వహించేటందుకు, ఒక అనధికార సంఘాన్ని ఏర్పాటు చెయ్యాలి. దానికి అవసరమైన వ్యవస్థ, స్వరూపం సంగ్రహంగా వివరించే మతలబుతయారుచేసాను. ఆ సాంఘికవ్యవస్థలో

సంస్థాపక సభ్యులుగా ఉండే వారు ఎవరు?వారిని ఎన్నుకొనడం ఏమీ అంత సులువైన పనికాదు. మేము తలపెట్టిన ప్రభుత్వాధికార ధిక్కారం ఏపరో ఒకవ్యక్తి బాధ్యతకు పరిమితం కారాదు. 'సంఘంలో సభ్యులందరూ దానికి కారకులు బాధ్యులు'అని, గట్టిగా నిలబడేవారు కావాలి. అట్లాంటి పరీక్షకు నిలబడే చొరవ తెగువకల వారెవరో చూసిమరీ ఎన్నుకోవాలి ఇదీ మా కెదురైన సమస్య. మోమినాబాదు ప్రజలు సాహసానికి, పట్టుదలకు పేరు పొందినవారు. మా అవసరం వచ్చిందనగానే ఎవరూ వెనక్కితగ్గలేదు ప్రమాదం18 మంది లాయర్లూ వ్యాపారం చేసేపెద్ద మనుష్యులూ సంఘంగా ఏర్పడి యాజమాన్యానికి పూనుకొంటామని ముందుకువచ్చారు. దేనికైనా సిద్ధమే అని నాకు మాటఇచ్చారు. అవసరం వస్తే జైలుకి వెళ్ళాడానికైనా రెడీగా ఉన్నాము. అని అన్నారు.

హిందూ పంచాంగం ప్రకారం మంచిరోజు చూసి నూతన సంవత్సరాది నాడు (జనవరి1)మేము ఉన్నత పాఠశాల తరగతులు ప్రారంభించాము. అది ప్రజా స్వాతంత్ర్య పోరాటపు దిశలో ఒక ఊపు. ప్రజా సమూహం వేసిన ఒక పెద్ద అడుగు. మేము ప్రభుత్వాధికారాన్ని ధిక్కరించే సాహసం ప్రజలకు కలిగేటట్లు ధైర్యపుమాటలు చెప్పవలసి వచ్చింది మొత్తంమీద సంస్థాన రాజకీయ సాంఘిక ప్రజాఉద్యమంలో బంతి ఆట ప్రారంభమైంది. బంతి దొర్లడం మొదలైంది. దాని దారిలో అడ్డం వచ్చిన గులకరాళ్లను నిదానంగా నిదానంగా చేయకుండ తొలగించడం జరిగేది. భగవంతుడి అనుగ్రహం వల్ల కావలసినవన్నీ సమకూరేవి ప్రతిరోజూ ప్రవాహ ధోరణిలో కొత్త విద్యార్థులు, పదులు, ఇరవైలుగా, వచ్చి మా పాఠశాలలో చేరసాగారు. ఆ ఏడాదిలోనే జూలైనెల నాటికి మా విద్యార్థుల సంఖ్య ఐదువందలైంది. పాఠశాలలో చేరడానికి వచ్చిన ప్రతివిద్యార్థితోటి స్పష్టంగా ఉన్న సంశయ పరిస్థితులు చెప్పేవాళ్ళము. ప్రతివిద్యార్థితో వచ్చిన పెద్దలుకూడా తాము ఎదుర్కొనవలసిన ప్రమాదాన్ని పూర్తిగా అవగాహన చేసుకొనేవారు. వారు దానికి తమ అంగీకారాన్ని, సంసిద్ధతను వెల్లడించేవారు. ప్రజలలో వ్యక్తమైన ఈ సమరోత్సాహమే

మాకు పెద్దపెట్టున లభించిన లాభము. సంస్థానం అంతా వెదికిచూస్తే కనీసం
ఒక్కచోటనయినా, ప్రభుత్వాధికారాన్ని ధిక్కరించాలనే భావం అంకు
రించింది అని మాకు సంతోషం కలిగింది. అయితే మోమినాబాద్‌లో
వ్యక్తమైన పరిస్థితి సంస్థానం అంతటా అల్లుకొని పోతున్న చైతన్యాన్ని
సూచిస్తున్నదా! అనే ప్రశ్న మాలో మేము వేసుకున్నాము.

మేము సాహసించి చేపట్టిన కార్యక్రమం యొక్క ప్రాధాన్యత
గురించి మాకు స్పష్టమైన అవగాహన ఉంది. మేము సంస్థానంలో విజ్ఞాన
వంతులైనవారు కూడా మా కార్యక్రమాన్ని గురించి దూర దృష్టితోనూ
దీర్ఘదర్శిత్వంతోనూ పరిశీలించే వాళ్ళము. చదువులు చెప్పడమే మా
లక్ష్యంకాదు. జాతి పునరుజ్జీవనం మా అసలు లక్ష్యము. అధికారాన్ని
అన్యాయాన్ని, ప్రజలు ఎదిరించాలి అనే నిప్పురవ్వ మా విద్యాసంస్థలో
రగులుకున్నది. అది క్రమంగా ఇతర రంగాల్లోకి వ్యాపిస్తుంది; వ్యాపించాలి.
అదే మా కృషి. అందుచేత సహజంగా కొన్ని నెలలపాటు మోమినాబాద్
అనేక కార్యక్రమాలు కొనసాగిస్తూన్న తేనెపట్టు పోలికగా పనిచేసింది.
అది ఆనాటికానాడు హైదరాబాదు సంస్థాన ప్రజల స్వాతంత్ర్య పోరాటంలో
పాల్గొన్న వీరుల సమావేశాలకు, కూడలి సంగమంగా రూపొందింది.

ఇట్లా ఉండగా 1937 లో హైదరాబాదు నగరంలో హైద్రాబాదు
సంస్థాన విద్యావేత్తల సమావేశం ఏర్పాటైంది. అప్పటి పరిస్థితుల్లో
అసంతృప్తి చెందినవారు అత్యంత ప్రభుభక్తులైనవారు, అతి స్వతంత్ర
భావాలు కలవారి వరకూ ఏ వర్గానికి చెందినవారికైనా ఒకేసారి ఒకే వేదిక
మీద కలిసి చర్చించే అవకాశం కల్పించిన సంఘటన ఆ సమావేశ
కార్యకలాపాలలో కొంత వేడి, ఆవేశము ద్యోతకమవడంలో ఏమీ ఆశ్చ
ర్యంలేదు. నాకు ఆ సమావేశంలో పాల్గొనవలసిందంటూ ఆహ్వానం
వచ్చింది. అందులో పాల్గొనకుండా బైటనే ఉండిపోదామా అని నామనస్సు
డోలాందోళనాయమానమైంది. కాని మిత్రులు నన్ను తప్పక పాల్గొన
వలసిందని అనడం అధ్యక్షులైన శ్రీ కె. ఎస్. వైద్య ఆ సమావేశానికి
హాజరుకావలసిందంటూ స్వయంగా ఆదరణ పూర్వకంగా వ్రాసిన జాబు ఆ

సమావేశంలో పాల్గొనాలనే నా నిర్ణయానికి తోడ్పడ్డాయి. కాని ఆ సభ ముచ్చట్లు తెలిపేముందుగా దాని కంటె ఒకఏడాది పూర్వము జరిగిన ఒక ముఖ్యమైన విషయం ఇప్పుడు వివరించడం అవసరము.

నేను పూర్తిగా ఒక సంవత్సరం అంతా ఎక్కడికి వెళ్ళకుండా మోమినాబాద్‌లోనే ఉన్నాను అయినప్పటికీ స్వాతంత్ర్యోద్యమాన్ని గురించిన ప్లాన్‌లు (పథకాలు) ఆలోచనలు చర్చలు అక్కడికి వచ్చినవారితో జరుగుతూనే ఉన్నాయి. ఆ వచ్చిన వారిలో చాలామంది మరాట్వాడా వారే. ఆ సంభాషణ లన్నింటినుంచి పరిస్థితి స్వతంత్ర పోరాటానికి అభిముఖంగా రూపొందుతోందనీ ప్రజల ఉద్యమానికి ఒక్క ఊపు ఇవ్వడం చాలుతుందనీ గుర్తించాము. మొట్టమొదట ఒక వందమంది ఎన్నికైనవారు కార్యరంగంలోకి దూకాలనీ ఆ తర్వాత పరిస్థితి పరి పక్వంకాగానే మిగిలినవారందరూ పాల్గొనడం అవసరమనీ మాలో కొందరం అనుకొన్నాము.

అందువేళ కొందరము మాజీవితాలను ఈకార్యక్రమానికే పూర్తిగా అంకితం చేసి కృషి చెయ్యడం అవసరమని నిర్ణయమైంది మేము ఆ దీక్షచేపట్టి ప్రతిజ్ఞ గైకొనకొండా "నీవు ముందుకురా. నీవురా" అంటూ ఇతరులను ఆహ్వానించడం తగినపనికాదు అని కూడా నిశ్చయించాము. మేము షోలాపూర్‌లో సమావేశమై, ప్రతిఒక్కరమూ హైదరాబాదు సంస్థాన ప్రజాస్వాతంత్రోద్యమానికై యావచ్ఛక్తిని ధారబోస్తానని అవ సరమైతే ప్రాణాలు కూడా అర్పించటందుకు వెనుకాడననీ ప్రతిజ్ఞ స్వీక రించాలని నిశ్చయించాము. ఆనాటి ముచ్చట్లను జ్ఞాపకం చేసుకొంటే- నాతోపాటు చదువుకున్న శ్రీ ఎ. కె వాఘ్‌మరే ఇంట్లో ఒక చిన్న గదిలో మేము ఆరుగురము సమావేశం అయాము. శ్రీ వాఘ్‌మరేను గురించి తర్వాత మరోఘట్టంలో కొంత వివరంగా చెప్పాలని అనుకొంటున్నందు వల్ల ఇప్పుడు ఆ ప్రసక్తి వాయిదా వేస్తున్నాను. నాతోబాటు ఆనాడు శ్రీ దిగంబర్‌రావు బిందు, శ్రీ ఆర్. జి. పరంజపే మోమినాబాద్

వారైన శ్రీ నారాయణ్‌రావు జోషి, హిప్పర్గి గ్రామం వారైన దేశాభ్యు దయానికై దీక్ష వహించిన శ్రీ వెంకటరావు సోదరులు, సమావేశం అయినట్లు జ్ఞాపకంవస్తోంది. ప్రతిజ్ఞపాఠం (మతలబు) తయారు చేసాము. అక్షరాలా ఈ క్రింది తీరుగాలేదు. కాని, దానిలో వ్యక్తమైన భావం మాత్రం ఇదే అనినాకు జ్ఞాపకం "నేను.........హైదరాబాదు సంస్థాన ప్రజల దాస్యవిమోచనానికై నా సర్వస్వాన్ని పణంగాబెట్టి త్యాగంచేస్తూ కృషిచేస్తానని ప్రతిజ్ఞ చేస్తున్నాను." మొట్టమొదటనేను ఆ ప్రతిజ్ఞ తీసుకోవాలని నిర్ణయమైంది. అట్లానేచేశాను. నన్ను అనుసరించి మిగిలిన వారందరూ అట్లాగే చేసారు. తర్వాత మేము ఎవరివనులలో వారుంటూ ఒక సంవత్సరం లోపుగా నూరుమంది ఆ ప్రతిజ్ఞను తీసుకొనేటట్లు కృషి సాగించాలనుకొన్నాము.

హైదరాబాదులో విద్యావేత్తల సమావేశం జరిగే సందర్భంలో మేము ఒకరినొకరు కలుసుకొని ఎంతవరకు కార్యసాఫల్యం సిద్ధించిందో పర్యాలోకన చెయ్యాలని కూడా అనుకొన్నాము. ఆ సమావేశానికి వెళ్ళడమనేది అంతకుముందే నిర్ణయమైనందువల్ల నేను సమావేశానికి రావలసిందంటూ సమావేశ కర్తలు ఆహ్వానం పంపగానే అంగీకరించాను.

ఈ విషయాలు మరికొంత వివరించడానికి ముందుగా ఆనాటి పరిస్థితుల స్వభావాన్ని దిక్ప్రదర్శనంగా తెలపడం అవసరం.

హైదరాబాదు సంస్థానము బ్రిటిష్‌సామ్రాజ్యంలో అంతర్భాగమైన భారతదేశానికి గరిమనాభి (నాడి బొడ్డు) వంటిదని అభివర్ణితమైంది. ఈ ఒక్క వాక్యంవల్లా "ఇంగ్లీషు వారు, భారతదేశంలో నానాటికీ ప్రజ్వరిల్లుతున్న జాతీయభావం అభివృద్ధి చెందకుండా అరికట్టేందుకూ, జాతీయోద్యమాన్ని కూలదోసేటందుకు తాము వేసే ఎదుఎత్తుల్లో సమర్థవంతమైన పావుగా ప్రయోగించేటందు కోసమూ హైద్రాబాదు సంస్థానాన్ని అక్కడి ప్రభుత్వాన్ని మలచుకొన్నారు" అని తెలుస్తుంది. ఈ రెండుఅంశాల్లోనూ

1948 ... హైదరాబాదు స్వాతంత్ర్యపోరాటము మొదటి అంశాన్ని సాధించేటందుకు మతావేశ ముస్లిము ధోరణులను ప్రోత్సహిస్తూ వారికి అధికారాలు కట్టబెట్టడమూ, రెండో అంశసాధనకు ఆ సంస్థానాధిపతిని ఘనత వహించిన నిజాము ప్రభువని, బ్రిటీష్ సామ్రాజ్యానికి అత్యంత విశ్వాసనీయుడైన మిత్రుడని స్వతంత్ర సంస్థానా(రాజ్యా)ధిపతి అని బిరుదావళులిచ్చి, వాటిని తరచు పేర్కొని ఆయన ఉబ్బి తబ్బిబ్బులవుతూ ఐశ్వర్యాన్ని దురహంకారాన్ని పెంచుకొనేటట్లు చెయ్యడమూ వారి కార్యక్రమాలైనాయి. ముస్లిము మతావేశ అధికారుల బృందము నిజాము (వ్యక్తి) ను పరివేష్టించి దృఢమైన వలగా అల్లుకుని ఉంటూ నిరంకుశాధికారంతో ప్రజలను దాస్యబంధాలతో బంధించి ఉంచింది.

ముస్లిం అవడమే ఘనతకు వారసత్వంగా పరిణమించింది. ముస్లిము కాకపోవడమొక దురదృష్టం, ఆజన్మ దాస్యానికి గురి కావలసిన కర్మఫలితం అనే భావాలు వ్యాప్తిలోకి వచ్చాయి. ఏ ముస్లిము అయినా నవాబే యజమానే, ఏ హిందువు అయినా లొంగి అణగిమణగి ఉండవలసిన బానిసే. సామాజిక జీవితం కూడా ఈ భావాలతో ఆర్ద్రమై పోయింది. అన్ని వైపులనుంచీ అన్ని రంగాలలోనూ హిందువుల్ని న్యూనంగా ఉంచడం కళ్ళకు కట్టినట్లుగా ప్రత్యక్షమయ్యేది. ప్రారంభ విద్యలో ఏకొద్దినాళ్ళ ముచ్చటనో వదలివేసి మిగిలిన విద్యాబోధన కార్యక్రమమంతా ఉర్దూ భాషలోనే కొనసాగేది. తమకు కావలసిన విద్యాబోధనను ప్రజలు ఏర్పాట్లు చేసుకొనే అవకాశాలే లేవు. పైగా నిషేధము అమలులో ఉండి, ప్రజలు ఏ కార్యక్రమము నిర్వహించుకొన్నా ప్రభుత్వం అనుమాన దృష్టితో పరిశీలించేది. సారస్వత కార్యక్రమాన్ని కూడా రాజకీయ కార్యక్రమాలుగానే పరిగణించడం జరిగేది. సామాజిక, సాంస్కృతిక కార్యక్రమాలను ఏర్పాటు చేసుకొనేటందుకే ముందుగా అనుమతి పొందాలంటే ఇక రాజకీయ కార్యక్రమాల సంగతి ఏమీ చెప్ప వలసిన పనేలేదు. వాటికి అనుమతి లేనేలేదు. అడిగినా రానేరాదు. లభించదు. పరిపాలనా రంగంలో ఉద్యోగాలన్నింటిలోనూ అన్ని స్థాయిల

లోనూ ఎక్కడ చూసినా ముస్లిం ప్రజా జీవిత నాడులు, రక్త వాహినులు అన్నీ ముస్లిము అధికార వర్గపు చేతులలో ఇమిడి ఉన్నాయి. ముస్లిములు స్వేచ్ఛగా ఆయుధాలు చేత బట్టవచ్చు. వేటాడవచ్చు ఆయుధాలను గురించిన చట్ట నిర్బంధాలన్నీ హిందువులకే వర్తిస్తాయి వారి పట్లనే కచ్చితంగా అమలు జరుగుతాయి చట్టాలన్నీ ముస్లిములకు అనుకూలంగానే ఉన్నాయి.

ప్రజలను "భయం" క్రుంగదీసింది. వారి తలలు ఎప్పుడూ వంగి ఉండేటట్లు చేసింది ఈ అణగి మణగి ఉండటం ఎంతకాలం కొనసాగుతుంది ? ఆత్మ గౌరవం, అభిమానం ప్రజలలో క్రమంగా ప్రజ్వరిల్లుతున్నాయి

కొందరు వ్యక్తులు ఇక్కడ ఒకరు, అక్కడ ఒకరు ధైర్యసాహసాలు వ్యక్తం చెయ్యసాగారు. స్థానికమైన సంఘటనలలో తిరుగుబాటు ధోరణి వ్యక్తంకావడం ప్రారంభమైంది ఒక మతం వారు మరొక మతం వారిని అన్ని విధాల అణగి త్రొక్కి ఉంచుతున్నారు గనుక, జరిగిన ప్రతి సంఘటన సహజంగా, మత కలహమనే రంగు పులుమడం జరిగేది. పండుగలలో ఒక మతం వారు ప్రదర్శన ఊరేగింపును నిషేధించడం జరిగితే వారు నిరసించడం ధిక్కరించడం జరుగుతుంది. అది మత కలహాలకు దారితీస్తుంది. అన్ని సందర్భాల్లోనూ వాటిలో కష్ట నష్టాలకు గురి అయ్యేది హిందువులే చట్టాలన్నింటినీ వారికి వ్యతిరేకంగా వ్యాఖ్యానించడం జరుగుతుంది కనుక మరొక విధంగా ఎప్పుడూ జరిగే అవకాశమే లేదు ప్రజలలో పొడచూపిన ప్రభుత్వ వ్యతిరేకత, మొట్టమొదట మత విషయకమైన సందర్భాలలో ప్రస్ఫుటమైంది ఆర్యసమాజ్ ముందుకు వచ్చి ప్రజలకు వత్తాసు ఇచ్చి నాయకత్వం వహించింది.

యథార్థంగా ప్రజల్లో కలిగింది సర్వతోముఖంగా వ్యాపించి అణగ త్రొక్కుతున్న నిరంకుశత్వానికి వ్యతిరేకతే అయినప్పటికీ అది తాత్కాలికంగా కేవలం మతావేశ రూపాన్ని మాత్రమే ధరించిందని

పరిగణించ వలసి ఉంటుంది. గ్రామాలలో ఏమాత్రం ఆత్మాభిమానము శౌర్యము కలిగిన వారున్నా వారందరూ ఆర్య సమాజంలో చేరారు. దానికి ఫలితంగా అనేకమంది ఆర్యసమాజ కార్యకర్తలు నష్టాలకు, అవమానాలకు, బాధలకు, గురికావడము చివరకు వారిలో కొందరు తమ ప్రాణాలకు అర్పించడము కూడా జరిగాయి అయినప్పటికీ నిరంకుశత్వాన్ని ఎదిరించడం కొనసాగుతూనే ఉంది.

ఆ రోజుల్లో కొనసాగుతున్న ఉద్యమాల్లో స్పష్టమైన రాజకీయ స్వరూప స్వభావాల రూపురేఖలు లేవు. సామాజిక సారస్వత కార్యక్రమాలను ప్రభుత్వం అంతగా పట్టించుకోకుండా చూసీ చూడనట్లు చరించెది. ఆంధ్ర మహాసభ రాజకీయ భావాలను వ్యక్తం చెయ్యకుండా వాటిని పూర్తిగా తెర వెనుకనే ఉంచి, తమ సంస్థకు రాజకీయాలతో ఏమీ సంబంధము లేదన్నట్లుగానే వ్యవహరించేది అందుచేత అది ప్రమాదకరమైన సంస్థ కాదనే ప్రభుత్వం పరిగణించేది సంస్థానంలోని కన్నడ మహారాష్ట్ర ప్రాంతాలలో వారిని సమీకరించే, సంస్థలు, ఆంధ్ర మహాసభను పోలిన సంస్థలు, చాలాకాలం వరకూ ఏర్పడనే లేదు. ఇదీ పరిస్థితి. ఈ పరిస్థితుల్లో నిస్సందేహంగా స్పష్టంగా రాజకీయ చైతన్యాన్ని వ్యక్తం చేసే సంఘటన ఒకటి జరిగింది ఆకోలా నుంచి ఆలోచనా పరులైన కొందరు తమ అభిప్రాయాలు వ్యక్తం చెయ్యడానికి ఒక యాత్రా బృందంగా వెళ్ళారు ఆ రోజుల్లో అదే ఒక మహత్కార్యము 'గొప్పపని) !

మొత్తం మీద పరిస్థితులు ఒక హిందూ సంస్థ ఏర్పడేటందుకు ఎంతో అనుకూలంగా ఉన్నాయి. ఆ పని చెయ్యడం చాలా తేలికే. హిందువులలో భావావేశం కలిగించ వచ్చు. అయితే, అది సరియైన పనా ? నిశితంగా విమర్శించి చూస్తే హైదరాబాదు సమస్య మత విషయకమైన సమస్య అనడం తగిన పని అవుతుందా ? ముస్లిములను బ్రిటిషు వారు తమ రాజకీయాల్లో చదరంగపు పావులుగా వాడుకుంటున్నారు కదా ! వారిని వారి కర్మానికి వదిలేసి ఒక్క హిందువులను మాత్రమే

సమీకరించడం ధర్మ సమ్మతమవుతుందా ? మతావేశాన్ని ఎదిరించే టందుకు మరొక మతావేశాన్ని రెచ్చగొట్టడం సమస్యా పరిష్కార విధాన మవుతుందా ? ప్రజాసందరినీ ఒక ఉద్యమం సాగించేటందుకు ఆహ్వా నించే ముందు ఈ ప్రశ్నలకు సమాధానాలు చెప్పవలసి ఉంటుంది. ఉద్యమ స్వరూపాన్ని గురించీ, దాని లక్ష్యాలను గురించీ మనస్సులో ఏమీ సందేహాలూ అనిశ్చిత విషయాలూ ఉండకూడదు. అదృష్టవశాత్తు హైదరాబాదులో ఉన్న విజ్ఞానవంతులందరూ హైదరాబాదు ప్రజల సమస్య అసలు స్వభావము హిందూ-ముస్లిము సమస్య కానే కాదని దృఢంగా విశ్వసించిన వారే ఆ సమస్యకు రెండు తలల రా కా సి స్వరూపం ఉంది. ఒకటీ నిరంకుశ భూస్వామ్య పరిపాలనా వ్యవస్థ, రెండోది, దానికి పూర్తి మద్దతు ఇచ్చి అసాధారణ బలము కల్గించిన బ్రిటిషు సామ్రాజ్య శక్తి, ముస్లిములలో ఎక్కువ మంది నిరంకుశ సంస్థాన ప్రభుత్వాన్ని సమర్థిస్తూండటం వల్ల దానికి మతతత్త్వ స్వభావం కలిగింది. అది ఆనుషంగికము మాత్రమే. అందుచేత పౌరుల హక్కుల కోసం, బాధ్యతాయుత ప్రభుత్వం కోసము ఉద్యమం సాగించాలి. అంతే కాని, ఉద్యోగాల కోసము, అధికారపు గౌరవాల్లో వాటాలకోసము, మతాల వారీగా కులాల వారీగా ప్రాతినిధ్యాల కోసము, పోరాటం సాగించా లనుకోకూడదు. మతతత్వ భావానికి విరుగుడు, ఈశ్వర వెరువంటిది జాతీయతా భావమే అని గుర్తించడం జరిగింది. విజ్ఞులైన వారందరూ ఇది గుర్తించడము వారి శక్తియుక్తుల నన్నింటినీ ఆ దిశవైపు మళ్ళిం చడమూ జరిగింది

హైదరాబాదు సంస్థానంలో ఉన్న కన్నడ ప్రాంతం కర్నాటక పరిషత్‌ను ఏర్పాటు చేసింది అట్లాంటి ప్రాంతీయ సంఘ సమీకరణకు కృషి చెయ్యడంలో మొదటిది ఆంధ్ర మహాసభ. రెండోది కర్నాటక పరిషత్ అది కూడా దాని స్వభావ లక్షణాలను బట్టి రాజకీయ వాసనలు లేనిదే. అందుకోసం ఎవ్వరినీ తప్పుపట్ట వలసిన పనిలేదు. పరిస్థితుల అంతరాంతరాల్లో నిగూఢమై ఉన్నప్పటికీ నిశ్చితంగా రాజకీయ సమస్య

నేను నిర్వహించిన పాత్రను అందరూ ఆమోద పూర్వకంగా గుర్తించి నట్లే కన్పించింది. నా ఉపన్యాసము, విన్న వారిని ఆకర్షించి ఆకట్టు కొన్నది. సమావేశం పూర్తి అయిన తర్వాత నన్ను అనేకులు ఆహ్వా నించారు. హైదరాబాదు సంస్థానంలోని విద్యావంతు లందరితోనూ నాకు సాన్నిహిత్యము లభించింది. హైదరాబాదు ప్రజా జీవితంలో ఎన్నిక గన్న వారందరితోటీ పరిచయం కలిగింది.

విద్యావేత్తల సమావేశంలో పాల్గొన్న ముఖ్యమైన కార్యకర్త లందరితోటీ ప్రజాశక్తిని ఏ రీతిగా క్రమబద్ధం చేసి అది ఒక దిశలో నడిపేటట్లు చేయగలము ? అని మర్మం లేకుండా మాట్లాడటం జరిగింది. మొట్టమొదట మహారాష్ట్ర ప్రాంతాలలో కూడా మహారాష్ట్ర పరిషత్‌ను ఏర్పాటు చెయ్యడం అవసరము అని అనుకొన్నాము. మరాఠీ భాష మాట్లాడే ప్రాంతం నుండి వచ్చిన వారికి రాజకీయాలతో సంబంధం లేని సంఘాన్ని ఏర్పాటు చేసుకోవడం అంటే మనస్కరించ లేదు రాజకీయ స్వాతంత్ర్యం లేకపోతే సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక అభివృద్ధి ఇతర రకాల అభివృద్ధి సాధ్యం కాదని వారు అభిప్రాయ పడ్డారు. పౌర హక్కుల కోసం పోరాటం సాగించాలి. సాధించుకోవాలి ప్రజలదే పరి పాలనాధికారం అని నినాదం చెయ్యవలసిందే ప్రజలందర్నీ ఉత్సాహ పరచి సజీవ శాశ్వత ఆదర్శాల కోసం కృషి చేసేటట్లు ఆవేశం కలిగించి నిరంకుశ ప్రభుత్వ శృంఖలాలు తెంచి వేసుకొనేటట్లు చెయ్యాలి. కాలం మారింది. ధైర్యంగా ముందుకు సాగడం అవసరము అని వారు వాదిం చారు. ఈ చర్యలవల్ల ఫలితం ఏమీ అంత విస్పష్టంగా కన్పించనప్పటికీ, మా అందరి రాజకీయ భావ ప్రభంజనపు గాలి వాలు ఎట్లావుందో స్పష్టంగా తెలిసింది

ఈ దృక్పథాన్ని ముఖ్యమైన వారందరూ ఆమోదించి దానికి స్వాగతం చెప్పారు. తన ఆలోచనా శాంత స్వభావాల (Sobriety) తో త్రికరణశుద్ధితో, నాకు ఎప్పుడూ మెప్పు కలిగించే టువంటి ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు కూడా ఆ దృక్పథాన్నే వెల్ల డించారు. శ్రీ కె. ఎన్. వైద్యకూడా అట్లాంటి భావాలే వెల్లడించారు. కాని

ఆయన మాటల్లో కొంత ఇటూ అటూ గోడమీది పిల్లి ధోరణి కనిపించింది శ్రీ దిగంబరరావు బిందు మనఃస్ఫూర్తిగా ఆ భావాన్ని సమర్థించారు. ఇంకా ఎ కె వాఘ్‌మారే మరాట్వాడా యువకుల ప్రగతిశీల వాదానికి సాక్షాత్తు ప్రతినిధే అనతగిన వారు ఆయనలో దాస్యవిముక్తి ఉద్యమం పట్ల ఉన్న అణగత్రొక్కబడి ఉన్నవారి అభినివేశము గుబ గుబలాడుతూ ఉన్నందువల్ల అశాంత చిత్తంతో ఓర్పు నశించిన వాని వలె కన్పించే వాడు. ఆయన రైల్వేశాఖలో చేస్తున్న ఉద్యోగాన్ని మాను కొని స్వతంత్ర పోరాటానికి ప్రజాశక్తుల నన్నింటినీ సమీకరించే లక్ష్యంతో కృషి చేస్తున్నాడు హైదరాబాదు సంస్థానంలో స్వాతంత్ర్య పోరాటంలోకి నన్ను ఆకర్షించిన వారిలో ఆయన ప్రథమ గణ్యుడు.

మొత్తంమీద అక్కడ కనిపించిన ప్రతివారు పలకరించిన ప్రతి వారూ తప్పకుండా చొరవచేసుకొని ఏదో వొక కార్యక్రమం కొనసాగించాలి అని అనేవారు. అదే ఆనాటి పరిస్థితుల యొక్క సామాన్య లక్షణాన్ని ప్రతిబింబించవచ్చు. చాలా ప్రఖ్యాతి వహించిన పెద్దలు ఇష్టాగోష్ఠిలో చాలా తీవ్రమైన భాషలో మాట్లాడేవారు కాని వారే పదిమంది ఎదటా ఉపన్యాసవేదిక నుంచి మాట్లాడేటప్పుడు మితవాదధోరణిలో మాట్లాడే వారు ఇక కార్యనిర్వహణ దగ్గరకు వచ్చేటప్పటికి కార్యక్రమాలను చాలా మందకొడిగా నిదానంగా నడిపించేవారు. వారి పద్ధతి గమనించినప్పుడు ప్రజా ఉద్యమానికి నాయకత్వం వహించినడిపేటందుకూ పాల్గొనేటందుకూ అట్లాంటి కర్తవ్యనిర్వహణలో తప్పనిసరి అయిన త్యాగాలకు ప్రమాదాన్ని ఎదుర్కొనే సాహసానికి వారింకా సంసిద్ధులుగాలేరని నాకు అనిపించేది. వారింకా ఉద్యమమువల్ల కలిగే లాభనష్టాలులెక్కలు కడుతున్నారు. లభించే ఫలితాలను అనుసరించి ఉద్యమపు భారాన్ని తలకెత్తుకొనడమా మానడమా అని యూహాలు చూస్తున్నారు. అట్లాంటి వారిని చూస్తే భవితవ్యాన్ని నిర్ణయించడం తమచేతుల్లో ఉందనీ అన్ని తాము నిర్ణయించినట్లుగానూ తమ అంచనాల ప్రకారమూ జరుగుతాయనే అసంబద్ధ విశ్వాసంతో వారున్నట్లూ నాకు అనిపించేది వారిలో కొందరు తమ దుర్బలత్వాన్ని బలహీనతనూ

స్పష్టంగా ఒప్పుకొనేవారు. మరి కొందరు అట్లాంటి వారికంటె చాలా తెలివైనవారు. వారు తాము ధైర్యసాహసాలతో కూడిన కార్యక్రమంలో పాల్గొనేటందుకు, త్యాగంచెయ్యడానికి సిద్ధంగాలేమని అంగీకరించరు. అసలుసంగతి మాటుపెట్టి రాజకీయ సిద్ధాంతాలు, కబుర్లు చెప్పుతూచర్చలు సాగిస్తారు. ఈ రకంవారి మనుష్యుల్ని పరిస్థితిని సూక్ష్మంగా పరిశీలించి ఎవరో ఒకరిద్దరు తప్ప అప్పటి హైదరాబాదు నగరంలో ముందుకువచ్చి ప్రజాస్వామిక ప్రభుత్వం ఏర్పడాలనే, స్వేచ్ఛకై పోరాటం సాగించే టందుకు సిద్ధంగా ఉన్నామనేవారు నాకు కనిపించనే లేదు. అట్లాంటి వారు సంస్థానంలో ఇతర ప్రదేశాలలో ఉన్నారు. వారిని అన్వేషించాలి. వారందర్నీ సమీకరించాలి.

నేను మోమినాబాద్ తిరిగివచ్చాను. హైదరాబాద్ వెళ్ళివచ్చినందు వల్ల నా మిత్రబృందం మరింత విస్తరించింది. ఆ తర్వాత రాజకీయంగా చైతన్యవంతులైనవారు. తమశక్తి కొద్దీప్రజాక్షేమంకోసం త్యాగం చెయ్యా లనుకొన్నవారు తరచుగా మోమినాబాద్ వచ్చేవారు. అంతవరకు అంకు రించకుండా ఆలోచనల రూపంలో, అస్పష్టభావాల రూపంలో నున్నవి క్రమంగా ఒక కచ్చితమైన పథక స్వరూపం ధరించసాగాయి. ఆనాటి నుంచి నేను తరచుగా హైదరాబాదు నగరానికి రాకపోకలు సాగించడము, ప్రతి సారీ వెళ్ళినప్పుడల్లా మాభావాలను సమర్థించే మరి కొంతమంది క్రొత్త మద్దతుదార్లను సంపాదించుకొనడం జరిగేది. అట్లాంటి సందర్భాలలో ఒక సందర్భం నా మనస్సులో గాఢమైన ముద్రవేసుకొని ఇప్పుడుపైకి చొచ్చు కొని వస్తోంది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని విద్యార్థులు శ్రీకృష్ణ జన్మాష్టమి రోజున ముచ్చటించవలసిందని నన్ను ఆహ్వానించారు. ఆ ఆహ్వానం విద్యార్థి సంఘంనుంచివచ్చింది, వారు తామిచ్చిన ఆహ్వానానికి అధికారులఆమోదంకూడా పొందినట్లున్నారు. వారునన్నువిద్యావేత్తగావిద్యా వేత్తలసమావేశంలో చర్చలలో పాల్గొన్న ఉపన్యాసకుడుగా ఎరుగుదురు. ఆ సందర్భంలో, వారిలో చాలామంది, నా ఉపన్యాసం వినడంకూడా సంభ వించింది. అందుచేతనే వారు నన్ను ఆహ్వానించారు. నాకు విశ్వవిద్యాలయ

భవనాల్లో ఒకదాంట్లో చక్కని వసతులతో బాగా అలంకృతమైన గదిలో వసతిఏర్పాటు చేసారు. నేను కరతల భిక్షకు, తరు తల నివాసానికి అలవాటు పడ్డ సన్యాసిని. అందుచేత ఆపరిసరాలలో ఇమిడేటందుకు తగనివాణ్ని అనుకున్నాను. నాకు అక్కడి కుషన్ (మెత్తని పరుపులు) ఉపయోగించేటందుకు మనస్కరించలేదు. సహజంగా నేలమీద ఏదో ముతక చాపమీద పడుకునే అలవాటు గలవాణ్ని. అయినా నా చుట్టూ చేరి అప్పుడే వికసిస్తున్న హృదయాలుగల యువకులు రాత్రంతాముచ్చట్లు చెప్పుతూ తమ మనస్సుల్లో ఉన్న భావాలన్నీ తెలియజేస్తూఉంటే నాకు ఎదురైన వసతి సౌకర్యాలవల్ల కలిగిన ఇరకాటాన్ని పట్టించుకోకుండామరచి పోయాను. వారితో జరిగిన సంభాషణలనుంచి వారి స్వతంత్రభావాలు ఎంత అణచిపెట్టబడినాయో, ముస్లిమేతరులు ఎంత అన్యాయమైన అసం గతమైన వివక్షణలకు గురిఅవుతున్నారో నేనప్పుడు ఆవగాహన చేసుకో గలిగాను విద్యార్థిలోకంలో అనేక పెద్దవర్గాలవారు చెప్పిన మాటలను బట్టి వారిమనస్సులలో కుతకుతలాడుతూ మరుగుతున్న భావావేశము వారెంత తీవ్రమైన ఆఘాతాలకు గురిఅవుతున్నదీ స్పష్టంచేసింది. వారిలో కొందరు నేను విద్యావిషయిక కార్యక్రమాలు వదలిపెట్టి మరొక విస్తృత రంగంలో ప్రవేశించి ప్రజలను సమీకరించి, సంస్థానంలోని నిరంకుశ ప్రభుత్వాన్ని కూలదోసేకృషి చేయవలసినదని కోరారు. వారందరి మాటల్ని నేను ఓర్పుతో విన్నాను. యువతరం రాజకీయ పరిస్థితులపట్ల అసంతుష్టితో, కసితో రోజుతూ బుసలు కొడుతోంది. అది కళ్ళారా చూసి వారి మాటలు చెవులారా వింటూ నిర్లిప్తతతో ఎట్లా ఊరుకోగలను? వారి సూచనలను గురించి తప్పకుండా ఆలోచిస్తానని వాగ్దానం చేసాను.

ఆనాటి సాయంకాలం "శ్రీకృష్ణపరమాత్ముని సందేశము" గురించి మాట్లాడాను. విశ్వవిద్యాలయ ప్రోవైస్ ఛాన్సలర్, కొందరు ఉపన్యాస కులు నగరంలోని పెద్దలు విద్యార్థి సంఘ సభ్యులు యావన్మందీ ఆ సభకు వచ్చారు. నేను ఇంగ్లీష్‌లో మాట్లాడాను. నా మాటలు ఆసక్తితో

పిన్నారు. వానిలో నివిషయంపైనా అది ఎట్లున్నప్పటికీ నాకు హైదరాబాదు నగర విద్యార్థులతో సన్నిహిత సంబంధము ఏర్పడింది. వాడునన్ను, నాసంగతి తెలుసుకొన్నారు వారికి నాపట్ల విశ్వాసం కలిగింది. వారు నన్ను అభిమానించి నా వెంటనిలిచి అప్పుడు ఇంకా రూపురేఖలు దిద్దుకొంటూ ఆ తర్వాతికాలంలో కొనసాగిన స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు. ఆనాటి నుంచి ఉద్యమానికి జీవంవంటిదైన ఈ అనుబంధ సంబంధము మాలో కొనసాగింది.

విద్యార్థి లోకం మనస్సులో ఉన్న కోరికలు ఆశయాలు నేను అద్దంలో చూసినట్లు చూసాను. వారు ఎప్పుడు కార్య రంగంలోకి దూకుదామా అనే ఆత్రంతో ఉన్నారు. వారిలోని అశాంతి, అవధులన్నింటినీ దాటి పోయింది. తమకు కలుగుతున్న అవమానాలన్నింటిని చూస్తూ సహిస్తూ తల ఒగ్గి ఉండే ఓర్పు వారిలో నశించింది. వారు తమదారితామే ఎన్ను కోవాలనే ఆలోచనలు చెస్తున్నారు. వారిలో పేలడానికి సిద్ధంగా ఉన్న అగ్ని పర్వతం, జ్వలించ డానికి సిద్ధంగా ఉన్న అగ్ని వంటి ఆవేశం ఉంది వారి ఆశయాలకు భావాలకు, క్రమ బద్ధమైన రూపం ఇచ్చి, తీర్చి దిద్ది, సంఘ శ్రేయస్కరమైన దారిని నడిపించ వలసిన అగత్యం ఏర్పడిందని గుర్తించాను. అది జరగక పోతే వారు సరియైన ఏకైక నాయకత్వం లెక ఎవరి దారి వారు చూసు కొనడం జరుగుతుంది. అది వారికీ, సంఘానికీ కూడా అత్యంత ప్రమాదకరము. ఇట్లా ఆలోచించి వారిని వీడ్కొనే సమయంలో నేను వారితో సాంగత్యాన్ని పెంపొందించు కొంటానని మాట ఇచ్చి వచ్చాను. ఈ సంఘటన, అను భవము పరిచయము, నా బలాన్ని ఎంతో వృద్ధి చేసాయి.

—o—

# 13. తొలి విజయము

శ్రీ యోగేశ్వరీ నూతన్ విద్యాలయానికి ప్రభుత్వపు గుర్తింపును పొందడము దాని నిర్వహణకు అనుమతి సాధించడము అనే సమస్య మా అందరి మనస్సులనూ కలతపెడుతున్న సమస్యగా ఉన్నప్పటికీ మేము ఆ సంస్థను పరిపూర్ణ విశ్వాసంతో, ధైర్యంగా నడుపుతున్నాము అనిశ్చిత వాతావరణ పరిస్థితి దాన్ని ఆవరించినప్పటికి అందులో చదువుతున్న విద్యార్థులు సుమారువెయ్యిమంది అయ్యారు. స్థానికంగా ఉన్న ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలోని విద్యార్థుల సంఖ్య క్రమ క్రమంగా క్షీణించ (తగ్గ) సాగింది. మా సంస్థలోని విద్యార్థులు స్వతంత్ర వాతావరణంలో అభివృద్ధి చెందే అవకాశం ఉంది. ప్రభుత్వ విద్యాసంస్థలో అది సాగదు వారు తమ ఆత్మగౌరవాన్ని జాగ్రత్తగా ఇంటిదగ్గరనే వదలి వినయ విధేయతలతో దాసభావంతో మెలగాలి అందుచేత ప్రజలు తమ పిల్లలను ప్రజా సంస్థలు నడుపు తున్న పాఠశాలలో చేర్చేటందుకే అందులో చెల్లించవలసిన ఫీజులు ప్రభుత్వసంస్థలలో చెల్లించ వలసిన వాటికంటే చాలా ఎక్కువైనప్పటికీ, ముందుకు రావటం జరిగింది తల్లిదండ్రులు తమ బిడ్డలకు ఆత్మగౌరవంతో జీవించే విద్యాబోధనలు లభించేటందుకు తమకున్న ధనంలో కొంత త్యాగం చెయ్యడానికి సిద్ధపడ్డారు.

మా విద్యాసంస్థ నిర్వాహకులు ప్రభుత్వ విద్యాశాఖవారికి ఎంత నచ్చచెప్పినా మా సంస్థకు పరిగణన లభించలేదు ప్రభుత్వానికి మా విద్యాసంస్థ ఆశయాలు, నిజస్వరూపము అప్పటికి తెలిసే ఉంటుంది. తమకువ్యతిరేకంగా ఉండె సంస్థలు వాటంతట అవే వాడిపోయి, మాడిపోయి,నేల రాలిపోయేటట్లు వదలివెయ్యాలేగాని వాటికి ప్రభుత్వపు గుర్తింపు

ఇయ్యకూడదు అని నిశ్చయించుకొన్నట్లున్నారు అట్లాంటి తాత్సారంలో రెండు సంవత్సరాలు గడిచాయి ప్రభుత్వం మా విద్యాసంస్థను మూసివేయమని ఆజ్ఞాపించలేరు అట్లాంటి చర్య నియమావళికి వ్యతిరేకము. ఈ సమస్య ఒకదశలో, మంత్రివర్గస్థాయిలో పూర్తిగా చర్చించినట్లు కూడాకూడు తెలిసింది. ఇంతలేసి పనులకు ఒడిగట్టిన ప్రభుత్వం, న్యాయచట్టబద్ధంగా పని చేస్తున్న విద్యాసంస్థను ఉడిచిపెట్టడం అసాధ్యమని గుర్తించింది. బహుశా, సంస్థానంలోని అన్ని వర్గాలకు చెందిన విద్యావంతులు ప్రముఖులు మావిద్యాసంస్థను మా కార్యక్రమాలను ఆమోదించి మెచ్చుకొనడం వల్ల మా పై ధ్వజమెత్తడం అసాధ్యమని ప్రభుత్వం వారనుకున్నారేమో. ఏమైతే నేమి. మేము మా విద్యా సంస్థను ఎట్టి పరిస్థితులలోనూ మూసివేసేది లేదని నిశ్చయించాము! మేము విజయం లభించే వరకూ పోరాడాలనే నిర్ణయించినాము విజయం సాధిస్తే మా కార్యక్రమాలను విస్తృతం చెయ్యవచ్చు. ఒక సమయంలో ప్రభుత్వం మా సంస్థలో ఉన్నత తరగతులను మూసివేయాలని వాటిలో చదువుతున్న విద్యార్థులను ప్రభుత్వ పాఠశాలలో ప్రారంభింప నున్న తరగతులకు బదిలీ చెయ్యవలసిందనీ, ఆర్డర్లు పంపింది. మేము మోమినాబాదు పాఠశాల ఏర్పాటు చెయ్యాలని, వెళ్లకముందే అక్కడి ప్రజలు ప్రభుత్వ పాఠశాలలో ఉన్నత తరగతులు ప్రారంభించ వలసిందని కోరడము, ప్రభుత్వం, వారి కోరికను తిరస్కరించడము, జరిగాయని తెలుసు కొనడం ఆసక్తి దాయకంగా ఉంటుంది. ఇప్పుడు, రెండు సంవత్సరాలు గడచిన తర్వాత, ప్రజలే ఉన్నత పాఠశాల ఏర్పాటు చేసుకొని నిర్వహించు కొంటున్నప్పుడు ప్రభుత్వం వారని మీరు నిర్వహించు కొంటున్న తరగతులు మూసి వేయండనీ మేము వాటిని మా విద్యా సంస్థలో ఏర్పాటు చేస్తామనీ అనడంలో ఏదో కుత్సితం ఉందన్నది స్పష్టము. మేము ప్రభుత్వ విద్యాశాఖ ఇచ్చిన ఆర్డర్లు ఆమోదించేది లేదని ఏ పరిస్థితులలోను మా విద్యాసంస్థలోని తరగతులను మూసి వెయ్యడం గాని, బదిలీ చెయ్యడం గాని జరగవనీ అవసర మనుకొంటే తమ విద్యా సంస్థలో తరగతులు ప్రారంభించేటందుకు ప్రభుత్వా

నికి స్వేచ్ఛ ఉందనీ తెలియజేసాము ప్రభుత్వానికీ మా సంస్థకూ నడుమ ఉన్న వైమనస్యాల స్థాయి బాగా హెచ్చింది మూడో సంవత్సరం పూర్తి కావచ్చే సమయంలో, మా విద్యార్థులలో మొదటి జట్టు ప్రభుత్వం నిర్వహించే ఉన్నత పాఠశాల విద్యార్థుల పరీక్షలకు వెళ్లవలసిన కాలవ్యవధి ఆసన్నం అయిన వెంటనే ప్రభుత్వం మా విద్యా సంస్థ నిర్వహణకు అనుమతిని మంజూరు చేసింది.

ఇది ప్రజా విజయం. ఇందు వల్ల పరిష్కారమైన సమస్య ఏమీ అంత పెద్దది కాదు కాని, ఈ విజయం యొక్క అసలు ప్రాముఖ్యం మరొక రంగానికి చెందింది. ఈ విజయ గర్వప్రభావం నిజంగామనస్సుకు సంబంధించింది. సంస్థానంలో ఎక్కడెక్కడ ఉన్న ప్రజలూ మా విద్యా సంస్థ భవిష్యత్తు ఏ రీతిగా నిర్ణయి మవుతుందో అని ఆతృతతో ఈ మూడేండ్లూ ప్రతి సంఘటనను పరిశీలిస్తున్నారు పౌర హక్కులకు సంబంధించిన ఈ విషయాన్ని గురించి కేసు ఎంత చిన్నదైనప్పటికీ, పోరాటం జరుగుతూ ఉండటం వల్ల ప్రజలలో ఆసక్తి చైతన్యము కదలిక కలిగాయి అది చివర వరకు కొనసాగి విజయం లభించగానే జీవితంలో ఇతర రంగాలలో కూడా కార్యక్రమాలు సాగించాలనే ప్రబలమైన కోరికలు ప్రజలకు కలిగాయి మోమినాబాద్‌లోను దాని పరిసర ప్రాంతాలలోను ఉన్న ప్రజల ఉత్సాహం ప్రవాహానికి అడ్డుగా ఉన్న లాకు తలుపులు తెరచినట్లే అయింది. ఒకముఖ్యమైన జీవిత సమస్యకు పరిష్కారం సాధించుకొన్నట్లుగా వారు తృప్తిచెందారు.

సంస్థానంలో అన్ని మూలలనుంచి ప్రజలు తమ సంతృప్తిని వెల్లడిస్తూ మా విద్యా సంస్థ కార్య నిర్వాహకులను
నందుకు అభినందించారు.

ఆ తర్వాత, ప్రజలు విద్యా సంస్థలు ఏర్పాటు చేసు కోవడానికి ఆటంకాలుగా ఉన్న నియమావళిని ప్రభుత్వం సవరించి ప్రజా విద్యా సంస్థల ఏర్పాటు సుకరంచేశారని చెప్పడం పునరుక్తి అవుతుంది.

ఈ విజయం వల్ల ప్రజలలో ఆత్మ విశ్వాసం పెరిగింది. ప్రభుత్వాన్ని ఎదిరించ వచ్చుననీ అన్యాయపు ఆర్డర్లను ధిక్కరించ వచ్చుననీ వారిలో ధైర్యం కలిగింది ప్రజల మనస్సులో ఇకమీదట అన్యాయాన్ని సహించేది లేదనేధిక్కార స్వభావం వేరు తన్ను కొన్నది. మోమినాబాదు సంఘటన, ఆ తర్వాత సంస్థానంలో జరిగిన చరిత్రాత్మక స్వాతంత్ర్య పోరాటానికి ప్రారంభం వంటిదైంది ప్రజలలో రేగిన కార్యాచరణోత్సాహము, సహజంగా వారు మార్గ దర్శకత్వం కోసము మోమినాబాదు వైపు చూసేటట్లు చేసింది

అత్యంత ప్రాథమికమైన కార్యంపూర్తి చేయగానే ప్రజల బలాన్ని మరింత సార్థకంగా ఉద్ధృతంగా సమీకరించే కార్య క్రమం చేపట్ట వచ్చునని నా కనిపించింది. దానికి ఆవశ్యకమైన విశాలమైన రంగస్థలంలోకి దూకేటందుకు తగిన సమయం కూడా ఆసన్నము కాసాగింది.

# 14. లాతూర్ రాజకీయాల్లోకి మొదటి అడుగు

1937, 1938 సంవత్సరాలు హైదరాబాదు సంస్థాన స్వాతంత్రోద్యమ చరిత్రలో ప్రముఖమైన స్థానం వహించినట్లు మనం పరిగణించ వచ్చు ఆ కాలంలోనే రాజకీయ భావాలకు ఒక స్థిరమైన రూపం ఏర్పడటమూ, అవి ఒక కచ్చితమైన ఆకారం ధరించడమూ జరిగాయి. ఆ సమయంలోనే సంస్థానంలో యథార్థమైన రాజకీయ జీవితం ప్రారంభమైనట్లు కూడా అంచనా వెయ్యడం తప్పుకాదు. ప్రజలలో ఎక్కువ మంది ఒక నిర్దిష్టమైన పద్ధతిలో ఆలోచనలు చెయ్యడం మొదలు పెట్టారు అందరి ఆలోచనలూ ఆశయాలూ ఒకే దిశలో ప్రయాణం చెయ్యడం మొదలైంది "ప్రజాస్వామ్య విధానాన్ననుసరించిన స్వాతంత్ర్యాన్ని సంపాదించే టందుకు, పోరాటాన్ని కొనసాగించే టందుకు సాధ్యమైనంత విరివిగా బలాలు సేకరించడం ఎట్లాగా? అనేదే అందరి లక్ష్యమూ అయింది.

ఇదివరకు ముందు చెప్పినట్లు తెలంగాణా, కర్నాటక ప్రాంతాలలో పని చేస్తున్న ప్రజా సంస్థలు అప్పటి వరకూ రాజకీయాలతో ఏమీ సంబంధం లేనట్లుగానే ఉన్నాయి. కర్నాటక పరిషత్ ఒక్కసారి మాత్రమే సమావేశమైంది. అందుచేత అది ఏమిటని తలపెట్టి నిర్వహించిందని అనే అవకాశం లేదు. ఆంధ్ర మహాసభ అనేక సాంవత్సరిక సమావేశాలు నడిపినప్పటికీ ప్రజలదైనందిన రాజకీయ సమస్యలతో ప్రత్యక్ష సంబంధం కలిగించుకోకుండా జాగ్రత్తగా, వాటికి దూరంగానే ఉంది. అందుచేత అవి కొత్త పరిస్థితులకు, అవసరాలకు తగినట్లుగా

ఉపకరించే సాధనాలుగా లేవు. ఈ భావం ఆ మహాసభలను ఏర్పాటు చేసి నిర్వహిస్తున్న కార్యనిర్వాహకులలో కూడా ఉదయించింది. మరాఠ్వాడా లోని కార్యకర్తలు కూడా ఒక రాజకీయ సంస్థను ఏర్పాటు చేసే ప్రయత్నాలు చేస్తున్నారు. అటువంటి సంస్థ ఏర్పాటుకు కూడా తగిన సమయము ఆసన్నమైంది.

హైదరాబాదు సంస్థానంలోని మరాఠ్వాడా ప్రాంతంలో అంత వరకు ఆ ప్రాంతంలో రాజకీయ చైతన్యంగల వారినందరినీ కూడగట్టె వ్యవస్థ ఏదీ లేదు. ఆంధ్ర, కర్నాటక మిత్రులు ఏర్పాటు చేసుకున్నట్లె తాము కూడ మహారాష్ట్ర పరిషత్ ఏర్పాటు చేసుకోవాలనే కోరిక వారికి కూడా సహజంగా కలిగింది. అదే సందర్భంలో, తమ సంఘానికి స్పష్టమైన రాజకీయ ఆశయాలు కూడా ఉండాలనే గాఢమైన వాంఛ కూడా కలిగింది. కాలానుగుణంగా ప్రాదుర్భవించి తీవ్రమవుతున్న ఆశయాల దృష్ట్యా కేవలం సాంస్కృతిక, సారస్వత, సామాజిక కార్యకలాపాల వల్ల ప్రజలకు తృప్తి కలగదని గమనించడం జరిగింది. రాజకీయ స్వాతంత్ర్యం లభిస్తేనే గానీ, నిజమైన సాంఘిక, సారస్వతాభివృద్ధి, ప్రగతి సిద్ధించే అవకాశం ఉందని గుర్తించడం కూడా జరిగింది. మరాఠ్వాడా కార్యకర్తలు స్పష్టమైన రాజకీయ కార్యక్రమాల ప్రసక్తి ఉంటేనే గాని ఊరుకొనేటట్లు లేరు.

మహారాష్ట్ర పరిషత్ మొదటి సమావేశం 1937 వేసవి కాలంలో పర్టూర్‌లో జరిగింది. ఆ సభకు (ఇప్పుడు స్వర్గీయులైన, శ్రీ గోవింద రామనానాల్‌ను అధ్యక్షత వహించమని కోరారు. ఆయనే ఆ తర్వాత హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసుకు మొదటి అధ్యక్షుడు కావడము, సత్యాగ్రహాలలో మొదటి జట్టుకు నాయకత్వం వహించడమూ కూడా జరిగాయి. ఆ సమావేశానికి అన్ని ఏర్పాట్లూ జరిగాయి. సభ జరిగే సమయానికి ముందు ఎన్నో అభ్యంతరాలను ఎదుర్కొనడం, వాటిని దాటుకొనడం అవసరమైంది. సభా స్థల నిర్మాణానికి వాడిన వస్తువులకు అభ్యంతరము

పెట్టారు సభ ఏర్పాటు చేస్తున్న కార్యకర్తలకు గవర్నమెంటు సాధ్యమైనన్ని చీకాకులు కల్గించారు. కాని, ఆ కార్యకర్తలు దృఢ నిశ్చయంతో, శక్తియుక్తులతో ఎదుర్కొనడంతో ఆ అడ్డంకులు నిలబడ లేదు. సభ ప్రారంభమైంది.

మరాట్వాడాలో అన్ని ప్రాంతాలనుంచీ ముఖ్యులైనవారు అధిక సంఖ్యాకులుగా సభలో పాల్గొనేటందుకు వచ్చారు నేను కూడా సభా సమావేశానికి రెండు రోజులు ముందుగానే పర్టూరు వెళ్ళాను. సమావేశ కర్తలతో సహకరించాలనీ, సభకు కావలసిన ఏర్పాట్లు చెయ్యడంలో వారికి తోడ్పడాలనీ నా ఉద్దేశము. సభా సమావేశ కర్తలలో గాని, ఆహ్వాన సంఘం వారిలోగాని, కీలక పాత్ర నిర్వహిస్తున్న ముఖ్యులలో గాని కలిసిపోయి పాల్గొంటూ ఉండేటందుకు నేనింకా సంసిద్ధుడను కాలేదు. జరుగుతున్నవి అన్నీ చూస్తూ, వింటూ నోరు విప్పకుండా ఉండాలని అనుకున్నాను. అందుచేత, భోజనాల ఏర్పాట్లను చూసే పని మాత్రమే స్వీకరించాను.

అసలు సభా సమావేశానికి కొన్ని వందలమంది మాత్రమే వచ్చారు. వారందరూ మరాట్వాడా లోని వివిధ ప్రాంతాలకు చెందిన వారు కావడమే ఆ సభయొక్క విశిష్టత వారందర్నీ కూడగట్టిన భావము రాజకీయ సమస్యల చర్చావేదిక ఒకటి ఏర్పాటు చెయ్యాలన్న గాఢమైన కోరిక. అందరికీ ఆ విషయంలో ఏకాభిప్రాయమే. అందువల్ల ఆ సభలో ఐకమత్యము, ఏకైక లక్ష్యము ప్రత్యక్షమయ్యాయి అట్లాగని ఒకరేదైనా ప్రతిపాదించగానే అందరూ తలలూపారని కాదు. ఆ మొదటి సమావేశంలోనే వేర్వేరు రాజకీయపు రంగులు కనిపించడం కూడా ప్రారంభమైంది ప్రజా సమస్యలను పరిశీలించే దృక్కోణాలతో భేదాలు, సమావేశంలో జరిగిన చర్చలలో కూడా స్పష్టంగా వ్యక్తమయ్యాయి. ఏ ఆవేశమూ వేడీ లేకుండా లాభనష్టాలు, కష్ట నిష్ఠూర్యాలు లెక్కలు చెప్పి వివరించే పరిపాలనా చట్టాన్ని గౌరవించే వారు తమ వాదాన్ని, భావాలను అందరికీ నచ్చచెప్పే ప్రయత్నాలు చేసారు. వారు మిగిలిన

ప్రతినిధులలో ప్రతి ఒక్కరినీ కలుసుకొని, బుజ్జగించే ధోరణిలో మాట్లాడుతూ ప్రభుత్వానికి ఆగ్రహం కలిగించే మాటలు సభలో మాట్లాడ వద్దని చెప్పి యువతర ప్రజా రాజకీయ వ్యూహారచనను శక్తి హీనం చేసి భావావేశ అగ్నిజ్వాలలు ప్రజ్వలించకుండా చల్లార్చే కృషి చేశాను మరొకవంక ధైర్య సాహసాలు ఉన్న ప్రగతిశీల వాదులవర్గము, చొరవగా ముందుకు నడవాలని, దానికి తగిన కార్యక్రమం రూపొందించాలనీ అన్నారు ఈ రెండు వర్గాలవారూ ప్రతి ఒక్కరిని తమవైపు సుముఖంగా ఏర్పాట్లు చేసుకోనాలని చేస్తున్న యత్నాలు చూస్తుంటే చాలా తమాషాగా ఉన్నట్లుండేది వాటితోపాటు ప్రభుత్వము రాజద్రోహకరమైన చర్యలుగా భావించే చర్యలు కొల్లలుగా ప్రత్యక్షమయ్యాయి. ఈ సభా జాతి విముక్తికోసం సామాన్యంగా అందరూ అనుసరించేదీ అత్యంత ప్రమాద భూయిష్టమైన కొత్తదారినీ పథకాన్నీ రూపొందిస్తుందా ? అని అందరూ ఎదురుచూడ సాగారు

మహారాష్ట్ర పరిషత్ ఆశయాలు, లక్ష్యాలు ఆ పరిషత్ నియమ నిబంధనలలో పొందుపరచ వలసి ఉంది. అదే అసలు వాద ప్రతివాదాల మధ్య నలుగుతోంది. ఎక్కువ ఆవేశంతో చర్చలు జరిగిన తర్వాత ఆ విషయాన్ని తేల్చేటందుకు ఒక సంఘాన్ని ఏర్పాటు చెయ్యాలనీ ఆ, సంఘం తమ నివేదికను, తీర్మానాన్ని మరుసటి సంవత్సరము లాటూర్‌లో జరగనున్న సభలో చర్చించి తీర్మానించే టందుకు సమర్పించాలనీ వాయిదా నిర్ణయం కావించారు.

అంతకు ముందు ఒకరి నొకరు చూడని వారెందరో ఆ సమావేశంలో ఒకరి కొకరు పరిచయులయారు మారట్వాడా లోని కార్యకర్తలు అంతకుముందు ఎప్పుడూ ఒకచోట కూడలేదు. అందు వల్ల ఒకరి భావాలను మరొకరు కల బోసి ఆలోచనలు చేసుకొనే టందుకు, తమ అనుభవాలు ఇతరులతో పంచు కొనేటందుకు అనేక అవకాశాలు లభించాయి. ఈ సమావేశ సందర్భంలోనే నాకు ఔరంగాబాదు నగరాన్నుంచి వచ్చిన ప్రతిభా

వంతులైన యువకుల వర్గంతో సాన్నిహిత్యం లభించింది, ఏదో అలౌకిక మైన అనుబంధము నన్ను వారివైపు ఆకర్షించింది. వారితో పట్టుదల, మనఃస్ఫూర్తిగా ముందుకు పోవాలనే కోరిక వ్యక్తమయాయి. వీటికి తోడు ప్రమాదాన్ని లెక్క చెయ్యకుండా ముందుకు దూకాలి అనే చొరవ కనిపించింది. నన్ను,మరికొందరినీ వారు తమ శిబిరంలోకి ఆహ్వానించారు. మేమందరముఒకరి అభిప్రాయాలను మరొకరు పంచు కున్నాము. చొరవగా ముందుకు అడుగు వెయ్యాలనే భావశుద్ధి కలవారి కలయిక జరిగి నట్లైంది. ఇప్పుడు సన్నిహితులమయాము కనుక: ఇంక ముందు ఒకరి కొకరు జాబులు వ్రాసు కొంటూ లక్ష్య సాధనకు తీవ్రమైన కృషి చెయ్యాలని అను కొన్నాము. మిత్రులు నన్ను పరిషత్‌కు జనరల్ సెక్రటరీగా ఉండ వలసిందని కోరారు. నేను అంతకు ముందు చేపట్టిన కార్యక్రమం అప్పటికింకా విజయ వంతంగా పరిష్కారం కాలేదు. అసందిగ్ధ స్థితిలో ఉంది. నేను చేపట్టిన కార్యక్రమము అసంపూర్తి స్థితిలో ఉందనీ అందు చేత, వారి ప్రతిపాదన ఆమోదించ లేననీ చెప్పాను. అప్పుడు వారు శ్రీ దిగంబర్ రావు, గంగాదర్ రావు బిందూను జనరల్ సెక్రటరీగా చేసి నట్లు నాకు జ్ఞాపకం వస్తోంది.

లాటూర్ (పర్‌టూర్) సమావేశం మరాట్వాడా ఆలోచనలు ఏ దిశలో ప్రసరిస్తున్నాయో వ్యక్తం చేసింది. అది రాజకీయ భావాల సమీకరణకు దారి చూపింది; ఏర్పాటు చేసింది. ఏమి జరిగినా సరే ఏ త్యాగం అవసరమైనా సరే ముందుకి పోవాలి అనే దృఢ నిశ్చయం వ్యక్త మైంది. మొత్తంమీద "ప్రజా స్వామ్య జీవిత విధానం కోసమూ, స్వాతంత్ర్యం కోసమూ త్యాగం చెయ్యాలనీ,ఎదురైన ప్రమాదాలను కష్ట నిష్టురాలను సహించాలనీ ప్రజలు నిశ్చయించు కొన్నట్లు స్పష్టంగా తేలి పోయింది అనీ సంగ్రహంగా చెప్ప వచ్చు.

పర్‌టూర్ సమావేశం నుంచి కొత్త ఉత్సాహంతో ఆశాపూర్ణమైన మనస్సులతో మేము మా స్థానాలకు వెళ్లి పోయాము.

ఆకాలంలో హైదరాబాద్ సంస్థానంలో హిందూ,ముస్లిమ్ కొట్లాటలు జరిగాయి "ఇంక ఎంత మాత్రమూ మేము ఈ అవమానాలనూ అణగ తొక్కడాన్ని సహించేది లేదు" అని హిందువులు అసంతృప్తితో, కసిగా బుసలు కొడుతూ ఉన్నారు వారు తలెత్తి తమర్ని అణగ ద్రొక్కి ఉంచు తున్న నిరంకుశ పరిపాలనను ఎదిరించారు. దురదృష్ట వశాత్తూ వారి వారితిరుగుబాటుకు మతా వేశపు రంగుపులమడం జరిగింది. అందువల్లనే మత కలహాలు జరిగాయి దానిలో పాల్గొనడానికి, కష్టాల నెదుర్కొన డానికికూడా, సంసిద్ధత, సాహసమూ అవసరమే. హమ్నాబాదులో కొన్ని ప్రాంతాలలో నడిచి వెళ్ళేవారు ఎలాంటి అవమానాలకు, అత్యాచారాలకు గురి అవుతూ ఉండటం జరిగెదో నేను ఇంతకుముందే ఒక సందర్భంలో వివరించాను వాటన్నింటినీ అంతం చెయ్యాలని సహజంగా ప్రజలు నిశ్చయించుకొని ఉంటారు అందుచేత ఆ కార్యక్రమంలో తమకు నాయ కత్వంవహించేవారితో సహకరించేటందుకు ముందుకువచ్చారు ఉద్యమమూ ముందుకువచ్చి ప్రజానాయకత్వంచేపట్టింది ప్రజల విమర్శలూ, నిర సనలూ అన్నీ మత విషయికమైన సంఘటనలకు సంబంధించిన వైనందు వల్ల ఆ ప్రజాఉద్యమం మత కలహాలకు దారితీసింది అది ఆ కాలంలో ఉన్న పరిస్థితి స్వభావం ప్రజల ఆలోచనలు సరియైన మార్గం అనుస రించేటట్లు తీర్చిదిద్దక పోయినట్లయితే అనేక స్థలాల్లో రక్తపుటేరులు ప్రవహిస్తాయని గమనించాము. అయితే మేమందరమూ మా ఈ ఆలోచన లన్నీ పౌరహక్కుల కోసం సాగించ వలసిన పోరాటానికి సంబంధించి ఉన్నాయి. అట్లాంటి పోరాటాన్ని నిర్వహించేటందుకు గట్టి పునాదులున్న రాజకీయ సంస్థకు మాత్రమే సామర్థ్యం ఉంటుంది ఇప్పుడు హైదరాబాదు సంస్థానంలో అట్లాంటి సంస్థే లేదు అది ఏర్పాటుచెయ్యడం అత్యవసరము సంస్థానంలో ప్రజలను అణగ త్రొక్కడం నానాటికీ హెచ్చి పోతోంది. అది చూడగానే పర్భూర్ మహారాష్ట్ర పరిషత్‌లో పాల్గొన్న వారందరి మనస్సుల్లో అలజడి, ఆవేదన కలిగేది శ్రీ ఎ. కె వాఘీమారే సంపాద కత్వంలో పూనా నగరాన్నుంచి "మరాట్వాడా" అనే పత్రిక (సంచిక) ల

రూపంలో ప్రకటిత మయేది. అందులో ఆయన ఈ భావాలు ప్రకటించాడు. నానాటికీ దిగజారుతున్న ఈ రాజకీయ పరిస్థితులు గమనించి ఆవేదన పొందుతున్న వారందరికీ మోమినాబాద్ గమ్యస్థానమైంది వారందరూ చర్చించి ఇట్లాచేద్దాము, అట్లాచేద్దాము అని ప్లాన్ వేసేవారు. మా అందరిలోనూ ఓర్పు నశించి అశాంతి ప్రబల సాగింది ఈ సమస్యలన్నీ ముందుంచినప్పుడు నా కర్తవ్యాన్ని విస్మరించి చేపట్టిన బాధ్యతలన్నింటినీ దులిపివేసి గౌరవ చెయ్యలేని స్థితిలో ఉన్నాననే వాడ్ని. మోమినాబాద్ లోని విద్యాసంస్థను గురించిన కర్తవ్యం గొప్పది. దానికి ప్రభుత్వం నుంచి గుర్తింపు వచ్చే వరకూ నేను దాన్ని వదలి ఎక్కడికీ కదిలి పోలేను. కాని, ఆ గుర్తింపు మంజూరు కాగానే నేను నా అశక్తి గురించి చెప్పేటందుకు కారణం మాయమైంది. అప్పుడు అందరూ నన్ను తమతో కార్యరంగంలోకి దూకమని ఒత్తిడి చెయ్యడము, దానికి కాలం పరిపక్వం కావడము, జరిగాయి.

జూన్ 1 వ తేదీనాడు మహారాష్ట్ర పరిషత్ రెండో సమావేశము ఉస్మానాబాద్ జిల్లాలోని లాటూరులో ఏర్పాటైంది. ఆంధ్ర మహాసభ, కర్నాటక పరిషత్ అనే రెండు సంస్థల సందర్భాల్లో మాదిరిగానే మహారాష్ట్ర పరిషత్ సమావేశం ఏర్పాటు చేసుకోవడానికి అనుమతి ఇచ్చే ముందు సభలో రాజకీయ విషయాలు చర్చించ కూడదనే షరతును ప్రభుత్వం విధించడం జరిగింది. దానికి అంగీకరించమనీ రాజకీయ విషయాలతో సంబంధం లేని కేవలం పోచు కబుర్ల వల్ల సమావేశం నిష్ప్రయోజనమనీ మేము భావించాము. మధ్యవర్తుల కృషి ఫలితంగా రాజీమార్గంగా ప్రభుత్వం సమావేశానికి సభకు అనుమతి ఇస్తూ అధ్యక్షత వహించిన వారి అధ్యక్షోపన్యాసాన్ని, సభలో చర్చించే తీర్మానాలనూ జిల్లా కలెక్టరు పరిశీలించేటందుకు ముందుగా సమర్పించా లన్నారు దానికి కూడా సమావేశ కర్తలు అంగీకరించ లేదు కాని, మరోదారి లేక నిషేధాజ్ఞల మూలంగా అసలు సమావేశానికి అవకాశం లేకపోవడంకంటె ఈ షరతుకు లోబడి సభ జరపాలని నిర్ణయించారు. ఇంత రగడ జరిగిన తర్వాతనే లాటూర్‌లో సమావేశ మయాము.

సమావేశంలో ఎక్కువ ఉత్సాహం వెల్లి విరిసింది ప్రతినిధు లందరూ ఈ అవమానకర పరిస్థితులను కొనసాగనియ్య కూడదనే స్థిర నిశ్చయంతో వచ్చారు. సమావేశం జరిగేటంతట వచ్చిన, వస్తున్న, అడ్డంకుల నన్నింటినీ ఎగర గొట్టాలనే కోరిక అంతటా కన్పించింది. మహారాష్ట్ర పరిషత్ సంఘనం, నియమావళిలో రాజకీయ ఆశయాలు, సభ ఉద్దేశం అని పొందు పరచడం జరిగినప్పటికీ ఆ అస్పష్ట ధోరణి మాకు సంతృప్తి కలిగించలేదు. అందుచేత, మా ఒత్తిడిని కాదని తోసి వెయ్యలేక విషయ నిర్ణయసభ అమితవాద సూచనలనే అంగీకరిస్తూ తీర్మానం చేసి సర్వసభ్య సమావేశంలో తమ తీర్మానాన్ని ఆమోదించి నప్పుడే హర్షపుష్కలం దన్నారు.

సమావేశం జరుగుతున్నప్పుడు జిల్లాకలక్టర్ లాటూర్‌లో మకాము చేసాడు. ఆయన సభ శాంతంగా జరగకుండా అభ్యంతరాలు కల్పించా లనే నిశ్చయంతో ఉన్నాడు. అధ్యక్షోపన్యాసంలో ఉన్న కొన్ని వాక్యాలు తొలగించవలసిందని అవిఉండే ఉపన్యాసాన్ని సభలో చదివేటందుకు అనుమతి ఇచ్చేది లేదనీ కచ్చితంగా చెప్పాడు ఈ రీతిగా కలెక్టరు నిర్ణ యించడం సభజరగకుండా వెన్నుపోటు పొడవడమేఅని అధ్యక్షుడు, సమా వేశ కర్తలు అనుకొన్నారు. సభలో కూర్చున్న ప్రతినిధులందరూ కలవర పడ్డారు కలెక్టరు అభ్యంతరకరంగా నిర్ణయించిన వాక్యాలలో హైదరాబాదు నగరంలోని ధూల్‌పేటలో జరిగిన అల్లర్లను గురించి ప్రభుత్వం ఒక అనధికార కమిటీచే విచారణ జరిపించాలనే కోరిక వెల్లడించింది. ఆకోరికను ప్రభుత్వము అంతకుముందే నిరాకరించింది. ఇప్పుడు ఈ సభ తిరిగి మరొక సారి కోరడం అర్థంలేని అభ్యంతరము. అందుచేత కలెక్టరు చర్చ సమావే శాన్ని స్తంభింపజేసింది. హైదరాబాదు ప్రభుత్వం ఏ ఏం జరగవచ్చునని అన్నింటికీ సిద్ధంగా తయారై వచ్చింది. ముఖ్యపట్నం నుంచి స్పెషల్ రిజర్వుడు పోలీసుదళాన్ని లాటూర్ తెప్పించి కవాతుచేయిస్తూ ఉంచింది. సమావేశానికి కాలంఅతిక్రమించినప్పటికి వారికి కనిపించలేదు. ప్రజలు, ప్రతినిధులు సభాస్థలం కోసమే వేసిన తాత్కాలిక డేరా పగటిలో కూర్చు

న్నారు ఎన్నిక అయిన సభాధ్యక్షుడూ, మరికొందరు పెద్దలూ ఆసమస్యను కలెక్టరుతో చర్చిస్తూఉన్నారు చివరికి కలెక్టరు ఒక మెట్టుదిగి, తను అభ్యంతరకరంగా నిర్ణయించిన వాక్యాలు సభలో చదవకూడదని చెప్పాడు అప్పుడు మరొక సమస్య పొడచూపింది. అధ్యక్షోపన్యాసం అప్పటికే అచ్చువేయడం జరిగింది. లాటూర్‌లో అచ్చువేసే ప్రెస్‌లేదు. సభా ప్రారంభంవేళదాటి, ప్రతినిధులందరూ కూర్చుండి ఉండగాఅచ్చైన అధ్యక్షోపన్యాస పారం పంచిపెట్టకుండా ఏమిచెసేది? అప్పుడు అందరూ ఆశ్చర్యపడి ముక్కుమీద వేలు వేసుకొనేలాగ కలెక్టరు అచ్చయిరెడీగాఉన్న ఆ కాగితాలే సభలో పంచిపెట్టవచ్చునని, నిషేదింపబడిన వాక్యాలు సభలో అధ్యక్షుడు చదవడానికిమాత్రం వీలుచేదని చెప్పాడు! అధ్యక్షుడు సభలో ఉపన్యసిస్తూ మీకందరికీ తెలిసిన కారణాలవల్ల తాను ఫలానా పేజీలో ఉన్న ఫలాని సంఖ్యలైను నుంచి ఫలానా సంఖ్యలైను వరకూ చదవటం లేదని అవి తానుచదవన్ట్లు పరిగణింపవలసిందనీ వెటకారపు చిరునవ్వుతొాల కాడుతూ చెప్పాడు! సభలోప్రతివారూ వాటిని తమకుతాము చదువుకోవచ్చు కాని, అధ్యక్షుడి ముఖతా వినకూడదు! ఏమితెలివి తక్కువతర్కము. ఎంత నవ్వుపుట్టించే పరిస్థితి.

మొదటి సమావేశం తొందర, తొందరగా అందరూ ఆవేశంతో కింకర్తవ్యమ్ అనే భావంతో ఉండగానే పూర్తి అయింది. ముందున్నది ముసుళ్ళ పండగ అన్నట్లు రావలసిన ముఖ్య అభ్యంతరాలు ఇంకా మిగిలే ఉంది. కలెక్టర్ ఆ విషయంలో దృఢనిశ్చయంతో ఉన్నాడు. ఆయన ప్రజాభిప్రాయానికి తలవంచేవాడుకాడు. సర్వసభ్య సమావేశంలో ప్రవేశపెట్టనున్న తీర్మానాల పారం అచ్చయిన కాపీ షరత్తుప్రకారం ఆయనకు ఆయనకు ముందుగానే పరిశీలనకు ఇచ్చాము ఆ తీర్మానాలలో రెండు తీర్మానాలు ఆయన అంగీకరించలేదు. ఒక తీర్మానం ప్రజలకు పౌరహక్కులను గురించి తెలివిడి కలిగించే చర్యలు తీసుకొనే టందుకు ముగ్గురు సభ్యులతో ఒక కమిటీని ఏర్పాటు, చెయ్యాలి అనేది. అది శుద్ధ ప్రమాదరహితమైన తీర్మానం కాని, ఆ కలెక్టరుగారికి అందులో ఏదో

రాజకీయ ప్రభావం ఉన్నట్లు తోచింది ఆయనకు ప్రజలు రాజకీయా లంటున్నారంటే బెదురు కదా! ఇంక రెండో తీర్మానం ధూల్‌పేట అల్లర్లను గురించి ప్రజల ఎదుటనే విచారణ జరిపించాలి అనే తీర్మానం. దాన్ని గురించిన ప్రసక్తే అధ్యక్షోపన్యాసంలో ఉండకూడదని ఇంతకు ముందే నిషేధించాడు కదా: ఆ విషయమే సభ ఎదుట తీర్మానం రూపం ధరించి తిరిగి ప్రత్యక్షం కాగానే ఆయన అహంకారానికి, అధికార ప్రాముఖ్యతకూ దెబ్బ తగిలింది. ఆ చర్చా విషయాన్ని వీధి గుమ్మంలో నుంచి బైటికి గెంటితే అది దొడ్డి దారిని తిరిగి ప్రవేశించే ప్రయత్నం చేస్తున్నట్లను కున్నాడు ఆ రెండు తీర్మానాలూ సభలో ప్రవేశపెట్టడానికి అనుమతి ఇవ్వటం లేదని తన దృఢ నిశ్చయాన్ని తెలియ జేశాడు. సభలో చర్చలు, ఉపన్యాసాలు తాత్కాలికంగా ఆపి వేసి కొంత మంది ప్రతి నిధులు కలెక్టరు దగ్గరకు సంప్రతింపుల కోసం వెళ్లారు. కొంత చర్చ జరిగిన తర్వాత చివరకు పౌర హక్కుల కమిటీ ఏర్పాటును గురించిన తీర్మానం గురించి కలెక్టరు తన పట్టుదల సడలించాడు కానీ, విచారణ కమటీని గురించిన తీర్మానాన్ని చర్చించ డానికి అంగీక రించనన్నాడు. ఏమి వింత? వింతపై వింత. విషయం చర్చించ కుండానే తీర్మానాన్ని సభ అంగీకరించ వచ్చు నన్నమాట! సంప్రతింపులకు వెళ్లిన ప్రతినిధులు విజయం సాధించామని అనుకున్నారు.

ఈ లోపున మేము ప్రతినిధుల రహస్య సమావేశం జరిపి, కలెక్టరు ఒంచుకు తోస్తున్న అభ్యంతరాలు చర్చించాము. వారందరూ ఏక గ్రీవంగా ఏ తీర్మానాన్నీ ఉపసంహరించ డానికి ఒప్పుకో కూడదనీ, కలెక్టరు ఆజ్ఞల్ని ధిక్క రించి అయినా వాటిని సభ అంగీకరించ వల సిందే ననీ అన్నారు అరెస్టయే అవసరం వస్తే అందుకు మేము సిద్ధంగా ఉన్నాము. మేమూనూ. అంటూ జట్లు, జట్లుగా పదులు, ఇరవైలలో జనం ముందుకు దూకారు. కాని, బలా బలాలు, లాభ నష్టాలు లెక్క చూసి ముందడుగు వేసే తరహా వారు మాత్రము 'నిదానమే ప్రధానం' అనీ 'తొందర పడవద్దు ప్రమాదం ముంచు కొస్తుంది'. అనీ వెనక్కి కళ్లెం

లాగసాగారు కాని, వారు కూడా ఉవ్వెత్తుగా లేచిన ప్రజాభిప్రాయ తరంగం ముందు నిలబడ లేక పోయారు ఆ తర్వాత కాలంలో ప్రజా సమ్మతమైన మంత్రి వర్గం ఏర్పాటైనప్పుడు మంత్రి పదవి నలంకరించిన ఒక నాయకుడు మూడు నెలల కాల వ్యవధి ఇస్తున్నాననీ, ఆ వ్యవధిలో ఈ తీవ్రవాదపు కబుర్లు చెప్పేవారు నూటఏభై మంది సత్యాగ్రహుల్ని సమీకరించ గలిగితే తాను నూటఏభై ఒకటో వాడి నవుతాననీ వాగ్దానం చేసాడు సత్యాగ్రహ ప్రభావం, స్వరూపం, త్యాగనిరతి, ఆయన ఎంత చక్కగా అర్థం చేసుకొన్నాడు! ఎంత చక్కగా ప్రజలకు చెప్పాడు. అని అందరూ హాస్యం చేస్తూ ముక్కు మీద వేళ్లు వేసుకొన్నారు. సమయం కని పెట్టి చొరవగా ముందుకు అడుగు వేసి ప్రజల్ని తనతో ముందుకు కొని పోయే స్వభావం ఒడులు, నాయకత్వంలో భయసందేహాలు ఇంకా ఆవరించి ఉన్నాయని ఆ సంఘటనవల్ల వ్యక్తమైంది.

ప్రతినిధులు సభ కొనసాగించడానికి అంగీకరించమనీ, అవమాన కరమైన షరతులకు తల ఒగ్గి, ఏ చర్చలు లేకుండా సభ జరపడానికి బదులుగా సభ వాయిదా వెయ్యనారని తాము సుముఖులమని గట్టిగా చెప్పారు ఏ గాలి అనుకూలంగా ఉంటే ఆ గాలివైపు తమ జెండా తిప్పే టటువంటి అలవాట్లు చేసుకొని ప్రభుత్వ చట్ట నియమాల కనుకూలంగా వ్యవహారాలు నిర్వహించాలనే తత్వంగలవారు సభను నడిపించి ఎట్లాగో ఒకలాగు [illegible] భావాలు వెల్లడించారు. కాని, చివరకు వారుకూడా అప్రధానమైన మిగిలిన వారి నిర్ణయానికి అంగీకరించారు పౌరుల స్వేచ్ఛకు భంగం కలిగిస్తూ అకారణంగా అధికారులు సభకు సంబంధించిన ప్రతి విషయంలోనూ జోక్యం కలిగించుకొని అనుచితమైన ఉపద్రవాలు కలిగించి నందువల్ల తమ నిరసనను తెలియజేస్తూ ఈ సభలో కూడిన ప్రతినిధులు సభను నిరవధికంగా వాయిదావేయడం జరిగిందని ప్రకటించడం జరిగింది ఆ ప్రకటన చేయడానికి ముందు గానే పౌరహక్కుల పరిరక్షణకోసం తిరుగుబాటు చేసేటందుకు అనుకూలంగా ప్రజాభిప్రాయాన్ని తీర్చి దిద్దేటందుకై ముగ్గురు మెంబర్ల కమిటీని

ఏర్పాటు చేసారు ప్రతినిధులందరూ ఒక్కుమ్మడిగా ఆ కమిటీ సమావేశ కర్తగా నా పేరు సూచించారు అయినా వారికి దానితో సంతృప్తికలగ లేదు. నేను వెంటనే విద్యారంగం నుంచి బైటికి వచ్చి పూర్తిగా రాజకీయ కార్యక్రమాలలో నిమగ్నుడను కావాలనీ మహారాష్ట్ర పరిషత్ కార్యదర్శి పదవిని చేపట్టాలనీ ఆదేశించారు.

అతి కచ్చితంగా ఉన్నా ఆ సభా నిర్ణయాలు నాకు మరోదారి దేన్నీ మిగల్చలేదు. నేను వెంటనే శ్రీ యోగీశ్వరీ నూతన్ విద్యాలయ యాజమాన్య కమిటీ వారిని లాటూర్ రావలసిందని కబురు చేశాను. వారికి, క్రొత్తగా రూపొందిన పరిస్థితిని వివరించాను వారు కూడా దేశం యొక్క అవసరాన్ని గుర్తించి, నేను తప్పుకొన్న తర్వాత, తాము ఆ సంస్థ నిర్వహణ, అభివృద్ధి బాధ్యతలను పూర్తిగా స్వీకరిస్తామని మాట ఇచ్చి రాజకీయ ఉద్యమంలో క్రొత్త బాధ్యతలు చేపట్టేటందుకు సంతోష పూర్వకంగా నాకు స్వేచ్ఛ ఇచ్చారు.

నేను మోమినాబాద్ వెళ్ళి లాంఛనప్రాయంగా ఆ విద్యా సంస్థతో సంబంధం తెంచుకొన్నాను. అనేకమంది సహచరుల శుభాకాంక్షలతో హైదరాబాదు నగరానికి ప్రయాణం కట్టి 1938 లో జూన్ 9 నాడు రాజకీయ రంగంలో పూర్తిగా నిమగ్నుణ్నై సేవ చేసేటందుకు ప్రారంభం చేసాను.

నేను వదలిన తర్వాత ఆ విద్యా సంస్థను శ్రీ ఆర్. జి పరాంజపె కొంతకాలం నిర్వహించారు కాని, ఆయన కూడా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనేటందుకై ఆ సంస్థను వదల వలసి వచ్చింది ఆ సంస్థను తర్వాత ఎదురైన అనేక చికాకుల నుంచి రక్షిస్తూ భద్రంగా నడిపించ వలసిన బాధ్యత నా సహచరులైన బెధూజీ అనే పేరుతో ప్రఖ్యాతి పొందిన శ్రీ బి బి భెడ్డికర్, శీవక్‌నాథ్ రావ్ కులకర్ణి అనే వారిద్దరూ వహించారు వారిద్దరి నిరాడంబర కార్యశీలత, నిరంతర శ్రద్ధ కలిసి ఆ విద్యా సంస్థ, దేశసేవాసక్తిని విద్యతో మేళవించి వర్ధిష్ణువైన యువతరానికి సార్థకమైన విద్యను ప్రసాదించేటట్లు చేసింది. ఉన్నత పాఠశాలగా ప్రారంభమైన ఆ విద్యా సంస్థ ఈనాడు కళాశాలగా అభివృద్ధి చెంది, వ్యాపార, విజ్ఞాన శాస్త్రాలను సాహిత్యము, చరిత్ర, మొదలైన విషయాలను విద్యార్థులు అధ్యయనం చేసేటందుకు అవకాశాలు కలిగిస్తున్నది

# 15. రాజకీయ పరిస్థితులు - తప్పనిసరియైన తిరుగుబాటు

హైద్రాబాద్ నగరంలో మొట్ట మొదట నాకు ఎదురైన సమస్య తెలిస్తే మీరు ఆశ్చర్య పోతారు. "నేను ఎక్కడ నివసించేది?" అనేదే ఆ సమస్య 'నాది' అనేది ఏమీ లేని వాడ్ని అయినందు వల్ల నేను ఎవరో ఒకరి మీద భోజనానికి, ఇతర జీవిత అవసరాలకు ఆధార పడవలసి వచ్చింది. నేను తాత్కాలికంగా శ్రీ బిందుదగ్గర ఉన్నాను. కాని, ఆయన మీద ఆ బరువు చాలా రోజులు వెయ్యదలచుకో లేదు. ఒక పదిహేను రోజులు ఇక్కడా, అక్కడా అని అనిశ్చిత స్థితిలో గడిచిన తర్వాత మునిసిఫ్‌గా ప్రభుత్వ ఉద్యోగించేసి విరమణ చేసిన శ్రీ రంగారావ్ రత్నాలీకర్ అనే ఉద్యోగి, తాను అద్దెకు (కిరాయికి) తీసుకొన్న ఇంట్లో ఒక గది నాకు బసగా ఇచ్చి నా సదుపాయాలు అన్నీ చూడసాగారు. ఆ రోజులు జ్ఞాపకం వస్తే, ప్రభుత్వం ప్రమాదకరమైన వాడని భావించిన రాజకీయ కార్య కర్తకు వసతి సౌకర్యాలు కల్పించడంలో ఆయన చూపిన ధైర్య సాహసాలు జ్ఞాపకం వచ్చి ఇప్పుడు కూడా నాలో నుంచి కృతజ్ఞతా భావం పైకి ఉబుకుతూ ఉన్నది.

'[illegible] భవన్'లో తిష్ఠ [illegible]. తర్వాత నేను చేపట్టినపని, పరిపాలనకు ముఖ్యస్థానంలో సన్నిహితం ఉండి పరిస్థితుల్ని అవగాహన చేసుకోవడము, ప్రజాభిప్రాయాలను [illegible] అవగాహన చేసుకోవడం కొన్ని రోజులు వారి దగ్గరకు, వీరి దగ్గరకు తిరిగిన తర్వాత నాయకులతో కలిసి ఉండటం నాకేమీ అంత సులభమైన విషయంగా

కన్పించ లేదు వారికి తీరికగా ఉన్న సమయం తెలుసు కొని వారితో ముచ్చటించవలసి ఉండటము అనేది.నాకు మొట్ట మొదట చికాకు కలిగించిన విషయము. సాధారణంగా ఆ అనుకూలమైన సమయం రాత్రివేళ బాగా పొద్దుపోయిన తర్వాత అవుతుంది. అప్పటికి వారు ఆ రోజు తాము చేయ వలసి ఉన్న పనులన్నీ పూర్తి చేసుకొని ఉంటారు. తమతో పని ఉండి వచ్చిన వారందర్నీ పీడ్కొని ఉంటారు. ఒక నాయకుడి ఇంటికి వెడితే నేను రాత్రి 10 గంటల వరకూ కనిపెట్టుకొని ఉండవలసి వచ్చేది ఆతర్వాతకూడా ఆయన తన కక్షిదారుల (పార్టీల) నందర్నీ పంపించి మరీ నన్ను పిలిచే వాడు. ఇట్లాగ సుమారొక పాతిక మంది నాయకుల గుమ్మాలు ఎక్కుతూ, దిగుతూ గడిపిన తర్వాత, గ్రామీణ ప్రాంతాలకు మార్గ దర్శకంగా నాయకత్వం వహించి ఉండ వల సిన హైదరాబాదు నగరం లోని పరిస్థితి అక్కడి నాయకుల అనిశ్చిత మనః స్థితి కారణంగా ముందడుగు వేయడానికే సమస్యగా ఉన్నట్లు గుర్తించాను. నా శారీరక అసౌకర్యాన్ని లెక్క చేయ కుండా నేను ప్రతి రోజూ ఎక్కువ దూరాలు నడక సాగించ వలసి వచ్చేది. అది రాజకీయ స్వరూపం ధరించిన ఆధ్యాత్మిక సాధన అనీ, తపశ్చర్య అని నేను విశ్వసించాను.

ఎనిమిది సంవత్సరాలు గడచిన తర్వాత ఆ నాటి అనుభవాలు ఇప్పుడు జ్ఞాపకం చేసుకొంటూ సంగ్రహంగా ఈ క్రింది మాటలలో పొందు పరుస్తున్నాను.

నేను ఈ వాక్యాలు వ్రాస్తూఉన్నప్పుడు, హైదరాబాదు నగరం లోని గత ఎనిమిది సంవత్సరాల రాజకీయ జీవితమూ నా మనో నేత్రం ముందు నిలిచి ఉంది. అది ఎక్కువ అమూల్యమైన అనుభవము అందులో ఎన్నో గుణపాఠాలు, నీతులు, జాగ్రత్తలు ఇమిడి ఉన్నాయి!

1938లో నేను గడిపిన రోజులు గుర్తు వస్తున్నాయి. అయ్యో దయచేసి, న్యాయదృష్టి ప్రసాదించమని మీరు భగవంతుడి వైపు చూసి రండి. ఏమీ పని చేయ కుండా ఈ నాడు మీరు ఆక్రమించు కొని వదల

కుండా పట్టుకొని ఉన్న నాయకత్వ స్థానాల నుంచి పక్కకు జరిగి తప్పుకొనండి. కార్య శూరులు, ప్రజాహిత సాధకులు అయిన వారికి ప్రజా సంస్థలలో చోటు ఇవ్వండి. అని కొందరితో స్పష్టంగా చెప్పడానికి ఎంతో మనఃక్లేశము కలిగెది. సాధారణంగా అట్లాచెప్పడం కేవలం నా కంఠశోష మాత్రమే గాని పని జరిగేది కాదు తమ పరిమితులను గుర్తించిన వారు కూడా తమకు అందిన స్థానాలను వదలడం, తమకు గౌరవ లోపమనీ, న్యూనత అని భావించి, వాటిని గట్టిగా పట్టుకొని వేళ్లాడే వారు. 'ఇట్లాంటి ప్రవర్తన వల్ల, ప్రజల సంక్షేమానికి తాము ఎంత కష్ట నష్టాలు కలిగిస్తున్నారో అనే ఆలోచన చేసే తత్వం కించిత్తైనా కూడా వారికిలేదు.

ఎనిమిది సంవత్సరాలు ఇట్లాగ ఒక సంవత్సరం తర్వాత మరొకటిగా దొర్లిపోయాయి. ఇప్పుడు ఆ పరిస్థితి కొంత మారింది. హైదరాదాదు ప్రజల ఉద్యమముని స్వార్థంగా, మనః స్ఫూర్తిగా త్యాగ బుద్ధితో తమ కాలాన్ని పూర్తిగా అర్పించి కృషిచేసిన కొద్దిమంది కార్య కర్తల మూలంగా వృద్ధిచెందింది. అది ఇంకా ఎంతో ముందుకు సాగవలసి ఉన్నప్పటికీ ఎంతో కష్టించవలసి ఉన్నప్పటికీ ఇప్పుడు అది చైతన్యవంతమైన శక్తిగా రూపొందింది.

నేను ఒకసారి ఒక నాయకుడితో మీరు మీ కాలాన్ని పూర్తిగా ప్రజలకోసం వినియోగించడం అవసరము అప్పుడే మీరు చేపట్టిన బాధ్యతకు మీరు పూర్తిగా న్యాయం చేయగ్గలరు. అని నచ్చచెప్ప బోయాను. ఆయన నా మాటలకు అంగీకరించ లేదు. 'నా కాలం అంతా ఉపయోగించి చేసేటంత పని, ఉంటేకదా ఆ అవసరము" అని ఆయన వెంటనే టక్కున జవాబిచ్చాడు ఆయన జవాబు వల్ల నా హృదయాన్ని ఎవరో గట్టిగా నులిమి పిండినట్లైంది. అవమానం, ఒత్తిడులు ఒకదానిపై ఒకటి పోగుపడుతూ ఉంటే, హిమాలయ పర్వతాల ఎత్తున పనులు ఎదురుగా నిలబడి ఉంటే కార్యకర్త తాను తన కాలాన్ని పూర్తిగా వినియోగించ వలసిన అవసరం ఏర్పడలేదనీ కాలం ఇంకా పరిపక్వం కాలేదనీ సాకులు చెప్తూతూ కాలక్షేపం చేస్తుంటే ఏమనాలి ? ఆయన మనస్సులో

దాగిఉన్న భావాలను అర్థం చేసుకొనే ప్రయత్నం చేస్తూ నిస్వార్థ, నిరాడంబరమైన ప్రజాసేవ దానికదే పుష్టి కలిగి సాగడానికి తగిన ఫలితం సాధిస్తుందనే తత్వాన్ని అవగాహన చేసుకొనక పోవడం వల్లనే ఆయన ఆ రీతిగా భావించడం సంభవించిందని అనుకొన్నాను. త్యాగం చెయ్యవలసిన అవసరము, సేవ, కంటికి కనిపించిన పని పరిమితిని అనుసరించి నిర్ణయమవుతాయా ? లేక, చెయ్యవలసిన పనిలో ఇమిడి ఉన్న నైతిక విలువలను బట్టి నిర్ణయించాలా ? ఒకే ఒక మనిషి బాధపడుతూ ప్రమాదకరమైన పరిస్థితిలో ఉన్నాడను కుందాము ఒక్కడే కదా అతన్ని రక్షించేటందుకు నా దగ్గర ఉన్నదంతా త్యాగం చెయ్యవలసిన పనిలేదు అనుకోడం త్యాగశీలతకు లక్షణ మవుతుందా ? ప్రతివారూ ఇట్లాంటి లోప భూయిష్టమైన ఆలోచనలు, కుతర్కాలు చేస్తూ, ఉంటే ప్రజల బలం ఏ రీతిగా పెంపొందించ గలము ?

హైదరాబాద్‌లో నేను ఉండటం వల్ల పట్నంలోనూ, పల్లెలోనూ ఉన్న అనేకమంది కార్యకర్తలు పరిస్థితులలో మార్పు కలుగుతుందని ఆశించారు. వందల కొద్దీ యువకులు నన్ను కలుసుకొని నా చుట్టూ మూగి, తమ మనస్సులో ఉన్న ఆలోచనలు వెళ్ళబోసుకొనే వారు నేను కూడా వ్యక్తిగతంగా పరిచయాలు పెంపొందించుకొంటూ వరుస, అను బంధాల వల్లనే సాన్నిహిత్యం వృద్ధి చేసుకోవచ్చునని విశ్వసించాను. యువకులందరూ ముందుకు వచ్చేటందుకు సిద్ధంగానే ఉన్నారు. కాని, అమూల్యమైన ఈ మానవ సంపద, దాన్ని ఎవ్వరూ సార్వజనీన జాతీయ ప్రయోజనాలు సాధించేటందుకు వినియోగించనందువల్ల, వృథా అయి కాల ప్రవాహపు గంగపాలయిపోతుంది అని గుర్తించాను. ఈ పరిస్థితికి ఇప్పుడున్న నాయకత్వాన్ని తప్పు పట్టటం వల్లగాని, వారి దృక్పథాన్ని గురించి ఫిర్యాదులు చెయ్యడం వల్లగాని ఏమీ ప్రయోజనం ఉండదని కూడా గుర్తించాను. అందుచేత పరిస్థితుల్ని ఏమైనా చెరుగు పరచడానికి వీలవుతుందా ? నాయకత్వం మరికొంత సమర్థవంతమైనదిగా అయ్యేటట్లు చూడటం తగిన పని అనుకొన్నాను. పరిస్థితుల్ని నాయ

కుల్నీ దుయ్యబట్టడం వల్ల సాధించేది ఏమీ లేదు, అనుకొని లక్ష్య సాధన కోసం నిర్దిష్టమైన చర్యలు తీసుకోవడాన్ని గురించి ఆలోచించ సాగాను.

ప్రజా జీవితంలో గణనీయమైన నాయకులందరూ కూడా సంస్థానమంతటికీ వర్తించే రాజకీయ సంస్థ ఒకటి అత్యవసరమనీ అప్పుడే పరిస్థితుల్ని తగిన బలంతో ఎదుర్కొనడానికి సాధ్యమవుతుందనీ గుర్తించారు. భాషావరంగా ఏర్పడ్డ సంస్థలూ, ఆయా ప్రాంతాల్లో అవి చేస్తున్న పనులూ ముందుకు చొచ్చుకొనిపోయే ప్రజా ఉద్యమంగా రూపొందడానికి తగిన జీవం, పుష్టి ఉన్నవి కాలేదు కాలేవు కూడా. ఏక లక్ష్యమూ, ప్రయత్నాల ఐక్యమూ సిద్ధించాలంటే మూడు ప్రాంతాలనూ కలిపి కృషి చేసే సంఘము, వ్యవస్థ అవసరము. ఈ లక్ష్యంతో ఒక క్రొత్త సంఘాన్ని ఏర్పాటు చెయ్యాలనే ప్రయత్నాలు జరుగుతున్నాయి. వాటితో నాకు ప్రత్యక్షంగా సంబంధం లేకపోయినప్పటికీ నగరంలో ఉన్న పెద్దలు ఆ విషయాన్ని ఇష్టాగోష్ఠిగా చర్చించేటందుకు ఏర్పాటు చేసిన సమావేశానికి రావలసిందని నన్ను ఆహ్వానించారు. ఆ సమావేశం హైదరాబాదు స్టేట్ కాంగ్రెసును ఏర్పాటు చెయ్యడానికి ఉద్దేశించినటువంటిది. అందులో తాత్కాలిక కమిటీని ఏర్పాటు చేసి, సభ్యులను విరివిగా చేర్పించి, ఒక నిర్దిష్ట కాలవ్యవధి లోపున వారి సమావేశం నిర్వహించడము, కార్య నిర్వాహక సభ్యులను ఎన్నుకొనడం జరగాలని నిర్ణయించారు. ఆ కమిటీలో అన్ని ప్రాంతాల నాయకులూ ఉన్నారు.

మహారాష్ట్ర పరిషత్ లాతూర్ సమావేశంలో పౌర హక్కులు సాధించేటందుకు కృషి చెయ్యాలనే తీర్మానం జరిగింది. ఆ కార్య నిర్వాహణ కోసం ఏర్పడిన కమిటీకి నేను సమావేశ కర్తను. ఆ కమిటీని ఏర్పాటు చెయ్యవలసి వచ్చిన కారణాలు, పరిస్థితులు, రాజకీయ వాతావరణము అన్నీ కూడా అన్యాయపు ప్రభుత్వాన్ని ఎదిరించే ధైర్య సాహసాలు ప్రజలకు కలిగించ వలసిన ఆవశ్యకతను వ్యక్తం చేస్తున్నాయి. కాని, ఆ పని నిర్వహించడం ఏమీ అంత సులువైంది కాదు. నాయ

కత్వం చేపట్టి ప్రజలను నడిపించ వలసిన వారు మనస్ఫూర్తిగా ఆ పనికి సిద్ధంగా లేరనీ ఆ కర్తవ్యాన్ని వాయిదా వెయ్యడమే వారి తత్వమనీ విస్పష్టమైంది కొద్ది కాలంలోనే జిల్లాలలోనే ప్రభుత్వ ప్రతిఘటనకు అనుకూలమైన సరుకున్నదనీ అందుకు తగిన ప్రజలు కనిపిస్తారనీ నేను గుర్తించాను.

ఇతర భాషా ప్రాంతాలలో నాకు తెలిసిన వారు ఎవరూ లేనందు వల్ల నేను నాకు తెలిసిన మరాట్వాడా వైపు దృష్టి సారించాను. ఔరంగాబాదులో గణేశ ఉత్సవాల సందర్భంలో మాట్లాడ వలసిందని పిలుపు వచ్చింది. అక్కడే నేను మొట్టమొదట శ్రీ గోవిందదాస్ షరాఫ్‌ను కలుసుకొన్నాను ఆ తర్వాత ఆయన అనేక సంవత్సరాల పాటు నాకు అత్యంత సన్నిహిత చరుడుగా ఉన్నాడు. ఆయన విశ్వవిద్యాలయం నుంచి రెండు డిగ్రీలు తీసున్న విద్యావంతుడు. యుక్తివరుడు. పాదరసం వలె చకచకా ముందుకు చొచ్చుకొనిపోయే ప్రతిభాశాలి. త్యాగనిరతం కలవాడు. తలపెట్టిన కార్యాన్ని మనస్ఫూర్తిగా నిర్వహించే స్వభావం కలవాడు

పేరెత్తి చెప్తే అందుకొని అంతం చూడగల తెలివి తేటలకు తోడు ఆయనలో కన్పించిన వైజ్ఞానిక శాస్త్రీయ దృక్పథం, సునిశిత (విశ్లేషణా శక్తి), లక్ష్య సాధనలో ఏకాగ్రత, నన్ను ఆయనకు సన్నిహితుణ్ని చేశాయి. ఆయన పూర్తిగా విశ్వసనీయుడని తెలుసుకొన్నాను ఆయనతో ఒక గంట సేపు ప్రసంగించేటప్పటికి హైదరాబాదు సంస్థానంలో ప్రజా ఉద్యమానికి రూప కల్పన చెయ్యడానికి తగిన వాడని తెలుసుకొన్నాను. ఉద్యమానికి పూర్తిగా తన శక్తియుక్తులను ధారపోసేటందుకు ఆయన తన సంసిద్ధతను కూడా వ్యక్తం చెశాడు.

ఇది నాకు వ్యక్తిగతమైన లాభంకాదు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనాలని ఉవ్విళ్లూరుతూ ఉరకలు వేస్తున్న యువతరం. శ్రీషరాఫ్‌లో మూర్తీభవించింది. ఆయన అన్నీ వదలుకొని ఉద్యమంలోకి దూకగానే వందల కొద్దీ యువకులు కూడా తమకున్న వన్నీ పణంగా పెట్టి, అంగ

ప్రొక్కు బడి ఉన్న ప్రజల విముక్తి కోసం, ఆయనను అనుసరించారు. స్వాతంత్ర్య పోరాటం జరిగిన కాలం యావత్తూ అంటే అది ప్రారంభమైనది మొదలు 1948లో పోలీసు చర్యతో పూర్తి అయేవరకూ ఉద్యమ భారం పూర్తిగా వహించి పథకం వెయ్యడము, రూపొందించడము, నడపడం అన్నీ ఆయనే నిర్వహించాడు హైదరాబాదు స్వాతంత్ర్య పోరాటం ఆయన కెంతో ఋణపడి ఉంది.

ప్రజా ఉద్యమ సౌధనిర్మాణానికి చిన్న, చిన్న రాళ్లను పోగుచేసే కృషి మరో రెండు నెలలు కొనసాగింది. మరాట్వాడాలో వందలాది యువకులు పిలిస్తే వెంటనే సత్యాగ్రహోద్యమం లోకి దూకేటందుకు సిద్ధంగా ఉన్నారని నేను గ్రహించాను తాలూకాస్థాయి వరకూ కమిటీలు ఏర్పాటు చేసి సంస్థను నిర్మించడం జరిగింది. ముందడుగు వెయ్యడానికి తమ సంసిద్ధతను వెల్లడించిన వారే ఈ కమిటీలో చేరారు. మారాట్వాడాలో కార్యక్రమం చక్కగా సాగుతుందని తృప్తికలగగానే నేను ఇతర ప్రాంతాలలో అట్లాంటి ఏర్పాట్లు జరిగేటట్లు చూడాలనే ప్రయత్నాలు చేసాను.

కాని, పరిస్థితులు అనుకొన్నంత కంటె వేగంగా నడవడం ప్రారంభమైంది పరిస్థితులు త్వరగా విషమించి ప్లాను వేయడానికి (పథకన్ని రూపొందించేటందుకు) కాల వ్యవధి లేనట్లైంది. మేమందరమూ ఆశించిన ఒకటైన రాజకీయ సంస్థ ఆవిర్భవించేటందుకు అధికారులు ఇష్టపడ లేదు. దాన్ని వారు ఆదిలోనే తుంచి పారెయ్యాలను కొన్నట్లు ఒక బలమైన పిడికిలి మా తలమీద పడేటందుకు సిద్ధంగా ఉన్న లక్షణాలు కన్పించాయి మతావేశమూ, భూస్వామ్యతత్వమూ కలిసి గడ్డ కట్టుకొని రూపొందిన నిరంకుశ ప్రభుత్వాధికారము కొనసాగిస్తున్న రాష్ట్రం లోని ప్రజలు బాధ్యతాయుత ప్రభుత్వాన్ని సాధించుకొనేటందుకు ఏర్పాటుచేసుకో దలచుకొన్న సంఘము అవతరించడాన్ని ఆ ప్రభుత్వం సహించ గలదా? అది తమకు సంబంధించిన విషయం కాదన్నట్లు చూస్తూ ఊరుకో గలదా!

హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ మెంబర్లను చేర్పించేకృషిని చేపట్టిన తాత్కాలిక కమిటీ తాను ఏర్పరచుకొన్న సంఖ్యా లక్ష్యాన్ని సాధించింది. సమావేశ కార్యకర్త ఆ మెంబర్లందరూ ఒక చోట కలుసుకోనాలనీ, కార్య వర్గాన్ని ఎన్నుకొని తద్వారా 'హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్' అనే రాజ కీయ సంస్థ అవతరణ జరుగుతుందనీ తేదీ నిర్ణయించి ప్రకటించారు. నిర్ణయమైన ఆ రోజు సమీపిస్తున్నదనగానే ప్రభుత్వ యంత్రాంగం చక చకా కదిలింది. తాత్కాలిక సంఘంలోఉన్న మెంబర్లలో కొంత మందిని, ప్రభుత్వ పరిపాలన విధాన నిర్ణేతలకు సలహాలిచ్చే వారిలో ప్రధానియైన సర్ అక్బరు హైదరీ (ఆయన తర్వాత స్వర్గీయుడైనాడు) తన సమ్ముఖానికి పిలిపించి బాధ్యతాయుత పరిపాలన ఏర్పాటు కోసం జరిగే ప్రయత్నాలను ప్రభుత్వం సహించదనీ, దాని కొసం ప్రతి పాదించ బడిన సమావేశాన్ని రద్దు చేయ వలసిందనీ సలహా రూపమైన ఆజ్ఞలు జారీచేశారు

ఇంతకు ముందే చెప్పినట్లు ఆ తాత్కాలిక కమిటీతో నాకు ఏమీ ప్రత్యక్ష సంబంధం లేదు. నేను కూడా అందరి లాగే సాధారణ మెంబ రుగా చేరాను. తాత్కాలిక కమిటీలో ముఖ్యులైన వారిలో కూడా నేను లేను. ఉన్నత స్థాయి సంభాషణలలో చర్చలలో ఏమి జరుగుతున్నదీ నాకు తెలియదు. వాటితో సంబంధం ఉన్న వారు, బహుశా నన్ను తీవ్ర వాదిగా భావించారనీ నేను సంప్రతింపులలో ఉంటే అనవసకే మోసం వస్తుందని అనుకున్నారేమో ననీ అని పిస్తుంది. ఏమైతేనేమి హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ అవతరణకు ఏర్పాటు చేసిన ముహూర్తమూ వాయిదా పడిందనీ తెలిసింది.

తాత్కాలిక కమిటీలో ఉన్న వారిలో చాలామంది చట్టానికి అను గుణంగా ప్రవర్తిస్తూ కృషి చెయ్యాలనే మితవాద తత్వం కలవారే, నచ్చచెప్పడం, వాదించడం, నివేదికలు సమర్పించడం, స్వాయముగా సంభాషించడం, సంప్రతింపులు జరపడం మాత్రమే వారి సాధన సామగ్రి. ఆందోళన, ఉద్యమం, అనేవి వారి రాజకీయ పరిభాషలో లేని

మాటలు. ఆచరణ వారికి కలల్లో కూడా రాదు. ప్రారంభం అయిన సంప్రతింపులకు ముగింపు కనిపించ లేదు. అవి అట్లా కొనసాగుతూ అనంతంగా కొనసాగుతున్నాయి. ఆ సంప్రతింపులలో పాల్గొన్న వారి ఓర్పు నిజంగా సాటిలేనిది: అనన్యగోచరము. వారు అధికారులతో ఎన్నడూ తెగతెంపులు చేసుకోరు. అంతా చివరికి ఏమవుతుందో ఎట్లా పరిణమస్తుందో అని ఆతురతతో ఎదురు చూస్తున్న వా తా వ ర ణ ం ఏర్పడింది.

మాలో కొందరము అంతుదరీ లేకుండా కొనసాగుతున్న ఈ సంప్రతింపులు ఆపాలనీ, ప్రభుత్వం నిరంకుశత్వాన్ని ధిక్కారించడానికి పిలుపు ఇవ్వాలనీ అనుకున్నాము. తాత్కాలిక కమిటీలో మెంబర్లుగా ఉన్న వారిలో ప్రతి ఒక్కరినీ కలుసుకొని, ధైర్య సాహసాలతో ముందుకు దూకవలసిన ఆవశ్యకతను గురించి వాదించాము. వారు మా వాదాన్ని అంగీకరించే వారు. కాని, ఏదైనా చర్య తీసుకొనేటందుకు ముందుకు వచ్చేవారు కారు. ఆ దృక్పథం చూసి, మేము బాధపడే వాళ్ళము. మేము మూడు భాషా ప్రాంతాలలోనూ సత్యాగ్రహంలో పాల్గొనేటందుకు ఉత్సాహవంతుల్ని రెచ్చగొట్టి పట్టికలు తయారు చేసాము. కాని, సత్యాగ్రహ సిద్ధాంతం ప్రకారం అట్లాంటిదేమీ అవసరం లేదు. ప్రతి సత్యాగ్రహీ తన అంతర్వాణి ప్రబోధాన్ని ఆదేశాన్ని పాటిస్తూనే ఉద్యమంలోకి దూకి తన కర్తవ్యం నిర్వహించాలి. తాత్కాలిక కమిటీ ప్రజలలో ఉన్న ఆవేశాన్ని, ఉద్ధృతాన్ని గమనించ కుండా గట్టిగా పీఠం వేసుకొని కూర్చున్నారు. కాని, ఆ కమిటీలో ఉన్న వారిలో కొద్దిమంది మాత్రము తమ నాయకుల పట్టులోంచి తప్పించుకొని చర్యలు తీసుకోవాలనే ఆలోచనలు వెల్లడించడము మాకు సంతోషం కలిగించింది. ఎవరికీ ఏ ఇరకాటమూ, ఏ అమర్యాదా కలగకుండా ఉండాలని తాత్కాలిక కమిటీ మెంబర్లు అందరూ రాజీనామా చెయ్యాలని కోరాము. చాలా సేపు చర్చలు జరిగిన తర్వాత వారు అంగీకరించారు. కాని, ఆ తాత్కా

లిక కమిటీని రద్దు చేసేటందుకు పూనుకొనగా వారు ఈ క్రింది రీతిగా ఒక స్టేట్‌మెంటు ఇచ్చారు.

ప్రజానీకము వహించిన నిజాము ప్రభుత్వము 2 ఆబాన్ 1347 ఫసలీ నాడు హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసును ఏర్పాటు చెయ్యడం పట్ల వ్యతిరేక చర్యగా భావిస్తూ చేసిన ప్రకటన ఈ కమిటీ వారికి హృదయవేదన కరమైనదని తెలియ చేస్తున్నారు. ప్రభుత్వం ఈ అసాధారణ చర్య గైకొనుటకు ఆధారభూతమైన పరిస్థితులను వివరిస్తూ వారు ఇచ్చిన సమాచారాన్ని ఈ కమిటీ జాగ్రత్తగా పరిశీలించి, అందులో మేము మా ఆశయాలను, ఉద్దేశాలను, కార్యక్రమాన్ని అనేక పర్యాయాలు స్పష్టంగా పేర్కొన్నప్పటికీ వాటిని పరిగణించకుండా మా సంస్థపై చేసిన తీవ్రమైన ఆరోపణలను ఖండించడం తమ ధర్మంగా భావిస్తున్నారు.

"కాంగ్రెసు" అనే పేరు సంస్థానం యొక్క బాగోగులకు ప్రయోజనాలకు భంగకరమైనదని ప్రభుత్వం భావించడం పట్ల ఈ కమిటీ తమ ఆశ్చర్యాన్ని వెల్లడించు చున్నది. 28 ఆగస్టు 1938 నాడు చేసిన రెండో ప్రకటనలో "కాంగ్రెసు" అనే పేరు స్వీకరించడానికి గల కారణాలను మేము వివరించడం జరిగింది. స్టేట్ కాంగ్రెసు అనుసరించ దలచుకొన్న రాజకీయ భావాల్ని, కార్యక్రమాన్ని వివరిస్తూ వాటిని గురించి ప్రభుత్వానికి ఏ విధమైన అపోహలూ కలగ కుండా ఉండాలనే లక్ష్యంతోనే మేము ఆ ప్రకటన చేయడం జరిగింది. అయినప్పటికీ ప్రభుత్వ ప్రకటనలో "కాంగ్రెసు అన్న పేరుకు ఏదో ప్రత్యేకత" ఉన్నట్లూ, ఆ ప్రత్యేకత రేకెత్తించే భావాలు ప్రజల హృదయాల్లో కలగ కుండా ఉండేటందుకే ప్రభుత్వం తమ నిషేధాజ్ఞ జారీచేసినట్లూ ధ్వనిస్తున్నది ఇండియన్ నేషనల్ కాంగ్రెసు (భారత జాతీయ కాంగ్రెసు) ప్రజల హక్కులకూ, స్వాతంత్ర్యాశయాలకూ ప్రతినిధి అదే దాని పేరులో ఉన్న ప్రత్యేకత ప్రభుత్వం ప్రజల హక్కులు, స్వాతంత్ర్యము అనే భావాలను ఆమోదించవనీ, ఆ భావాలు ప్రజలలో ప్రచారం చెయ్యడం సహించదనీ

ప్రభుత్వ ప్రకటన తేట తెల్లం చేస్తున్నది అకారణంగా ఏ ప్రేరణా అవసరమూ లేకుండా ప్రభుత్వం జారీ చేసిన ఈ ఆర్డినెన్సు, ప్రజల వ్యక్తి స్వాతంత్ర్యాన్ని కనీస స్థాయికి పరిమితం చేస్తూ జారీచేసిన అనేక ఇతర అధికార ప్రకటనలు, నియమాలు మనస్సుకి పట్టించుకొన్నప్పుడు మరే విధమైన అభిప్రాయమూ కలిగే అవకాశం లేదు."

హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు సంస్థ నిషేధాజ్ఞకు గురిఅవుతుందనీ తెలిసినప్పటికీ ఆ సంస్థను ఏర్పాటు చేసి పని చెయ్యడమే ఆ నిషేధాజ్ఞను ధిక్కరించడం అవుతుంది. అట్లాచెయ్యడం తప్ప మాకు గత్యంతరము కన్పించటం లేదు. మరో తీరుగా నిర్ణయం చెసేటందుకు ముందుగా ఆంధ్ర, కర్నాటక ప్రాంతాలకు చెందిన నాయకులలో ఎవరైనా అగ్రశ్రేణి నాయకులు ఉద్యమం నిర్వహించేటందుకు ముందుకు వస్తారేమోనని తెలుసుకొనే ప్రయత్నాలు చేసాను. అగ్రశ్రేణి నాయకులలో ఎవరూ మేము ఉన్నామనీ రాకపోవడం నాకు విచారం కలిగించింది. వారిలో కొందరు సత్యాగ్రహం చేసి బాధలకు గురి అయి వాటిని సహించే శక్తి తమకు లేదని స్పష్టంగా అంగీకరించారు. కొంత తరచి, తరచి వెతకగా శ్రీ రావి నారాయణ రెడ్డి తన సహచర వర్గంతోసహా ఉద్యమంలో చేరతానని వచ్చారు. ఆయనను చేర్చుకొనేటందుకు చాలాసంతోషం కలిగింది. ఆయన 1941 వరకు హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడుగా ఉన్నారు. ఆ సమయంలో భారత కమ్యూనిస్టు పార్టీ సిద్ధాంతాల పట్ల మొగ్గ కలిగి కాంగ్రెసు నుంచి రాజీనామ ఇచ్చి ఆ పార్టీలలో చేరారు. ఆయనతో పాటు ఆంధ్ర కార్యకర్తలలో నిగ్గుతేరి నాయకత్వం వహించినవారు విడిపోవడం జరిగింది.

కర్నాటక ప్రాంతాలలో నాయకత్వం చేపట్టేటందుకు తగినవారిని ఎన్ను కొనడం కష్టమైంది. కాని, అదృష్టవశాత్తూ శ్రీ జనార్దన రావ్ దేశాయ్ ముందుకు రావడం చేత ఆయన పేరు మొదటి జట్టు సత్యాగ్రహులలో చేర్చడం జరిగింది.

ఆనాటి హైదరాబాన్ ప్రజాజీవితంలో ఒక పెద్ద లక్షణం ఉండేది ఎప్పుడు అధికారాన్ని ధిక్కరించేటందుకు ఉద్యమాన్ని ప్రారంభించాలని నిశ్చయించిన వెంటనే అనేక మంది దాన్ని ఆపేటందుకు ప్రయత్నాలు జరిపే వారు. ప్రభుత్వ చట్టాన్ని అనుసరిస్తూ సంప్రతింపులు జరపాలనే వారు. పైకి లేచి కార్య క్రమం ఒక రూపం ధరించ కుండా దానికి ఒక ఊపు రాకుండా అడ్డు పడటం జరిగేది. దానికి వ్యక్తి గతమైన విషయాలు కారణాలా? లేకపోతే అంతరంగిక పోటీలు కారణాలా? నాయకుడు కార్యాచరణకు పగ్గాలు లాగుతూ ఉంటే వీరికి గుండె కలవారు ప్రమాదాల నెదుర్కొనడానికి అసంసిద్ధులై ఉండటము కారణమా? వీటిలో ఇదమిద్ధమని తేల్చి చెప్పడం ఎవరికీ సులభ సాధ్యం కాదు.

మొదటి జట్టు సత్యాగ్రహం చెయ్యడానికి సిద్ధం అవుతున్నప్పుడే జారీ అయిన ప్రభుత్వపు ఆర్డరు, ప్రభుత్వం ప్రజల రాజకీయ లక్ష్యాల పట్ల అవలంబిస్తున్న వైఖరిని వ్యక్తం చేసింది ప్రభుత్వం జారీ చేసిన ఆర్డరులోని ముఖ్యమైన భాగాలను ఈ క్రింద ఉదాహరిస్తున్నాను

"ఘనత వహించిన నిజాము ప్రభుత్వానికి సంస్థానంలో రాజకీయ సంఘం ఏర్పడేటందుకు వ్యతి రేకత లేదు. అట్టి సంస్థ కచ్చితంగా మత ప్రసక్తి లేకుండా సంస్థానానికి వెలుపల నున్న మరే సంస్థతోనూ అనుబంధాలు కలిగి ఉండ కూడదు.

అట్టి సంఘాన్ని స్థాపించాలనే ఆశయంతో కృషి చేసేవారు ఆది పరిపాలనా చట్టానికి అనుగుణంగా కృషిచేస్తూ ప్రజల స్వేచ్ఛకు, నిర్దుష్ట జీవిత వ్యవహార ప్రమాణాల సాధనకు ఉపకరిస్తూ పరస్పరశాంతి భంగకరం కాకుండేటట్లు వ్యవహరిస్తూ వారికి యథార్థ ప్రాతినిధ్యం వహించి ఉమ్మడి జాతీయ వేదికగా రూపొందేటట్లు కృషిచెయ్యడం తమ ప్రధాన కర్తవ్యం అని గ్రహించ వలసి ఉంటుంది

అప్పుడు వారి ప్రతి పాదనలను ప్రభుత్వం సానుభూతితో పరిశీలించి ఏకులం వారినీ, ఏమతం వారినీ బహిష్కరించని యథార్థ జాతీయ

సంస్థగా పరిగణించేటందుకు, దానికి తగిన పరిగణన ఇవ్వడానికి అర్హత కలిగినదని గుర్తించే టందుకు, అవకాశం ఉంటుంది. మరొక తీరుగా కనక జరిగితే మత తత్వానికి, రాజకీయాలకూ నడుమ ఉన్న భేదాలను గుర్తించక పోవడము ప్రజల అభివృద్ధికి గల అవకాశాలు ప్రమాద భూయిష్ఠం కావడము సంభవిస్తుంది.

సంఘం యొక్క ఆశయాలుగా ఉటంకించిన వన్నింటినీ అట్లా ఒక ప్రక్కన ఉంచి ప్రభుత్వం ఆ సంఘంలో వదలకుండా ఉన్న కొందరువ్యక్తుల వల్ల ఆ సంఘం ప్రధానాశయము మతతత్వపరమైనదనీ అదే దాని యధార్థదృక్పథాన్ని, ఆశయాన్ని, చర్యలనూ నిర్ణయిస్తుందనీ ప్రభుత్వం దృఢంగా విశ్వసిస్తున్నది ప్రభుత్వం తన అభిప్రాయాలు విశదీకరిస్తూ చేసిన ప్రకటన ఆ సంస్థను విశాలమైన జాతీయ భావపునాదుల పైన పునర్వ్యవస్థీకరించే టందుకు తగినంత కాలవ్యవధి కల్పించినప్పటికి అట్లాంటి ప్రయత్నాలేమీ జరగ లేదు అందు చేత ప్రభుత్వం ఆ సంస్థ ఉద్యమం రాజకీయ మైనదని అనడం కేవలం ఒక మిషమాత్రమే అనీ ఆ ముసుగు వెనక విద్రోహకర మతావేశ చర్యలు నిర్వహించడమేదాని అసలు లక్ష్యమనీ 'కాంగ్రెసు' అనే పేరు ప్రజలకు భ్రమకలిగించి వారిని తప్పు దారి పట్టించేటందుకు ఉద్దేశ పూర్వకంగా ఉపయోగించడం జరిగిందనీ, ప్రభుత్వం మరింత దృఢంగా విశ్వ సించే టందుకు కారణాలవుతున్నాయి. ప్రభుత్వం ఈ సంస్థను గురించి స్వయంగా వివరణలు సేకరించింది హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు అనే పేరుతో ఏర్పాటు కానున్న సంస్థతో సంబంధం ఉన్న వ్యక్తులలో కొందరు ముఖ్యుల గురించి తెలుసుకున్నది. పైకి ఎన్ని ఎట్లాంటి కబుర్లు చెప్పినా అది పూర్తిగా మతప్రాతిపదిక మీద మత,విద్రోహకర చర్యలు కొనసాగించె టందుకు ఏర్పడిందనీ దాని మనుగడ, ఉనికి, సంస్థాన పరిపాలనలో ప్రవేశ పెట్టనున్న సంస్కరణల పురోగమనానికి ఆటంకం మవుతుందనీ ప్రభుత్వం భావిస్తున్నది.

అందు వల్ల ప్రభుత్వము 'హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్' అనే పేరుతో ఏ సంస్థనైనా ఏర్పాటు చేయడాన్ని నిషేధిస్తున్నది. అది ఏర్పా

మైన మరుక్షణంలోనే ప్రజాక్షేమ సంరక్షణ నియమాల ననుసరించి అక్రమ సంఘంగా పరిగణింప బడటం అది అందుకు అనుగుణమైన చర్యలకు గురికావడం జరుగుతాయి "

మేము సత్యాగ్రహుల పేర్లున్న పట్టికలు పరిశీలించడం జరిగింది. వాటిని సూక్ష్మంగా పరిశీలించినప్పుడు అందులో కొద్ది మంది మాత్రమే హైదరాబాద్ నగరానికి చెందిన వారని తేలింది నాయకులు ఉద్యమానికి దూరంగా ఉన్నందు వల్ల ఇతరులు, సామాన్యులు, వారి అనుచరులు, ముందుకు రాలేదు. అందు చేత ప్రతి వారమూ నగరంలో ఏదో ఒక చోట రెండు సార్లు మాత్రమే సత్యాగ్రహం చెయ్యాలని నిర్ణయించాము. అప్పుడు మరొక సమస్య ఎదురైంది సత్యాగ్రహులలో జీవితంలో అనుభవం కలవారు అని చెప్పేటందుకు తగిన వయస్సు ఉన్న పెద్దలెవరూ లేరు. అప్పుడు మా అదృష్టం కొద్దీ శ్రీ గోవింద రావు నానాల్ ముందుకు వచ్చి మాతో సహకరించారు. ఆయన హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌కు మొదటి అధ్యక్షుడుగా పదవీ స్వీకారం చేసారు ఆయన తన నిర్ణయం ప్రజలకు చెప్పగానే ఉద్యమంలో చేరకుండా ఆయనకు నచ్చ చెప్పాలని ఎన్నో విధాల ఎందరో ప్రయత్నించారు. రాత్రి చాలా ప్రొద్దుపోయే వరకూ పేరు పొందిన వారెందరో ఆయన ఇంటికి వెళ్లి ఆయన తన నిర్ణయాన్ని మార్చుకొనేటట్లు చేసేటందుకు ఎంతెంత కృషి చేసారో నాకు తలచుకోగానే కళ్లకు కట్టి నట్లుగా కనిపిస్తుంది కాని, ఆయన దృఢనిశ్చయం కలవాడు. ఈ "మంచి కోరే వారందరి"తో విసిగివేసారి చివరకు తనయింటి తలుపులు మూసి తనతో మాట్లాడేందుకు మరెవరినీ రానియ్య వద్దని కచ్చితంగా చెప్పాడు

శ్రీ నానాల్ ఆధ్యాత్మిక చింతనా పరుడు; భక్తిమార్గం అనుసరించిన వాడు. మాటనూటి ఉన్న వాడు ఆయన తన అంతర్వాణి ఆదేశాన్ని పాలించే తరహా మనిషి. ఆయన మనస్సులో ద్వైధీ భావం అనేది లేదు. లయలుగా మాట్లాడటం, మాట మార్చడం, ద్వైధీభావ లక్షణాలు. అవి

రాజకీయాలలో తప్పని సరి అవి రాజకీయ నాయకులుగా రాణించ డానికి ఆవశ్యకము అనే భ్రమ చాల మందికి ఉంది. శ్రీ నానాల్ ఒకసారి నిర్ణయం తీసుకొంటే మిన్ను విరిగి మీద పడ్డా చెదరకుండా పరిస్థితిని ధైర్య సాహసాలతో ఎదుర్కొన నిలిగిన మనీషి. హైదరాబాదు నగర రాజకీయ జీవితము, ఆయన సత్యాగ్రహంలో పాల్గొనడం వల్ల, వున్నత స్థాయిని అందు కొన్నది ప్రథమ అధ్యక్షుడుగా ఆయనను ఎన్నుకొనగానె హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు వ్యవహారాలన్నీ ఆకతాయిమూక, కుత్ర కారు చేష్టలన్న నిందారోపణలు చేసిన వారి నోళ్లుకట్టుబడి, వారు మౌనం వహించారు.



# 16. పరిస్థితుల పర్యాలోకనము

ప్రత్యక్ష చర్యకు బలాలు సమీకరించు కొంటూనే సంస్థానానికి బైట భారత దేశం అంతటా ఉన్న ప్రజలకు మా ఉద్యమ స్వరూపాన్ని దాని ఆవశ్యకతను వివరించి వారు ఇక్కడి పరిస్థితులు అర్థం చేసుకొని సానుభూతి చూపించే టట్లుగా తీర్చి దిద్దే ప్రయత్నాలు చేసాము. స్వదేశ సంస్థానాల వ్యవహారాల్లో కలుగ జేసుకొనడం తమ విధానం కాదని ఆ రోజుల్లో భారత జాతీయ కాంగ్రెసు నిర్ణయించుకొన్నది. అందు చేత కాంగ్రెసు, తమ సంస్థ శాఖల్ని స్వదేశ సంస్థానాలలో ఏర్పాటు చేసే టందుకు అనుమతి ఇచ్చేది కాదు. మాలో చాల మందిమి మన దేశంలో ఉన్న ముఖ్యమైన రాజకీయ సంస్థ తన పరిధికిఇట్లా పరిమితులు ఏర్పరచు కోవడం హర్షించే వాళ్లము కాము. కాని, అది సంస్థానాల ప్రజలలో స్వయం సహాయ, స్వయం నిర్ణయ శీలాన్ని ప్రోదిచేసే టందుకు ఏర్పాటు చేసు కొన్నట్లుగా మేము కొంతనిదానంగా ఆలోచించి తెలుసుకోగలిగాము ఆ విధానం ఎవరు మెచ్చినా, మెచ్చక పోయినా అప్పుడు అమలులో ఉంది. అందు చేత మేము మా శక్తి సామర్థ్యాల మీదనే ఆధార పడేటందుకు ప్రయత్నిస్తూ కాంగ్రెసు నాయకుల ముందు యథార్థ విషయాలన్నీ నివే దించాము. మేము నివేదించిన అన్యాయాల వివరాలు అన్నీ కలబోసి చూసినా చాలాతక్కువేఉన్నాయి అచ్చు అయిన వివరాలు అన్నీ (హిందూ) స్థాయి సంఘం వారు ప్రకటించినవి. అవి అన్నీ ఉద్యోగాలలో హిందు వులకు లభిస్తున్న వాటాలు మొదలైన వాటికి సంబంధించినవి. వాటి వల్ల మా సమస్య అర్థం చేసు కొనడం సులువై నప్పటికీ, దానికి ఒక హిందూ వర్గంవారి ఆమోదం మాత్రమే, విన్న వెంటనే, లభించేటట్లుంది, అందులో

మౌలికమైన సార్వజనీన సూత్రం ఏమీ లేదు. ప్రజలందరి అభివృద్ధి సాధించ వలసిన వర్గం వారు, జరిగిన అన్యాయాలు పేర్కొనడంలో ఏవో కొందరికి జరిగినవే నొక్కి చెప్పడం పాత రోజుల్లో కాంగ్రెసు అవలంబించిన పద్ధతి అనీ కేవలం ఏదో గడబిడ చెయ్యడం వంటిదనీ అనిపిస్తుంది. భారత దేశంలో కూడా హిందూ మహా సభానాయకులు, వారి రీతిగానే ఆలోచించే తదితరులూ హైదరాబాదు సంస్థానపు వ్యవహారాలను గురించి కొంత ఆసక్తి చూపించారు కానీ, కాంగ్రెసు వారు అప్పటి వరకు ఏమీ అంత శ్రద్ధ తీసుకొన లేదు. అది మౌలికంగా తప్పుదారి అనీ అది సరి దిద్దడం అత్యవసరమనీ కూడా నేననుకొన్నాను. భారత దేశంలో ఉన్న విద్యావంతులందరూ సంస్థానంలోని నేటి యథార్థ పరిస్థితులు తెలుసుకొనేటందుకు వీలుగా ఇంగ్లీషులో ఒక బులెటిన్ (కరపత్రము) తయారు చేసి ప్రకటించడము అత్యవసరం అని నిశ్చయించుకొన్నాను. అది చిన్న పనే కని, అది కూడా ఏమీ తేలికైన పనికాదు. దానికి కావలసిన విషయాల సేకరణ రహస్యంగా చెయ్య వలసి వచ్చింది దాన్ని టైప్ చెయ్యడం కూడా రాత్రి వేళల్లో దూరంగా ఉన్న చోట ఎవరికీ తెలియని మనుష్యులచే చేయించ వలసి వచ్చింది వ్రాత ప్రతిని సంస్థానంలో నుంచి బైటికి రహస్యంగా, పోలీసుల కళ్లు కప్పి, తరలించి అచ్చు వేయించ వలసి వచ్చింది. సంస్థానం లోని ఏ ముద్రాశాల (అచ్చు ఆఫీసు) కూ దాన్ని అచ్చు వెయ్యడానికి తగిన సాహసంలేదు. ఆ ఏడాది అఖిల భారత కాంగ్రెసు (ఏ. ఐ. సి. సి.) సమావేశం ఢిల్లీ నగరంలో జరిగింది. ఆ సమావేశం జరిగే నాటికి ఆ పుస్తకం కాపీలు తయారు చేయించి వాటిని ఆ సమావేశంలో మెంబర్లందరికీ ఢిల్లీలోనే పంచి పెడితే దేశం నలుమూలలకూ హైదరాబాదు సంస్థాన సమస్య ప్రచారం అవుతుంది. అందుచేత ఆ కరపత్రాన్ని అచ్చువేసే పని తొందరగా చేపట్టడం జరిగింది. "హైదరాబాదు సంస్థానంలోకి ఒకసారి తొంగిచూస్తే" అనే చిన్న పుస్తకం, ఆ ప్రయత్న ఫలితంగా తయారైంది.

కొంతకాలం గడిచే వరకూ ఆ పుస్తకాన్ని సంస్థానంలో అచ్చు వెయ్యాలనుకోలేదు అది అచ్చువేస్తే సంస్థాన ప్రభుత్వం దాన్ని వెంటనే నిషేధించ వచ్చునని అనుకొన్నాము. అయినా, కొన్ని కాపీలను సంస్థానంలో ప్రముఖులైన వారికిచ్చి అన్ని కాపీలూ ప్రజలలో ప్రచారం అవుతున్నాయని తృప్తి చెందాము. ఆ పుస్తకం అచ్చుఅయి సంస్థానంలో ప్రచారమైందని ప్రభుత్వానికి తెలిసింది. కాని, అప్పుడు ఏమి చేసే టందుకూ కాలాతిక్రమణమైందని వారేమి చర్య తీసుకోలేదు. వారు దాన్ని నిషేధించ లేదు కాని, మొదటి సత్యాగ్రహోద్యమం ప్రారంభించిన దినాల్లో ఆ పుస్తకం కాపీలు ఎక్కడెక్కడ కంటబడ్డా ప్రభుత్వం తమ స్వాధీనం చేసుకొన్నది.

అగ్ని పర్వతం పేలేటటువంటి పరిస్థితి క్రమక్రమంగా వృద్ధి చెందుతోంది. సంస్థానానికి బైట ఉన్న కొందరు దేశభక్తులు మేము చాలా సోమరిపోతుల్లా ఉన్నామనీ అలసులమనీ అనుకోసాగారు. వారు మా అలసత్వాన్ని గురించి అసంతృప్తి వెల్లడించేవారు ప్రఖ్యాతి చెందిన సేనాపతి బాపట్ నాకు తాను హైదరాబాదు రాదలచుకొన్నట్లూ ప్రభుత్వం తన్ను హైదరాబాదు రాకూడదని నిషేధాజ్ఞ జారీచేస్తే ఆ ఆజ్ఞను ఉల్లంఘించ దలచుకొన్నాననీ జాబు వ్రాసారు. ఆయనకు జవాబు వ్రాస్తూ ఆయన రాకకుహృదయ పూర్వక స్వాగతం వెల్లడిస్తున్నాననీ ఆయన అడుగు జాడలలో నడిచే టందుకు సిద్ధంగా ఉన్నామనీ ఆయన వెంట సూదిలో దారంలా ఉంటామనీ తెలియజేశాను. ఆయన వచ్చారు ప్రభుత్వం ఆయన సంస్థానాన్ని సందర్శించ కూడదని నిషేధించ లేదు. ఆయన మాతో రెండు రోజులు గడిపారు. ఆయనకు మేము మా కార్యాచరణ పథకాలు వివరించాము మరికొన్ని వారాలపాటు ఓర్పుతో కని పెట్టుకొని ఉండవలసిందని అర్థించాము. ఉద్యమాన్ని సంస్థానం లోని వారు సంస్థానంలోనే ప్రారంభించ వలసి ఉంటుందనీ, సంస్థానానికి చెందని బైటి వారు ఎంత గొప్పవారైనా అది ప్రారంభించడం అనుచితమనీ చెప్పాము. ఆయన మాతో ఏకీభవించి పూనా నగరానికి వెళ్లారు

ఉద్యమం ప్రారంభమైన తర్వాత ఆయన అందులో పాల్గొని సత్యాగ్రహం చెయ్యడము ఔరంగాబాదు జైలులో నిర్బంధంలో ఉండటమూ జరిగాయి.

సత్యాగ్రహోద్యమము జరుగుతుంది, జరపాలి, అనే వార్త గాలిలో నిండి వ్యాప్తి చెందింది. ప్రతి వారూ ఆ అభిప్రాయంతో ... వించారు. స్వాగతం అన్నారు. ఏదో కొద్దిమంది సమాజంలో ఏ మార్పూ రాకూడదని అభిలషించేవారు తప్ప అందరూ ఉద్యమం పట్ల సానుభూతి కలవారే. అందులో స్వయంగా పాల్గొనడమా మానడమా అనే విషయం చర్చనీయమైనపుడు ఉద్యమం పట్ల వెల్లడి అయిన ఉత్సాహం సన్నగిల్లేది. అందుచేత ఉద్యమంలో పాల్గొనే వారి సంఖ్య తక్కువగానే ఉంటుందని మేము అంచనా వేశాము కానీ, సత్యాగ్రహోద్యమ ప్రభావము ఎప్పుడూ అందులో పాల్గొనే వారి సంఖ్యను అనుసరించి నిర్ణయం కాదు. మొత్తం మీద సమయం ఆసన్నమైంది. కాలం పరిపక్వమైంది ఎక్కువ మందో, తక్కువ మందో సంఖ్యతో నిమిత్తం లేకుండా ఉద్యమాగ్ని గుండాన్ని ప్రజ్వలితంచేసి, దానిలోకి దూకవలసిందే,అని నిర్ణయించాము.

సంస్థానంలోనూ బైటా ఉన్న రాజకీయ వాదులందరూ సంచలితులైనారు. భారత దేశంలోని మత తత్వ ప్రధాన సంస్థలు తమ పాత్ర తాము నిర్వహించా లనుకున్నాయి. సంస్థానంలో ఉన్న సంస్థలు కూడా అట్లాగె అనుకున్నాయి సత్యాగ్రహోద్యమ ప్రారంభానికి తేదీ నిర్ణయించినట్లు తెలియగానే వారు నా దగ్గరకు వచ్చి ఉద్యమాన్ని మహారాష్ట్ర పరిషత్ కనక ప్రారంభిస్తే తాము పెద్దా వాలంటీర్లుగా పాల్గొంటామని చెప్పి అది లాటూర్ సమావేశంలో పరిషత్ చేసిన నిర్ణయానికి అనుగుణమైన చర్య అని చెప్పారు. అంతే కాని, తమకు హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌పై ఉన్న నిషేధాజ్ఞను ధిక్కరించే ప్రసక్తితో సంబంధం పెట్టుకోమని అన్నారు. వారితో నేను చర్చించాను. ఇట్లాంటి చర్యలు సంస్థానం మొత్తం మీద బృహత్ పథకాన్ని అనుసరించి నిర్వహించడం తగిన పని అని ఏదో ఒక ప్రాంతానికి సంబంధించిన విషయంగా దాన్ని కుదించి

సంకుచితం చెయ్యడం అనుచితమనీ విషయ గౌరవానికి తగిన గుర్తింపు కాదనీ నచ్చ చెప్పే ప్రయత్నం చేసాను. కానీ, వారు వెనక లేదు. వారు కాంగ్రెస్‌తో ఏమీ సంబంధం పెట్టుకో దలచుకో లేదు. వారు, ఒకవిధంగా భారత దేశంలో ఉన్న మత సంస్థకు అనుబంధంగా ఉన్న తరహా వారు. కాంగ్రెసుకి ప్రాధాన్యం లభించడం వారికి సుతరామూ ఇష్టం లేదనీ ఉద్యమం నిర్వహించిన పేరు ప్రతిష్టలు కాంగ్రెసుకి కాకుండా మరొకరికి రావాలనీ వారి ముఖ్యోద్దేశము. ఒకరోజున హిందూ పౌరహక్కుల సంఘము ఏర్పాటవుతుందనీ వారు సత్యాగ్రహోద్యమం నిర్వహిస్తారనీ ప్రకటన వచ్చింది. వారు తమ పనితాము చేశారు

హైదరాబాదు ఆర్య సమాజ్ పూర్తిగా మత పరమైనసంస్థ. వారు కూడా మత విషయికమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కొరకు సత్యాగ్రహం చెయ్యాలనే పథకాలు వేస్తున్నారు. గతకొన్ని సంవత్సరాలుగా నిరంకుశ ప్రభుత్వం యొక్క ఇనప పిడికిలి వారిని అణచి పెట్టి ఉంచింది. 'ఓమ్' అని ఉన్నవారి జెండాలు తగల బెట్టడం జరిగింది. వారి హవన (హోమాగ్ని) కుండాలు అపవిత్రం కావించ బడ్డాయి. ఆర్య సమాజ్ మందిరాలపైన దాడులు జరిగాయి. కార్య కర్తలను హింసించడం, అవమానించడం కుప్పతిప్పలుగా జరిగాయి అందు చేత వారుకూడా ముస్లిము మతావేశ పరుల మతావేశాన్నెదుర్కొనే సామర్థ్యం గల సంఘాన్ని నిర్మించు కొని కృషి చేస్తున్నారు. వారి వెనుక మద్దతుగా వారి అఖిల భారత సంస్థ ఉంది.

ఆ నాటి ఆర్య సమాజ్ నాయకు లందరి లోనూ నాకు పండిట్ నరేంద్రజీ అత్యున్నతుడనే భావం కలిగింది. ఆయనతోనాకు అంతకు ముందు వ్యక్తిగత పరిచయం ఏమీ లేదు. ఆయన పూర్తిగా విప్లవాత్మక భావాలు కలవాడు. ఆయన తన భావాలను నిర్భయంగా వెల్లడించ గలిగిన సాహసి ఆయనధైర్య సాహసోపేత వచనాలు వేలాది జనాన్ని కదిలించాయి. ఆయన శక్తి మంతుడైన వక్త. తన జీవితాన్నంతా ఆయన ప్రజల కోసమే ధార పోశాడు. ఆ రోజుల్లోని ప్రభుత్వము, ఆయనను

తమ ప్రధాన శత్రువుగా పరిగణించింది. హైదరాబాదు ప్రజాసామాన్యానికి ఆత్మ విశ్వాసము, ఆత్మ గౌరవం పట్ల అభి నివేశము, స్వయం రక్షణ శక్తి, కలిగే టందుకు ఆ కష్టకాలంలో వారు సిగ్రహించు కొని నిలబడే టందుకూ నరేంద్రజీ ప్రోత్సాహమే కారణము. ప్రభుత్వం అవకాశం కల్పించుకొని మొట్టమొదటనే ఆయనను అరెస్టు చేసి మన్ననూరు జైలులో ఒక సంవత్సరమో, రెండు సంవవ్సరాలో నిర్బంధించారనడం ఎవరికీ ఆశ్చర్యం కలిగించ లేదు.

సత్యాగ్రహం చెయ్యాలనుకున్న మా వంటి వారము ప్రారంభింప దలచు కొన్న ఉద్యమం జాతీయతా చిహ్నిత మైన సత్యాగ్రహోద్యమము మేము నమ్మిన మౌలిక సూత్రాల పట్ల మా విశ్వాసాల కనుగుణంగా ఉద్యమాన్ని నిర్వహించే విధానాన్ని మేమే రూపొందించు కొనవలసి మేము ఆర్యసమాజ్ మిత్రుల తోటి హిందూ మహా సభకు చెందిన వారితోటి హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధాజ్ఞలు జారీ అయిన వెంటనే మేము సత్యాగ్రహం చేస్తామనీ మా సత్యాగ్రహం మతపరమైన భావాలతో సంబంధం పెట్టుకోకుండా స్వచ్ఛమైన జాతీయతను నిలబెట్టుకొంటుందనీ తెలియ జేసాము ఆ తర్వాతనే 1938 లో అక్టోబరు 24 నాడు హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు తన మొదటి సత్యాగ్రహోద్యమాన్ని ప్రారంభించింది. దానికి రెండురోజులు ముందుగానే హిందూమహాసభకు చెందినవారు తమ ఉద్యమం ప్రారంభం చేశారు. ఆర్యసమాజ్ వారు ఆ తర్వాత మరి కొన్నాళ్ళకు ఒక సంస్థగా ఉద్యమంలో ప్రవేశించారు.

మా ఉద్యమాన్ని కొన్ని మౌలిక సూత్రాల ననుసరించి నడపడం సరియైన నిర్ణయమని, తర్వాతి అనుభవం వల్ల రుజువైంది. హైదరాబాదు కాంగ్రెసు ఉద్యమం జాతీయత పునాదిగా రూపొందింది. మతపరమైన శక్తులకు సంస్థానంలోని వాతావరణం అత్యంత అనుకూలంగా ఉన్నప్పటికీ అవి నిలబడలేక పోయాయి.

ప్రజలకు నివేదించే ప్రకటనలు తయారు చేసేటందుకూ ఉద్యమ నాయక నిర్వాహకులుగా ఒకరి తర్వాత ఒకరు బాధ్యత వహించే సర్వాధికారులను నియమించేటందుకూ, జట్ల వారీగా సత్యాగ్రహులను రంగంలోకి పంపేటందుకూ ఒక చిన్న కమిటీని ఏర్పాటు చెయ్యడం మా ప్రథమ కర్తవ్యమైంది ఉద్యమం కొనసాగుతున్న తీరు, దానికి సంబంధించిన సమాచారము వివరాలు, అన్ని వార్తా పత్రికలకు, ప్రముఖ దేశీయ కాంగ్రెసు నాయకులకు తెలియజేసే ఏర్పాట్లు చెయ్యవలసి వచ్చింది ఈ పనులు పూర్తి కాగానే శ్రీ నానాల్ అధ్యక్షుడుగా శ్రీరామకృష్ణధూత్ కార్యదర్శిగా, శ్రీయుతులు జనార్దన్ దేశాయి, రావి నారాయణరెడ్డి, శ్రీనివాసరావు బోరికర్, మెంబర్లుగా మొదటి కార్యాచరణ కమిటీ (Working Committee) ఏర్పడింది. వెంటనే తాత్కాలిక కమిటీ రద్దు అయింది అందుచేత సత్యాగ్రహానికి వెంటనే అవసరం కలిగింది.

శ్రీనానాల్ మత విశ్వాసం కలవాడు. ఉద్యమ ప్రారంభానికి మంచిరోజు ఏదో జ్యోతిష్కులు నిర్ణయించాలన్నారు మాలో చాలా మందికి అట్లాంటి నమ్మకాలు లేకపోయినా ఆయన మాట ప్రకారమే కొనసాగించాము. అందువల్ల దీపావళి మొదటి రోజున సత్యాగ్రహం చెయ్యాలని నిశ్చయించాము. సుల్తాన్ బజారు ప్రాంతంలో టెలిగ్రాఫ్ ఆఫీసు దగ్గర, ఉదయం 10 గంటల వేళ సత్యాగ్రహానికి కాల నిర్ణయం చేశాము వేల సంఖ్యలో జనం సమావేశమయారు. వారందర్నీ ఉద్దేశించి శ్రీ నానాల్ హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ ఏర్పడిందనీ దానికి తాను అధ్యక్షుడననీ తనతో ఉన్న నలుగురూ కార్యవర్గ సభ్యులనీ వారి పేర్లు పేర్కొంటూ ప్రకటన చేసారు.

శ్రీ జనార్దనరావ్ దేశాయ్ కర్నాటక పరిషత్ ఏర్పాటు కావడానికి ముఖ్య కారకుడు ఆయన కర్నాటక నాయకులలో అగ్రేసరుడు, శక్తిమంతుడు. బాధ్యతాయుత ప్రభుత్వ సాధన లక్ష్యంగా కృషి చేసేటందుకు మొత్తం సంస్థానం అంతటికీ ఒక సంస్థ ఉండాలన్న వాదాన్ని సమర్థించి

ప్రచారం చేసిన వారిలో ఆయన ఒకరు. హైదరాబాదు స్టేట్ కాంగ్రెసులో ముందుగా సభ్యులను చేర్చాలనే ఆలోచన ఆయనఇంట్లో జరిగిన సమావేశంలోనే వచ్చిందనీ ఆనిర్ణయం అక్కడే తీసుకొనడం జరిగిందనీ అందుకోసమై ఒక తాత్కాలిక కమిటీ కూడా ఏర్పాటైందనీ నాకు జ్ఞాపకం. ఆయన మొదటి జట్టు సత్యాగ్రహులలో చేరినందువల్ల ఉద్యమానికి ఎంతో బలం లభించింది.

శ్రీ రామకృష్ణదూత్ సంస్థానంలో ఉన్న మార్వాడీలలో ఒకరు. సామాజిక శ్రేయస్కాముడైన కార్యకర్త అనేక సంవత్సరాల అనుభవం ఉన్నవాడు. సహజ స్వభావం చేత నిర్మాణాత్మక కార్యక్రమాల పట్లనే ఎక్కువ ఆసక్తి ఉన్నవాడైనా ప్రభుత్వం చేసిన సవాలువల్ల ఉత్తేజితుడై స్టేట్ కాంగ్రెస్ మొదటి కార్యాచరణ కమిటీలో కార్యదర్శిపదవి చేపట్టారు. ఆ తర్వాత సత్యాగ్రహం పూర్తి అయి మహాసభ సమావేశం జరిగి కార్యదర్శిని ఎన్నుకొనడం జరిగేవరకూ ఆయన ఆ పదవిలోనే కొనసాగినారు.

శ్రీ శ్రీనివాసరావు బోరికర్ మరాట్వాడవాడైన యువకుడు. మంచి ఆర్జన ఇస్తున్న న్యాయవాద వృత్తిని తృణప్రాయంగా వదలి మొదటి జట్టు సత్యాగ్రహులలో చేరేటందుకు ఆయన ముందుకు వచ్చాడు. హైదరాబాద్ స్వాతంత్ర్యోద్యమంలో తన సర్వస్వాన్ని త్యాగం చేసిన యువకుల్లో శ్రీ బోరికర్ ఒకరని ఎన్నుకోవలసి ఉంటుంది అంతేకాకుండా ఆయన ఉద్యమం ప్రారంభ దశలోనూ ఆ తర్వాతా కూడా ఉద్యమానికి సమర్థవంతనీయమైన కారకుడైనాడు.

శ్రీ హరిశ్చంద్ర హెడాకు కార్యాలయాన్ని నిర్వహించడము, సత్యాగ్రహోద్యమాన్ని సమన్వయం చెయ్యడము అనే బాధ్యతలు అప్పగించడం జరిగింది. సత్యాగ్రహుల పేర్లున్న పట్టికలు అన్నీ ఆయనకు అప్పగించి, సత్యాగ్రహోద్యమ స్థాయి నిర్ణయించి అది కొనసాగించాలని అనుకొన్నాము సత్యాగ్రహులను ఒక జట్టు తర్వాత ఒక జట్టుగా కార్యరంగంలోకి పంపడం, కరపత్రాల ద్వారా ప్రచారం చెయ్యడం, ఇతర

ఏర్పాట్లు చెయ్యడం ఆయన కార్యకలాపాలైనాయి. శ్రీ బిందు తనవంతు వచ్చేవరకూ ఆయనకు సహకరించే ఏర్పాటు జరిగింది ఆయన తెలంగాణా ప్రాంతంలో కొందర్ని ఉత్సాహితుల్ని చేసి, తర్వాతనే స్వయంగా ఉద్యమంలో పాల్గొనవలసి ఉంటుంది.

సంస్థానంలో ఉన్న పోలీసు ఆఫీసర్లకు సత్యాగ్రహోద్యమం అంటే ఏమీ తెలియదు. వారు శాంతియుత ఉద్యమంయొక్క ప్రాధాన్యం అర్థం చేసుకోగలిగినవారు కారు కొంతకాలంపాటు వారికి ఏమి చెయ్యాలో తెలియలేదు. బహుశా వారు ప్రజలలో అలజడి కలుగుతుందనీ, అల్లర్లు జరుగుతాయనీ ఎదురుచూసినట్లున్నారు. ప్రజలు శాంతంగా ఉండి క్రమశిక్షణతో ప్రవర్తించారు చివరకు వారికి స్టేట్ కాంగ్రెసు మొదటి కార్యాచరణ సమితి సభ్యులను అందర్నీ అరెస్టు చెయ్యవలసిందని ఆజ్ఞలు వచ్చినట్లున్నాయి. వారు సత్యాగ్రహుల్ని చంచల్‌గుడా సెంట్రల్ జైలుకి కొనిపోయారు.

ప్రజా ఉద్యమంలో మొదటి బాణాన్ని వదిలాము. నేను ఆ సంరంభాన్ని సందర్శించేటందుకు పోలేదు. ఆ తర్వాత కొనసాగించవలసిన భవిష్యత్ కార్యక్రమానికి తుదిమెరుగులు తీర్చవలసివుంది ఎందుచేతనంటే మరో రెండు రోజులు గడచిన తర్వాత(సత్యాగ్రహోద్యమ) మొదటి సర్వాధికారి (డిక్టేటర్)గా నేను సత్యాగ్రహం చెయ్యవలసివుంది "సత్యాగ్రహోద్యమాన్ని రెండు నెలలపాటు కొనసాగించాలి ప్రతివారంలోనూ మూడుసార్లు సత్యాగ్రహుల జట్లు నిషేధాజ్ఞను ఉల్లంఘించాలి." అని, నిర్ణయించాము. ఈ కార్యక్రమానికి వరసగా పదవీస్వీకారం చేసే పదహారుమంది సర్వాధికారులనూ, సత్యాగ్రహుల జట్లనూ నిర్ణయించవలసిన అవరంవుంది. నాయకులుగా చెలామణీ అవుతున్న వారిలో ఒకరు, చట్టాలకు అనుగుణంగా కార్యక్రమాలు నిర్వహించాలనే తత్వం గలవారు ఒక వింతగా కన్పించే అభిప్రాయాన్ని వెల్లడించం జరగింది ప్రజల్లో ఏమీ ఊరూ పేరూ లేని కార్యకర్తలు మొదటి సత్యాగ్రహం చెయ్యాలనీ

వార్తాపత్రికలలో ప్రచారం పొందుతూ ప్రఖ్యాతికెక్కిన వారు చివరి జట్టులో సతాగ్రహం చెయ్యాలనీ ఆయన ప్రతిపాదించారు! సతాగ్రహోద్యమంపట్లా, నాయకత్వ బాధ్యతలపట్లా ఆయనకు ఎంత విపరీతమైన భావాలున్నాయి! ఆ నాయకుడితో నేను వాదించలేదు ఆయన పేరు ముహూర్తానికి కనిపెట్టుకొని వుండేవారి పట్టికలో చేర్చాము. నేను సత్యాగ్రహం చెయ్యడానికి సంసిద్ధుణ్ని అయాను. అప్పటికి పూర్తిచెయ్యడానికి వీలైనంత పనీ చేసి పథకం తీర్చిదిద్ది 1938 అక్టోబరు 27, నాడు సత్యాగ్రహం చేశాను

భారత దేశం నలు మూలల నుంచీ కాంగ్రెసు నాయకులు మా ఉద్యమాన్ని, దాని ప్రాముఖ్యతను గుర్తించారు వారుతమ అభినందనలను మాకు తంతి వార్తలుగా పంపించారు ప్రజలలో కూడా ఉత్సాహం పొంగింది. అది ఉవ్వెత్తుగా తరంగం వలె పైకి ఉవికి తిరిగి కిందికి దిగే టటు వంటిదై కొద్దికాలం పాటు మాత్రమే ఉండ వచ్చునని అనుకున్నాము శ్రీయుతులు హరిశ్చంద్ర హెడా, దిగంబర్ రావు బిందు, మందుముల రామచంద్రరావు గార్లకు భావికార్యక్రమ నిర్వహణ బాధ్యత అప్పగించడం జరిగింది. శ్రీ గోపెంద్ దాస్ పరాఫ్‌ను మరాట్వాడాలో ఉద్యమ నిర్వహణ బాధ్యత చేపట్ట మన్నాము. సత్యాగ్రహోద్యమానికి ఔరంగాబాదు రెండో కేంద్రము సత్యాగ్రహులు ఒకజట్టు తర్వాత ఒక జట్టుగా వుద్యమంలోకి దూకి శ్రీ కృష్ణ జన్మస్థాన (జైలు) ప్రవేశం చేశారు హిందూ పౌరహక్కుల పరిరక్షణ యూనియన్ (సంఘము) తన వెనుక తగినంత బలం వుండేట్లు చేసుకోనందు వల్లా కింకర్తవ్యతా విమూఢత్వంతో తెల్లమొగం వెయ్యసాగాడు. ఆర్య సమాజ్‌కి చెందినవారు వ్యక్తిపరంగా అప్పుడొకరుఇప్పుడొకరు సత్యాగ్రహంచేస్తూ మేమూఉద్యమం నిర్వహిస్తున్నామని వ్యక్తం చేసారు వారిప్రధాన సంస్థ దాని సత్యాగ్రహ ఉద్యమాన్ని గురించి ఏమి నిర్ణయం చేయ లేదు. ఇతరుల ఉద్యమాల ధోరణులతో నిమిత్తం లేకుండా స్టేట్ కాంగ్రెసు మాత్రం తన సత్యాగ్రహోద్యమాన్ని అను కొన్న రీతిగా క్రమం తప్పకుండా నడిపించింది

ఏమి జరుగుతున్నదో ప్రజలకు తెలిసేటందుకు ధారావాహికంగా కర పత్రాల ప్రచురణ జరిగేది. నానాటికీ జైలులో వున్న కాంగ్రెసు సత్యా గ్రహుల సంఖ్య పెరగ సాగింది.

జైలులో జరిగిన కొన్ని సంఘటనల వివరాలు తరవాతి అధ్యా యాల్లో ఒక దాంట్లో ఇవ్వాలని అను కొంటున్నాను. అందు చేత ఈ సందర్భంలో మా సత్యాగ్రహోద్యమానికి బలం చేకూర్చిన మరొక ముఖ్య మైన ప్రగతి శీల సంఘటనను గురించి ఇప్పుడు చెప్పడం తగినదని అనీ అవసరమనీ అనిపిస్తున్నది అది శ్రీ సిరాజుల్ హసన్ తిర్మిజి,హైదరా బాద్ స్వాతంత్ర్య పోరాటంలో నిర్వహించిన పాత్రకు సంబంధించింది. స్వర్గీయ శ్రీతిర్మిజి ఆ నాటి కాంగ్రెసు వాదులందరిలో అత్యున్నతుడు. ముస్లిము మతావేశంతో నిండి వున్న హైదరాబాదు సంస్థానంలో తన అసాధారణ ధైర్య సాహసాల వల్లా సహజ దేశభక్తి విశ్వాసాల వల్లా శ్రీ తిర్మిజి ప్రజల హృదయాల్లో అనన్య స్థానాన్ని అలంకరించారు. ఆయన మతావేశాన్ని ఎదిరించి పోరాటం సాగించారు. కొన్ని సమయాల్లో ఆయన ఏకాకి కావడం, ఆయన ఒక్కరి గొంతు మాత్రమే ముస్లిమ్‌మతా వేశాన్ని నిరసిస్తూ వినిపించడం కూడా జరిగేది. ఆయన మంచి వక్త. మతాతీత భావంతో కూడిన దృక్పథాన్నే ఆయన దృఢంగా విశ్వ సించాడు తన విశ్వాసానికి ఫలితంగా ఆయన ముస్లిమ్ మతావేశ పరుల నిరసనలకు గురియై అనేక అవమానాల పాలవడం జరిగింది. అయినప్ప టికీ ఆయన తన తుది క్షణం వరకూ జాతీయ వాదిగానే నిలచి స్వర్గీయు డైనాడు.

# 17. వందేమాతరం ఉద్యమంలోని ఉపకథ

హైదరాబాదు సంస్థానంలో వందేమాతరం ఉద్యమం రేపిన అగ్ని జ్వాలల్లో దివిటీలను చేత ధరించి నడచిన వారిలో విద్యార్థి లోకానిదే ప్రథమ తాంబూలము. దేశభక్తి భావావేశం క్రమంగా వృద్ధిచెంది విద్యార్థి లోకానికి ఆవేశం కలిగించింది. ఒక వంక దేశం అంతా స్వతంత్రం కోసం పోరాటం సాగిస్తూ ఉండగా యువకులు అసహజమైన వాతావరణంలో ఆ ఉద్యమంతో తమకేమీ సంబంధం లేదన్నట్లుగా చేతులు ముడుచుకొని కూర్చుని ఉండి పోకుండా ఒక అనుబంధ ఉద్యమం కొనసాగించడం ఎంతో సహజమనే అనాలి. హైదరాబాదు సంస్థానములో ఉన్న విద్యార్థుల విషయంలో ఇది మరింత యథార్థం. కొన్ని సంవత్సరాలనుంచీ హైదరాబాదు సంస్థానంలోని విద్యార్థులు,తాము అవమానాలకూ అగౌరవాలకు దూషణలకూ గురి అవుతున్నట్లు గుర్తించి బుసలుకొడుతూ తగిన సమయం కోసం కని పెట్టుకొని ఉన్నారు. సంస్థానం లోని విద్యా కేంద్రాలు అన్నీ వచ్చి కులమత తత్వంతో కుళ్లుకంపు కొడుతున్నాయని వారు తీవ్రమైన అసంతృప్తి చెంది ఉన్నారు. హిందూవిద్యార్థులు, తమతో పాటు చదువుతున్న ముస్లిము విద్యార్థుల కంటె హీనులుగా పరిగణింపబడటం జరుగుతోంది.విద్య నేర్పేటప్పుడుగూడా హిందూ విద్యార్థులను చిన్న చూపు చూడటము, వారెంత నేర్చినా,ఎంత తెలివైన వారైన,వారు ముస్లిము విద్యార్థుల కంటె తక్కువే అని ఈసడించడము జరిగేది. పాలిత పాలక వర్గ భావం అడుగడుగునా, మాట మాటకీ ప్రస్ఫుట మయేది. ఉన్నత ఉద్యోగాలలో సుమారు అన్నీ కూడా ముస్లిము విద్యార్థులకే కేటాయించబడి ఉండేవి. ముస్లిములు కాని వారు తమ భవిష్యత్తును గురించి ఏమీ ఆశ

పెట్టుకొనేటందుకు అవకాశాలుండేవి కాదు. అందు చేత విద్యార్థులలో అధిక సంఖ్యాకులు, వారిలోనూ ఒక అంతస్థుకు చెందిన వారు, సత్యాగ్రహోద్యమం యొక్క ప్రభావానికి వశులై అంత వరకూ వారిని దాస్య భావంలో ఉంచిన మానసిక శృంఖలాలను త్రెంచు కొని బైట పడటమూ, అది వందేమాతరం ఉద్యమంగా రూపొందడమూ జరిగాయి

వందేమాతరం ఉద్యమంలో మొదటి ఫిరంగిగుండు ఔరంగాబాద్‌లో పేలింది ఆ నగరంలో ప్రభుత్వం నిర్వహిస్తున్న ఇంటర్మీడియట్ కాలేజి విద్యార్థుల్లో శ్రీ గోపాలరావు షరాఫ్ అనే అధ్యాపకుడు దేశభక్తి భావాలను ప్రోది చేసి పెంపొందిస్తున్నాడు. అవి పరిణతి చెంది ఉద్యమ రూపంలో ప్రస్ఫుటమైనాయి ఆ కాలేజీ విద్యార్థులు తాము కూడా స్వాతంత్ర్యోద్యమానికి ఏమి శక్తి కొద్దీ తోడ్పడాలని అనుకొన్నారు అవకాశాలు సేకరించారు ఆ రోజుల్లో ప్రభుత్వ సంస్థానా లన్నింటిలోనూ అసాఫియా వంశపు ఔన్నత్యాన్ని కీర్తించే వంది మాగధ గేయాన్ని ఇంగ్లీషు వారి 'గాడ్ సేవ్ ది కింగ్' గేయపు ఫక్కీలో పాడించే ఆచారం (సంప్రదాయం) ఉండేది ప్రతి రోజూ పాఠాలు చెప్పడం ప్రారంభం చేయడానికి ముందుగా ప్రతి విద్యా సంస్థలోనూ ప్రతి క్లాసులోనూ విద్యార్థుల చేత ఐక్య కంఠంతో ఆ రాజ భక్తి గేయాన్ని పాడించే వారు ఆ పాట పాడించటంలో ఒక ప్రత్యేకత కూడా ఉంది ఆ పాట పాడిన ప్రతి వారూ అసాఫియా వంశం వారి పట్ల తమ విధేయతను ప్రతిజ్ఞా పూర్వకంగా (ఒట్టు రూపంలో) అంగీకరించడం ఇమిడి ఉంది యువ హృదయాలు, ఆ భావాన్ని సహజంగా వ్యతి రేకించాయి దాన్ని వ్యతిరేకించాలని వారనుకున్నారు, అంతే, వెంటనే దాన్ని తీవ్రమైన ధోరణిలో ఎదిరించారు. అసాఫియా వంశాన్ని కీర్తించే గేయాన్ని పాడేటందుకు వారు నిరాకరించారు దానికి బదులు "స్వాతంత్ర్యోద్యమ శంఖారావం వంటిదైన "వందే మాతరం" అనే జాతీయ గీతం పాడు కొంటామన్నారు ఒక రోజున విద్యార్థులు యావన్మందీ, వారిలో కొందరు ముస్లిము యువకులు కూడా వున్నారు, అసాఫియా వంశ కీర్తి గెయం పాడము అని నిక్కా

రించి, "వందేమాతరం" పాట పాడారు ఈ రీతిగానే అన్ని హాస్టల్స్ లోనూ, సంస్థానంలోని అన్ని విద్యాసంస్థల్లోనూ విద్యార్థుల్లో భావవిప్లవము పంచలనము ప్రత్యక్ష మైనాయి

కళాశాల అధికారులు ఈ విద్రోహచర్యను సహించ లేక పోయారు. ప్రభు వంశం వారి పట్ల గౌరవాభిమానాలు లేకపోవడం రాజ ద్రోహం. విద్యార్థులు, వారంతట వారు మరెవరి ప్రోత్సాహమూ మద్దతూ లేకుండా ఈ చర్య తీసుకొని ఉంటారా? ఎవరు ఈ రాజ ద్రోహచర్యలకు విద్యార్థులను రెచ్చ గొట్టిన మూల కారకులు? వారిని బైటికి లాగాలి. విశ్వ విద్యాలయ అధికారులు ఈ పరిస్థితులను గమనించి చాలా ఆందో ళన పడ్డారు కూపీ లాగడానికి తీవ్రంగా కృషి చెయ్యడం ప్రారంభిం చారు ఎందు చేత నంటే ఇది ఆ సంస్థకే పరిమిత మైన విషయం కాదు. విద్యార్థి లోకం ఈ సవాలును ఎదుర్కొన్నది వందే మాతరం పాడటం తమ జన్మ హక్కుగా భావిస్తూ న్నా మన్నారు. ప్రభుత్వం కూడా తన మొండి పట్టుదల వదల లెదు శ్రీ గోవింద దాస్ షరాఫ్ తన ఉద్యోగాన్ని వదలివేసి జాతీయ గీతమైన వందేమాతరం పాడేటందుకు తమకు గల హక్కుకోసం విద్యార్థులు కొన సాగిస్తున్న పోరాటాన్ని, ఉద్య మాన్ని బలపరిచే టందుకు సహాయకారిగా ఉండేటందుకు నిశ్చయించు కున్నారు.

విశ్వ విద్యాలయ పరిసరాలు వందేమాతరం పాటతో ప్రతిధ్వనిం చాయి అధికారులు ఆ పాట పాడకూడదని నిషేధించారు ఆ పాటపాడిన విద్యార్థులు తీవ్రమైన కఠినమైన పరిణామాల నెదుర్కొన వలసి ఉంటుం దని భయపెట్టారు. కాని, విద్యార్థులు ఎవరి పోలేదు. వారు తమ విద్యారు లతో ఒక కార్యాచరణ కమిటీని ఏర్పాటు చేసుకొన్నారు. సంస్థానంలోనూ బైటా భారత దేశం అంతటా తమ పోరాటాన్ని సమర్థించే టందుకు కావలసిన ప్రజాభిప్రాయాన్ని దానికి అనుకూలమైన వాతావరణాన్ని ప్రచారం ద్వారా కల్గించు కొన్నారు. నిజాము ప్రభుత్వం ప్రజాభిప్రాయా నిం లొంగి పోవడానికి సిద్ధంగా లేదు ... తన పంతము నెగ్గాలనే

నిరంకుశత్వం కరడు కట్టిన ప్రభుత్వము. అప్పుడు సంస్థానానికి ఆ తర్వాతి కాలంలో స్వర్గీయులైన సర్ అక్బర్ హైదరీ ముఖ్య మంత్రి. ఆయన నుంచి ప్రజలపై పగసాధించె చర్యలు తప్ప మరేసామోపాయాలు ఆశించే అవకాశాలు లేవు. విద్యార్థులు కూడా ఏ మాత్రమూ వెనుకకు తగ్గకుండా ఆయన వలెనే దృఢ నిశ్చయంతో టి ఉన్నారు. సంప్రతింపులు అన్నీ విఫల మయ్యాయి విద్యార్థులు ప్రభుత్వవిద్యాసంస్థలన్నిం టినీ బహిష్కరించాలనే పిలుపునిచ్చారు ప్రభుత్వ కళాశాలలన్నీ మూత పడ్డాయి. వందేమాతరం ఉద్యమం నిరవధికంగా కొన సాగింది

ఈ విషయంలో రాజీ కాని, మధ్యేమార్గం కాని ఉన్నట్లు కనిపించ లేదు. ఎంత కాలం విద్యార్థులు కళాశాలలకు వెళ్లకుండా ఉండ గలరు? సమ్మెరూపంలో ఉన్న ఆ బహిష్కరణోద్యమం నెలల తరబడి సాగింది. మాలో చాలా మందిమి అప్పుడు జైళ్లలో ఉన్నాము. అందు చేత, తమ సర్వస్వాన్ని, భవిష్యత్తునూ ఒడ్డి పోరాటం కొనసాగిస్తూన్న ఆ యువకు లకు ఏ విధంగానూ ఉపకరించ లేకపోయాము కాని, స్వేచ్ఛగా ఉన్న వారిలో కొందరు ఆ విద్యార్థులకు ఏ తీరుగా సంహాలిచ్చి తోడ్పడే టందుకు వీలున్నదో అట్లాగ చెసి సహాయ కారులైనారు స్వర్గీయ శ్రీ రామచంద్రరావు తన మిత్రులతో కూడ కలిసి వారికి సహాయపడినారని ఈ సందర్భంలో తెలియ జెయ్యడం ఉచిత మనిపిస్తున్నది కార్యాచరణ కమిటీ ఉద్యమాన్ని ఏ విధంగానూ నడలించేటందుకు అంగీక రించలేదు విశ్వవిద్యాలయంలో చదువుతన్న విద్యార్థులచదువులకు ప్రత్యామ్నాయపు ఏర్పాట్లు చెయ్యడం ఆవశ్యక మైంది అది ఎంతో కష్టమైన పని విద్యా ర్థులలో చాలా మంది వారు గైకొన్న ఈ దేశ భక్తి పూర్వక చర్యలకు, పాల్పడిన కష్ట నిష్ఠురాలకు తమ తల్లి దండ్రుల కోపాలకి గురిఅయినారు. అందు చెత వారి సంరక్షకులు వారికే విధంగానూ సాయం చెయ్యరు రాజీ పడట మనే సమస్యే లేదు శ్రీ అంతూ (Antoo), మరి కొందరూ ఇతర విశ్వవిద్యాలయాల ఉపాధ్యాయులను కలుసు కొన్నారు. ఉస్మానియా విశ్వ విద్యాలయానికి చెందిన విద్యార్థులకు తమ విశ్వ విద్యాలయాల్లో

చదువులు కొన సాగించు కొనేటందుకు అవకాశాలు కల్పించ వలసిందని అభ్యర్థించారు. నాగపూర్ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులైన శ్రీ కేదార్ ఈ సమస్యను గురించి తన సహచరులతో చర్చించిన తర్వాత తన ఆమోదాన్నీ, సంసిద్ధతనూ తెలియ జేశారు ఆ అవకాశాన్ని పురస్కరించుకొని వందల కొద్దీ ఉస్మానియా విశ్వ విద్యాలయ విద్యార్థులు తమ తమ చదువులు కొన సాగేటందుకై నాగపూరు, జబ్బల్‌పూరు నగరాలకు వలస పోయారు. సాహసికులైన ఆ యువకులు ఎన్నో కష్టాలను ఎదుర్కో వలసి వచ్చింది వారు వెళ్లిన చోట్ల, వారికి భోజన వసతి కాని, తగిన నివాస సదుపాయాలు గాని లభించ లేదు వాటిని ఏర్పాటు చెయడానికి సాధ్యం కాలేదు. అయినప్పటికీ వారు గుండె దిటవుతో తమ జీవితంలో ఎదురైన ఆ కఠిన పరీక్షల నన్నింటినీ ఎదుర్కొన్నారు. హైదరాబాదు నగరంలో ఉన్న ధనికులు విరాళాలిచ్చి వారికి తోడ్పడేటందుకు తాము చేయ గలిగినంత సాయం చేసారు విద్యార్థులు అచంచల అసదృశమైన దీక్షతో ఉన్నందు వల్ల కొంత కాలం తర్వాత మరో దశలో అధికారులు లాము జారీ చేసిన ఆజ్ఞను రద్దు చేసి, వందేమాతరం పాట పాడటానికి విద్యార్థులకు అనుమతి ఇచ్చారు

ఈ ఉద్యమం హైదరాబాదు సంస్థానంలో ఆ తర్వాత పెద్ద ఎత్తున సాగిన ప్రజా ఉద్యమాలకు ఒక గట్టి పునాది వేసింది విద్యావంతులైన యువకులలో జాతీయభావం ప్రాదుర్భవించి గౌరవాస్పదమైన ఉద్యమాల్లో పాల్గొని కష్ట నిష్ఠురాల నెదుర్కొనాలనే త్యాగ శీలము కలిగించింది ఆ దేశాభిమాన జ్యోతి ఉత్తరోత్తర రోజుల్లో జ్వాలగా ప్రకాశించింది. విద్యార్థి సంఘాలు (యూనియన్లు) ఏర్పాటై వాటిద్వారా విద్యార్థులందరూ సమీకరణమై బలపడ్డారు. ఆ నాడు వారింకా ఆ తర్వాతి కాలంలో జరిగిన స్వాతంత్ర్యోద్యమంలో నిర్వహించ వలసిన ఉన్నత పాత్రలకు తయారవుతున్నారు. హైదరాబాదు విద్యార్థి లోకం మంచి పేరు సంపాదించు కొన్నది. చాల కాలం పాటు, దేశభక్తి భావంతో ఉత్తేజితులైన విద్యార్థులతో సన్నిహితంగా ఉండటం నాకు ఎంతో సంతోషదాయ

కంగా ఉండేది ఈ వందేమాతరం ఉద్యమం యొక్క ప్రభావం ఒక తరం విద్యార్థుల మనస్సులో గాఢమైన ముద్ర వేసింది అనేక మందిలో ఈ ఉద్యమం అనుకోనటు వంటి మార్పు కలిగించింది. వారిలో దేశ భక్తి జ్వాలను రగుల్కొల్పి నిరంకుశ త్వాన్ని ఎదిరించే సాహసాన్ని ప్రసాదించింది ఈ నాడు నాయకులుగా ఉన్న వారిలో పాత హైదర్బాబాదు సంస్థానానికి చెందిన వారిలో అనేక మందికి వందే మాతరం ఉద్యమమే రాజకీయ కార్య క్షేత్రంలో శిక్షణ, అనుభవము సమకూర్చింది అని నిస్సంశయంగా చెప్పవచ్చు

# 18. ధీరుడైన సత్యాగ్రహి

సంస్థానంలోని మూడు ప్రాంతాలకూ చెందిన యువకులు నా జట్టులో ఉన్నారు. వారిలో ఒకరు ఇంటిలో ఎవరితోనూ చెప్పకుండా పారిపోయి వచ్చి సత్యాగ్రహుల జట్టులో చేరి పోయిన మనిషి. ఆయన తల్లి దండ్రులు తమ కుమారుడు వకీలు సనదు (పట్టా) కొనం ప్రయత్ని స్తున్నాడనే భ్రమలో ఉన్నారు !

ప్రజలలో ఉత్సాహం పరవళ్లు తొక్కుతోంది. వారికి కార్యాచరణకు నిశ్చయమైన టైమ్ ఏదో తెలుసు. అందు చేత వారు వేల సంఖ్యలో అక్కడ కూడారు. మేము మా స్టేట్ మెంట్ (ప్రకటన) చదివాము. నేను సగం ప్రకటన చదివానో లేదో నన్ను అరెస్టు చేసారు. ప్రజలలో కొంత అలజడి కన్పించింది. మమ్మల్ని వెంటనే జైలుకు కొని పోయారు. ఆ రాత్రి చీకటిలోనే మమ్మల్ని జైలులో ఒక గది నుంచి మరొక గదికి మార్చారు. ఎట్లాగైతే నేమి చివరికి మమ్మల్ని రెండు గదుల్లో వుంచి బంధించారు. ఆ గదులు చిన్నవి. వాటిలో కాళ్లు చాచు కొని పడు కొందా మంటే చోటు చాలదు. లైటు (దీపం), తాగేటందుకు నీరు లేవు.

మమ్మల్ని అరెస్టు చేసిన రెండు రోజుల తర్వాత నేర విచారణ అనే ఫార్సు (తమషా) జరిగింది. ఏయే నేరాలు చేశామనే సాకుతో మా పైన నేరారోపణ చేసారో నాకు గుర్తు లేదు. హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు పై వున్న నిషేధాజ్ఞలను ఉల్లంఘించిన నేరం చేసామని చెప్పాలనే మేము తీర్మానించు కొన్నాము. ఇతర నేరారోపణ లేమన్నా వుంటే మేము సహజంగానే నిరాక రించాలనీ మేము ప్రతివాదము చెయ్య

మనీ కొత్త వారుతను ఇష్టం వచ్చినట్లు చెయ్య వచ్చుననీ స్పష్టంగాచెప్పా లనీ అనుకొన్నాము.

నా మీద మోపిన నేరాల్లో ఒకటి చాలా హాస్యాస్పదమైంది పొట్ట గడవడానికి ఇది, అది అని ఏ నిర్ణీతమైన వృత్తీ చేయకుండా తిరిగే దేశ దిమ్మరి అనీ, తిరుగు బోతు అనీ ఫిరాటకులవలె ప్రవర్తిస్తాననీ అన్నారు సన్యాసాశ్రమం స్వీకరించిన వాడికి ఇంతకు చక్కని నిర్వచనము ! ఎంత గౌరవాస్పదమైంది! నేరారోపణ చెయ్యడం పూర్తి అయిన తర్వాత మేము సంగ్రహంగా (మూడు నాలుగు వాక్యాలలో) నిషేధాజ్ఞలను అతిక్రమించ డమే మా లక్ష్యమనీ ఆనేరం చేసామనీ ప్రకటన చేసాము మేజిస్ట్రేట్, మొత్తం అన్ని నేరాలకు నాకు 18 నెలల కఠిన జైలు శిక్ష విధించాడు. నాజట్టులో వున్న వారందరికీ కూడా వేర్వేరు కాలపరిమితుల కఠినజైలు శిక్షలు వేసాడు

విచారణ పూర్తి అయి శిక్షవేయడం జరిగింది కనుక మమ్మల్ని జైలు ఖైదీలుగా పరిగణించారు మా బట్టలు, వస్తువులు మార్చుకో వలసి వచ్చింది. ఇతర ఖైదీల వలెనే మేమూ జైలుదుస్తుల వేసుకొని వారి కాళ్లకు ఇనప కడియాలతో బంధము, జైలులో ప్రవేశించి నప్పుడే పడింది. కప్పు కొనేటందుకు ఒక గొంగళి, తిండి తినేందుకు ఒక థాలి (కంచము), నీరు తాగేటందుకు ఒక లోటా (పాత్ర) పడుకునేటందుకు ఒక చాప, లాగులు, ఒక జత నిక్కర్లు (పొట్టిలాగులు) ఒక ఒకే జైలులో ఆస్తిగా మాకు సంక్రమించినాయి. రెండు రొట్టెలు, పప్పు లేదా ఏదో శాకము మాకు ప్రతి రోజూ ఇచ్చే ఆహారమైంది మాకు కఠిన శిక్షపడి నందు వల్ల మమ్మల్ని నూలు దారాన్ని కండెలుగా చుట్టేపనిలో నియమిం చారు ఇందులో ఎంత చెయ్య గలిగిన పనికి మూడు రెట్లపని మాకు నిర్ణయించడం జరిగింది మాకు జైలు అధికారుల మనస్తత్వం తెలియ నందు వల్ల మేము ఏమీ విశ్రాంతి లేకుండా కష్టపడి ఏరోజు పని ఆ రోజు పూర్తి చెయ్యాలని ప్రయత్నించాము ఎనిమిది గంటల పాటు అవిరామంగా చక్రం తిప్పినా ఇచ్చిన పనిలో మూడో

వంతైనా పూర్తి అవలేదు. మేము పూర్తిగా అలసి పోయాము. ఎంత శ్రద్ధతో పని చేసినా ఇచ్చిన పని ఎందుకు చేత పూర్తి చెయ్యలేక పోయామని ఆశ్చర్య పడ్డాము. మరునాటి రోజున మాకు పని అప్పగించ పెడుతున్న వార్డను, అతను ఖైదీలలో సీనియరు, మాలో ఒకరితో చెప్పలా రహస్యంగా ఒక మాట చెప్పాడు. 'మీకు ఇచ్చిన పని మీరు చెయ్యగలిగిన దాని కంటె ఎంతో ఎక్కువ. అది మిమ్మల్ని కష్ట పెట్టాలని జైలు అధికార్లు బుద్ధి పూర్వకంగా వచ్చిన పన్నుగడ. మీరు ఇందులో నాలుగో వంతు పని మాత్రమే చెయ్యగలరు!" అని కాని, మేము అంతకు ముందు రోజున పని చేసినట్లే అందాజుగా పని చేసాము. అయినా ఇచ్చిన పనిలో మూడో వంతు మాత్రమే పూర్తిచెయ్యగలిగాము.

ఇట్లా మా దినచర్యలో ఏమీ మార్పు లేకుండా మరొకటి రెండు రోజులు గడిచాయి. అప్పుడు పోలీసు ఇన్స్పెక్టర్ జనరల్ మా జైలు సందర్శించడానికి వచ్చాడు. ఆయన మాట మర్యాదలు ఏమీ తెలియని యూరపియను. ఆయన నాతో జరిపిన సంభాషణలో మేమిద్దరమూ కరుకైన ధోరణిలో ప్రసంగించు కోవడం జరిగింది. దాని ఫలితంగా నన్ను నా సహచరుల నుండి, వేరుచేసి మూటపదకొండు రోజులపాటు ఏకాంత వాస శిక్ష వేసారు. నా సహచరులను వేరే జైళ్లకు బదిలీ చేసారు.

నే నున్న జైలు గది చిన్న కూపం. దాని పొడుగు ఎనిమిది అడుగులు, వెడల్పు నాలుగడుగులు. గోడల్లో ఎత్తుగా ఉన్న చోట్ల రెండు వెంటిలేటర్లు ( వాజా) లున్నాయి. ఆ గదిలో ఉంచిలోపలికీ బైటికీ పోయేటందుకు ఏర్పాటు చేసిన (…లాకీలతో) తయారైంది దానికిపైట గోడ ఉంది. అందువల్ల గదిలో వున్న నాకు బైట వున్నదేదీ కనిపించే అవకాశం లేదు. నా దగ్గర పుస్తకాలు ఏమీ లేవు. వార్తాపత్రికలు ఇచ్చే ఏర్పాటు అసలే లేదు. … అది పూర్తిగా ఏకాంతవాసమే. భగవద్గీత కాపీ ఒకటీ, బ్రహ్మానందుడి భక్తిగేయాల పుస్తకం ఒకటీ ఖైదీ తన మత గ్రంథాలు రెండు తనతో వెంట ఉంచుకోవచ్చునన్న అవకాశాన్ని అనుసరించి నా దగ్గర ఉంచుకోవడానికి అనుమతించారు.

రాత్రి దీపం ఏమీలేదు పగలు నేను చెయ్యవలసిన పని నా గదిలోనే చెయ్యాలి ఆ గదిలో ఒకమూల ఒక మూకుడు (కుండీ) మలమూత్రాల విసర్జన ఏర్పాటుకోసం వుంచినిచ్చారు. రోజు కొకసారి నన్ను స్నానం కోసం కొన్ని నిమిషాలు బైటికి కొనిపోయే ఏర్పాటు చేసారు. ఆ సమయంలో నేను ఎవరితోనూ ఏమీ మాట్లాడకూడదు ఎవరినీ చూసే అవకాశం ఉండకుండా కూడా తగిన జాగ్రత్తలు తీసుకొనేవారు. పరేబైదీ కూడా నాతో సంభాషించరాదు ఈ నియమాలతో, నిర్బంధాలతో నా యేకాంతవాస కఠిన శిక్ష, ఏ సడలింపూలేని సంపూర్ణ యేకాంతవాసం అయింది. క్రమంగా మా జైలు, సత్యాగ్రహులతో నిండిపోయింది వారి సంఖ్య వందలకు పెరిగింది. యువకులు గొంతెత్తి పాడే దేశభక్తి గేయాలూ, భక్తి కీర్తనలూ మమ్మల్నందరినీ తెల్లవారుఝామునసే మేల్కొల్పేవి. జైలు పరిసరాలన్నీ ఆ పాటలతో మారుమ్రోగిపోయేవి జైలు జీవితాలను ఆవహించిన విషాద ఛాయలు మటు మాయమయాయి

ఇట్టి పరిస్థితులలో ఒక అనూహ్యమైన సంఘటన మాకు ఎదురైంది. సత్యాగ్రహులలో హిందువులైనవారిని అరెస్టు అయిన వెంటనే పోలీసులు ప్రత్యేకంగా హింసించడం ప్రారంభించారు. అట్లాంటి హింసాచర్యలు, విధానాలు ఊహాతీతములు. హిందువుల బుజంమీద వేలాడుతూ వుండే యజ్ఞోపవీతాలను (జన్నిదాలను) లాగి పారవేసేవారు అందుచేత ఆ సత్యాగ్రహులు సహజంగా తమ జంధ్యాలు తిరిగి తమకు సమర్పిస్తేగాని భుజించమని నిరాకరించెవారు. జంధ్యాలను తిరిగి ఇచ్చినా జంధ్యం వేసుకోవడమనేది మత సంబంధమైన కర్మకలాపమనీ అందుచేత తాము వాటిని తిరిగి వేసుకొనేటందుకు మంత్రం చెప్పే పురోహితుడిని పిలిపించాలనీ, పిలిపించవలసి వుంటుందనీ పట్టుపట్టారు! జైలు పరిపాలన అధికారంలో జైలరుది రెండో స్థానం స్థానికంగా అతనికే ప్రాధాన్యము. ఆయన నన్ను "గురుమహరాజ్ ' అని పలకరించి పేర్కొనేవాడు ఆయన నా దగ్గరకు వచ్చి నేను పౌరోహిత్యం వహించి మంత్రం చెప్పి, సత్యాగ్రహులు తిరిగి తమ జంధ్యాలు ధరించేటట్లు

సచ్చచెప్పవలసిందనీ కోరాడు! నేను ఎప్పుడూ అట్లాంటి పౌరోహిత్య మంత్రము నిర్వహించలేదని చెప్పాను అయినప్పటికీ గాయత్రీ మంత్రము ఉచ్చరించి, అది ఉపదేశ పూర్వకంగా వారు పరిగ్రహించి జంధ్యాలు తిరిగి ధరిస్తే నాకు ఏమీ అభ్యంతరం లేదన్నాను దాని. రెండు పక్షాలవారూ—అంటే జైలరూ, సత్యా ...ంచారు. తర్వాత సత్యాగ్రహులను నా దగ్గరకు కొనితెచ్చారు వారు వరసగా ఒకరొకరే స్నానాలు చేసివచ్చారు. నేను మంత్రం ఉచ్చరిస్తూంటే నా మాటల ననుసరించి వారూ తిరిగి ఆ మంత్రాన్ని ఉచ్చరించారు. తర్వాత వారికి వరసగా జంధ్యాలు ఇవ్వడంతో ఆ క్రియ పూర్తి అయింది. నాకు వారందరు కొంతదూరంగా వుండేటట్లు కూర్చుండబెట్టారు. వారు నాతో మాటేమి సంభాషించకూడదని ఆ జాగ్రత్త తీసుకొన్నారు. ఇంతచేసినా కొందరు యుక్తిపరులైన సత్యాగ్రహులు మంత్రవాక్యంలో నడుమ దానితో యేమీ సంబంధంలేని కొన్ని ఇతర వాక్యాలను చొప్పించి జైలుకు బైటవున్న ప్రపంచంలో సంభవిస్తున్న సంఘటనల సమాచారం కొంత అందించారు. జైలరుకి సంస్కృత ...ంతోగాని ఏ మాత్రమూ పరిచయము లేనందువల్ల ఆ వార్తలు కూడా మంత్ర సందర్భోచిత మైనవనే భ్రమలో మునిగిపోయాడు ఈ రీతిగా జైలులో యేకాంతవాస కఠినశిక్ష అనుభవిస్తున్న నాకు అత్యంత నవీన ఫోంటతో వార్తాప్రసారం వినే అవకాశం లభించింది!

వందేమాతరం ఉద్యమం విద్యార్థి లోకంలో హుటాహుటి నడకలతో వ్యాపించింది ఆ జాతీయ గీతాన్ని విద్యాసంస్థల పరిసరాలలో పాడకూడదని నిషేధాజ్ఞలు జారీ అయ్యాయి. ఆ నిషేధాజ్ఞలను పాటించేదిలేదని విద్యార్థి లోకం ధైర్యంగా పోరాటం జరుపుతోంది జైలులో వున్న సత్యాగ్రహులు ఆ వందేమాతరం ఉద్యమం పట్ల తమకున్న సానుభూతినీ, విద్యార్థులు నిర్వహిస్తున్న పోరాటంలో తాముకూడా పాలు పంచుకొంటున్నామని సూచించే ఉద్దేశంతోనే ఆ పాట పాడే హక్కు— తమకు కూడా వుందని వెల్లడిస్తూ గొంతెత్తి ఆ పాట పాడటం ప్రారం

ఖించారు ఒక రోజున వేకువజామున ఆ జైలు గదుల శ్రేణిలో ఒక మూలనుంచి 'వందేమాతరం' అంటూ బృందగానం వినవచ్చింది. అది మిగిలిన వారందరికీ మీరు కూడా మాతో గొంతు కలపండి అనే సంకేతంగా పరిణమించింది వెంటనే ప్రతి సత్యాగ్రహి ఆ జాతీయగేయం పాడటం మొదలు పెట్టాడు ఈ సంఘటన రిపోర్టు వెంటనే జైలు సూపరింటెండెంటుకు వెళ్ళింది ఈ విధంగా వేకువ వేళల వందేమాతరం అంటూ బృందగానం మరో మూడు రోజులపాటు కొనసాగింది. సూపరింటెండెంటు తాను తీసుకొన దలచిన ప్రతీకార చర్యకు తానే పూర్తి బాధ్యత వహించ దలచుకో లేదు ఈ కాల వ్యవధిలో ఆయన తన పై అధికారులను సంప్రదించినట్లు అనుకోవచ్చు హఠాత్తుగా ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ ప్రిజన్స్ అంటే జైళ్ళ పరిపాలనను నిర్వహించుచున్న అత్యున్నతాధికారి, మా జైలుకి వచ్చి జైళ్ళలో వందేమాతరం గేయాన్ని పాడటం నిషేధిస్తున్నట్లు ఉత్తరువులు ప్రకటించాడు. ఆ అధికారి నా గదికి కూడా వచ్చి ఆ పాట పాడటాన్ని సహించేది లేదని చెప్పాడు నేను దానికి అంగీకరించేది లేదనీ, ఆ పాట నేను పాడతానని చెప్పాను ఆయన నాకు వార్నింగు ఇస్తున్నాననీ, ఈ ఆజ్ఞను ధిక్కరించినట్లతే వచ్చే ఫలితాలు, శిక్షలు చాలా కఠినంగా ఉంటాయనీ చెప్పాడు ఈ మాటలు విషయ వివరణ కొసం నాతో చెప్పినట్లూ నేను మాత్రము, ఒక్కడినే ఉన్నాను గనక ఆ పాట పాడుకొనవచ్చుననీ. ఆ పాటను గుంపుగా బృందగాన ధోరణిలో పాడుట సహించడం జరగదనీ ఆ తర్వాత వెంటనే చెప్పాడు.

ఈ ఆజ్ఞలకు తల ఒగ్గి ఊరకుండటం గాని, దిగమింగడం గాని సత్యాగ్రహులకు తగని పని! అందుచేత వారు ఆ పాట పాడటం కొనసాగించారు. ఒకనాడు మధ్యాహ్నము, ఖైదీలందరూ అంతా సత్యాగ్రహులూ, ఇతరులూ కూడా వారి వారి గదుల్లో నిర్బంధింప బడ్డారు. వందేమాతరం పాట పాడుతూ అధికారుల ఆజ్ఞ ధిక్కరించిన నేరానికి ఒక సత్యాగ్రహిని వేము బెత్తంతో గొడ్డును బాదినట్లు (కొట్టినట్లు) ఎడా

పెడా మూడు డజన్ల దెబ్బలు కొట్టారు. జైలులో వేసే, శిక్షల్లో ఇదే అత్యంత కఠినమైన శిక్ష. దాన్ని 'టిక్ టికీ' అంటారు. ఈ శిక్షకు పాత్రుడైన నేరస్థుడ్ని ఒక గుంజకు కట్టి మరీ కొడతారు. ఆ శిక్షాస్థానం నా గదికి దగ్గరగా ఏర్పాటు చేసారు అందుచేత ప్రతి దెబ్బవల్లా కలిగిన చప్పుడు నా చెవుల్లో పడుతూనే ఉంది, స్పష్టంగా వినిపిస్తోంది. ఒక్కొక్క దెబ్బ తగిలినప్పుడల్లా ఆ సత్యాగ్రహి "వందేమాతరం" అంటూ గొంతెత్తి నినాదం చేస్తూనే ఉన్నాడు. రక్త బిందువులు ఆయన శరీరం నుంచి పైకి చిందుతూనే ఉన్నాయి నేను 14 సార్లు, ఆ "వందే మాతరం' అనే నినాదం విన్నాను. తర్వాత ఆయన సొమ్మసిల్లి స్మృతి తప్పి పడిపోయినట్లున్నాడు నినాదం వినిపించ లేదు. అది ఆయన శరీరం మీద పడుతూన్న దెబ్బల చప్పుడులో లీనమైపోయింది

ఈ అమానుష ప్రతీకార చర్యకు మా హృదయాలు ఎవరో నులిమినట్లే సంక్షుభితమైనాయి సత్యాగ్రహులందరూ నిరశన వ్రతం పూని మేము ఆహారం గ్రహించేది లేదు అని నిరాకరించారు. రెండు రోజులు గడిచాయి నిరశన వ్రతం కొనసాగుతోంది. 'వందేమాతరం' పాట ఆలాపన కూడా మరింత ఉద్ధృతంగా కొనసాగింది. ఇప్పుడు ఆ పాట పాడటం నా వంతు అయింది. నేను పాడగలిగినంత గట్టిగా ఆ పాట పాడేవాడ్ని జైలు సూపరింటెండెంటుకి వణుకు పుట్టింది ఇప్పుడు ఆ పాటను రాత్రింబవళ్ళు సత్యాగ్రహుల్లో ఎవరో ఒకరు వదలకుండా పాడుతూనే ఉన్నారు ప్రభుత్వానికి, కొరకరానికి మింగడానికి వీలు కాని పరిస్థితి ఏర్పడింది ఈ విషయాన్ని గురించీ, పరిస్థితిని గురించీ అత్యున్నత స్థాయిలో చర్చలు జరిగినట్లు తోస్తుంది. నిరశన వ్రతం సాగుతున్న మూడో రోజున ఐ జి పి మా జైలుకి వచ్చాడు ఆయన సత్యాగ్రహులందరితోనూ ఈ విషయాన్ని చర్చించాడు. వందేమాతరం పాటను వారు సాయంత్రం వారి గదులలో చేరుకొన్న తర్వాత ఒకసారి (పర్యాయము) పాడుకొనేటందుకు అభ్యంతరం లేదని చెప్పాడు. వారు

దానికి తృప్తి చెందారు. ఆ వార్త నాకు తెలిపారు. ఐ. జి. పి. నా దగ్గరికు వచ్చినప్పుడు ఆ దెబ్బల శిక్షకు గురియైన సత్యాగ్రహిని సందర్శిస్తే గాని నేను ఆహారం స్వీకరించనని స్పష్టంగా చెప్పాను. కొంత కీచులాట, తాత్సారం జరిగిన తర్వాత నన్ను ఆ సత్యాగ్రహి ఉన్న గదికి తీసుకొని వెడతామనీ ఆయనతో నేను ఒక్కమాటైనా మాట్లాడకూడదనీ అన్నాడు ఆ షరతుకి లోబడి నేను ఆ మిత్రుడ్ని సందర్శించి మౌనంగా అభివందన పూర్వకంగా తల ఊపి నా సాను భూతిని తెలిపి తిరిగి నా గదికి వచ్చాను.

ఆ ధీర సత్యాగ్రహి వందేమాతరం రామచంద్రరావు. "వందే మాతరం" అనేది ఆయన తన ధీరత్వంతో, పౌరుషంతో సాధించుకొన్న బిరుదు. అది ఆయన పేరుతో ముడిపడి కలసిపోయి కీర్తిపతాకగా ఉంది. నేను ఆయన సాహసాన్నీ ధైర్యాన్నీ ఎప్పుడూ అభినందిస్తాను. ఆ తర్వాతి రోజుల్లో మేము ఇద్దరమూ రాజకీయ రంగంలో విభిన్న మార్గాలను అనుసరించడం సంభవించింది.

# 19. నేరంచేసే స్వభావం గురించి ఒక పరిశీలన

సత్యాగ్రహోద్యమం ఎట్లా ముందుకు సాగిందో వివరించ డానికి పూర్వం జైలు పరిసరాలలో ఎంత అమానుష వాతావరణం వ్యాపించి వుండేదో చదువరులకు ఉద్దేశంతో ఇప్పుడు కొన్ని సంఘటనలను చెప్ప దలచు కొన్నాను.

ఒక బల్ల చెక్కకు ఇనప రింగు బిగించ బడి వుంటుంది. ఆ బల్ల చెక్క మీద ఖైదీ వర్ణన, నంబరు, అతనికి ఏ కారణాన శిక్షణ పడిందీ, ఏ నాడు విడుదల కావచ్చునో, మొదలైన వివరాలు వ్రాయబడి వుంటాయి. ఖైదీ తన గదిలో నుంచి బైటికి ఇక్కడికి, అక్కడికి కదిలినా ఎవరైనా అధికారులు జైలు సందర్శించేటందుకు వచ్చినా, ఆబిళ్లను అతను తన మెడలో ధరించాలి అంతే కాదు అతనప్పుడు ఇతర ఖైదీలతో పాటు వరసగా నిలబడి మొలచుట్టూ చేతులు కట్టుకొని, తల వంచి కిందికి చూస్తూ వుండాలి ఇది నాకు చాలా అసహజంగా కనిపించింది. జైలు సూపరెంటు నా గదికి తన సాధారణ కార్యక్రమ నిర్వహణలో వచ్చి నప్పుడు మామూలుగానే ఉన్న నన్ను చూసి,'ఏమి,నీ మెడలో బిళ్ల వేసుకోలేదేమి?' అని, అడిగాడు నేను ఆ బిళ్ళ ధరించడం వల్ల సాధించే పని ఏమిటి? అని తిరిగి ప్రశ్నించాను 'చూడ వచ్చిన అధికారి వివరాలన్నీ చదివి వెంటనే తెలుసుకో గలడు' అని, జవాబిచ్చాడు 'ఇంత దూరానఖైదీ నిలబడి ఉన్నప్పుడు, ఎవరూ అట్లా చదవ లేరు. కావాలంటే ఆ బిళ్ళ అడిగితీసుకొని చదువుకో వచ్చు' అని చెప్పాను. సూపరెంటు ఆ విషయాన్ని మరి

ప్రోత్సహించ లేదు. నేను ఒడి ఖైదులో ఏకాంత వాసం చేస్తున్నందువల్ల వరసగా ఇతరులతో కలిసిపోవటం అనే ప్రసక్తి లేనే లేదు. అప్పటికీ నేను మొల చుట్టూ లవాలు కట్టుకోవడానికి నిరాకరించే వాణ్ని

కొన్ని రోజులపాటు నన్ను సాధారణ ఖైదీలతో పాటుగా ఉంచారు. ఆ ఖైదీలు నన్ను సహృదయుడుగా గుర్తించి నా దగ్గర చేరి తాము తమ జీవితంలో చేసిన పొరపాట్లు చెప్పి, చేసిన నేరాలు ఒప్పుకొనే వారు వారు, మరల ఏ తప్పు చెయ్యకుండా కాయ కష్టం చేసుకుంటూ సత్ప్రవర్తనతో మామూలుగా జీవించాలనే కోరిక వెల్లడించే వారు కాని, అట్లా ఉన్నా సమాజం తమర్ని సమ్మతిస్తుందా ? అనే సంశయాలు వెలిబుచ్చే వారు. వారిలో, ఖూనీ చేసిన వారిలో కూడా, నేను సత్పురుషుల్ని చూశాను. వారిలో నేర స్వభావం ఏమీ లేదు. వారిలో కొందరు ఆదర్శప్రాయమైన వారు ఈ నాటి జైలు వ్యవస్థ పూర్తిగా మారి పోవాలని, అది నేరస్థులను మంచి పౌరులుగా తీర్చి దిద్దేటటు వంటిదిగా ఉండాలనీ, వారు విడుదల అయిన తర్వాత సమాజం, వారిని వేలెత్తి చూపి ఒక సారి నేరం చేసిన వాడు యావజ్జీవం నేరస్థుడే అనే దృక్పథాన్ని మార్చుకోవాలనీ నే నెల్లప్పుడూ భావిస్తున్నాను. ప్రతి మానవుడిలో సహజంగా వున్న సదాలోచనలను, సత్ప్రవర్తనను పెంపొందించే అవకాశం ఎప్పుడూ వుంటూనే వుంటుంది. అందు చేత ఎవ్వరినీ అన్ని విధాలా దుర్మార్గుడు అని తోసి పార వేయడం తగదు. ఏదో వంక కన్పించినంత మాత్రాన ఎవరినీ మానవజాతి నుంచి గెంటి వెయ్యడం జరగ కూడదు. పేదరికం వల్ల నేరం చేస్తే దానికి మూల కారణమైన పేదరికాన్ని రూపు మాపి, ప్రతి పేదా కష్టించి పని చేసి బ్రతికే అవకాశాలు కల్పించాలి అంతే కాని, మనిషి పేదరికంలో మునిగి తేలుతూ ఏ దారీ కనిపించక సంఘ వ్యతిరేక కార్యకలాపాల్లో పాల్గొనే టట్లు గెంటిన సమాజం, వాణ్ని దుర్మార్గుడని, పనికి రాని వాడని, అనడం భావ్యం కాదు

అనేక సంవత్సరాల జైలుశిక్ష అనుభవించినవారిని నేనెరుగుదును వారు జైలు నుంచి తిరిగి బైటి ప్రపంచంలోకి రావాలనుకోరు వస్తే

అందరూ అసహ్యించుకొంటారని, అవమానిస్తారని భయపడతారు జైలులోనే కాలంగడిపి మరణించేటందుకు సిద్ధపడతారుగాని బైట మనుషులుచేసే అవమానం భరించలేమంటారు కరుణార్ద్ర శీలంగల సమాజము, మానవత్వంతో కూడిన జైలు పరిపాలన అనేవి రెండూ సమాజంలో జరిగే నేరాలను చాలావరకు తగ్గించగలవనే దృఢ విశ్వాసం నాకు జైలులో చేసిన పరిశీలన వల్ల కలిగింది.

# 20. ఉద్యమ విరమణ, సంప్రతింపులు

మా సత్యాగ్రహోద్యమం అభివృద్ధి చెంద సాగింది. ఆర్య సమాజ్ కూడా ఉద్యమం ప్రారంభించాలని నిశ్చయించింది. వారి అఖిల భారత సంస్థ ఆ ఉద్యమానికి ప్రోత్సాహం ఇచ్చింది. అందుచేత సహజంగా ఆర్య సమాజ్ నాయకులలో అఖిల భారత స్థాయికి చెందిన పెద్దలు హైదరాబాదు వచ్చారు. వారు షోలాపూర్‌లో జరిపిన సమావేశంలో తాము మత స్వేచ్ఛ కోసం పోరాటం సాగిస్తామని ప్రకటించారు. ప్రతి రోజూ అనేక మంది ఆర్య సమాజ్ కార్య కర్తలు సత్యాగ్రహం చేయసాగారు. మూడు వర్గాల వారు ఎవరి దారిని వారు సత్యాగ్రహం చేస్తూ ఉండటం చూస్తే తమాషాగా ఉన్నట్లు కొందరు భావించే వారు. మొదటిది హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ పౌరహక్కుల కొరకు సాగిస్తున్నది. రెండోది పౌర హక్కుల కోసం హిందూ పౌర స్వాతంత్ర్య యూనియన్ సాగిస్తున్న పోరాటము. మూడో పోరాటం మత స్వాతంత్ర్యం కోసం ఆర్య సమాజం నడిపిస్తున్న పోరాటం. ఈ పోరాటాలన్నీ కలిసి ప్రజల మనస్సుల్లో కలగా పులగం అయి కలవరం రేకెత్తించాయి. సమస్య లన్నీ వారికి గజిబిజి కలిగించాయి. సామాన్యులు ఏది ఏమిటో ఏమర్కించి ఈ వేర్వేరు ఉద్యమాల ఆశయాలు విడమర్చి అర్థం చేసుకో లేని స్థితిలో ఉన్నారు. చాల మంది ఆర్య సామాజికులు కానివారు కూడా ఆర్యసమాజ్ నిర్వహిస్తున్న ఉద్యమంలో చేరి పాల్గొనడం నేను గమనించాను. అందువల్ల ఉద్యమం యొక్క రాజకీయ స్వరూపం మాటు పడి మతావేశం క్రమంగా ఉద్ధృతం కావడం జరుగుతోంది. అది ప్రమాదకరమన్న విషయం స్పష్టమే. ఈ పరిస్థితిలో మేము మహాత్మా గాంధీ సలహా పొందడం జరి

గింది. అయినా కూడా ఈ ప్రమాదాన్ని గమనించి ప్రజా సామూహిక తప్పుడు దారి పట్టడము, క్షమలు పొందడం జరగ కుండా ఉండేటం దుకై ఉద్యమాన్ని ఉపసంహరించ వలసిందని స్టేట్ కాంగ్రెస్ సలహా ఇచ్చారు ఆ సలహాను ఆమోదించి ఉద్యమాన్ని నడిపిస్తున్న వారు వెంటనే స్టేట్ కాంగ్రెస్ తన ఉద్యమాన్ని ఉప సంహరిస్తున్నట్లు ప్రకటించారు. అప్పటి వరకు రెండు నెలలకు పైగా కొనసాగిన ఉద్యమంలో నాలుగు వందల మంది జైలు పాలయ్యారు.

స్టేట్ కాంగ్రెసు తన ఉద్యమాన్ని ఉపసంహరించి నప్పుడు మేము జైల్లో ఉన్నాము. శ్రీ నానాల్‌నీ ఆయన కార్యవర్గాన్నీ అంతకు ముందే ప్రభుత్వం విడుదల చేసింది అందు చేత ఉద్యమాన్ని ఉపసంహరించడం గురించి వారు నిర్ణయం గైకొని, ప్రకటించి, ఉద్యమ ఎపిసోడుకు అధికార ముద్ర వేశారు ఆ నిర్ణయం యొక్క ఔచిత్యాన్ని అప్పుడు మేము అవగాహన చేసుకో లేక పోయాము మాలో కొందరము మహాత్మాజీ ఇచ్చిన సలహా సరియైనది కాదని కొంత ఆగ్రహాన్ని కూడా వెల్లడించాము స్టేట్ కాంగ్రెసు ఛిన్నా భిన్నమై ముక్కలవుతుందనీ మతావేశ శక్తులు విజృంభించి విచ్చల విడిగా సంచరిస్తాయనీ మేము వాదించాము కాని మేము నిస్సహాయులమై ఏమీ చెయ్యలేక అనుకూలమైన సమయం కోసం వేచి యున్నాము ఆర్య సమాజ్ సత్యాగ్రహం బాగా విజృంభించింది దానితోపాటు జైలులో వారి సత్యాగ్రహుల్ని బాధించడం కూడా హెచ్చింది అందరమూ సత్యాగ్రహులమే. అందుచేత అందరమూ ఒకటే. మాలో తరతమ భేదాలూ వేరు పాటు భావాలూ లేవు. హఠాత్తుగా ఒక నాటి ఉదయవేళ ఒక సుముహూర్తాన స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహుల్ని విడుదల చెయ్య వలసిందని ఆజ్ఞలు జైలరుకి అందాయి. విడుదల అవుతున్న మాకు ఇంకా పోరాటం కొనసాగుతూనే ఉండగా జైలులో ఉన్న వేలాది యువ సత్యాగ్రహుల్ని వదలి స్వేచ్ఛగా బైటికి పోవడానికి మనస్సు విముఖమైంది. కాని, మేము చెయ్య గలిగిందేమీ లేదని పించింది.

ఈ సంఘటనలన్నింటినీ జ్ఞాపకం చేసుకొని, పునర్విమర్శ చేసిన ప్పుడు ఆ దశలో మహాత్మాజీ ఇచ్చిన సలహా ఎంత సరియైనదో బాగా అర్థం అయింది. స్టేట్ కాంగ్రెస్ ఉద్యమం తాత్కాలికంగా మందగించి నప్పటికీ అది తర్వాత ఎంతో వేగం పుంజుకొన్నది. ఉద్యమాన్ని ఉప సంహరించడం మూలంగా రాజకీయ స్వాతంత్ర్యం కోసం ఉద్యమాన్ని నిర్వహించడము మత స్వేచ్ఛ కోసం జరిపే పోరాటం కంటె ఎట్లాంటి భిన్న మైనదో వంటిదో ఒక వర్గం వారి కోరికల కోసం కంటె ప్రజలందరికీ కావలసిన హక్కుల కోసం జరిపే పోరాటం ఎంత ఉన్నతమైనదీ సార్వ జనీనమైనదీ అత్యావశ్యకమైనదీ స్పష్టమైంది. ప్రజలకు కాంగ్రెస్ ఉద్యమ స్వరూపం తేట తెల్లమైంది.

కాంగ్రెస్ సత్యాగ్రహులు విడుదల అయ్యారు. కాని, హైదరా బాద్ స్టేట్ కాంగ్రెస్ పైన ఉన్న నిషేధాజ్ఞ అట్లాగే వుంది. అందు చేత, తర్వాత ఏమి చెయ్యాలి? అనే ప్రశ్న మా అందరి ముందూ వుంది. మాలో ఎవ్వరమూ స్టేట్ కాంగ్రెస్ మూల పడి బూజు పట్టి క్రమంగా నశించి పోవడం జరగాలని అనుకోవటం లేదు. కాని, మాలో ఒక వర్గం వారు మాత్రము సంస్థానాని కంతటికీ వర్తించే ఈ సంస్థలను కుదించి పున ర్వ్యవస్థీకరణం చేసి పని చెయ్యాలనే భావం వెల్లడించారు. కొందరు స్వయంగా నాయకత్వాన్ని పూని, ప్రభుత్వంతో రాజీ బేరాలు చేస్తూ సంప్రతింపులు ప్రారంభించారు. అది కాంగ్రెస్ తత్వానికి, మనుగడకే ప్రమాదకరమని తోచింది. పరిస్థితిని బాగా చర్చించి, సత్యాగ్రహం చేసిన వారందరూ, లేదా దాన్ని నిర్వహించిన వారు సంస్థానానికి బైట ఎక్కడో ఒక చోట సమావేశమై పరస్పర చర్చలు జరిపి భవిష్యత్ కార్యక్రమ స్వరూప నిర్ణయం చెయ్యాలనుకున్నాము. చివరకు మన్మాడ్‌ను స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహుల సమావేశానికి తగిన స్థలంగా నిర్ణయించాము. సమావేశం జరిగింది.

ఆ సమావేశము ఒక గొప్ప సంకల్పము, పోరాటాన్ని కొనసా గించాలనే దృఢ నిశ్చయం కాంగ్రెసు వారందరిలో వ్యక్తమైంది. ప్రతి

వారూ తాము ఏ క్షణంలోనైనా తిరిగి అరెస్టు కవచ్చునని ఎరుగుదురు. ప్రభుత్వపు సవాలును అంగీకరించి కాంగ్రెస్ మీద ఉన్న నిషేధాజ్ఞ రద్దు అయ్యే వరకు పోరు కొనసాగ వలసిందే, అని తీర్మానించారు

ఆ తర్వాత కాంగ్రెస్ స్థాయి సంఘ సమావేశాన్ని నిషేధించడం జరుగుతుందనే పుకార్లు వ్యాపించాయి. ఆ సమావేశం ప్రారంభం కాగానె మెంబర్ల నందర్నీ అరెస్టు చెయ్యడం జరుగుతుందనే వార్తలు మాకు ముందుగానే తెలిశాయి సుల్తాన్‌బజారు ప్రాంతంలో సి. ఐ డి లు పెద్ద ఎత్తున తిరుగుతూ ఉండటం ప్రజలలో మానసిక అశాంతి కలిగించ డముగా జరిగాయి. స్థాయి సంఘ సమావేశానికి సమయం ఆసన్నం కాగానే రకరకాల ఓంత ఓంత పుకార్లు వ్యాపించయి. వాటిలో సమా వేశం రద్దు అయిందనేది ఒకటి కాని, మేము అనుకొన్న రీతిగా అను కొన్న వేళకే సమావేశం జరిపాము. అయినా ఎవరినీ అరెస్టు చెయ్యడం జరగలేదు స్థాయి సంఘము, పదిహేనుమంది సభ్యులను కార్యాచరణ సంఘం (వర్కింగ్ కమిటీ) గా ఎన్నుకొని, స్టేట్ కాంగ్రెస్‌పై నున్న నిషేధాజ్ఞల రద్దుకోసం వారు తగిన చర్యలు తీసుకొనే బాధ్యత వహించా లని తీర్మానించింది

సంప్రతింపులు నడిపిస్తోన్న వర్గం మరింత చురుకుగా పనిచెయ్య సాగింది. హైదరాబాదు ప్రభుత్వము 'కాంగ్రెస్' అన్న మాటను తొల గించి మా సంస్థకు మరొక పేరు పెట్టుకొన్నట్లయితే, నిషేధాజ్ఞను ఉప సంహరించడం జరుగుతుందని తెలియజేసినట్లు వారు వెల్లడించారు. 'కాంగ్రెస్' అన్న మాట సంస్థానం బైటనున్న వారి ప్రమేయం తెలియ జేస్తున్నదని ప్రభుత్వం భావించింది. అందుచేత ఆమాట దానికి సహించ రానిదైంది. మరో పేరు పూర్తిగా స్థానికమైన సంస్థ అనిపించే పేరు ఉండాలట ! స్టేట్ కాంగ్రెస్ కార్యవర్గ కమిటీ సభ్యులలో ఈ విష యాన్ని గురించి ఏకాభిప్రాయం కుదరలేదు. ఎక్కువ మంది, ప్రభుత్వ ప్రతిపాదన అర్థరహిత మైందనీ దానికి వారు చెప్పిన కారణంలో బలం లేదనీ అది ఏయీ చాలూ లేనిదనీ అభిప్రాయ పడ్డారు. మిగిలిన వారు

పేరును గురించి పట్టుదల ఎందుకు? ఏ పేరైతేనేమి? లక్ష్యాలు, ఆశయాలు, కార్యక్రమ, ముఖ్యము. అసలు స్వరూప స్వభావాల్లో మార్పు లేనప్పుడు, మరో పేరుతో మనం మన లక్ష్యం సాధించవచ్చు ! అన్నారు ఈ వాదనలో కూడా ఎంతో బలం ఉంది మేము ఇటూ అటూ తేల్చు కొనడం వీలు కాక... మా అందరికీ మార్గదర్శి సారథి సచివుడు అయిన మహాత్మాజీని సంప్రతించి ఆయన సలహా ప్రకారం నడవాలను కున్నాము. కార్యవర్గ సభ్యులంపరూ కట్టకట్టుకొని సేవాగ్రామ్ వెళ్లారు మహాత్మాజీ అందరు చెప్పిన మాటలూ సావధానంగా విని, సంప్రతింపులు కొనసాగించండని సలహా ఇచ్చారు సంస్థాన ప్రభుత్వం స్టేట్ కాంగ్రెసు తరఫున ప్రాతినిధ్యం వహించదానికి తగిన హోదాలో ఉన్న వారితో గాక కమిటీలో ఉన్న ఒక మెంబరు (సభ్యుడితో) సంప్రతింపులు జరపడం ఎంతో వింతగా కనిపించేది. బహుశా ఆయనను ఒప్పించడం తమకు సుకరమని వారనుకొన్నారు కాబోలు అందుచేత ఆ సభ్యుణ్నే ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరప వలసిందని అధికారం ఇవ్వడం జరిగింది. సంప్రతింపులను గురించిన ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ సర్ అక్బర్ హైదరీ, శ్రీ కె. ఎస్ వైద్యల నడుమ జరిగాయి. నేను స్టేట్ కాంగ్రెస్ కార్యదర్శిగా ఉన్నందువల్ల సేవాగ్రామ్‌కు వెళ్ళి సర్ అక్బర్ హైదరీ ఇచ్చిన ఉత్తరం, అందులో సూచించిన ప్రభుత్వ ప్రతిపాదనలను మహాత్మాజీతో చర్చించి దానికి ఆయన తయారు చేసి ఇచ్చిన జవాబు, తిరిగి హైదరాబాద్‌కి తెచ్చి దాన్ని శ్రీ కె ఎస్ వైద్య ద్వారా ప్రభుత్వానికి అందించ వలసిన బాధ్యత, అదృష్టము నాకు లభించాయి స్టేట్ కాంగ్రెస్ తరఫున ప్రభుత్వానికి పంపిన జాబులలో ప్రతి మాటా మహాత్మాగాంధీ తన కలంతో స్వయంగా వ్రాసిందే అది హైదరాబాదు సంస్థానపు రాజకీయ సమస్య ఎంత క్లిష్టమైందో తెలియజేసేటటు వంటి అమూల్యమైన చారిత్రక రుజువుల సంపద

మహాత్మాగాంధీకి సంస్థానంలో జరుగుతున్న ప్రతి చిన్న సంఘటన గురించీ, విషయాన్ని గురించీ మేము వివరంగా ఎప్పటికప్పుడే నివే

దించడం జరిగేది హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌ను నిషేధించిన ఆజ్ఞను గురించీ కాంగ్రెస్ జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలు గురించీ అవి ఆయనే తయారు చేసినట్లూ ఇంతకు ముందే తెలిపాను. హైదరాబాద్ సమస్య ఎంత దుష్కరము, క్లిష్టము అయినదో ఆయన అవగాహన చేసుకొన్నట్లుగా మరెవ్వరూ అర్థం చేసుకోలేదు అందుచేత మమ్మల్ని ఒక అడుగు తీసి మరో అడుగు వెయ్యమని సలహా ఇచ్చినప్పుడల్లా ఆయన ఎంతో తూచి, ఆలోచించి లెక్కగట్టి (బేరీజు వేసి) మరీ చెప్పినట్లుంటుంది. ఆయన ముఖంలో ఎంతో మానసిక ఆవేదన ప్రతిఫలించేది సంస్థాన ప్రభుత్వం ప్రజలను గురిచేసిన చేస్తున్న దుర్భరమైన బాధలు, గృహ దహనాలు, దోపిడీలు గురించిన కథలు ఆయనకు చేరేవి. నేను సేవాగ్రామ్‌కు వెళ్ళినప్పుడు ప్రతీసారీ ఆయన పాటిలో ప్రతి ఒక్క సంఘటన గురించీ వివరాలు అడిగి తెలుసుకొనే వారు ఆ దశలోనే మరొక దుర్ఘటన క్రౌర్యంలో, పరిపాలకుల నిరంకుశ దౌష్ట్యంలో అసమానమైన దిన దగిన సంఘటన-ఒకటి జరిగింది. బీదర్, ఆ పేరుగల జిల్లా ముఖ్యపట్నం అదే ఆ అత్యంత విషాదకర సంఘటన జరిగిన చోటు ఆ నగరం ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థకు కోటవంటిదనీ దానికి అక్కడ ఎదురులేని సంఖ్యాబలం ఉందనీ పేరు పొందింది. అక్కడ ముస్లిము హిందువుల జనసంఖ్య సమానం అయినా ముస్లిమ్‌లు, హిందువులపై ఏ అత్యాచారం సాగించినా సాగిపోతుంది. హిందువులు అనేక రకాల అవమాన పరంపరలకు గురి అవుతూ కత్తి అంచుమీద తమ బ్రతుకులు సాగిస్తున్నారు. ఆ నగరంలో ఒంటరిగా తిరగడానికి ఆడవారెవరికీ సాహసం లేదు. అతి తరచుగా ఆ నగరం హిందూ ముస్లిమ్ కొట్లాటలకు రణరంగము అవుతుండటం జరుగుతోంది. జిల్లాలో ఇతర ప్రాంతాలలో కూడా ఇదే పరిస్థితి అక్కడ కూడా ఇట్లాంటి కథలే నిత్యం జరిగే సంఘటనలు. అట్లాంటప్పుడు అక్కడి భయం, ఒత్తిడి, ద్వేష భావాలు అత్యున్నత స్థాయి నందుకొని ఉన్నాయనడం అత్యుక్తి కాదు హిందువులు కూడా మరేదారీ లేక క్రమంగా ధైర్య సాహసాలు అలవరచు

కొన్నారు. వారిని అణగ ద్రొక్కి నిర్వీర్యులను చేసేటందుకు పెద్ద ఎత్తున ఒక వ్యూహం పన్నబడింది. దాని ప్రకారం ముస్లిమ్‌లలో ఒక వర్గంవారు, పోలీసుల మద్దతుతో ఒక బజారంతటినీ (వీధిని) అగ్నిజ్వాలలకు ఆహుతి చేస్తుంటే ఆ జిల్లా కలెక్టరూ పోలీసు సూపరింటెండెంటూ ఊరికే నిలబడి చూస్తూ ఉన్నారు బీదర్ హైదరాబాద్ సంస్థానంలో అత్యంత ధనవంతమైన వ్యాపార కేంద్రము. చాలా మంది ఆ నగరాన్నుంచి ప్రాణాలు దక్కించుకొనేటందుకు ఆస్తిపాస్తులు వదిలి పారిపోయారు దారి తోచక ఉన్నవారు ముస్లిమ్ గూండాల ధాటి భయం వల్ల ఇండ్లలోనే ఉండి తలుపులు మూసి దాగి ఉండి కాలం గడిపారు. ఈ సంఘటనను గురించిన వార్తలు సంస్థానం బైటికి, సంస్థానంలో కూడా ఇతర నగరాలకూ పోకుండా ఆపారు కాని ఆ సమాచారం హైదరాబాద్ నగరానికి చేరకుండా ఆపడం సాధ్యం కాలేదు. ఆ సమాచారం చెరగానే మేమంతా కలవర పడ్డాము మిత్రులందరినీ సంప్రదించి, నేను బీదర్ నగరానికి వెళ్ళి, అక్కడి పరిస్థితులను స్వయంగా సందర్శించాలని నిశ్చయించుకొన్నాను మా మోటార్ కారు బీదర్ నగర పరిసరాలు చేరుకోగానే ఇక ముందుకు పోవడానికి వీలులేదంటూ ఒక పోలీసు ఆఫీసరు అటకాయించాడు. ఆయనకు నా ప్రయాణం యొక్క ఆవశ్యకతను తెలియజేసి నన్ను ముందుకు పోనియ్యవలసిందని నచ్చచెప్పే ప్రయత్నం చేసాను. అతను పెద్దమనిషి, ఉచితజ్ఞుడూ కావడం చేత, తనకు నేను కోరిన అనుమతి ఇచ్చే చొరవా అధికారమూ లేనందు వల్లనేమో నన్ను తాలూక్‌దార్ అంటే కలెక్టర్ దగ్గరకు తీసుకొని వెళ్ళారు కలెక్టర్ శ్రీ బిల్‌గ్రామి నన్ను ఎగాదిగా పరిశీలనగా చూసి, నన్ను అంతకు ముందు ఎన్నో సంవత్సరాల క్రిందట హిప్పర్గిలో విద్యాసంస్థలో నేను పనిచేస్తున్న రోజుల్లో కలుసుకొన్నట్లు గుర్తించాడు. వెంటనే అతని ప్రవర్తన కొంతమెత్తబడింది. అది నేను అతన్ని చూచిన వెంటనే గమనించాను కొంతసేపైన తర్వాత ఆలోచించి 'స్వామీజీ ! మీరు ఆ సంఘటనలు జరిగిన చోటుకి పోయి సందర్శించవచ్చు నేనిచ్చిన ఈ

స్వేచ్ఛను మీరు దుర్వినియోగం చెయ్యబోవటం లేదని నేను విశ్వసి స్తున్నాను'' అన్నాడు. అప్పుడు నేను, నన్ను కొందరు పోలీసు అధికారులు అనుసరించి వస్తూ ఉండగా, పరశురామ ప్రేతి అయిన బజారు చూసేటందుకు వెళ్ళాను.

ఆ ప్రాంతం అంతా భయం కరంగా వుంది. వందల కొద్దీ దుకాణాలు ఎంతో విలువైన ఎన్నో సరుకులూ కాలి బూడిద అయ్యాయి. వెండి గింజలు, కిరాణా దుకాణ్లోని సరుకులు నిండి వున్న గిడ్డంగులు ఎన్నో కాలి బూడిదైనాయి. అది జరిగి నాలుగు రోజులైంది. అయినా కొన్ని చోట్ల మంటలు ఆరి పోకుండా ఇంకా ప్రజ్వలిస్తూ వున్నాయి. ఆ ప్రాంతం అంతా ఒక మండు తున్న అగ్ని గుండంలా కన్పించింది. కలిగిన నష్టం అంచనా వెయ్యడం సులభ సాధ్యం కాలేదు. ఇరవై లక్షల రూపాయలను మించి వుండ వచ్చునేమో అనే భావం కలిగింది. మండి బూడిద అయిన ఆ బజారు చూస్తే నా మనస్సు దుఃఖంతో విచారంతో బాధతో నిండి పోయింది కలెక్టరును వీడ్కొని హైదరాబాదు తిరిగి వచ్చి నేను మహాత్మా గాంధీకి వివరాలన్నీ వ్రాసి, తెలియ జేసాను. నేను స్వయంగా సేవా గ్రామ్ వెళ్లి నాకు కలిగిన భావాలు, ఆవేదనా తెలియ చెప్పాను. అప్పుడు ఆయన వైపు చూస్తే నాకు బీదర్ సంఘటనల క్రౌర్యము కలత పెట్టినట్లుగా ఆయన మనస్సును మరేదీ కలత పెట్ట లేదు అనే భావం కలిగింది వెంటనే ఆయన "ఈ సమస్య మనం అనుకొంటున్న దాని కంటె చాల తీవ్రమైంది. అయితే, ఇప్పుడు మీరు ఏమి చెయ్యాలను కుంటున్నారు?" అని, వాకబు చేసారు "మీరు ఏమి చెయ్యమని ఆజ్ఞ ఇస్తే అట్లాగే నడచు కొంటాను." అని నేను జవాబు చెప్పాను. ఆయన నన్ను సేవాగ్రామ్ లోనే ఒకటి రెండు రోజులు ఆగి పోవలసిందని అన్నారు ఆ వ్యవధిలో తాను ఈ సమస్యను గురించి తీవ్రంగా ఆలోచసి చెసి, కార్య నిశ్చయం కావించి తెలియ చేస్తానన్నారు ఏ తీరుగా నిశ్చయించినా తర్వాత అడుగు వెయ్య బోయే ముందు, తాను జాతీయ వాదినంటూ సగర్వంగా చెప్పుకొనే అలవాటు గలిగిన సర్ అక్బర్

హైదరీకి, సాటి వ్యక్తిగా మైత్రీ భావంతో ఒక లేఖ వ్రాస్తానన్నారు సర్ అక్బర్ హైదరీ ఆధ్వర్యంలో జరుగుతున్న పరిపాలనలో ఇంత లేని పనులు జరిగినా ఆ పరిపాలనాధ్యక్షుని న్యాయ సమ్మత దృక్పథాన్ని గురించి మహాత్మాజీలో ఆశాభావం పోలేదు. మహాత్మాజీ వ్రాసిన లేఖలో "అమాయకులు నిరపరాధులు అయిన ప్రజల జీవితాలు, ఆస్తులు ధ్వంసం చెస్తూ చెలగాటాలాడుతున్న దుండగుల గుంపులపై కఠిన చర్యలు తీసుకొన వలసివుందని సంస్థాన ప్రభుత్వం గుర్తించి తన పరిపాలనా దృక్పథాన్ని పూర్తిగా పునర్విమర్శించి మార్పు కొనవలసిందని కోరుతున్నట్లు" తెలిపారు. తర్వాత లేఖ ముగిస్తూ "ఆ సంఘటన గురించి ప్రజల ఎదుట బహిరంగంగా న్యాయమూర్తుల చేత విచారణ తప్పకుండా జరిపించ వలసి వున్నది." అని ఒక షరతు కూడా విధించారు

మహాత్మాజీ నాకు ఆ లేఖ చదవమని ఇచ్చారు. దాని కాపీ ఒకటి స్టేట్ కాంగ్రెసు దగ్గర ఉంటే బాగుంటుందని నేను భావించాను. అందుకు అనుమతించ వలసిందని మహాత్మాజీని కోరాను. ఆయన అంగీకరించి "దీని కాపీ తీసుకొని తిరిగి ఇయ్యి నా దగ్గర మరో కాపీ లేదు. అసలు ఉత్తరం సర్ అక్బర్ హైదరీకి పంపించి వేసాను" అని అన్నారు నేను ఆ ఉత్తరం కాపీని వార్ధాలో నా మకాముగా ఉన్న హోటల్‌కువెళ్లి కొంత సేపైన తర్వాత కాపీ చేద్దా మని భద్రంగా ఉంచాను. రెండు గంటల తర్వాత చూస్తే ఆ ఉత్తరం నాకు కనిపించ లేదు. నేను నిశ్చేష్టుడనయాను ముఖ్యమైన పత్రము చెయ్యి జారి పోయింది అంతటా వెతికాను అంతకు ముందు నడచి వచ్చిన ఆ ఆరు మైళ్లూనడచి తిరిగి సేవాగ్రామం వెళ్లాను. ఆ ఉత్తరం అక్కడే ఎక్కడో పడేసి వుండ వచ్చునేమో అనే ఆశ నన్నక్కడికి వెళ్లేటట్లు చేసింది. నా ప్రయత్నా లన్నీ వృథా అయాయి మహాత్మాజీతో ఏమని చెప్పేది? కర్తవ్య పాలనలో లోపం కలిగింది. నా మనశ్శాంతి చెడింది. మనస్సు వికలమైంది మహాత్మాజీ ఎదుట పడటం ఎట్లా? ఎట్లాగైతే నేమి, కొంత ధైర్యం తెచ్చు కొని మహాత్మాజీ కుటీరం వైపు వెళ్లాను. ఆయన దిగులు పడి వున్న నా మొగంచూసి ఏమి

జరిగింది? అని అడిగారు. ఆయన మొగం వైపే చూస్తూ, జరిగిందంతా చెప్పి పొరపాటున నా వల్ల నేరం జరిగింది, అని ఒప్పుకున్నాను. ఆయన నన్ను తీవ్రంగా మందలిస్తారని, ఒక్క క్షణం పాటు అనుకొన్నాను। కాని, మహాత్మాజీ నవ్వు మొగంతో, 'ఆ పోయిన ఉత్తరాన్ని గురించి చింతించకు. నువ్వు చదివింది జ్ఞాపకం తెచ్చుకొని తిరిగి రాసి ఇయ్యి' అని, 'నేను కూడా ఆ పనె చేస్తాను రేపురా వచ్చేటప్పుడు నీకు జ్ఞాపకం ఉన్నవి రాసిపట్టుకురా' అన్నారు ఆయన నన్ను చెయ్యమని చెప్పిన పని నాకు దుష్కరమైంది నే నేమీ ఏకసంతా గ్రాహిని కాను అందు చేత ఏవో కొన్ని వాక్యాల గీతలుగీసి అది ఫలితం లేనివని అని మానివేసాను. మరునటి రోజున నేను మహాత్మాజీని కలుసు కొన్నప్పుడు ఆయన తాను జ్ఞాపకం చేసు కొని వ్రాసింది నాకు ఇచ్చారు. అది చదివి అది అచ్చు నెను ఇంతకు ముందు చదివి నట్లే ఉంది అనుకొన్నాను.

ఆ తర్వాత ఒక వారమో, అంత కంటె ఎక్కువ కాలమో గడ చింది. నేను మరోసారి తిరిగి సేవాగ్రామం వెళ్లాను. అప్పుడు కూడా వార్ధాలో ఆ వసతి గృహంలోనే ఉన్నాను నన్ను చూడగానే పే నేజరు ఒక కవరు ఇచ్చాడు అందులో నేను పోయిందను కున్న మహాత్మాజి ఇచ్చిన ఉత్తరం ఉంది అది నేను అశ్రద్ధగా పడవేశాననీ, మరునటి రోజున గదితుడుస్తూ పని మనిషి అది చెత్త కాగితాల బుట్టలో పారేసిం దనీ తానది చూసి ఉపయోగ కరమైన కాగితంగా గుర్తించి భద్ర పరచి తిరిగి నేను వార్ధా వచ్చినప్పుడు ఇద్దామని అనుకొని ఇచ్చినట్లూ చెప్పాడు.

నా మనస్సంకోచం తొలగిపోయింది సేవాగ్రాం పరుగెత్తి వెళ్లినంత తొందరగా వెళ్లి మహాత్మాజీకి పునర్లభ్యమైన ఆ ఉత్తరం ఇచ్చాను. ఆయన తాను జ్ఞాపకం చేసు కొని వ్రాసిన ఉత్తరం పైకి తీసారు నేను రెండూ పోల్చిచూసి మహాత్మాజీ జ్ఞాపకం తెచ్చుకొని అసలు ఉత్తరానికి అక్షరాల సరియైన నకలు వ్రాసినట్లు గ్రహించాను. ఒక నిమిషం పాటు అది సంభవమని నమ్మలేక పోయాను. కాని, కంటిఎదుట ప్రత్యక్షంగా కన్పిస్తుంటే ఆ యథార్థం గుర్తించక పోవడం ఎట్లా? మహా

త్మాజీ అపూర్వ అసాధారణ మనోతీత శక్తి ప్రత్యక్షంగా, పూర్తిగా రుజువైంది.

సంప్రతింపులు తెగకుండా, ముగింపు లేకుండా కొన సాగుతూనే వుండటంచేత అనిశ్చిత స్థితి ఏర్పడింది. పేరు మార్చు కొంటే తమకు అభ్యంతరంలేదని ప్రభుత్వం చెప్పినప్పటికీ హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ కార్య వర్గ కమిటీ తమ సంస్థ పేరు హైదరాబాద్ నేషనల్ కాన్ఫరెన్స్ (హైదరాబాద్ జాతీయ సంఘము) అని మార్చుకొని వ్యవహరించేటందుకు అంగీక రించి నప్పటికీ ప్రభుత్వానికి అసలు దాని మనుగడే నచ్చ లేదు. పేరు ఒక్కటే మార్చడం జరిగింది కాని, సంస్థ ఆశయాల్లో లక్ష్యాల్లో నియమావళిలో ఏ మార్పులూ చెయ్యడం జరగదని కాంగ్రెసు వారు కచ్చితంగా చెప్పారు ఒకవంక ఇత్తెహాదుల్ ముసల్మీన్ అనే మతావేశ పూరిత [illegible] సంస్థ, హైదరాబాద్‌లో ప్రజాస్వామ్య సిద్ధాంతాన్ని ప్రచారంచేసే ఏ సంస్థా ఉండకూడదని [illegible] వాదించి నప్పటికీ ప్రభుత్వము [illegible] తేల్చకుండా పేరు మార్చు [illegible] గీక రించింది ఇత్తెహాదుల్ ముసల్మీన్, ముస్లిముల ప్రాధాన్యత కోసం అనిల్ హక్ అనే ఒక విపరీత మైన సిద్ధాంతాన్ని [illegible] ప్రతిపాదించింది 'ముస్లిములు పరిపాలకులు' తదితరులు వారిని సేవించి బ్రతక వలసిన వారు' అనేదే ఆ విపరీతపు సూత్రము సంస్థానానికి నిజాము పరిపాలకు డైనందు వల్ల ఈ సూత్రం సహజమై ఆయనలో మూర్తీభవించింది, అని వారి వితండ వాదంలోని సారాంశము. ఏది ఏమైనా నిజాము, ఈ సంప్రతింపులను పూర్తిగా తానే నడిపిస్తూ ఒకవిపరీతమూ, అసాధ్యమూ, అసంబద్ధమూ అయిన పరిణామం ఏర్పడేటందుకు మూలకారణమైనాడు.

హైదరాబాదు నేషనల్ కాన్ఫరెన్సు అనే పేరుతో హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు కార్యనిర్వహణ చేయడం తమకు అభ్యంతరకరం కాదంటూ ప్రభుత్వం జాబువ్రాసింది. కాని, ఆచరణలో అది వెంటనే తన మనస్సును మార్చుకొన్నట్లైంది స్టేట్ కాంగ్రెస్ కార్యవర్గము కొత్త పేరుతో తన కార్యక్రమాలు ప్రారంభించింది. సంస్థానంలో అన్ని

ప్రాంతాలలోనూ వేలకొద్దీ జనాన్ని ప్రాథమిక సభ్యులుగా చేర్చడం మొదలైంది. స్టేట్ కాంగ్రెస్, తనపేరు మార్చుకొని హైదరాబాదు నేషనల్ కాన్ఫరెన్స్ అనే పేరుతో వ్యవహరించ దలచుకొన్నట్లు వ్రాతపూర్వకంగా ప్రకటనచేసింది. అంతటితో అన్ని సమస్యలూ పరిష్కారం అయినట్లు అనుకోవాలి. సంప్రదింపులు పూర్తికావలసింది కాని, ప్రభుత్వం ఈ వ్యవహారాన్ని ఇంత తేలికగా ముగించ దలచుకో లేదు. వెంటనే ప్రభుత్వము, నిషేధాజ్ఞను ఉపసంహరించకుండా ఉన్నప్పుడు మీ సంస్థ ఎట్లా కార్యక్రమాలు నిర్వహిస్తున్నది? అని, నిషేధాజ్ఞలు ఇంకా అమలులో ఉన్నట్లు తెలియజేసారు. మేము ఏమిటి ఈ కుతర్కము? అనుకున్నాము. మాకు ఏమీ తోచలేదు. కాంగ్రెస్ కార్యవర్గము బిర్ర బిగిసింది. జరిగినవన్నీ మహాత్మాజీకి తెలియ జేసాము. ఆయన మా చర్యలలో నియమావళికి విరుద్ధమైన చర్య ఉన్నట్లు వివరించారు. హైదరాబాదు నేషనల్ కాన్ఫరెన్సును రద్దుచేయవలసిందని సలహా ఇచ్చారు. అప్పుడు మొదట ఉన్న పరిస్థితి ఏర్పడుతుందని అన్నాము

అట్లా చెయ్యడానికి కార్యవర్గానికి మనస్కరించలేదు ప్రభుత్వం తానిచ్చిన మాట వెనకకు తీసుకొన్నదని నమ్మించి తప్పుదారి పట్టించిందనీ, తమ విశ్వాసానికి తగినట్లు ప్రవర్తించ లేదనీ అందువల్ల తాము సంప్రతింపులు ప్రారంభించక ముందున్న స్థితిలోనే అంటే హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు కార్యవర్గంగా ఉన్నామనీ, ఉండాలనీ నిశ్చయించారు. అందువల్ల మరొకదృక్పథంకూడా వ్యక్తమైంది. పేరు మార్చుకొనేటందుకు అంగీకరించడమూ, కొద్ది కాలము క్రొత్త పేరుతో వ్యవహరించడమూ జరిగాయి అందుచేత ఒకసారి వదలుకొన్న పూర్వపు పేరు తిరిగి స్వీకరించడం తగదు అని కొందరు భావించారు. జోరుగా వేడిగా వాదించి, చివరకు మహాత్మాజీ సలహా ప్రకారం నడచుకోవాలని నిర్ణయించారు అప్పుడు ప్రభుత్వం నేషనల్ కాన్ఫరెన్సు అనే పేరుతో పని చెయ్యడానికి అంగీకరించనట్లయితే మరో పోరాటం అనివార్య మవుతుందని అందరూ గుర్తించారు ఈసందర్భంలో జరిగిన ఉత్తర, ప్రత్యుత్తరాలు రెండూ అతిముఖ్యమైనందున వాటిని

ఈ క్రింద పొందపరచడం జరిగింది.

1939 డిసెంబరు 25 నాడు నిజాము ప్రభుత్వపు హోమ్‌శాఖ కార్యదర్శినుంచి మాకువచ్చిన లేఖలో ఈ క్రింది విధంగా ఉంది —

"డిసెంబరు 19 నాటి మీ జాబుకు జవాబుగా ప్రభుత్వం మీకు ఈ క్రింది సమాచారము తెలియ జేస్తుంది. స్టేట్ కాంగ్రెస్ అనే పేరులో అనుకూలమైన మార్పు జరిగిన తర్వాత ప్రజారక్షణ నియమావళి 13 ననుసరించి జారీచేసిన ఆర్డరు, మారిన పరిస్థితిలో నియమావళి 14 ననుసరించి అంటే మీ సంఘం సంస్థానం వెలుపల ఉన్న మరే సంఘంతోగాని సంస్థతోగాని సంబంధం లేనిదని రుజువైనందున, రద్దు యింది"

హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ స్థాయి సంఘము ఈ క్రింది తీర్మానాన్ని అంగీకరించింది —

"ఘనత వహించిన నిజామువారి ప్రభుత్వానికి, హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌కు నడుమ, పేరును గురించి అభిప్రాయ భేదాలు కలిగి నందువల్లను ఘనత వహించిన నిజాము ప్రభుత్వం అభ్యంతరము వెల్లడించి నందువల్లను స్టేట్ కాంగ్రెస్ స్థాయి సంఘము తన పేరును "హైదరాబాదు నేషనల్ కాన్ఫరెన్స్"గా మార్చుకొనుటకు తీర్మానించింది. ఇప్పటినుంచి హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ ఆ పేరుతో వ్యవహరించబడుతుంది. దాని ఆశయాలు, లక్ష్యాలు, నియమావళి యథాతథంగా ఉంటాయి సాధారణంగా అన్ని సంఘాలలో వలెనే ఆ తర్వాత వాటిలో మరే మార్పులు చేర్పులు అయినా చేయడం జరుగుతుంది స్టేట్ కాంగ్రెస్ రికార్డు లన్నింటిలోనూ 'స్టేట్ కాంగ్రెస్' అన్న మాటలకు బదులు ఇకనుంచి "నేషనల్ కాన్ఫరెన్స్" అని ఉపయోగించడం జరుగుతుంది".

# 21. సత్యాగ్రహి - అగ్ని పరీక్ష

ఆ తర్వాత రాజకీయాల్లో ఏమీ సంచలనం లేకుండా చాలా రోజులు గడిచాయి నేషనల్ కాన్ఫరెన్స్ రద్దుచేసినందువల్ల ఆ పేరుతో వ్యవహరించే అవకాశం లేదు. హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌కు అంతకు ముందే ఎప్పుడో వీడ్కోలు ఇచ్చాము. కార్యక్రమాలు ఏవైనా నడిపించే టందుకు మాకు ఏ సంస్థాలేదు. ఏ హోదాలో ఏ పతాక ఛాయలో మేము అందరమూ కలిసి కార్యక్రమాలు కొనసాగించేది ? అందుచేత సంప్రతింపులు జరపడం ఒక్కటే మాకు మిగిలింది అదికూడా ఇటూ అటూ తేలని ఒక పెద్ద సమస్య అయి కూర్చుంది. కార్యకర్తలలో తొందర హెచ్చింది. వారందరూ తిరిగి పోరాటం ప్రారంభించాలనీ అదొక్కటే ఆత్మగౌరవంపట్ల అభిమాన, అభినివేశాలున్న ప్రజలకు కర్తవ్యము అనీ చెప్పసాగారు. కాని, సంప్రతింపుల్ని హఠాత్తుగా త్రుంచి వెయ్యడం సాధ్యంకాలేదు. అందుచేత అవి అట్లాగే మరి కొన్ని నెలల పాటు సాగాయి "నేషనల్ (జాతీయ)" అనే మాటవల్ల సూచిత మవు తున్నది. ఏమిటి అని, కొంత తీవ్రంగా వాదోపవాదాలు జరిగాయి. మా సంఘంలో ఎటెపిగా ముస్లిము సభ్యులు లేనందువల్ల ఆమాట వాడ కూడదని ప్రభుత్వం తన అభ్యంతరాన్ని తెలిపింది ఆశయాన్ని అనుసరించి పేరు నిర్ధారణ కావాలి కాని సభ్యుల సంఖ్యను అనుసరించి కాదని మేము వాదించాము. [illegible] పూర్తిగా మాయమైనందువల్ల మాకు ప్రభుత్వ నిషేధాజ్ఞల నుల్లంఘించడం తప్ప మరొకదారి కనిపించలేదు. రద్దుఅయిన నేషనల్ కాన్ఫరెన్స్ కార్యవర్గం సేవాగ్రాం వెళ్ళి మహాత్మాగాంధీ ఆమోదాన్ని, ఆశీస్సుల్ని పొందాలని అనుకొన్నారు. పోరాటం అనివార్యమైంది.

1940 ఆగష్టు నెలలో సుమారు రెండు డజన్ల మందిమి సేవా

గ్రాంలో మహాత్మాజీ కుటీరంముందు గుంపుగా కూర్చున్నాము. ఆయనకు మా అభిప్రాయాలన్నీ చెప్పి తిరిగి పోరాటాన్ని ప్రారంభించేటందుకు అనుజ్ఞ ఇమ్మనీ కోరాము. మా మాటలన్నీ ఆయన ఎంతో ఓర్పుతో విని ఆలోచనలలో మునిగినట్లు తోచింది. ఆయన మా అందరికీ ఏదో క్రొత్త విషయం చెప్పదలచుకొన్నట్లుగా అది ఎట్లా చెప్పనా, ఏది ఎంతవరకు చెప్పడానికి ఇది సమయము అనుకొన్నట్లు కన్పించారు. హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ సమీపంగా ఉన్నదని నిరూపించేటందుకు పోరాటాన్ని తిరిగి ప్రారంభించడం మినహా మరోదారి మాకు లేదని ఆయన అన్నారు అట్లా చేసేటందుకు ముందు మేము స్టేట్ కాంగ్రెస్ సభ్యుల మని ప్రకటించుకోవాలన్నారు. కాని, ఈసారి జరిగే పోరాటము ఆషా మాషీ పోరాటంగా ఉండదని చావో, [illegible] తేల్చేటటువంటి దవుతుం దనీ అన్నారు అది ఎంతకాలం [illegible] ఎవరూ చెప్పలే రన్నారు. ఉన్నదంతా త్యాగం చెయ్యవలసిన అవసర మేర్పడవచ్చు నన్నారు. దాని ఫలితంగా ప్రాణత్యాగాలుకూడా చేయవలసి వస్తుందేమో నన్నారు. మీలో కొందరి తలలు తెగిపడవచ్చు. ఎందరో ఉరిశిక్షకు తుపాకి ఫిరంగిగుండ్ల బారికి గురికావలసిన అవసరం వస్తుంది. అని వివరించి మీలో ఎందరు, ఎవరెవరు దీనికి సిద్ధంగా ఉన్నారో చెప్పండి అంటూ ప్రశ్నించారు. మేమందరమూ స్వాతంత్ర్య సాధనకు అమూల్యం చెల్లించడానికి సంసిద్ధులమే అన్నాము. కాని, మహాత్మాజీకి మేము చేసిన వాగ్దానంవల్ల తృప్తికలగలేదు ఆయన మనస్సులో దాని అంతరాంతరాల్లో చాలా లోతున ఏదో మరో ఆలోచనలు మెదులుతూ ఉన్నాయి. ఆ ఆలోచనలు అన్నీ ఒక రూపం ధరించేటందుకు కొట్టుమిట్టాడుతున్నాయి. అందుచేత ఆయన "కాదు! అట్లాకాదు," "మీరు ఆత్మాహుతికి సిద్ధంగా ఉన్నారా? నేను మిమ్మల్ని క్షమించండని, విడుదల చెయ్యండని, ప్రభుత్వానికి నివేదిస్తూ వ్రాయను. ప్రభుత్వంతో రాయబారాలు జరపను. మీకు ఈ లోకంతో సంబంధం ఉండదు మిమ్మల్ని పూర్తిగా ఖర్చువ్రాసి కొట్టిపారెయ్యవచ్చు ? మీకు దానికి తగిన ఆత్మబలంవుందా?" అని అడిగి

మాకు కొంత వ్యవధి ఇచ్చి ఆఖరి ప్రశ్న అడిగారు "మీకు అహింసలో సంపూర్ణ విశ్వాసము, మతాభినివేశము ఉన్నాయా ?"

మహాత్మాజీ వేసిన ఈ ప్రశ్నలన్నీ మమ్మల్ని నిశ్చేష్టులుగా చేసాయి. మాకందరికీ సత్యాగ్రహంలో ఉన్న ప్రవేశం స్వల్పం మేమెవ్వరము దానితత్వం పూర్తిగా తెలిసినవాళ్ళం కాదు. అట్లాంటి మమ్మల్ని మహాత్మాజీ విశేషానుభవం కలవారిని అడగతగిన ఈ ప్రశ్నలడగడం ఎంతో ఆశ్చర్యం కలిగించింది. మాలో చాలమంది అహింసను తమ జీవిత విధానంగా చెసుకొనే ఆలోచనలే చెయ్యలేదు. మాదృష్టిలో అహింసా విధానం ప్రస్తుత రాజకీయ సమస్యా పరిష్కారానికి ఒక అనుసరణీయ పద్ధతి మాత్రమే అందుచేత, భారతదేశంలో మిగిలిన కార్యకర్తల ఎన్నిక విషయంలో ఏయే పరీక్షలు జరుపుతున్నారో మావట్ల కూడా వాటినే అమలు చెయ్యవలసిందనీ ఇంత కఠినపరీక్ష వద్దనీ మహాత్మాజీని అభ్యర్థిస్తూ ఎంతోసేపు చెప్పాము. ఆయన మా అభ్యర్థనను మన్నించలేదు. మా వాదన నిష్ఫలమైంది

మహాత్మాజీ ఎంతమాత్రమూ తన పట్టునుంచి దిగలేదు 'నిషేధాజ్ఞను ఉల్లంఘించెటందుకు అహింసాత్మక విధానంలో సంపూర్ణవిశ్వాసం కలవారికే నేను అనుమతి ఇస్తాను. మిగిలినవారందరూ నిర్మాణాత్మక కార్యక్రమాల నిర్వహణలో మాత్రమే నిమగ్నులు కావాలి మీ కాంగ్రెస్ సంఘంలో రెండు విభాగాలు ఏర్పాటు చేసుకోండి. ఒకవర్గం నిర్మాణాత్మక కార్యక్రమాలు చేపట్టి నిర్వహిస్తుంది రెండోది హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ ప్రతిష్ఠ నిలబెట్టేటందుకు నిషేధాజ్ఞలు ధిక్కరించి ఉద్యమం నిర్వహిస్తుంది' ఇట్లా చెప్పి తాను సంఖ్యాబలానికి ప్రాధాన్యం ఇవ్వనని విస్పష్టం చేసారు. తన గీటురాయి పరీక్షకు నిలబడగలిగినవారు ఒక్కరున్నా చాలునన్నారు. తన నియమాన్ని దిగజార్చే ఆలోచనే లేదన్నారు ఈ నిర్ణయం మమ్మల్ని విషాదంలో ముంచింది మాలో కొందరికి ఆవేశం కలిగింది. మహాత్మాజీ మా అందరి హృదయాల్లోనూ ఉన్న ఆవేదనను అర్థం చేసుకొన్నారు. ఆయన తాను నిర్ణయించిన

మార్గం ఒక్కటే ఉద్యమ నిర్వహణకు సరియైన విధానం అన్నారు. ఆయన మమ్మల్ని బాగా ఆలోచన చేసుకొని, మా నిశ్చయాన్ని మరునాటి సాయంకాలం తెలియజేయ వలసిందని చెప్పి పంపించారు.

వార్ధాలో ఉన్న ప్రయాణికుల వసతిగృహం ఆవరణలో ముందు భాగంలో ఉన్న పచ్చికబయలులో కూర్చుని మేమందరమూ ఎట్లా చర్చించామో, ఎట్లా వాదించామో నాకు ఇప్పుడు కూడా కళ్ళకు కట్టినట్లు ఉంది. పోరాటానికి సుముఖంగా లేనివారు సహజంగా తాము హాయిగా ఊపిరి తీసుకోవచ్చునని తృప్తిచెందారు పోరాటానికి ముందుకు ఉరకలు పెడుతూ చూస్తున్న వారిలో జంకు వచ్చింది. నాకు రోషము కలిగింది నిర్మాణాత్మక కార్యక్రమాలు పోరాటాన్ని తప్పించుకొనేటందుకు మార్గమా ? నా మనస్సు కలత చెందింది కలత చెందిన మనస్సు ఎట్లా పనిచెయ్య గలుగుతుంది? నేను తగ్గాను. ఒక మూల కూర్చుని, నిదానంగా మహాత్మాజీ చెప్పిన మాటలో ప్రతీమాటా వరసగా జ్ఞాపకం తెచ్చుకుంటూ నిదానంగా ఆలోచన చెయ్యడం సాగించాను ఎంత ఆలోచించినా 'అహింస' అనేది నా తత్వము, మతము అయేటంత పట్టుదలతో జీర్ణించుకొన్నానని తోచలేదు ఆ రాత్రంతా మనశ్శాంతి లేకుండా గాంధీజీ నిర్ణయించిన పరీక్ష గురించి ఆలోచనలు చేస్తూ గడిపాను. చివరికి తెల్లవారుజామున మనస్సు దృఢంచేసుకొని ఏంచెయ్యాలో నిశ్చయించుకొన్నాను మహాత్మాజీ కుటీరం దగ్గరకు చేరుకొనేటప్పటికి మధ్యాహ్నం దాటింది నేను మహాత్మాజీతో ఇప్పుడు నేను అహింసా తత్వాన్ని పూర్తిగా అలవరచుకొన్న వాడ్ని కాకపోయినప్పటికీ క్రమంగా మనోబలం సంపాదించుకొని యావజ్జీవం దాని సాధనలోనే గడపాలని నిశ్చయించుకొన్నాను, అని చెప్పాను. ఆ మాటలు వింటూ ఆయన సూటిగా నా కళ్ళలోకి చూసారు ఆ చూపు నన్ను అంతటా అంతరాంతరాల్లోకి పరిశీలిస్తూ చూసినట్లనిపించింది ఆయన చిరునవ్వు నవ్వుతూ హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌పై ఉన్న నిషేధాజ్ఞను ఉల్లంఘించేటందుకు నాకు అనుమతి ఇస్తున్నానన్నారు. అది వ్యక్తి సత్యాగ్రహంగా ఉండా

లనీ నన్ను మరెవరైనా అనుసరించ దలచుకొంటే వారు తనను ముందు కలుసుకోవాలనీ తనకు వారిపట్ల సంతృప్తి కలిగి అనుమతి ఇచ్చిన తర్వాతనే వారు సత్యాగ్రహం చెయ్యవలసి ఉంటుందనీ అన్నారు.

ఒక వారంపాటు సేవాగ్రాంలోనే ఉన్నాను అంతసమయంలోనున్నదూ గాంధీజీతో లభించని సాన్నిహిత్య భాగ్యం పొందాను. ఆయనకు నాతో ఎప్పుడు మాట్లాడాలనే కోరిక కలిగితే అప్పుడు నన్ను పిలువనంపే వారు. ఆయన నాకు చెప్పదలచుకొన్న మాటయి చెప్పేవారు సత్యంకోసం ప్రాణాలు పణంగా ఒడ్డేటందుకు సిద్ధంగా ఉన్నావా? అని మరోసారీ మరోసారీ అడిగారు "నీవు నిషేధాజ్ఞను ధిక్కరించడం ఒకటేకాదు చెయ్యవలసింది ఈ ఉద్యమంలో దానికి మించిన ధర్మంనిగూఢమై ఉంది. ఆత్మత్యాగానికి మన సంసిద్ధతను ఈ ఉద్యమంలో వెల్లడించవలసి ఉంటుంది అందుచేతనే సత్యాగ్రహుల్లో అహింసపట్ల గాఢమైన విశ్వాసం ఉండాలంటున్నాను" అన్నారు. ఆయన తన హృదయాన్ని విప్పి నా ముందుంచుతున్నట్లు అనిపించింది ఒక్కొక్కప్పుడు ఆయన తన మనోభావాలన్నీ ఇట్లా ఎందుకు చెప్పతున్నారా అనిపించేది. సత్యాగ్రహశాస్త్రంలో ఒక కొత్త కార్యాచరణ విధానాన్ని, అంటే వ్యక్తి సత్యాగ్రహాన్ని, రూపొందించి అది దేశం అంతటా వ్యాపించేటట్లుగా ఆ విధానాన్ని తీర్చిదిద్దే ఆలోచనలలో ఆయన అప్పుడు నిమగ్నులైనట్లు నాకు కించిత్తయినా తెలియదు ఆ తర్వాత ఆయన సత్యాగ్రహులలో సాధకోత్తముడైన వినోబాజీని ప్రథమ వ్యక్తి సత్యాగ్రహిగా ఎన్నుకొన్నారు. ఏమైతేనేమి ఆయన నిశిత దృక్కులతో పరిశీలించి తన సంతృప్తిని వెల్లడించి, హైదరాబాదు వెళ్ళి హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు సభ్యుడనని ప్రకటించి నిషేదాజ్ఞను ఉల్లంఘిస్తూ సత్యాగ్రహం చేసేటందుకు నాకు అనుమతి ప్రసాదించారు. వీడ్కోలు మాటలు చెప్పతూ ప్రభుత్వానికి పంపించవలసిన పత్రరం యొక్క మతలబు (డ్రాఫ్ట్) కూడా ఇచ్చారు. ఆయన ఆశీర్వాదాలు పొంది సేవాగ్రాం వదిలాను.

ఈ సంఘటనను గురించి నేను తర్వాత అనేకసార్లు ఆలోచించాను నాలో, జంకుతూ ఇటూ అటూ చలిస్తూవున్న విశ్వాసము మహాత్మా మాటలవల్ల పదిరెట్లు వృద్ధి అయి దృఢతరమైంది. ఆయన తన పనులు చేసేవారి బలాన్నీ దౌర్బల్యాల్నీ బాగా గుర్తించి వారిచేత పనులు చేయించగలిగిన శక్తిమంతుడు. వారి బలాన్ని పెంపొందించి, తీర్చిదిద్ది వారు శక్తిమంతులని రుజువుచేసుకొన్న మీదటనే కార్యనిర్వహణకు రంగ స్థలానికి పంపిస్తారు. నేను ఆయన సాన్నిధ్యంలో గడపిన వారం రోజుల్లోనూ నాకు వ్యక్తి సత్యాగ్రహం చేయదలచుకొన్న వారికి ఉండవలసిన మనోనిబ్బరంమువంటి సాధన సంపద సమకూరింది.

నేను గాంధీజీ ఆజ్ఞ గైకొనేటందుకు సేవాగ్రామ్ వెళ్లేటందుకు హైదరాబాద్ వదలకముందే మహాత్మాజీ చెప్పినట్లుగా వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన దలచుకొన్నవారు పాటించవలసిన పరతులు, అలవరించు కొనవలసిన లక్షణాలు ఉన్నవారిని కొందరిని స్వయంగా కలుసుకొని వెళ్ళడం తగినపని అని భావించాను. ఒక అరడజను మందైనా అట్లాంటివారు లభిస్తారని నా నమ్మకము. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ ఆఫీసు నిర్వహిస్తున్న శ్రీ జె. కె ప్రాణేశాచార్య సత్యాగ్రహంలో పాల్గొనే కోరికను వెల్లడిస్తూ అనుమతి ఇవ్వవలసిందని మహాత్మాజీకి అంతకుముందే జాబు వ్రాసారు. అందుచేత నేను ఆయనకూ, సత్యాగ్రహం చెయ్యాలని ఉత్సాహం వున్నవారిలో మహాత్మాజీ పరీక్షకు నిలబడగలిగినవారని నేను భావించిన మరి కొందరికీ కూడా విషయం తెలియజేయ వలసిందనీ వారే మహాత్మాజీకి తమ సంసిద్ధతను వెల్లడిస్తూ స్వయంగా వ్రాయడం తగిన పని అనీ సూచిస్తూ జాబు వ్రాశాను ఈ పని నిర్వహించేటందుకు ఆయనకంటె తగిన మనిషి మరెవ్వరూ వున్నట్లు నాకు తోచలేదు. శ్రీ ప్రాణేశాచార్య స్వయంగా స్వాతంత్ర్యోద్యమానికి అంకితమైనాడు నిష్కల్మషమైన దృక్పథం కలవాడు. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ కార్యదర్శిగా నేను పనిచేసిన 15 సంవత్సరాలూ ఆయన పూర్తి సహకారం పొందాను క్లిష్టమైన సమస్యలకు చిక్కుముడి విప్పిన

తీరుగా పరిష్కరించే సూచన లివ్వగలిగిన ప్రజ్ఞావంతుడు. నేను అరెస్టు అయాను వెంటనే ఆయన కూడా హైదరాబాద్ సంస్థానంలోని కర్నాటక ప్రాంతంలో వ్యక్తి సత్యాగ్రహం చెయ్యడానికి ప్రయత్నాలు చేస్తుండగా ప్రభుత్వం ఆయనను అరెస్టుచేసి 16 నెలలపాటు జైలుశిక్ష విధించింది

ఈ సత్యాగ్రహోద్యమానికి పట్టికలు తయారుచెయ్యవలసిన పని లేదు ప్రతి సత్యాగ్రహీ ముందు మహాత్మాజీ పరీక్షకు నిలబడి అనుమతి పొంది, ఆ తర్వాతనే సత్యాగ్రహం చెయ్యాలి అందుచేత నన్ను వెంటనే సత్యాగ్రహం చెయ్యకుండా ఆపేటటువంటి కారణాలు ఏమీ లేవు. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసుకీ ప్రభుత్వానికీ నడుమ నడచిన వ్యవహారానికి సంబంధించిన వుత్తర ప్రత్యుత్తరాలు ప్రకటించవలసిన అవసరం వుంది వాటిని ఒక చిన్న పుస్తకంగా ప్రకటించి ఎక్కువ ప్రచారం చెయ్యాలనుకొన్నాము పుస్తకాన్ని అచ్చువెయ్యడం సంస్థానానికి బైట కొనసాగించి, దాని కాపీలు సంస్థానంలోకి రహస్యంగా రవాణాచేసి పంపకం చేశాము. అది పూర్తికాగానే నేను చెయ్యవలసిన మరేపనీ మిగల లేదు వెంటనే నేను హైదరాబాద్ సంస్థాన ముఖ్యమంత్రిగా వున్న సర్ అక్బర్ హైదరీకి నేను సత్యాగ్రహం చెయ్యవలసిన అవసరం ఎందుకు ఏర్పడిందో వివరించే కారణాలు, ఈ సారి చేస్తున్న సత్యాగ్రహం యొక్క స్వరూప స్వభావాలు వున్న లేఖ వ్రాశాను ఆ లేఖ అనేక కారణాల వల్ల ముఖ్యమైంది, చారిత్రక ప్రాముఖ్యం కలది. అందుచేత దాన్ని ఇక్కడ పొందుపరుస్తున్నాను.

"నాకు సహాయ నిరాకరణ వుద్యమంలో పాల్గొంటూ సత్యాగ్రహం చెయ్యవలసిన అవసరం ఏర్పడిందని ఎంతో నొచ్చుకుంటూ మీకు తెలియ జేస్తున్నాను. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ ఎంతో ఆలోచించి ప్రభుత్వాన్ని తృప్తిపరచేటందుకు కృషిచేసినప్పటికీ ఘనతవహించిన నిజాము ప్రభువుల ప్రభుత్వం స్టేట్ కాంగ్రెస్ పట్ల ఏమాత్రమూ సౌహార్ద్రిమూ సామరస్యమూ లేని శత్రుభావంతోనే వ్యవహరించి రాజీ ప్రయత్నాల నన్నింటినీ నిష్ఫలం కావించించింది. అందువల్ల, స్టేట్ కాంగ్రెస్ తన కార్య

క్రమాలను మామూలుగా కొనసాగించడం అసాధ్యమైంది. ఈ పరిస్థితు లలో మా వ్యక్తి స్వాతంత్ర్యాన్ని అడ్డగించే ప్రభుత్వ చట్టాలను, నియమాలను ఉల్లంఘించడం మినహా మాకు మరో దారిలేదు

మా కాంగ్రెసు సభ్యత్వము పదివేలమందికి మించి వుంది. మాతో పాటు వున్న సానుభూతిపరులు అసంఖ్యాకులు ఎంతోమంది వున్నారు. అయినప్పటికీ పూర్తిగా అహింసపట్ల హృదయపూర్వక విశ్వాసం వున్న వారూ, ఈ సహాయ నిరాకరణ వుద్యమంలో సత్యాగ్రహం చేసినప్పుడు ఎదుర్కొనవలసిన కష్టనిష్టురాలను, చేయవలసిన త్యాగాలను మనస్ఫూర్తిగా శాంతంగా గ్రహించ గలిగిన వారూ మాత్రమే ఈ వుద్యమంలో పాల్గొనాలని మేము నిశ్చయించినాము. ఇప్పుడు ఈ వుద్యమంలో నేనూ, నాతోపాటు 15 మంది నా సహచరులూ పాల్గొనాలని తీర్మానించు కొన్నాము. ఈ సత్యాగ్రహ పోరాట పద్ధతిని మేము హింసాయుతమైన పనులు, ఆ ఆలోచనలు పూర్తిగా నిరసిస్తున్నామని తెలియజేయడానికే ఎన్నుకొన్నాము. ఘనతవహించిన నిజాము ప్రభువుల పర్యవేక్షణలో ప్రజాస్వామ్య బాధ్యతాయుత పరిపాలనకోసం మేము జరుపుతున్న ఈ పోరాటం ఎవరిపట్లా ద్వేషంలేనిదనీ కుల, మత భావాలతో సంబంధం లేకుండా ప్రజాసామాన్య సక్షేమ అభివృద్ధులే మా ధ్యేయాలని తెలియ జేస్తున్నాము

"అధికారులు ప్రజల వాక్ స్వాతంత్ర్యాన్ని మన్నించి, రాజకీయ ఆశయాల సాధనకు శాంతియుతంగా కృషి చేసేటందుకు అవకాశాలు ప్రసాదించి ఉండి ఉన్నట్లయితే మేము ఈ విధానాన్ని చేపట్ట వలసిన అగత్యం ఏర్పడేది కాదు ఆ ఆశ కేవలం ఆశ వంటిదిగా మాత్రమే ఉండి పోకుండా మీరు ప్రభుత్వ విధానాన్ని పరిశీలించి సరిదిద్ద వలసిందని వినయ పూర్వకంగా అభ్యర్థిస్తూ, మా కోరిక సఫలమైనప్పుడు మేము తల పెట్టిన ఈ ఉద్యమాన్ని ఆపివేసేటందుకు అవకాశ మేర్పడుతుందని తెలియ జేస్తున్నాము. ఒక వారం రోజులలో తమ దగ్గర నుంచి జవాబు రాగదలని కోరుతున్నాము."

నన్ను జైలులో వేయగానే మరి కొందరు కార్య కర్తలు తాము సత్యాగ్రహంలో పాల్గొనే టందుకు అనుమతి ఇవ్వ వలసిందంటూ మహాత్మాజీని కోరారు. మహాత్మాజి వారిలో నలుగురికి మాత్రమే అనుమతి ఇచ్చారు. శ్రీ అచ్చుత్ రావ్ దేశ్‌పాండే, శ్రీ హీరాలాల్ కోటీచా, శ్రీ మోతీలాల్ మంత్రి, శ్రీ దేవ్ రామ్ చవాన్ అనే వారు నలుగురూ ఆ సత్యాగ్రహులు ఈ సమాచారాన్ని నిజాము ప్రభుత్వానికి తెలియ జేస్తూ మహాత్మాజీ సత్యాగ్రహుల జట్టులో ఇది చివరి జట్టుఅనీ తాను మరి సత్యాగ్రహుల్ని పంపించడం లేదనీ తెలిపారు. వీరు కనక జైలులో కాకుండా బైట ఉంటే ప్రతి దినమూ సత్యాగ్రహం చేస్తూ ఉండాలని మహాత్మాజీ తన ఆలోచన, నిర్ణయము అని తెలియ జేశారు.

ఈసత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నందుకు నన్ను సెప్టెంబరు 11 నాడు రాత్రి బాగా ప్రొద్దు పోయిన తర్వాత అరెస్టు చేసారు. సుల్తాన్ బజార్ ప్రాంతం అంతటా పోలీసులు కావలా ఏర్పాటు చేసారు. నేనప్పుడు గాఢనిద్రలో ఉన్నాను పోలీసులు నా బసపక్కనే ఉన్న ఇంటిలో నుంచి ప్రవేశించి నన్ను నిద్రనుంచి లేపారు కావలసిన వస్తువుల్ని పోగుచేసు కొని నాతో తెచ్చు కొనేటందుకు కూడా టైమ్ (వ్యవధి) ఇయ్యకుండా పోలీసు వాన్‌లో కూర్చోపెట్టారు. ఎక్కడికి తీసుకొని పోఒన్నారో చెప్ప కుండానే బండిని పోనిమ్మన్నారు భగవద్గీత ఒక్కటే నాకు ఆ ప్రయాణంలో తోడు నీడ. వేకువ జాముకాక ముందుగానే ఇంకా కంటి కేదీకని పించని చిమ్మ చీకటి ఉండగానే నన్ను ఒక పెద్దగదిలో ప్రవేశపెట్టి తాళం వేసి మూసి ఉంచారు. అక్కడ వసతి బాగానే ఉంది. విశాలం, మంచిగాలి, వసతి ఉన్నాయి అది ఒక ఎత్తైన కొండ మీద ఉన్న జైలు. ఆ పర్వత పాదంలో ఉన్న గది నా వసతి, అది ఏ ప్రాంతమో చోటు ఏదో నాకు తెలియ నందు వల్ల నేనూ నా ఊహలతోనే తృప్తి పడవలసి వచ్చింది కొంత సేపటికి నన్ను నిజామాబాద్ సెంట్రల్ జైలులో ఒ-చిసట్ల- ప్రజా సంక్షేమ రక్షణ చట్టా న్ననుసరించి నిర్బంధంలో ఉంచినట్లూ తెలిసింది.

# 22. జైలులో ఆధ్యాత్మిక సాధన

నేను నిజామాబాద్ జైలులో ప్రవేశించగానే జైలు బైట ఏమి జరుగుతున్నదీ తెలుసుకోవాలనే కోరిక, దానిని గురించిన ఆలోచనలు ఆగిపోయాయి. రెండు మూడు సంవత్సరాలో ఇంకా చాలా ఎక్కువే కాలమో నేను జైలులోనే గడపవలసి వుంటుందని అనుకొన్నాను. అందు చేత బైట జరుగుతున్న సంఘటనలను గురించి మనః క్లేశము పొందడము, చింతించడము అవివేకము, నిష్ఫలము. ఒక విధంగా చూస్తే నాకు ఈ జైలు నివాసము ఒకవరము బైటివారి కెవరికీ ప్రభుత్వము నన్నెక్కడ వుంచిందీ తెలియదు. చాలాకాలంవరకూ వుత్తర ప్రత్యుత్తరాలకు అవ కాశం కూడా లేదు నాకు కావలసిన నిత్యావసర వస్తువులు యేమీ చడీ చప్పుడు లేకుండా సప్లయి చేస్తున్నారు. ఒకవిధంగా చూస్తే నన్ను పలక రించకుండా యేమీ చెయ్యకుండా నా మానాన నన్ను వదిలేసారు. నే నున్న పరిసరాలలోకి మరే ఖైదీ రావడానికి వీలులేదు. జైలరు, వార్డరు, రాత్రి నాకు కావలావుండే మనిషి తప్ప నాలుగో మనిషి మొహమే నాకు కన్పించేది కాదు.

నా గది ఒక కొండమీద బాగా ఎత్తుగా వున్నచోటవుంది ప్రకృతి సౌందర్యము దర్శనీయమైంది. రకరకాల ఉడతలు, పాములు, తేళ్లు నాకు ప్రత్యక్షం అవుతూ వుండేవి రంగురంగుల సీతాకోక చిలకలు, రకరకాల పక్షులు నాతో చెలిమిచేసేవి వాటికి నాతో అనుబంధం కలిగినట్లు, అవి కొంతదూరంగా వుంటూన్నప్పటికీ, తమ సాహచర్యాన్ని ప్రసాదించి హాయి నిచ్చేవి. సరళ, స్వచ్ఛమైనటువంటి ఆ పరిసరాల్లో నా మనస్సు సహజంగా ఆత్మాను సంధానం వైపు తిరిగింది. వంటచేసుకొనవలసిన

పనితప్ప నాకు మరో పనిగాని నన్ను ఆకర్షించే విషయంగాని లేవు ఆ వంటకూడా అన్నము ఏదో శాకము రోజు కొకసారి మాత్రమే వండు కొనడము, ఆ తర్వాత తక్లీమీద ఒకగంటసేపు నూలు తీయడము, ఇవి మాత్రమే రోజంతటికీ నా కున్న పనులు. మిగిలినకాలం అంతా నేను ధ్యానంలోనే గడిపేవాణ్ని పదిహేను నెలలపాటు ఆ జైల్లో అట్లాగే గడిపాను అది నాకు చాలా తత్ఫలితాలు ప్రసాదించింది. ఆ కాలం అంతా నేను ఉపవాసాలలో, ప్రార్థనలో, ధ్యానంలో గడిపాను. అక్కడే ఆ కాలంలోనే నేను ఉపనిషత్తులు పఠించాను. అలిఫ్ అక్షరంతో ప్రారంభించి ఏడు పార్శ్య పుస్తకాలను ఆ కాలంలోనే పూర్తిచేసాను. నేను బైటి ప్రపంచాన్ని పూర్తిగా మరచిపోయాను.

నేను అరెస్టు అయిన తర్వాత ఆరుగురికి మాత్రమే సత్యాగ్రహం చేసేటందుకు మహాత్మాజీ అనుమతి ఇచ్చారు. మిగిలిన వారినందరినీ నిర్మాణ కార్య క్రమాలు నిర్వహించ వలసిందని ఆయన ఆదేశించారు వారు ఆ పని శక్తి వంచన లేకుండా యథాశక్తి వినియోగించి కొనసాగించినట్లు కనిపించ లేదు కార్య కర్తలలో నిర్మాణ కార్య క్రమాల పట్ల తగినంత ఆసక్తి కలిగించే టందుకు కృషి జరగక పోవడమే అందుకు కారణము దానికి తోడుగా జాతి రత్నాల వంటి మరాట్వాడా కాంగ్రెసు నాయకులందరూ శ్రీ గోవిందదాస్ షరాఫ్ మొదలైన వారందరూకూడా అరెస్టయి జైళ్ల పాలై ఇరవైఒక్క నెలల పాటు అక్కడే నిర్బంధంలో ఉన్నారు మూడుభాషా ప్రాంతాలలోనూ బైటనే ఉన్నవారు, తమ తమ ప్రాంతీయ సంఘాల ద్వారా ప్రాంతీయ సమస్యల గురించి పనిచేస్తూ కాలం గడప సాగారు. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ తానుకూడా ఉన్నాననేటందుకు లాంఛన ప్రాయమైన చిహ్నం జైళ్లలో ఉన్న ఆరుగురు కార్య కర్తల రూపంలో మిగిలింది

జైలులో గడిపిన దీర్ఘకాలావధులను నేను పూర్తిగా ఆధ్యాత్మిక సాధనావకాశాలుగా వినియోగించు కొనడం జరిగింది నేను, నన్నే పరికరంగా ఉపయోగించు కొంటూ ప్రయోగాలు చేశాను. అందుకు అవసర

మైన ఉత్సాహము, మార్గదర్శకత్వము, నాకు నాలో నుంచే వచ్చాయి. నాలో నేనే ఆలోచించుకొంటూ కూని రాగాలుతీస్తూ మాట్లాడుకొంటూ వాదించుకొంటూ గడిపాను ఒక్కొక్కప్పుడు నేనే గురువుగా, నేనే శిష్యుడుగా ఏకపాత్రాభినయం చేసేవాడ్ని అందు చేత ఆ కాలంలో నాకు నేనే గురువునై బోధపరచుకొన్నాను ఈ కృషి ఫలితంగా నాకు నేనే ఒక మౌలికమైన దృక్పథాన్ని తీర్చి దిద్దుకొనే శక్తిని అలవరచుకొన్నాను. అది నా ప్రవర్తనకు మార్గసూచిగా ఉపయోగించింది 1943 జనవరి 14 నాడు హైదరాబాద్ సెంట్రల్ జైలులో ఉండి నా దిన చర్య పుస్తకంలో ఇట్లా వ్రాసుకొన్నాను.

"ఈ లోకంలో ఉంటూ కూడా దాని వల్ల ప్రభావితమైపోయి అది ఎటు లాగితే అటు పోవడం చెయ్యకు. ఆత్మ సర్వాంతర్యామి. అట్లాంటప్పుడు పొంగి పోవడముగాని క్రుంగిపోవడముగాని ఎందుకు?

"జీవన స్రవంతి నిదానంగా ప్రవహించేటట్లు ప్రవర్తించు తుఫానులు, సుడిగాలులు, లేవనియ్యకు. అవి ఆసక్తి, కోరిక, ఆశలవల్ల కలుగుతాయి. ఏ లంపటత్వమూ పెట్టుకోక ఏకాంత భావ సాధనచెయ్యి

"పాపపు ఆలోచనలు కలవాడికి ప్రపంచమంతా పాపభూయిష్టమే నని పిస్తుంది. తన పాపానికీ దుఃఖాలకూ ప్రపంచానిదే పూర్తి బాధ్యత అని తప్పు లెన్నుట నిష్ఫలము.

"దౌర్బల్యం ఉందే అని నీవు హృదయావేదన పొందకు. గతించిన పనులు, వాటిఫలితాలు, కలిగించే స్మృతుల బరువు నీ మనస్సును క్రిందికి దిగలాగకుండేటట్లు చూసుకో ఇతః పూర్వ కర్మల ముద్రాంకిత చిహ్నాలను నీ మనస్సు నుండి తొలగించి వేసి, స్వచ్ఛమైన మనస్సుతో ముందుకుసాగు. పాప భారం ఏదీ లేదనే, భావంతో తేలికైన మనస్సుతో కాంతి వంతమైన స్వేచ్ఛాపథంలో నడుస్తున్నట్లు భావించి ప్రవర్తించుము.

"పదే పదే ప్రతిజ్ఞ తీసుకో. ప్రతిజ్ఞా పాలన చెయ్య లేక పోతే నిరుత్సాహం చెందకు. దౌర్బల్యం వ్యక్తమైతే పరాజితుడై కిందపడిపోయి నట్లు కాదు. అది, ముందడుగు వెయ్యడానికి తగిన శక్తి పుంజు కొనడం

అవసరమైందనే టందుకు సూచన ఆత్మాను సంధానం చేస్తున్న ఆధ్యాత్మిక సాధకులకు పతన మనేది లేదు. అతని కృషి నిరంతరమూ కొనసాగుతూనే ఉంటుంది.

"మరొకరిని ఉద్ధరించాలి, ఉద్ధరిస్తున్నాను అని ఎన్నడూ భావించకు ఉద్ధరించడం నీ కర్తవ్యంకాదు నీవు సేవమా తమే చెయ్యగలవు. అందులోనే నీ పరిణామము ఇమిడివుంది. ఎవరు ఒకపరిధిలోకి చేరుకుంటారో వారు తమ స్వంత శక్తికి తగినట్లుగా ఉన్నత స్థాయిని అందు కొంటారు.

'నీవు లేనిదే ఏదీ జరగదనీ అనుకోకు. ప్రకృతి, కర్తవ్యాలను నిర్ణ యించింది. పరమేశ్వరుడు ఈనాడు నిన్ను ఆ కర్తవ్య పాలనకు సాధనంగా మాత్రమే ఎన్ను కొన్నాడు రేపు ఆయన మరొక సాధనాన్ని ఎన్నుకో వచ్చు. ఈ ప్రపంచ నాటకంలో తత్తత్ సమయాను కూలంగా నీ పాత్రను నీవు నిర్వహించాలి. అట్లా చెయ్యగానే నీకు స్వేచ్ఛలభిస్తుంది, నీవు కేవలం నిమిత్త మాత్రుడవు మాత్రమే.

"నీకు అవసర మైన వాటిలో ఏది ఎక్కడ నుంచి వస్తుంది? అని, చింతించకు నీ పాత్ర నీవు నిర్వహించాలని కోరిన వారే నీకు అవసర మైన సాధనాలు కూడా అంద జేస్తారు. నీవు ఆయన పనులకు పూర్తిగా అంకితమై నిర్వహించడమే నీ కర్తవ్యము.

"నేను సాధకుడను కావాలనే కోరిక గలవాడిని. ఇంకా శైశవాస్థ లోనే ఉన్నాను నా లోపాలను విమర్శనా దృష్టితో పరిశీలించకు. నా పాపాలకు నన్ను అసహ్యించుకో వద్దు మాతృ హృదయంతో నన్ను క్షమించి, అనురాగం వర్షించి బలం ప్రసాదించు. నన్ను రక్షించు! అమాయిక హృదయంతో నిన్ను అర్థిస్తున్నాను."

ఆ రోజుననే "ఈ రోజు వరకు నేను నేర్చుకొన్న గుణపాఠాలు" అనే శీర్షిక క్రింద ఈ రీతిగా వ్రాసు కొన్నాను.

1. నేను నా ప్రవర్తనలో సూటిగా ఉన్నాను.

2. నేను ఎవరి స్వంత వస్తువులనూ ఆశించ లేదు.

3. నేను ఏ జీవికీ అపకారం కోరటం లేదు.

4 నేను యథార్థంగా ఉండాలని అను కుంటున్నాను. కాని, అందులో నాకు ఇంకా పూర్తిగా విజయం లభించలేదు

5. నాకు పాపం చేసే మనస్తత్వము, అభిరుచులు ఉన్నాయి కాని, వాటిని నిగ్రహించి పవిత్రత సాధించడంలో కొంత వరకు కృతకృత్యుడ నయ్యాను. ఇంకా కృషి చెసి సిద్ధి పొందాలని ఆశిస్తున్నాను

6. పూర్తిగా అంకితం కావాలనేదే నాలక్ష్యము. అందు చెత నాకు దిగులనేది లెదు.

7. ఒక్కొక్కప్పుడు పవిత్రమైన ప్రతిజ్ఞా నియమాల పాలన నుంచి తప్పించుకొంటున్నాను. ఆ వెంటనే వాటిని తిరిగి స్వీకరించి ముందుకు నడుస్తున్నాను.

8. ఆధ్యాత్మిక మార్గంలో పురోగమించేటప్పుడు నాకు ఇంక మరెవరి ఆసరా అవసరములేదు.

9. 'నేను' ఈ నా శరీరం కాదని తెలుసుకొన్నాను.

10. అందువల్ల నాలో సంశయాలేవీ లేవు. కల్లోలమూ వొత్తిడిలేవు.

ఈ నియమాలను, ఆదర్శాలను ఎప్పుడూ నా ఎదుటనే ఉంచుకొని, నా ఆలోచనలు పనులు యెంతవరకు వీటికి అనుగుణంగా వున్నాయి అని నిత్యమూ పరిశీలించుకొంటూ వుండటమే నా అనుక్షణ ప్రయత్నము. ఈ ఆదర్శాల నుంచి నాకు అత్యుత్తమమైన తృప్తి, శాంతి లభించాయి. ఆధ్యాత్మికంగా శూన్యతా స్థితి నాలో యేర్పడి నేను కింకర్తవ్యతా మూఢుడనై వున్నప్పుడు వీటిని తిరిగి మననం చేసుకొంటూ వుంటాను.

నా మనసులో వున్న ఈ భావాల నన్నింటినీ ఇక్కడ వుదహరించడానికి, చదువరులముందు నా లోపాలనూ నాలో ప్రజ్వరిల్లుతున్న నిరంతర మథనమునూ ప్రదర్శించాలనే కోరికే కారణము ఈ అభిప్రా

యాన్ని ఇతరు లెట్లా పరిగణించి స్వీకరిస్తారో నాకు తెలియదుకాని, నాకు సంబంధించినంతవరకూ అది నా ప్రతిజ్ఞా స్వీకరణను మరొకసారి పునరుద్ఘాటన చెయ్యడం వంటిదే అని భావిస్తున్నాను. ఒకసారి భారత మాతృసేవా వ్రతాన్ని, స్వతంత్ర సాధన దీక్షను గైకొన్నాను అది ఇంకా పూర్తికాకుండా అట్లాగె పాలించవలసి వున్నది. దానికోసం జరుగు తున్న యాత్రలో ఇంకా చాలాదూరం ప్రయాణం సాగించవలసివుంది. ఆ మార్గంలో ఎన్ని అవరోధాలు వచ్చినప్పటికీ ఎంత శ్రమపడవలసినా సహించవలసిందే. ఆ యాత్రా ప్రయాణం పూర్తి అయి గమ్యం చెరే వరకూ కొనసాగ వలసిందే.

స్టేట్ కాంగ్రెస్ నామ మాత్రంగా ఉండటంలో ఔచిత్యము, ప్రయోజనము ఏమీ లేదని కొందరు తమకు తోచినట్లు మాట్లాడటం సాగించారు. నిషేధాజ్ఞలకు గురి అయిన స్థితిలో ఏ సంస్థ నిర్మాణము జరగదు, అది సాధ్యం కాదు ప్రజల బలాన్ని సమీక రించేటువంటి స్వతంత్ర మున్న సంస్థ ఒకటి వెంటనే అవసరము అందు చెత స్టేట్ కాంగ్రెస్‌ను పునరుద్ధరించే ఆలోచనలన్నీ మానివేయడం మంచిదని బాహాటంగా అనడం కూడా కొందరు కొనసాగించారు జైలులో లేకుండా బైటవున్న వారె వరూ లాంఛన ప్రాయంగా జరిగిన ఈ సత్యాగ్రహానికి ఏమీ ప్రాముఖ్యం ఇయ్య లేదు. అది, కేవలం స్టేట్ కాంగ్రెస్ నశించి అణగారి పోలేదు, ఉన్నది అని మాత్రమే సూచించింది. ఇవన్నీ పరిశీలిస్తే బైట ఉన్న వారి ఆలోచనలలో గజిబిజి ఉన్నట్లని పిస్తుంది. ఏమైతే నేమి నేను గాని మరొ కరు గాని చెయ్య గలిగిందేమి లేదు ఈ నడుమ కాలంలో మహారాష్ట్ర పరిషత్‌ను కూడా పునరుద్ధరించడం జరిగింది అప్పుడప్పుడు కొందరు పెద్ద మనుషులు స్టేట్ కాంగ్రెస్‌పై నున్న నిషేధాజ్ఞను రద్దు చెయ్య వల సిందనే కోర్కెను ఉద్ఘాటించే వారు

భారత దేశంలో వ్యక్తి సత్యాగ్రహం మంచి ఊపులో కొనసాగు తోంది. కాంగ్రెసు, రెండో ప్రపంచ యుద్ధంలో భారత దేశం పాల్గొనడం

పట్ల తమ పూర్తి నిరసనను, విముఖతను తెలియ జేశారు దేశం మొత్తం మీద స్వాతంత్ర్య పోరాటం పెద్ద ఎత్తున సాగుతూ ఉంటే మమ్మల్ని ఎక్కువ కాలం నిర్బంధంలోనే ఉంచడం జరిగింది దేశంలోని రాజకీయ పరిస్థితి కొంత మార్పు చెంది సడలి నప్పుడే హైదరాబాదు ప్రభుత్వం హఠాత్తుగా నన్నూ ఇతర సత్యాగ్రహుల్నీ విడుదల చెయ్య వలసిందని అర్డర్లు జారీ చేసింది. కాని, అప్పుడు కూడా వారు ఔరంగాబాదు కార్య కర్తలను జైళ్లనుంచి వదల లేదు వారిని "ప్రమాద కరమైన కమ్యునిస్టు కార్య కర్తల"ని ప్రభుత్వం పరిగణించింది! నేను జైలు నుంచి విడుదల పొంది బైటికి రాగానే, ఏవి చెయ్యాలో మార్గం సూచించ వలసిందని కోరుతూ మహాత్మాజీకి ఒక లేఖ వ్రాసాను ఆయన అప్పుడు బార్డోలిలో ఉన్నారు అందు చేత ఆయన ఒక వారం రోజులు గడచిన తర్వాత తనను కలుసు కొనేటందుకు సేవాగ్రాం రావలసిందని వ్రాసారు మేమిద్దరమూ కలసి చర్చించాము. ఆయన నన్ను యథాంథంగా విడుదలైన తర్వాత ఇప్పుడున్నట్లే ఉండ మనీ ఏ భాషా ప్రాంత సంఘంలోనూ చేర వద్దనీ సలహా ఇచ్చారు

బహుశా ఆయన ఏదో ఒక కొత్త విధానం రూపొందిస్తున్నట్లున్నారు. ఆయన నన్ను తొందర పడవద్దన్నారు. ఆయన దేశమంతటా ఒక పోరాటం జరుగు తుందనీ అదే దేశానికి స్వాతంత్ర్యం లభింప జేసే తుది పోరాట మనీ అను కొంటున్నట్లు సూచన ప్రాయంగా చెప్పారు. ఆయన తన మనస్సులో ఉన్నదంతా అప్పుడు పైకి చెప్పలేదు. కాని, ఆయన మనస్సులో ఏదో సంగ్రామం, మథనము జరుగు తున్నట్లే వ్యక్తమైంది. ఆయన అదేదోరకమైన ఉద్రేకంతో మాట్లాడుతూ పేరీలు మనివేల డానికి సిద్ధంగా ఉన్న అగ్ని పర్వతంలా కన్పించారు. ఆయన నన్ను హరిజన పత్రికలో వేసేటందుకు ఒక ప్రకటన తయారు చెయ్యమని చెప్పి అది సవరించి అచ్చు వెయ్యడానికి పంపారు. ఆ ప్రకటనతో పాటు ఆయన హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌పై నున్న నిషేధాజ్ఞలను ఉపసంహరించ వలసిందని ప్రభుత్వాన్ని కోరుతూ ఒక అధోజ్ఞాపిక రాశారు.

అప్పుడున్న పరిస్థితులలో అది ప్రభుత్వం చేయగలిగిన కనీస కర్తవ్యం అన్నారు నేను ఇచ్చిన ప్రకటన పూర్తి పాఠము ఈ క్రింద ఇస్తున్నాన "మార్చి 2, 1940 నాడు నిషేధాజ్ఞలకు గురియైన హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ కార్య కర్తలలో కొందరు మహాత్మాగాంధీ మార్గదర్శకత్వాన్ని అనుసరించి సెప్టెంబరు నెలలో ఆ నిషేధాజ్ఞలకు తమ అసమ్మతిని తెలియ జేస్తూ వ్యక్తి సత్యాగ్రహం చేసారు వారిని వెంటనే నిర్బంధంలోకి గైకొన్న నిజాము ప్రభుత్వం ఏ షరతులూ లేకుండా వారిని డిసెంబరు 16, 1941 నాడు విడుదల చేసింది. విడుదల చేసిన వెంటనే, ప్రభుత్వం మమ్మలను విడుదల చేసినప్పటికీ స్టేట్ కాంగ్రెస్ సంస్థపై ప్రయోగించిన నిషేధాజ్ఞ లను రద్దు చేయడం సంభవించ లేదని నేను స్టేట్ మెంట్ ఇచ్చాను. అందు వల్ల మేము తిరిగి సత్యాగ్రహం చెయ్య వలసిన ఆవశ్యకత అట్లాగే ఉంది. విడుదల అయిన తర్వాత మేము మహాత్మా గాంధీని సంప్ర తించాము. ఆయనకు హైదరాబాదు ప్రస్తుత స్థితిని, మా ఆలోచ నలను, వివరించాము. ప్రపంచ యుద్ధపు క్లిష్ట పరిస్థితిని పరిగణించి ఆయన ఇప్పుడు తిరిగి సత్యాగ్రహం చేసే ఆలోచనలను విరమించ వలసిందనీ, మా శక్తి యుక్తులను పూర్తిగా నిర్మాణాత్మక కార్యక్రమాల నిర్వహణకు వినియోగించ వలసిందనీ సలహా ఇచ్చారు. అందువల్ల మేము మహాత్మాజీ సలహా ననుసరించి నడచు కొనుటకు నిశ్చయించు కొన్నాము. అందు చేత మేము ప్రజలనూ, వారిలో ముఖ్యంగా కార్యకర్త లను తమ కాలాన్నీ వనరులనూ శక్తినీ ఈ కార్య క్రమంలో వినియో గించ వలసిందని అర్థిస్తున్నాము ఈ క్లిష్ట సమయంలో మనము ఘనత వహించిన నిజాము ప్రభుత్వానికి మన కార్య క్రమాల మూలంగా ఏ విధ మైన చికాకులు, సమస్యలు కలిగించడం తగిన పనికాదని భావిస్తున్నాము. ఈ రీతిగా సత్యాగ్రహోద్యమాన్ని తాత్కాలికంగా విరమించడంవల్ల ఘనత వహించిన నిజాము, ఆసఫ్‌జాహి వంశం వారి పర్యవేక్షణలో సంపూర్ణ ప్రజా స్వామ్య బాధ్యతాయుత పరి పాలన స్థాపించు కొనాలనే మన లక్ష్యంలో మార్పు కలిగిందని ఎవ్వరూ భావించ రాదని స్పష్టం చేస్తున్నాము."

ఈ ప్రకటనతో పాటు తన భావప్రకటన సూచికగా మహాత్మాజీ:

"ఘనత వహించిన నిజాము ప్రభుత్వము లోగడ ప్రయోగించిన నిషేధాజ్ఞలను తొలగించాలని నేను యెంతో వాంఛిస్తున్నాను ఘనత వహించిన నిజాము అధ్వర్యంలో బాధ్యతాయుత ప్రజాసత్తాక పరిపాలన నేర్పాటు చేసుకోవాలంటూ తమ కోరికలను చట్టబద్ధంగా వెల్లడించి కృషి చెయ్యాలనే ప్రయత్నాలకు వారు ఆటంకాలు కలిగించరాదు. ఇటీవల సత్యాగ్రహుల్ని విడుదల చేయడంలో వారు చూపిన ఔదార్యము, స్టేట్ కాంగ్రెస్‌పై నున్న నిషేధాజ్ఞలను రద్దుచెయనియెడల నిజమైన ఔదార్య ఫలిత మని అనిపించుకొనదు.

సేవాగ్రామ్ ఎమ్ కె. జి
8. 2. '42 (మోహన్‌దాస్ కరంచద్ గాంధీ)"

కాని, ప్రభుత్వంలో ఏమీ కదలిక కనిపించ లేదు. నేను మహాత్మాజీని మరోసారి కలుసుకొన్నాను. ఆయన నాతో "తొందర పడ వలసిన పని లేదు, అఖిల భారత స్థాయిలో పోరాటం ప్రారంభం కాబోతుంది. అందులో హైదరాబాదు సంస్థానంలో జరిగే పోరాటం అంతర్భాగం అవుతుంది" అని, చెప్పారు. ఈ రీతీగా మా సంభాషణలు మే 1942లో, అంటే క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభం అవడానికి కొన్ని నెలలు ముందుగానే జరిగాయి.

# 23. క్విట్ 'ఇండియా' ఉద్యమం

నాకు లభించిన ఎనిమిది నెలల స్వేచ్ఛా హైదరాబాద్ సంస్థానానికి సంబంధించి నంత వరకు ఏమీ అంత ఎక్కువ ముఖ్యమైన విషయం కాలేదు. మే 1942లో నేను సేవాగ్రాం వెళ్లి మహాత్మాజీని కలుసు కొని ప్రభుత్వం మా మరాట్వాడా సహచరులను విడుదల చెయ్యకుండా విచారణ కూడా చెయ్యకుండా ఇంకా నిర్బంధంలో ఉంచడం పట్ల నిరసన తెలియ జేస్తూ ఉపవాసం చేసేటందుకు అనుమతి ఇయ్యా వలసిందని కోరాను. ఆయన నన్ను అట్లాంటి కోరిక కోరవద్దని చెప్పి వారి విడుదలను గురించి ఆశలు వదలు కొనవలసిందనీ తాను భారత దేశ విముక్తి కొరకు తుది పోరాటం సాగించ వలసిందని ప్రజలకు ఆదేశం ఇవ్వ దలచు కొన్నట్లు సూచన ప్రాయంగా తెలిపారు. ప్రాతఃకాలపు నడకలలో నేను కూడా అయన ననుసరించి పాల్గొనే వాణ్ని. అంతకు ముందెప్పుడూ ఆయన ముఖం అంత కాంతి వంతంగా ఉండటం నేను గమనించ లేదు. ఆయన మౌనం వహించడం, మాట్లాడుతూ ఆగడం అనేవిఏమీ లేకుండా అత్యంత తీవ్రమైన ధోరణిలో అవిరామంగా చెప్పుతూ ఉండటం నాకు అసాధారణ విషయాలుగా కన్పించాయి. ఈ పర్యాయము నేను సేవాగ్రామంలో పది రోజులు గడిపాను. ప్రముఖ కాంగ్రెసు నాయకు లందరూ ఆ సమయంలో సేవాగ్రాం వచ్చి మహాత్మా గాంధీతో సంప్రతింపులు జరిపి వెళ్లారు. ఆరోజుల్లోనే అక్కడ కాంగ్రెసు కార్యవర్గ (వర్కింగ్ కమిటీ) సమావేశం కూడా జరిగింది. ఆసందర్భంలోనే, వారికి హైదరాబాద్ సమస్యను మహాత్మాజీ సమగ్రంగా వివరించారు. నేను కూడా ఆసమస్యను గురించి మాట్లాడే టందుకు కొన్ని నిమిషాల వ్యవధి ఇచ్చారు. ఆ పని

పూర్తికాగానే నాకు హైదరాబాద్ తిరిగి వెళ్లేటందుకు అనుమతి ఇచ్చి, మరలా బొంబాయిలో జరుగ నున్న అఖిల భారత కాంగ్రెసు కమిటీ (ఎ. ఐ. సి. సి) సమావేశానికి రావలసిందని ఆదేశించారు.

ఆనాటి వరకు స్వదేశ సంస్థానలలో ఉన్న ప్రజలు నిరంకుశులు భూస్వామ్య తత్త్వం కలవారూ అయిన పరిపాలకుల నెదిరించి ఎవరి సంస్థానంలో వారే తమ తమ పోరాటాలు సాగిస్తున్నారు. ఆ పోరాటాలు వేర్వేరు సమయాల్లో కొనసాగినప్పటికీ ప్రజాస్వామ్య బాధ్యతాయుత పరిపాలనను సాధించుకొనడమే ఆయాసంస్థానాలలోని ప్రజలందరి లక్ష్యమూ. అయినప్పటికి వేర్వేరు పాయలుగా సాగిన వారందరి ఉద్యమాలనూ సంధానం చేసే ప్రయత్నం చాలాకాలంగా జరగలేదు. అఖిలభారత సంస్థానాల ప్రజల సభ గుంపులు గుంపులుగా ఉండేకాని జిగి బిగి వున్న ఒక సంస్థగాలేదు. అది ఆయా సంస్థానాలలోని ప్రజలందర్నీ ఆయా సమయాల్లో ఆకర్షించిన సమస్యపట్ల కృషి చెయ్యడమే లక్ష్యంగా పని చేసింది. కొన్ని సంస్థానాలలో స్వాతంత్ర్యోద్యమం చాలా బలంగా వుంది. మరికొన్నింటిలో చాలా సులువుగా అణగద్రొక్క బడింది. అఖిలభారత సంస్థానాల ప్రజల సభ దేశంలో నలుమూలల్నించీ వచ్చే కార్యకర్తల సమావేశ స్థలంగా మాత్రమే ఉపకరించింది. నిజం చెప్పాలంటే కొందరు కాంగ్రెసు నాయకులు సంస్థానాలలోని ప్రజల సమస్యలను గురించి శ్రద్ధ వహించి వారి నాయకులందరూ ఒక చోట సమావేశం అవాలని భావించారు. ముఖ్యంగా డాక్టర్ పట్టాభి సీతారామయ్య, మరి కొందరూ ఈ విషయాన్ని గురించి ఎక్కువ శ్రద్ధ వహించారు. అయినప్పటికీ ఆ సభకు నియమ నిబంధనలు గాని, దాని తరఫున పని చేసేటందుకై ఎన్నుకొనబడిన ప్రతినిధులు, కార్య వర్గం అనేవిగాని ఏమీ లేవు 1939లో ఆ సభ లూథియానాలో సమావేశమైంది. తిరిగి 1942 వరకు మరో సమావేశం జరిగిందని అనుకోను.

పరిస్థితులు ఎట్లాగున్నా స్వదేశ సంస్థానంలలో ఆ సంస్థాల ప్రజా మండలి అనే పేరుతోనూ, సంస్థాన ప్రజల సంఘం అనే పేరుతోనో

పనులు చేస్తున్న కార్యకర్తలందరిలోనూ ఒక విధమైన సౌహార్ద భావం కలిగింది. అఖిల భారత సంస్థాన ప్రజల సంఘానికి అధ్యక్షుడైన పండిత జవహర్లాల్ మార్గదర్శకత్వంలో ఆ సంస్థ శక్తివంతమైన సజీవ సంస్థగా ఆవిర్భవించ సాగింది. కొందరు సభ్యులతో ఏర్పడిన స్థాయి సంఘం, అప్పుడప్పుడు క్రమబద్ధంగా సమావేశం అవుతూ ఆయా సంస్థానాలలో కొనసాగుతున్న వుద్యమాలకు సలహాలు, సూచనలు ఇచ్చి నడిపించేది. కాని, దేశస్వాతంత్ర్యోద్యమం కాంగ్రెస్‌లో అందరి దృష్టిని ఆకట్టుకొన్నందువల్ల అప్పుడు సంస్థాన ప్రజల ఉద్యమాలకు సహజంగా తక్కువ ప్రాముఖ్యం మాత్రమే లభించింది. అయినప్పటికీ స్వదేశ సంస్థానాలు వేరు, బ్రిటిషు పరిపాలనలో వున్న భారతదేశం వేరు, అనే భావమూ పరిస్థితీ తొలగిపోవాలనీ దేశం అంతటికీ స్వాతంత్ర్యం సిద్ధించేందుకు పెద్ద యెత్తున ఒకే ఉద్యమం సాగాలనీ అందరి మనస్సుల్లోనూ వుంది. ఒకే దేశంలో వున్న ప్రజల నడుమ వారిని వేరుచేస్తున్న కృత్రిమ భిత్తికలు (గోడలు) కూలిపోవాలని అందరూ కోరారు. స్వదేశ సంస్థానాలలో వున్న ప్రజలను కూడా ఈ ఉద్యమంలోకి ఆహ్వానించాలని మహాత్మాజీ కాంక్షించారు. అందుచేత, అఖిలభారత స్వదేశ సంస్థానాల ప్రజల సభవారి స్థాయి సంఘ సమావేశం కూడా ఎ. ఐ. సి. సి. సమావేశంతోపాటు జరిపించాలని ఆయన నిర్ణయించారు.

హైదరాబాద్ స్టేట్ నేషనల్ కాన్ఫరెన్స్‌కు సంబంధించిన సర్వాధికారాలూ సంఘ నియమావళి ననుసరించి శ్రీనానాల్ చేతుల్లో వున్నాయి. అయినప్పటికీ ఆయన రాజకీయాల్లోంచి వైదొలగి దూరంగా వున్నారు. అందుచేత, కొంతమంది సహచరులతో కలిసి నేను బొంబాయిలో జరిగిన సమావేశంలోనూ, చర్చల్లోనూ పాల్గొన్నాను. ఎ. ఐ సి. సి. సమావేశం ప్రారంభించిన ముందు రోజుననే మహాత్మాజీ, పండిత జవహర్లాల్ నెహ్రూ యిరువురూ సమావేశంలో ముచ్చటించారు. మహాత్మాజి 'క్విట్ ఇండియా ఉద్యమం' యొక్క లక్ష్యాలనూ అందులో యిమిడివున్న కష్ట నిష్ఠూరాలనూ వివరించి భారతదేశంలోని స్వదేశ సంస్థానాల ప్రజలందరూ ఆ

ఉద్యమంలో ప్రాణాలని త్యాగాలు చేసి, తమకు ఎదురైన కష్టాలు సహించవలసిన ఆవశ్యకతను వివరించారు. అందువల్ల ఇంకమీదట దేశం అంతటా ఒకే ఒక నాయకత్వం క్రింద ఒకే ఒక స్వాతంత్ర్యోద్యమం కొనసాగాలి, అని ఆదేశించారు; ప్రకటించారు. ఆ ప్రకటన, మా హృదయాలు సంతోషంతో పులకరించి పొంగిపోయేటట్లు చేసింది. అప్పటివరకూ, మా లక్ష్యం సంస్థానాధిపతి ఆధ్వర్యంలో బాధ్యతాయుత పరిపాలనను సాధించుకొనడమే. కాని ఇప్పుడు అది భారత దేశస్వాతంత్ర్యమూ, స్వతంత్ర భారత దేశంలో స్వదేశ సంస్థానాలలో ప్రతిదీ విలీనం కావడం జరగాలి. అది మనం అందరమూ కలిసి సాధించుకోవాలి. మనమందరమూ స్వతంత్ర భారతదేశ పౌరులవటానికి బ్రిటిషు ప్రభువులకు, రాజులకు, మహారాజులకు, నవాబులకు, భక్తి విశ్వాసాలు ప్రకటిస్తూ తలలొగ్గి వుండే దాసులము కామనీ గొంతెత్తి ప్రకటించాలి. ఈ నాటివరకూ మన మీద అధికారాలు చెలాయిస్తూ బ్రిటిషువారి తొత్తులుగా, బానిసలుగా వ్యవహరిస్తూన్న పరిపాలకు లందరూ తాము ఇకమీదట బ్రిటిషు [illegible] కామనీ స్వతంత్ర భారత దేశంలో ఏర్పడే వ్యవస్థకు బద్ధులమనీ నిర్ద్వంద్వంగా ప్రకటించాలి. ఇదీ సర్వసాధారణంగా భారత భూఖండానికంతటికీ అనువర్తించే ముఖ్యమైన లక్షణము. దీని కనుగుణంగా మా ఉద్యమాలను మరునాటి ఎ. ఐ. సి. సి. సమావేశంలో తీర్మానం కానున్న జాతీయ ఉద్యమ విధానంతో సమన్వయం చేసుకొంటూ నడిపించి విజయం సాధించవలసిన అగత్యం ఏర్పడింది. మాలో ప్రతి ఒక్కరమూ మా ముందు ఆ మహానాయకులు ప్రవేశపెట్టిన ప్రతిపాదనకు ఆమోదాన్ని వెల్లడించాము. కొందరు, స్వదేశ సంస్థానాల ప్రజలను ఈ ఉద్యమంలోకి లాగకుండా వుంటే బాగుంటుందని సన్నసన్నగా గొణిగారు. కాని, ఆ సణుగుడు పిరికితనం, అలసత్వంవల్ల కలిగిందైనందువల్ల ఎవరికీ వినిపించనూ లేదు. ఈ సూచనల ననుసరించి, స్టే [illegible] చేటందుకు మా ఆమోదాన్ని వెల్లడించే తీర్మానమొకటి తయారుచేయవలసిందని ఒక కమిటీని యేర్పాటు చేయడం జరిగింది. ఆ కమిటీ

తయారుచేసిన తీర్మాన పాఠం పండిట్ నెహ్రూకి నచ్చలేదు అందుచేత ఆయనే స్వయంగా ఆ సిద్ధాంత పాఠం తయారుచేసి దాన్ని మహాత్మాజీ పరిశీలించి ఆమోదించేటందుకు యిచ్చారు మహాత్మాజీ ఆ తీర్మాన పాఠాన్ని సవరించవలసి వుందని చెప్పి తాను రాత్రి ఆ పనిచేసి మరునాటి సభలో దాన్ని ప్రవేశపెట్టేందుకు ఇస్తానన్నారు.

ఎ. ఐ. సి సి సమావేశం అనుకొన్నవేళకు ప్రారంభమైంది. క్విట్ ఇండియా తీర్మానం చేసి తన కార్యక్రమాన్ని ముగించింది. మహాత్మాజీకి అఖిలభారత స్వదేశ సంస్థానాలలోని ప్రజల స్థాయి సంఘ సమావేశంలో వారి ఆమోదం పొందేటందుకై మేము ప్రవేశపెట్టవలసిన తీర్మానానికి తుదిమెరుగులు పెట్టేటందుకు అవకాశం (కాలవ్యవధి) లభించ లేదు. ఎ ఐ. సి. సి సమావేశపు గడబిడలో మహాత్మాజీకీ, ఇతర నాయ కులకూ ఊపిరాడనంత పని పడింది మహాత్మాజీ మాలో ఒకరితో ఆ తీర్మాన పాఠం సిద్ధంగా వున్నట్లే అని చెప్పారు. కాని మాకు నాయకుల నందర్నీ అరెస్టు చెయ్యబోతున్నారనే వార్తలు రాసాగాయి. మాలో కొందరము రాత్రి బాగా గడచిన తర్వాత మహాత్మాజీ దగ్గరకు వెళ్ళి ఆయన తుదిమెరుగులు దిద్దిన తీర్మానపు పాఠం తీసుకోవాలనుకున్నాము. కాని, అది అవసరంలేదని అనుకొన్నాము. ఆ సమావేశంలో ప్రతి ఒక్కరూ మహాత్మాజీ చెప్పిన వివరాల ననుసరించి తమ తమ సంస్థా నాల్లో అమలు చెయ్యడానికి తగిన కార్యాచరణ విధానాలు రూపొందించు కోవలసి ఉంది మిగిలిన సంస్థానాల నుంచి వచ్చిన ప్రతినిధులందరూ ఆ పనిలో నిమగ్నులయారు హైదరాబాదు సంస్థానంలోని ప్రజోద్యమం యొక్క బలహీనత నాకు అప్పుడు బాగా వెల్లడిఅయింది నేను ఏదైనా ఒక నిర్దిష్టమైన పథకాన్ని రూపొందించాలని ఎంతో ప్రయత్నించాను. కాని, ఆపని గురించి నాతోపాటు అక్కడికి వచ్చిన వారిలో ఎవరూ శ్రద్ధాసక్తులు చూపించనందువల్ల అది సాధ్యంకాలేదు అయితే హైదరా బాదు సంస్థానం ఈ విప్లవోద్యమంలో పాల్గొనకుండా దూరంగా నిలబడి చూస్తూ ఉండటమే జరుగుతుందా ? అది ఏమైనా ఎవరైనా మెచ్చతగిన

పరిస్థితేనా? ఆ సంస్థానంలోని ప్రజలకు బలంలేదా? నేను స్వతంత్ర భారతదేశ పౌరుడిని అని భావించి సగర్వంగా చెప్పుకొనేవారెవ్వరూ ఆ సంస్థానంలో లేరా? అక్కడి ప్రజల ఉద్యమం అంత దుర్బలమైందా? అక్కడి ప్రజలలో అందరూ సంస్థానాధిపతికి 'జీహుకుమ్' అనే దాసానుదాసులా? అనే ప్రశ్నలన్నీ నా మనస్సులో ప్రవేశించి తుఫాను గాలిలా సుడులు తిరిగాయి చిట్టచివరకు, ఆగష్టు 8 మధ్యాహ్నం వేళ మహాత్మాజీకి "పరస్పర విరుద్ధంగా ఉన్న భావాల సంఘర్షణ మూలంగా హైదరాబాదు సంస్థానం ఐక్యకంఠంతో చర్యలు తీసుకొనలేక పోవచ్చు. మీరు కొందరు వ్యక్తులు తమశక్తి వంచన లేకుండా ఈ విప్లవోద్యమంలో పాల్గొని ఇతరులతో కలిసి నడిపెటందుకు అనుమతి ఇస్తారా" అని వ్రాశాను. మహాత్మాజీ చారిత్రాత్మకమైన తన ఎ. ఐ సి. సి. ఉపన్యాసంలో ఏ సంస్థానంలోనైనా ముగ్గురు మనుష్యులు, త్యాగశీలురైన స్వతంత్ర భావోద్దీపితులైన వారు ఉన్నా, వారు ఈ విప్లవోద్యమంలో చేరి పాల్గొన రండని ఆహ్వానిస్తున్నాను అంటూ ఏ సందేహాలకూ అవకాశం లేని విధంగా ఉద్ఘాటించారు.

ఏ నిమిషంలోనైనా నేను అరెస్టు కావచ్చుననే భావంతో నేను, ఉద్యమం యొక్క ఆశయము, దాన్ని నిర్వహించవలసిన విధానము వివరిస్తూ ఒక సంగ్రహ నివేదికను తయారుచేసి సంస్థానంలో ఉన్న 50 మంది పేరున్న కాంగ్రెసు వారికి పంపించి వారి అమోదము ఉపస్థలనను సరించి ఉద్యమం కొనసాగించండని తెలియజేసాను.

మరునాడు ఉదయమే ప్రభుత్వం కాంగ్రెసు వర్కింగ్ కమిటీ సభ్యులందర్నీ అరెస్టు చేసి అవిదిత గమ్యస్థానాలకు కొనిపోయింది. అనేకమంది ఇతర ప్రఖ్యాత కాంగ్రెసు నాయకులందర్నీ కూడా అరెస్టు చేసింది. త్వరలోనే మిగిలిన వారందర్నీ కూడా వారు, వారి రాష్ట్రాలు చేరి చేరగానే అరెస్టు చెయ్యడం జరుగుతుందనీ, స్వదేశ సంస్థానాలనుంచి వచ్చిన కార్యకర్తల విషయం కూడా అంతే అప్పుడనే వార్తలు వ్యాపించాయి. మాలో ప్రతి ఒక్కరికీ మిగిలిన వారిగతి ఏమైందో,

ఏమవుతుందో తెలియని స్థితి ఏర్పడింది. టెలిఫోను ద్వారా సంబంధాలు కలిగించు కొనేటందుకు వీలు కాలేదు. మాలో ఇంకా అరెస్టు కాకుండా ఉన్నవారు, మారు దారిని, సులభంగా గుర్తించేటందుకు వీలుకాని దుస్తుల్లో కోట ప్రాంతంలో ఒక నిర్దిష్ట స్థానంలో సమావేశం కావాలని కబురు వచ్చింది. ఆ సమావేశంలో స్థాయి సంఘం మళ్ళీ సమావేశమవడం సాధ్యం కానందువల్ల స్థాయి సంఘం ఆమోదించవలసి ఉన్న తీర్మానాన్ని ఆమోదించడం జరుగుతుందని తెలిసింది. శ్రీ బల్వంత్‌రాయ్ మెహతా అప్పుడు అఖిల భారత స్వదేశ సంస్థానాలలోని ప్రజల సదస్సు జనరల్ సెక్రటరీ ఆయన మాకోసం నిర్దిష్ట స్థానంలో కనిపెట్టుకొని ఉన్నాడు. ఒక డజను మంది సభ్యులు కూడారు. వివిధ ( తమ సంస్థానాల పరిపాలకులకు పంపించవలసిన లేఖ ముసాయిదాను తయారుచేసి, ఒక అరగంటలో మా కార్యక్రమం పూర్తి చేసుకొని ఎవరి దారిని వారు వెళ్ళిపోయాము. మాలో ప్రతివారూ తాము అరెస్టు కాక ముందే ఆ లేఖ కాపీలు పంపించడం జరగాలని నిశ్చయించాము

ఆ రాత్రే నేను ఎవరికీ కానరాకుండా ప్రయాణంచేసి, షోలాపూర్ చేరుకొని, ఒక చిన్న సందులో ఒక చిన్న గదిలో అరడజను మంది మిత్రులకు తప్ప మరెవరికీ తెలియని రీతిగా మకాముచేశాను శ్రీ ఆర్. ఎన్. దివాన్‌ను హైదరాబాద్‌లో ఉన్న సహచరులకు బొంబాయి సభలలో జరిగిన నిర్ణయాలు తెలియజేసేటందుకు ప్రత్యేక వార్తావహుడుగా పంపించాను. నిజాముకి పంపించవలసిన లేఖ కాపీకూడా వారికి, సమాచారం అవగాహన అయేటందుకు పంపించాను హైదరాబాదు సంస్థానంలో ప్రవేశించగానే నన్ను తప్పకుండా అరెస్టు చేస్తారని నమ్మినందువల్ల నా సహచరులు నిర్వహించవలసి ఉన్న విప్లవోద్యమ స్వభావం, కార్యక్రమం పూర్తిగా అవగాహన చేసుకొనాలనే కోరికతో ఆ జాగ్రత్తలు తీసుకొన్నాను ముగ్గురు నలుగురు ముఖ్యులైన హైదరాబాదు నాయకులకు షోలాపూరు వచ్చి నన్ను కలుసుకో వలసిందంటూ కూడా వ్రాశాను. కాని, వారెవ్వరూ నన్ను కలుసు కొనేటందుకు అక్కడికి

రానేలేదు. ఏమైనప్పటికీ నిజాముకి పంపించ వలసిన ఉత్తరం కాపీ వారికి చేరింది వారు దాన్ని నిజాముకిపంపించే విషయాన్ని గురించి చర్చించి పంపించడమో మానడమో నిర్ణయిస్తా మని తెలియ జేసినట్లు శ్రీ దివాన్ షోలాపూర్ తిరిగి వచ్చిన వెంటనే నాకు చెప్పారు ఎంత ఓంతగా వుంది వారి ప్రవర్తన' అప్పటికి శ్రీ నానాల్ వర్భాని నుండి షోలాపూర్ రావడం జరిగింది ఆయన, నిజాముకి పంప వలసి ఉన్న లేఖ చదివి, అది నిజాముకి పంప వలసిందేనని, విప్లవోద్యమం ప్రారంభించ వలసిందేనని చెప్పారు. తన ఆరోగ్యం సరిగా లేనందు వల్లా అది త్వరగా క్షీణిస్తున్నందు వల్లా తాను స్వయంగా ఉద్యమంలోకి దూక లేని స్థితిలో ఉన్నానని, మనసులో ఎంతో నొచ్చు కొంటూ వ్రాత పూర్వకంగా హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ ప్రెసిడెంటుగా తన కున్న అధికారాలన్నీ నాకు దత్తం చేసి వ్యవహారం నడిపించ మన్నారు. ఆ రీతిగా నేను సరంజామా అంతా సమకూర్చుకొని షోలాపూర్ వదలి మద్రాస్ మెయిల్‌లో ప్రయాణం చేస్తు హైదరాబాద్ వచ్చాను. నాతో పాటు ముగ్గురు మిత్రులు కూడా వచ్చున్నులుగా ప్రయాణం చేశారు. వారు ముగ్గిరి దగ్గరా విడి విడిగా ఒక్కొక్క కాపీ (నిజాముకు పంపించ వలసిన లేఖ, నేను సంతకాలు చేసిన కాపీలు) వుంది. మేము ముగ్గురమూ అరెస్టు కావలసిన వారమే అయినందున ప్రత్యేకంగా ఈ జాగ్రత్త తీసుకొనడం అవసరమని అనిపించింది. రైలు, గుల్బర్గా స్టేషన్ ప్లాట్‌ఫారమ్ మీదికి రాగానే ఒక చివరి నుంచి మరొక చివరి వరకూ సాయుధులైన పోలీసుపళంవారు బారులు తీరి ఉండటం చూశాను. కాని, వారు నన్ను అరెస్టు చెయ్య లేదు. నేను వాడీ స్టేషన్‌లో రైలు మారాను కాని, అక్కడ కూడా అరెస్టు కాలేదు. కాని, సాయంత్రం 5 గంటలకు నాంపల్లి స్టేషన్ చేరిన తర్వాత టాంగా మాట్లాడు కొంటున్నప్పుడు పోలీసు డిప్యూటి కమీషనరు నా దగ్గరకు వచ్చి నన్ను అరెస్టు చేస్తున్నట్లు తెలియ జేశాడు. నా ముగ్గురు మిత్రులూ నన్ను అరెస్టు చేసి తీసుకొని పోవడము కన్నులారా చూశారు నిజాముకి వ్రాసిన ఉత్తరం తప్పకుండా ఆయనకు

రవాణా అవుతుందన్ని నేను తృప్తి చెందాను. నేను సంతకం పెట్టిన ఉత్తరాల్లో ఒకటి, నేను నగరానికి రాగానే పంపించ వలసివుంది. ఆ పని చెయ్యడానికి నాకు వీలు కలుగ లేదు. ఆ ఉత్తరం కాపీ ఒకటి అంతకు ముందే డాక్టర్ మేల్కోటేకి ఇవ్వవలసినదని శ్రీ దివాన్ ద్వారా పంపించాను. నేను నగరానికి రాక ముందే అరెస్టు కావడం సంభవిస్తే డాక్టర్ మేల్కోటే ఆ ఉత్తరంలో తన సంతకం చేసి నిజామ్‌కి పంపించే టందుకు తన సంసిద్ధతను వెల్లడించారు.

నిజామ్ చిరునామాకు వ్రాసి పంపిన ఉత్తరం ఈ క్రింది విధంగా వుంది :—

కుల, మత విభేదాలతో సంబంధం లేకుండా సంస్థానంలోని ప్రజలను సేవించేటందుకు అంకితమైన జాతీయ సంస్థ అయిన హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ తరఫున ఘనతవహించిన ప్రభువరేణ్యులగు తమకు ఈ లేఖ వ్రాసే గౌరవం నాకు తటస్థించినది. ఇందుమూలముగా తమకు తెలియజేస్తున్న విషయములను సావధానముగా సానుభూతితో ఓర్పుతో పరిశీలించవలసినదని సవినయముగా మనవి చేసుకొంటున్నాను.

హైదరాబాదు సంస్థాన ప్రభుత్వము, సంస్థానంలో పౌరులకుండే హక్కుల నన్నింటినీ పూర్తిగా అణచివేసింది. అందుకు కారణాలేవో వారికే తెలుసు. కొంతకాలం క్రిందట స్టేట్ కాంగ్రెస్‌ను చట్ట వ్యతిరేక సంఘమని ప్రకటించి సహజ పౌర జీవనం సామరస్య విధానంలో అభివృద్ధి చెందకుండా ఆటంకములు కలిగించింది. స్టేట్ కాంగ్రెస్‌పై ప్రభుత్వం చేసిన ఆరోపణలను వారు అంగీకరించడంగాని, వాటిని ప్రభుత్వం రుజువు చెయ్యడంగాని జరగలేదు. నిషేధాజ్ఞలపట్ల స్టేట్ కాంగ్రెస్ తన అంగీకారాన్ని వెల్లడించి, దాన్ని అణగద్రొక్కేటందుకు ప్రయత్నాలు జరిగినప్పటికీ సజీవంగా వుంది. తన మనుగడకోసం అది ప్రయత్నాలు జరిపిన కాలంలో ఎందరో దాని నుంచి వైదొలగడం జరిగింది. అందుచేత, దానితో సంబంధం వదులుకొన్న వారెవ్వరికీ ఈ

నివేదనా పత్రంతోగాని, ముమ్ముందు స్టేట్ కాంగ్రెస్ నిర్వహించనున్న కార్యక్రమాలతోగాని ఎట్లాంటి సంబంధములూ లేవు

ఘనతవహించిన నిజాము ప్రభువరేణ్యుల ఆశ్రయంలో సంపూర్ణమైన ప్రజాస్వామ్య బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడాలనీ, సామాన్య పౌరహక్కులకు భంగం కలుగకూడదనీ స్టేట్ కాంగ్రెస్ తన కోరికలని స్పష్టంగా ఉద్ఘాటించింది. తాను ఎదుర్కొన్న క్లిష్ట కాలంలో కూడా ఆ కోరికలను ఎంతమాత్రమూ సడలించలేదు అంతేకాకుండా తన కార్యక్రమా లన్నింటిలోనూ ఆ ఆశయాలనే అగ్రశ్రేణిలో ప్రతిష్ఠించడం కూడా జరిగింది. అందువల్ల దాని లక్ష్యాలను ఇప్పుడు పునరుక్తం చేయవలసిన అగత్యం లేదు

భారతదేశంయొక్క భౌగోళిక, రాజకీయ ఐక్యత పరిరక్షింపబడవలెనని స్టేట్ కాంగ్రెస్ పట్టుదల వహించింది. అంతేకాకుండా అది, బ్రిటన్ తన సామ్రాజ్య ప్రయోజనాలకోసం సృష్టించి, ప్రోదిచేసిన రాజకీయ విభేదాలను అంటే స్వదేశ సంస్థానాలు బ్రిటిషు పరిపాలనలో ఉన్న రాష్ట్రాలు అనే భేదాలను పట్టించుకోనకుండా. భారతదేశం అంతటికీ ఒకేరకమైన రాజకీయ వ్యవస్థ వుండాలని విశ్వసిస్తున్నది ఈ విశ్వాసానికి తోడుగా, దానికి ఉపాంగంగా ఈ రెండు విభాగాలలోవున్న ప్రభుత్వాలూ స్వతంత్ర భారత ప్రజా సత్తాక దేశంలో ప్రభుత్వంపట్ల విధేయమైన - సమాఖ్యగా రూపొందాలని కోరుచున్నది.

ఈనాడు అంతర్జాతీయ పరిస్థితులలో ఏర్పడిన క్లిష్టసమస్య, భారతదేశ ఐక్యతనూ, స్వతంత్ర వ్యక్తిత్వాన్నీ పరిరక్షించడము దానిలో ఇమిడివున్న వెర్వేరు విభాగాల సంక్షేమానికీ, అభివృద్ధికి అత్యవసరమని రుజువు చేసింది జాతీయ వనరులను, సంపదను పూర్తిగా వెంటనే సమీకరించి, మనదేశానికి ఎదురైన భయంకర, ఘోర, ప్రమాదకర పరిస్థితులను యెదుర్కొని పోరాటం జరపడం తప్పనిసరి అయింది.

ఇప్పడున్న బాధ్యతారహిత, నిరంకుశ, మధ్యయుగం నాటి ప్రభుత్వం, రాబోయే విదేశీయ దండయాత్రను నెదుర్కొని ప్రజల

యిచ్చేదన, కుటుంబాలను రక్షించేటందుకు సామర్థ్యం కలదికాదు దేశంలో ఉన్న మనుష్యుల నందరికి ఉత్తేజం కలిగించి వస్తు పదార్థాల నన్నింటినీ సేకరించి ఉపయోగించే [illegible] యిప్పటి ప్రభుత్వము ప్రజాస్వామ్య ప్రజా ప్రతినిధి వర్గాల ప్రభుత్వానికి దారివదలి చోటు యియ్యాలి ఈ అన్ని అంశాలనూ, ప్రజాక్షేమాన్ని తీక్ష్ణంగా పరిశీలించి స్టేట్ కాంగ్రెస్ తన దృక్పథం దృఢమైనదనీ, విమర్శలకు నిలబడేదనీ విశ్వసించి ఈ కోరికలను తమరు అంగీకరించవలసిందనీ, వెంటనే అమలుచెయవలసిందనీ కోరుతున్నది

అవి -

1 ఘనత వహించిన నిజాము ప్రభువరేణ్యుల ఆశ్రయంలో ప్రజాస్వామ్య, బాధ్యతాయుత పరిపాలనా విధానాన్ని వెంటనే ప్రవేశపెట్టి హైదరాబాదు సంస్థానం స్వతంత్ర భారత యూనియన్‌లో ఒక యూనిట్‌గా చేరేటందుకు తమ సంసిద్ధతను నిర్ద్వంద్వంగా ప్రకటించాలి.

2 పౌరులకున్న సామాన్య హక్కులను (వాక్స్వాతంత్ర్యము) మత స్వేచ్ఛ, సమావేశ స్వేచ్ఛ, వెంటనే ప్రసాదిస్తూ స్టేట్ కాంగ్రెస్ పైన ఉన్న నిషేధాజ్ఞను వెంటనే ఉపసంహరించాలి.

3 నిర్బంధంలో ఉన్న రాజకీయ కార్యకర్తల నందరినీ వెంటనే విడుదల చెయ్యాలి

ఈ సమస్య లన్నింటికీ శాంతియుత పరిష్కారము లభించవలసి ఉన్నప్పటికీ హఠాత్తుగా, అకారణంగా కాంగ్రెస్ కార్యకర్తల నందరినీ ఇటీవల ప్రభుత్వం అరెస్టు చేసినందువల్ల ఆ సమస్యా పరిష్కారం మరింత చిక్కుల పాలవడం నిజంగా గొప్ప దురదృష్టము ఇప్పటికే క్లిష్టమైన పరిస్థితి, స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షులైన శ్రీ స్వామి రామానంద తీర్థను నిన్న రైలు స్టేషన్ ప్లాట్‌ఫారమ్ మీద ఆయన రైలు దిగి తమ సన్నిధికి స్టేట్ కాంగ్రెస్ కోరికలున్న ఈ వినతి పత్రాన్ని సమర్పించే ఉద్దేశంతో వస్తున్నప్పుడు 'అరెస్టుచెయ్యడం వల్ల మరింత క్లిష్టతరమైంది.

అయినప్పటికీ స్టేట్ కాంగ్రెస్ అత్యంత వినయ భావంతో వెల్లడించిన ఈ కోరికలను తమరు వెంటనే అమోదించి శాంతియుత పరిష్కారం సాధించ గలరని ఆశిస్తున్నాము.

మనదేశ చరిత్రలో ఈ నాడు సంభవించిన అత్యంత క్లిష్టమైన పరిస్థితిని ప్రభుత్వం వివేక, విజ్ఞానాలతో, క్రాంత దర్శిత్వంతో చర్యలు తీసుకొని చక్కదిద్ద గలదని స్టేట్ కాంగ్రెస్ హృదయ పూర్వకంగా విశ్వసిస్తున్నది."

ఈరీతిగా హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్,సంస్థాన రాజకీయ సమస్యా పరిష్కారానికి దారి చూపించింది. కాని ఉద్యమ నిర్వహణలో ప్రజలకు ముఖ్యంగా కార్యకర్తలకు, మార్గ దర్శకత్వం అవసరము. ఆ సమర్థతను వారికి కలిగించడానికి అవకాశం లేక పోయింది. అందుచేత కార్యకర్తలు ఎవరి ఊహాపోహల ననుసరించి వారే వార్తా పత్రికల ద్వారా తెలిసిన విషయాల నుంచి తమ పథకాలు రూపొందించుకొని ఉద్యమాన్ని కొనసాగించారు. క్విట్ ఇండియా ఉద్యమం యొక్క అంతరార్థాన్ని గురించి అపార్థం కలిగినట్లు మాకు తర్వాత వ్యక్తమైంది. అది ముఖ్యంగా స్వదేశ సంస్థానాలలోని ప్రజల లోనే కలిగింది. సంస్థానాలలోని ప్రగతి నిరోధక శక్తులు ఈ అవకాశాన్ని పూర్తిగా ఉపయోగించుకొని, తమకు అనుకూలంగా ఉద్యమ స్వరూపాన్ని వివరించి, వ్యాఖ్యానం చేసి, ప్రచారం చేసారు. క్విట్ ఇండియా ఉద్యమ లక్ష్యం భారత దేశానికి స్వాతంత్ర్య సాధన అయినప్పుడు మనం హైదరాబాద్ సంస్థానానికి స్వతంత్రం కావాలని ఎందుకు ఉద్యమం నిర్వహించ కూడదు? బ్రిటిషు సామ్రాజ్య ప్రతినిధిగా భారత ప్రభుత్వ సార్వభౌమత్వం ప్రతీకగా సంస్థానంలో తిష్ఠ వేసి, నిజామును అదుపులో ఉంచుతూ వున్న 'రెసిడెంట్ తొలగి పోవాలి.' అని మనం ఉద్యమం నడుపుదాము. అప్పుడు బ్రిటిషు ప్రభుత్వ పెత్తనమూ, భారత ప్రభుత్వ సార్వభౌమాధికారమూ రెండూ తొలగి పోయి, సంస్థానం స్వతంత్ర మవుతుంది అనే ధోరణిలో కొందరు ఆలోచించారు. కొంత మంది పేరు పొందిన కాంగ్రెసు వారు కూడా ఆ అభి

ప్రాయానికి స్వాగతం చెప్పినట్లు తెలిసింది. ఈ భావం 'అజాద్ హైదరాబాద్' అంటే 'హైదరాబాదు సంస్థానం సర్వ స్వతంత్ర రాజ్యంగా అవతరించాల'నే కోరికకు సామాన్య ప్రజలకు ఆకర్షణీయమైన రూప కల్పన. అట్లా కనక జరిగితే భారత దేశ పరిపూర్ణతకు, ఐక్యతకు స్వస్తివాక్యం పలికి తిలోదకాలు ఇచ్చినట్లే. సంస్థాన ప్రజలను అణచి వుంచిన మతావేశ ఫ్యూడల్ ప్రభుత్వపు సంకెళ్లు మరింత గట్టి పడేవి. భారత దేశం చిన్న, చిన్న స్వతంత్రా రాజ్యాలుగా ముక్కలు చెక్కలై పరస్పర విజిగీషరెచ్చగొట్టే యుద్ధాలతో, అశాంతితో సంక్షుభిత మవుతుంది. ఇదీ సామ్రాజ్యవాదుల కుతంత్రము. రాజకీయ చతురంగపు ఎత్తు. ఉద్యమాన్ని నిర్వీర్యం చెయ్యాలనీ, అణచి వెయ్యాలని తలచిన హైదరాబాదు ప్రభుత్వం ఆ ఉద్యమంలోకి వీలైనంత మంది వివిధ వర్గాల వారిని లాగడం ప్రారంభించింది. ఇత్తెహాదుల్ ముసల్మాన్ నాయకులకు తమ స్వప్రయోజనాల సాధనకు'క్విట్ ఇండియా'ఉద్యమం నుంచి ఒక మంచి నినాదం దొరికింది. 'క్విట్ ఇండియా వాలాలు' 'అజాన్ హైదరాబాద్' భావాన్నీ, సూత్రాన్ని అంగీకరిస్తే తాము క్విట్ ఇండియా ఉద్యమాన్ని సమర్థిస్తామని అన్నారు. వారిప్రతిపాదన, హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్, తరపున ఆగస్టు 18, 1942 నాడు డాక్టర్ జి. యస్. మేల్కోటే సంతకం చేసి, ఘనత వహించిన నిజాము ప్రభువుకు పంపిన లేఖలో వ్యక్తం చేసిన మౌలిక సూత్రాలకు పూర్తిగా వ్యతి రేకమైన విధానము. ఆ లేఖలో హైదరాబాదు సంస్థానం స్వతంత్ర భారతదేశ ప్రభుత్వానికి అనుబంధితమై, విధేయంగా ఉంటూ అంతర్భాగమై ప్రజాస్వామ్య పరిపాలనగల రాష్ట్రంగా రూపొందాలని స్పష్టంగా చెప్పడం జరిగింది.

కార్యకర్తలు దురభిప్రాయాలు ప్రచారం అవుతున్నాయని గుర్తించారు. ఉద్యమాన్నీ, ప్రజల్నీ తప్పుదారి పట్టించాలని జరుగుతున్న ప్రయత్నాలను అర్థంచేసుకొన్నారు. 'అజాద్ హైదరాబాదు' నినాదంలో ఇమిడి ఉన్న దుర్బుద్ధినీ ప్రమాదాన్నీ అర్థంచేసుకొన్నవారు ఉద్యమాన్ని వెంటనే సరియైన పంథాలో స్పష్టమైన దృష్టితో నడిపించారు. కొందరు

సత్యాగ్రహులలో కొన్ని జట్లకు చెందినవారు తమను నడిపించిన నాయకత్వంలో ఏర్పడిన లోపంవల్ల 'క్విట్ హైదరాబాదు'అనే నినాదాలు కూడా చేశారు. మొత్తంమీద హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు వాలంటీర్లలో 400 మందికి పైగా సత్యాగ్రహం చేసి జైళ్ళలో ప్రవేశించారు సంస్థానంలో యువతరం ఉద్యమ నాయకత్వాన్ని చేపట్టి, చెదరిపోయి ఉన్న బలాలను కూడగట్టుకొంటూ ముందుకు నడిచింది. కనీసం నూరుమంది సత్యాగ్రహులనైనా ఈ శాంతి సేనతో చేర్చవలసి [illegible] అంటూ నేను పండిట్ నరేంద్రజీతో చెప్పాను ఆయన అట్లాగె చేశారు. కొన్ని నెలల్లో మా బలం అంతా పూర్తిగా జైలుపాలైనందువల్ల భారతదేశంలోని ఇతర ప్రాంతాలలో జరిగినట్లే హైదరాబాదులోకూడా క్విట్ ఇండియా ఉద్యమ తరంగం శాంతించి చప్పబడింది

చంచల్‌గూడా జైలులో నాలుగు గోడలనడుమా నిర్బంధంలో ఉండి, హైదరాబాదు సంస్థాన ప్రజల స్వాతంత్ర్యోద్యమాన్ని, భారతజాతి స్వాతంత్ర్యోద్యమంతో చేతులు కలిపి నడిపించి, భారతదేశంలో మేమూ, మా సంస్థానమూ అంతర్భాగాలే అని నిరూపించిన యువతరం నాకు గర్వం కలిగించింది.

# 24. నాతో స్వాతంత్ర్యోద్యమంలో దూకిన కొందరు మిత్రులు

నన్ను అరెస్టు చేసిన తర్వాత ఒక గంటలో, హైదరాబాదు సెంట్రల్ జైలులో నా సహచరుల మధ్య వున్నాను. వారు, నేను హైదరాబాదు చేరక ముందే అరెస్టయ్యారు వారేమీ ఎక్కువ మంది లేరు వారిలో శ్రీ రామకృష్ణ దూత్, శ్రీ హరిశ్చంద్ర హెడా, శ్రీ మాణిక్ చంద్ పహాడే, మొదలైన వారున్నారు.

డాక్టర్ మేల్కోటే ఒక వారం తర్వాతనో, ఏమో వచ్చి మాతో కలిశారు. ఆయన క్రమశిక్షణతో మెలగిన యోధుడు. ఆయన అప్పుడు పట్నంలో వున్న ప్రతిఒక్క నాయకుడినీ

పంపించ మని ఇచ్చిన ఉత్తరం పంపించ వలసిందని కోరాడ ఎవరూ అంగీకరించ లేదు. అంతే కాకుండా వారు వాదించడం మొదలు పెట్టారు. అఖిల భారతస్వదేశ సంస్థానాల ప్రజా కాంగ్రెసు స్థాయి సంఘ సమావేశము జరగనే లేదు. అందు చేత ఈ జాబులోని విషయాలకు కాంగ్రెసు అధికార ముద్రవడ లేదు; అని అభ్యంతరాలు కూడా చెప్పారు. 'మహాత్మాజీ ఉద్యమానికి పిలుపు ఇవ్వక ముందే అరెస్టయి నందు వల్ల ఉద్యమ ప్రారంభం జరిగిందని ఎట్లా అనగలము ? అందు చేత అసలు ఉద్యమమే లేదు' అని, మరికొందరు అన్నారు. చాలా వింతైన ఆలోచనా ధోరణి ! ఇంకొక పెద్ద నాయకుడు ఆ జాబు మీద తాను సంతకం చేస్తే నిజాము తన తల తీసివేసే ప్రమాదం ఉందని, అన్నట్లు తెలిసింది. ఈ వాదోప వాదాలు, అవి చేసిన నాయకుడు దుర్బలుడనే వ్యక్తం

వేస్తాయి. కాని, డాక్టర్ మేల్కోటే గట్టి పిండం ఆయన మీరు మా అగ్రనాయకులనే భావంతో నేను మీ దగ్గరకు వచ్చాను. మీరు సంత కాలు పెట్టడానికి అంగీకరించలేకపోతే నేనే సంతకం చేసి పంపిస్తాను లెండి, అన్నాడట. ఆయన ఇట్లాగ అన్నా ఎవరూ ముందుకు రానందు వల్ల, చివరకు ఆయనే ఆ జాబు నిజాముకి పంపించాడు. వెంటనే అరె స్టయినాడు

డాక్టర్ జి. యస్ మేల్కోటే హైదరాబాదు సంస్థాన స్వాతంత్ర్యో ద్యమ నిర్మాతల్లో ఒకరు స్టేట్ కాంగ్రెసు తన ఉద్యమాన్ని ప్రారంభించ డానికి అనేక సంవత్సరాల ముందే భారత జాతీయ కాంగ్రెసు నడిపిన ఉప్పు సత్యాగ్రహోద్యమంలో పాల్గొని కర్నాటక దేశంలో లాఠీ దెబ్బలకు గురి అయినాడు. హైదరాబాద్ సంస్థాన రాజకీయ జీవిత సముద్రంలో ఉప్పెన లేవగానే ఆయన మరోసారి అందులోకి దూకి మొదటి నుండి చివరి వరకు చిత్త శుద్ధితో పాల్గొన్నారు. ఆయన ప్రఖ్యాత వైద్యుడు. ఆయనకు ప్రతి నెలా వేలకొద్దీ రూపాయలు రాబడిగా వచ్చేవి. అవన్నీ వదలుకొని, ఆయన స్వాతంత్ర్య యోధులలో చేరారు అందువల్ల సహ జంగా ఆయనే ఎంతో ఇరకాటంలో ఉండి ఎన్నో కష్టాలకు గురి అయి నారు. ఆయన అతి తక్కువ సొమ్ములో ఇమిడి కాలం గడిపిన రోజులు నాకు తెలుసు. ఆయన ఒక్కరే కాదు. ఆయన [illegible] లోని వారం దరూ కూడా హృదయ పూర్వకంగా కష్టాలను ఆహ్వానిస్తూ ఉద్యమంలో పాల్గొనడం, ప్రశంసనీయమైన విషయం అయిన ఇల్లు స్టేట్ కాంగ్రెసు కార్యక్రమాల తేనె పట్టు కొన్ని సమయాల్లో ఆ సంస్థ కేంద్రకార్యా లయము ఆయన ఇంట్లోనే ఉండేది పెద్ద, చిన్న కార్యకర్త లందరికీ కూడా ఆయన తనతో పాటే భోజన వసతి కల్పించి అతిథేయతృప్తి పొందే వారు - సహజంగా స్నేహశీలి, కార్యదీక్షాపరుడు, కరుణార్ద్ర స్వభావం కలవాడు, ఆధ్యాత్మిక చింతనా - పరుడు, అయిన డాక్టర్ మేల్కోటే నాకు ఈనాటి వరకూ కూడా అచంచల విశ్వాస పాత్రుడైన, నమ్మిన సహచరుడు. ఇంతకు ముందు గతకాలంలో ఆయన నాకు అనేక

సంవత్సరాల పాటు నా కార్యక్రమాలకు కేంద్రంగా తన ఇంటిని ఉపయోగించుకొనే చనువు ఇచ్చారని చెప్పేటందుకు గర్విస్తున్నాను స్వాతంత్ర్య పోరాటపు తుదిదశలో మేల్కొటే ఢిల్లీకి,ఇతర ప్రదేశాలకు చేసిన ప్రయోజన కరమైన యాత్రలు, పర్యటనలు స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో గర్వించదగిన ఘట్టాలు.

ఈ ఉద్యమ ప్రభావం సంస్థానంలో ఎంతో సంచలనం కలిగించింది. ఉద్యమంతో ఏ కొంచెం సంబంధం వుందని అనుమానం కలిగినా ప్రభుత్వం వారిని వెంటనే అరెస్టు చేసింది. కొన్ని ప్రదేశాల్లో ప్రజలే చొరవగా ముందుకు వచ్చి సత్యాగ్రహం చేసారు. ప్రతివారు తమకుతోచిన తీరుగా ప్రారంభించి స్వతంత్ర హిందూదేశ పౌరులమనే నమ్మకంతో సత్యాగ్రహోద్యమాన్ని నడిపారు. అట్లా సత్యాగ్రహం చేసి ఆ నాడు జైలుకు వచ్చిన వారు రెండు వందల మందో, అంత కంటె ఎక్కువ మందో కూడా వున్నారని నాకు జ్ఞాపకము. ఉద్యమంలో ఏది జరిగిందో అదంతా దానంతట అదే పైకి ఉబికింది. కేంద్ర నాయకత్వము, సూచనలు ఇవ్వడం అనేదేమీ లేనేలేదు బైట వున్న వారందరూ ఉద్యమానికి దూరంగా వున్నవారే. ప్రజలు తమ దారిని తాము నడిచారు దేశభక్తి భావాలున్న వారు ఆవేశంతో ఒక్కదూకు దూకారు. హైదరాబాదు కాంగ్రెసు కార్యకర్తలకు సంబంధించినంత వరకు సుమారుగా అందరూ ఎవరూ మిగిలి పోకుండా అరెస్టు అయినారు దాని ఫలితంగా ఉవ్వెత్తుగా లేచిన ఉద్యమం కొద్దికాలం గడవగానే పూర్తిగా ఆగిపోయింది

అప్పుడు తెలంగాణా ప్రాంతంలో యువకులు నాయకత్వం చేబట్టి ఉద్యమం లోకి వచ్చారు. ప్రజలందరూ 'సర్దార్' అనే పేరుతో గౌరవించే శ్రీ జమలాపురం కేశవరావు అట్లాంటి నాయకుడు వరంగల్, ఖమ్మం జిల్లాలలోనూ, ఇతర తెలంగాణా జిల్లాలలోనూ, ఉన్న యువకులెందరో ఆయన చుట్టూ చేరారు. శ్రీ రావి నారాయణ రెడ్డి కాంగ్రెసును వదలి కమ్యూనిష్టులతో చేరి పోగానే తెలంగాణా యువకులకు సాహసియైన నాయకుడి కొరత కలిగింది. వయోవంతులు ముందుకు వచ్చేటందుకు వెనుకా

చారు. 'సర్దార్' కేశవ రావు తెలంగాణా ప్రజలకు యథార్థమైన ప్రతినిధి. ఆయన డాబు దర్పాలు లేని వాడు, సూటిగా మాయా, మర్మం లేకుండా మాట్లాడే రకం. ఆయన తన మాటలతో ప్రజల మనస్సులు లోబరచుకొనే శక్తి గలవాడు. ఆయనతో కలిసి పని చెయ్యడం ఎంతో సంతోషకరంగా వుండేది. రాజకీయ సంప్రదాయ ధోరణులు, సిద్ధాంతాలు గురించిన విజ్ఞానంలో ఆయనకు పాండిత్యం లేక పోయినా తెలంగాణాలో శ్రమశక్తి దోపిడీకి గురయైన పేద జనుల విముక్తికోసం ఆయన పోరాటం నడిపాడు. ఆయన నాటి నుంచి చివరి వరకూ స్వాతంత్ర్యోద్యమంలో అగ్రగామిగానే ఉన్నాడు మాస్వాములు, పెట్టుబడి దారీ వర్గాల వారు కలిసి ఆయన్ని ఎదిరించారనడంలో ఏమీ ఆశ్చర్యం లేదు. ఆయన తన చుట్టూ అనేక మంది యువకుల్ని కూడగట్టుకొని 1947లో ఉద్యమానికి నాయకత్వం వహించి దాన్ని సమర్ధ వంతగా నడిపాడు.

కర్నాటక ప్రాంతం ఆ రోజుల్లో ఎంత మాత్రమూ సమీకృతం కాలేదు. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు ఆఫీసులో కార్యదర్శిగా వున్న శ్రీ జె. కె. ప్రాణేశాచార్య అనే యువకుడు, వ్యక్తి సత్యాగ్రహపు రోజుల్లో ఉద్యమంలో పాల్గొని 16 నెలలకు పైగా జైలు శిక్ష అనుభవించాడు. ఆయన కర్నాటక ప్రాంతం నుంచి వచ్చిన కార్యకర్త. అయినప్పటికీ, చాలా కాలం పాటు కర్నాటక ప్రాంతం తన సంగతి కాదన్నట్లుగా ఉద్యమానికి ఎడం గానే వుందనాలి. కాని, వందేమాతరం ఉద్యమాన్ని మాత్రం అందులో పాల్గొని నాయకత్వం వహించిన శ్రీ జగన్నాథ రావు చండర్కి నడిపించాడు ఆయన మంచి సాహసి; సునిశితమైన ప్రజ్ఞా వంతుడు; మంచివక్త. బహుభాషా వేత్త. రాష్ట్రంలోని మూడు భాషలలోనూ గంగా ప్రవాహ ధోరణిలో ప్రసంగించే వాడు. స్వాతంత్ర్యోద్యమంలో జైలుబాధలను సహించడంలో ఆయనను మించిన వారు ఎవ్వరూ లేరు. కర్నాటక ప్రాంతంలో చైతన్య వంతులైన యువకులు ఆయనను అనుసరించి పని చేశారు. ఆయన కర్నాటక ప్రాంతం లోని ప్రజాసామాన్యాన్ని చైతన్య వంతుల్ని చెయ్యడంలో తన బాధ్యతను నిర్వహిస్తూ 1947లో జరిగిన తుదిదశ పోరాటంలో పాల్గొన్నారు

ఉద్యమం చప్పబడిన తర్వాత హైదరాబాద్ సంస్థాన రాజకీయ జీవితంలో చాలా కాలం పాటు నిశ్చలత, నిస్తబ్దత కొన సాగాయి. దేశం నలుమూలలా స్వాతంత్ర్యోద్యమ స్వభావాన్ని గురించి వాదోప వాదాలు ప్రవాహ గతిలో సాగి సుడిగుండాలు ఏర్పడేట్లు చేశాయి అనేక మంది కాంగ్రెసు, కాంగ్రెసు సోష[illegible] చెంది[illegible] లోకి పోయి అహింసాయుత మైన పని అనేటందుకు అవకాశం లేని కార్య క్రమాలు కొన సాగించారు. పరిపాలనా యంత్రాంగాన్ని స్తంభింప చేయ్యాలనే ప్రయత్నాలు జరిగాయి ప్రజాసామాన్యంలో కొంత చైతన్య వంతులైన వారు తమ్ము శూన్యం ఆవరించి నట్లు భావింప సాగారు స్పష్టంగా, ఉద్యమ పరిస్థితి ఇది, అని చెప్పగలిగిన వారెవ్వరూ లేరు. చివరికి ఉద్యమం పూర్తిగా చల్ల బడి పోయింది అనిశ్చిత, అస్పష్టత ఆ కాలంలోని పరిస్థితుల లక్షణ మైంది హైదరాబాదు విషయం కూడా అట్లాగే వుంది. కాని, మరాట్వాడాలో కొంతమార్పు కనిపించింది వ్యక్తి సత్యాగ్రహం రోజుల నాటి నుంచీ జైళ్లలో మగ్గి వున్న వారు విడుదల కావడము, వారు మరి కొందర్ని సమీకరించడమూ సంభవించాయి. హైదరాబాదులో అధికార పూర్వక మైన ఉద్యమం ఏదీ లెదనీ, ఏమో కొందరు వ్యక్తులు మాత్రమే సత్యాగ్రహం చేసి జైలుకు వెళ్లినట్లూ వారికి నచ్చజెప్పే ప్రయత్నాలు జరిగాయి కాని, శ్రీ షరాఫ్ తోటీ ఇతరులతోటీ, జైలులో వున్న వారిలో కొందరము యథార్థ పరిస్థితిని గురించి చెప్పాము. వారు అది విని ఉద్యమాన్ని పూర్తిగా సమర్ధించారు కాని, భారత దేశం అంతటా ఉద్యమం చప్పబడి పోయినందు వల్ల వారు అరెస్టు కావాలని ప్రయత్నించనూ లేదు ప్రభుత్వం వారిని అరెస్టు చెయ్యనూ లేదు. వారు మిత్రులతో సంప్రతింపులు జరిపి, గత సమాచారాన్ని తెలుసు కొంటూ మిత్రుల్ని కలిసి వారిసలహాలు గ్రహించారు. వారు మహారాష్ట్ర పరిషత్‌ను పునరుద్ధరించి 1943లో ఔరంగా బాదులో శ్రీ ఎస్. వి నాయక్ అధ్యక్షతన ఒక మహాసభ నిర్వహించారు

జైళ్లకు వెళ్లిన సత్యాగ్రహులను క్రమక్రమంగా విడుదల చేద్దామని ప్రభుత్వం నిశ్చయించింది. తొమ్మిది నెలల తర్వాత కొందరు డిటెన్యూలను విడుదల చేశారు. మరోకొన్ని నెలలు గడచిన తర్వాత రెండో జట్టును విడుదల చేసారు. మాలో ఐదుగురం జైలు శిక్ష అనుభవిస్తూ 16 నెలల పాటు గడిపాం. ఆ తర్వాత మమ్మల్ని కూడా వదలి వేయడం జరిగింది విడుదల చేసిన వారందరినీ బేషరతుగానే విడుదల చేశారు. మా ఉద్యమం అఖిలభారత ఉద్యమంలో ముడిపడి వుండటం చేత, దాన్ని గురించి అప్పుడు మేమేమి చెయ్యడాని కేదారి కనిపించ లేదు. మహాత్మాజీని వర్కింగ్ కమిటీ మెంబర్లను విడుదల చేసే వరకు,ఏమీ చెయ్యకుండా వేచి వుండాలనీ ఏమీ ముందడుగు వేయకుండా ఆగి చూడాలనీ మేము అనుకొన్నాము.

# 25. ప్రాంతీయ భాషాపరిషత్ సభల అభివృద్ధి

నేను విడుదల అయిన తర్వాత సుమారు రెండు వారాల తర్వాత నా సహచరుల అభిప్రాయాలు తెలుసు కొనడం అవసరం అనిపించి ఒక సమావేశం ఏర్పాటు చేసి వారితో ఆ నాటి రాజకీయ పరిస్థితులను గురించి చర్చించాను. వారిలో చాలా మంది తమ ప్రాంతీయ స్థాయిద్వారా ప్రజల్ని సమీకరించి పనులు చేస్తూ స్టేట్ కాంగ్రెసు లక్ష్యాల సాధన కోసమే కృషి చేస్తున్నారు అందు చేత స్టేట్ కాంగ్రెసు మీద ఉన్న నిషేధాజ్ఞ ఉపసంహరణకు (రద్దుచేయించే) ప్రయత్నాలు చెయ్యడం ఈ పరిస్థితుల్లో అవసరమా? అని వాదు వాదించే వారు వివిధ ప్రాంతాల్లో రాజకీయసదస్సులు నిర్వహించి,బలం పెంచుకొని ఆ బలం అంతటినీ ఒకచోటచేర్చి దాన్నే తరవాత రాష్ట్రస్థాయి సంస్థగా ఎందుచేత రూపొందించుకో కూడదు? స్టేట్ కాంగ్రెసుసంస్థ అంటూ ఒక సంస్థ ఎందుకు ఉండాలి దాన్నిఎందు చేత కొనసాగించాలో వివరించేటందుకు కూడా అంత బలమైన కారణాలు ఉన్నాయి. ఏ రాష్ట్రీయ సదస్సులోనూ బాధ్యతాయుత ప్రభుత్వ ప్రసక్తే రాదేమి అందు చేత అవి అన్నీ ఉమ్మడిగా కూడా స్టేట్ కాంగ్రెసుకు తగిన ప్రత్యామ్నాయ సంస్థ అని ఎట్లాభావించ గలము? బాధ్యతాయుత ప్రభుత్వం కోశం జరిగే పోరాటం ఏదో ఒక రూపంలోనో మరో రూపంలోనో కొనసాగుతూనే ఉండాలి మొత్తం మీద ఆ సమస్య సులువు ఒరుపులన్నీ వివరంగా సమగ్రంగా చర్చచేశాము. చివరకు రాష్ట్రస్థాయి సదస్సులద్వారా కృషిచేస్తున్న వారందరూ అట్లాగే తమపనులు కొనసాగించ డానికీ నేనూ మరికొందరూ వాటికి దూరంగా వుంటూ పూర్వంమాదిరి

గానే మా కార్యక్రమాలు నిర్వహించడానికి తీర్మాన మైంది అందు వల్ల హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు ఒక వ్యవస్థ రూపంగా అవతరించ లేదని వేరే స్పష్టంగా చెప్పనక్కర లేదు అది ఒక ఆదర్శానికి చిహ్నంగా మాత్రమే కొందరు కార్యకర్తలతో తన మనుగడ సాగించింది.

అప్పటినుంచీ కొంతకాలంపాటు ప్రాంతీయస్థాయి సదస్సులు కార్యక్రమాలకు కేంద్రాలైనాయి అవి వేలాది సంఖ్యలలో చేరిన సభ్యులతో వందలాది శాఖలతో తమ తమ మండలాల్లో వృద్ధిచెంది ప్రజా సంస్థలు అయినాయి వాటిలో ఉన్న కార్యకర్తలు, యువకులు, తెలివైన వారు పట్టుదలతో పనిచేసే ఉత్సాహం కలవారు అయినందున సంస్థకు క్రిందిస్థాయినుంచీ బలం కలిగింది తమ కాలాన్ని పూర్తిగా సంస్థ కోసమే త్యాగంచేసిన కార్యకర్తలు వందలకొద్దీ లభించారు. స్వాతంత్ర్యోద్యమం కొనసాగుతూనేవుంది. రాష్ట్రస్థాయి సదస్సును రూపొందించిన వారందరూ కాంగ్రెసువారే వారందరూ కూడా హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌మీది నిషేధాజ్ఞ తొలగించవలసిందంటూ ప్రభుత్వాన్ని కోరడం జరిగింది కాని వారు సాంవత్సరిక సమావేశంలో మాత్రమే ఆ ధోరణిలో తీర్మానాలు చేసారు. కాలం పరిపక్వం కాగానే ఘనతవహించిన నిజాము ఆధిపత్యంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని సాధించడమే తమ లక్ష్యము, ఆశయము అని ఉద్ఘాటించారు మొదట మహారాష్ట్ర పరిషత్ ఈ తీరుగామార్పు చెందింది మిగిలిన రెండు భాషా సదస్సులూ ఆంధ్రమహాసభ కర్నాటక పరిషత్‌ల ననుసరించాయి ఒక వంక నిషేధాజ్ఞ అమలులో ఉన్నా స్టేట్ కాంగ్రెసు మరో పేరుతో అవతరించి ప్రజలను అందరినీ కూడగట్టి బాధ్యతాయుత ప్రభుత్వ సాధన కోసం కృషిచేస్తున్న మూడు సంస్థల కూడలి విజృంభిస్తోంది. ఈ పరిస్థితి గమనించి ప్రభుత్వం సహజంగా, ఏమిచెయ్యాలో తోచని అయోమయ స్థితిలో పడింది ఏ కార్యక్రమం నిర్వహించకుండా స్టేట్ కాంగ్రెసుని నిషేధించడం జరిగిందో దాన్నే ఈ ప్రాంతీయ మండల సదస్సులు ఉధృతంగా సాగించడం మొదలు

పెట్టాయి. ఈ సంస్థలను కూడా నిషేధించడం జరుగుతుందనే వార్తలు ఒకానొక సందర్భంలో ఎక్కువగా వ్యాపించాయి. ఆ తర్వాత అనేక సంఘటనలు జరిగాయి. ఆ వార్తాగతి మూసీనది వరదలో కొట్టుకొని పోయిన చెత్త కాగితం వంటిదైంది. సంస్థానంలో ఒక వంక రాజకీయ చైతన్యం పెంపొందడము, మరోవంక దేశంలో స్వాతంత్ర్యోద్యమపు స్థాయి నానాటికీ విజృంభిస్తూ ఉండటమూ గమనించి ప్రభుత్వం కొంత వేచి ఉండి పరిశీలిస్తూ చూద్దామన్న ధోరణిలో పడినట్లు కన్పించింది. ఉద్యమం మరికొంత ముందుకు సాగిన తర్వాత అప్పటివరకూ విడివిడిగా పనిచేస్తున్న మూడు ప్రాంతీయ సంస్థలూ తమ కార్యక్రమాల్ని సమన్వయం చేసేటందుకు తమ తమ ప్రతినిధులతో కూడి స్వతంత్రంగా వ్యవహరించే కమిటీ నొకదాన్ని ఏర్పాటు చేశారు. హైదరాబాదు స్టేట్ కాంగ్రెసుపైనున్న నిషేధాజ్ఞ రద్దు అయ్యేటట్లు చూడటమే వారందర్నీ ముడివేసిన లింకువంటిదైంది.

హైదరాబాదు స్టేట్ కాంగ్రెసును సజీవంగా ఉంచేటందుకు మేము మరో నూతన పంథా ఆలోచన చేశాము. మహాత్మాగాంధీ సలహా గ్రహించనిదే మేము ఆ సంస్థపైనున్న నిషేధాజ్ఞను ధిక్కరించలేము. అంతేకాదు. ఇప్పటి పోరాటము 'క్విట్ ఇండియా' (భారతదేశం వదలి పొండి అనే) నినాదాన్ని అనుసరించి దానిలోని భాగంగా (అంశంగా) జరుగుతోంది. అందుచేత దాన్ని రాష్ట్రస్థాయిలో పునరుద్ధరించడం అనేది కూడా సాధ్యంకాదు. ఇట్లా సుదీర్ఘంగా తీవ్రంగా ఆలోచనలు చేసిన తర్వాత హైదరాబాదు స్టేట్ కాంగ్రెసుకు సంబంధించినంతవరకు దాని స్థితి 1941 లో ఎట్లా ఉందో, ఎక్కడుందో అట్లాగే అక్కడే ఉంది. మేము దాని జెండా నీడనే వ్యక్తి సత్యాగ్రహంచేసి, శిక్షపొంది విడుదల అయిన తర్వాత అది రంగమీద నిలబడి ఉన్నదనే చిహ్నాలు స్పష్టంగా ఉన్నట్లేకదా. అయితే దాన్ని ఎట్లా ధాటీగా వ్యక్తీకరించడం? ప్రాంతీయ సంస్థతోటీ ముడిపడకుండా ఉండిపోవడం ఒక పద్ధతి. అయితే ఆ ఒక్క-

పనీ సరిపోతుందా ? అందుచేత అన్ని ప్రజా సమావేశాల్లోనూ అవకాశం దొరకగానే స్టేట్ కాంగ్రెస్ సందేశాన్ని లక్ష్యాన్ని ఆశయాలనూ వివరించాలని నిశ్చయించాను మా ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలోనూ మా ఆశయం బాధ్యతాయుత ప్రభుత్వ సాధన అనీ ప్రజలు స్టేట్ కాంగ్రెసుపై ఉన్న నిషేధాజ్ఞ రద్దు చేయవలసిందని ప్రభుత్వంపై ఒత్తిడి తేవాలనీ, శీర్షికలున్న లెటర్ హెడ్ ఉన్న కాగితాలనే వాడేవాళ్ళము. ఇది మా కార్యక్రమములో మూడో అంశము. హైదరాబాదుకు ప్రత్యేకత ఏమిలేదని ఆదికూడ భారతదేశంలో ఒక భాగమేననీ మేము స్వతంత్రభారత దేశాన్ని ముక్కలు చేయడం జరగకూడదనీ ప్రచారం చేసే వాళ్ళము. ఒక దశలో సాహసించి మేము బాధ్యతాయుత ప్రభుత్వ స్వరూపము అంటూ నేను రాసిన ఒక చిన్న వివరణాత్మక పుస్తకాన్ని ప్రకటించడం కూడా జరిగింది అందులో నిజాము సార్వభౌమత్వాధికారాన్ని తూర్పారబట్టడము, ప్రజాస్వామిక సిద్ధాంతంలోఉన్న న్యాయాన్ని ఔచిత్యాన్ని సమర్థించడం జరిగింది ప్రభుత్వం ఆ ప్రకటనను నిషేధించవచ్చుననీ నన్నూ, ఆ పుస్తకాలు చేతబట్టిన వారినికూడా అరెస్టు చేయవచ్చుననీ అనుకున్నాము కాని, అట్లాంటిదేమీ జరగలేదు. ప్రజలు గుంపులు గుంపులుగా చేరడం బాధ్యతాయుత ప్రభుత్వాన్ని గురించి, చర్చించి, ముచ్చటించుకోవడం పరిపాటి అయింది ప్రాంతీయ స్థాయి సదస్సులు ఈ భావాలన్నీ విరివిగా ప్రచారమయేటందుకు మంచి అవకాశాలు కలిగించాయి ఈ విధంగా స్టేట్ కాంగ్రెస్ కార్యక్రమం తనదంటూ ఏదీ స్థిరమైన స్వరూపంతో నిమిత్తం లేకుండానే, అవిరామంగా, కొనసాగింది. దానికి అస్థిత్వాన్ని, రూపాన్నీ జవసత్త్వలున్న శరీరాన్నీ కల్పించిన సంఘటనలు క్రమంగా పుంజుకొనడం ప్రారంభమైనాయి.

# 26. హైదరాబాదు, కాశ్మీరు

అఖిల భారత సంస్థాన ప్రజల సదస్సు స్వదేశ సంస్థానా లన్నింటిలోనూ ప్రగతిశీల వాదులందర్నీ ఒకే లక్ష్యంతో కృషి చేసే టందుకు ఒక చోటికి చేర్చి అత్యంత శక్తివంతమైన సంస్థగా రూపొందింది. 'క్విట్ ఇండియా' ఉద్యమ ఫలితంగా అది అన్ని వ్యవహారాలకూ భారత జాతీయ కాంగ్రెసులో ఒక విభాగంగా పరిగణన కెక్కినప్పటికీ సంస్థాగతంగా తన వ్యక్తిత్వాన్ని తాను అట్టే పెట్టుకుంది కాంగ్రెసు వర్కింగ్ కమిటీ మెంబర్లు జైలునుంచి విడుదల కాగనే, అఖిల భారత సంస్థాన ప్రజల సదస్సు స్థాయి సంఘ సమావేశం ఏర్పాటు కావాలని తీర్మానించారు. కాశ్మీర ప్రజల నాయకుడూ, అనేక స్వాతంత్ర్య పోరాటాలు నిర్వహించిన అనుభవజ్ఞుడూ అయిన షేక్ అబ్దుల్లా శ్రీనగర్‌లో ఆ సమావేశాన్ని జరుపవలసిందని ఆహ్వానించారు ఆ ఆహ్వానాన్ని అంగీకరించి 1944 ఆగస్టులో మేమందరమూ శ్రీ మొహమ్మద్ అఫ్జల్ బేగ్ గృహంలో పండిట్ నెహ్రూ అధ్యక్షతను సమావేశం అయాము. ఆ సమావేశానికి, నేను ప్రత్యేక ఆహ్వానితుడుగా వెళ్ళి, అందులో పాల్గొన్నాను

షేక్ అబ్దుల్లా అత్యంత శక్తిసామర్థ్యాలున్న నాయకుడు. ఆయన ఉన్నత దేహయష్టి భయాశ్చ ఆయన కాశ్మీర కేసరి (సింహము) ఆయన ఎక్కడికి (వెళ్ళినా) అడుగుపెట్టినా వేలాది మంది అభివాదన పురస్సరంగా పట్టాభిషేకం తమ ఆదరాభిమానాలు వెల్లడిస్తారు. ఆయన తన మనస్సులో ఉన్న మాట సూటిగా చెప్పేవాడు. ఆయన జమ్మూ, కాశ్మీర్ సంస్థాన ప్రజల్ని జాతీయ సదస్సు బావుటా

క్రింద సమీకరించాడు. ఆయన తన కార్యక్రమాలు మతప్రాతిపదికతో ప్రారంభించినా సమస్య యధార్థ స్వరూపాన్ని గుర్తించి జాతీయవాదిగా రూపొందాడు కాశ్మీరు, హైదరాబాదు సంస్థానాల పరిస్థితులలో పోలిక లున్నాయి అక్కడ కాశ్మీరులో హిందూ మహారాజు నిరంకుశంగా పరిపాలిస్తున్నాడు ప్రజాసామాన్యంలో ఎక్కువమంది ముస్లిములు. ఇక్కడ హైదరాబాదులో పరిపాలకుడు ముస్లిము పరిపాలితులలో ఎక్కువమంది హిందువులు అయినప్పటికీ ముస్లిములే అనేక సదుపాయాలు అనుభవిస్తున్నారు. అందుచేత హైదరాబాదులో స్వాతంత్ర్యోద్యమం ప్రారంభమైనప్పుడు అది షేక్ అబ్దుల్లా, ఆయన సహరుల సానుభూతికి పాత్రమైంది. ఆయన 1940 లో ఒక వారం రోజులు హైదరాబాదులో పర్యటించి మాకు నూతనోత్సాహం కలిగించారు ఆయన కాశ్మీరు రావలసిందని నాకు వ్రాయడంకూడా జరిగింది.

ఆ సంవత్సరంలో సోపూర్ (Sopore) లో జరిగిన కాశ్మీర్ జాతీయ సదస్సుకు హాజరయే అవకాశంకూడా నాకు కలిగింది. వేలాది పేద రైతులు కాలినడకన అక్కడకు వచ్చి ఆ సదస్సులో పాల్గొన్నారు. రెండు మూడు అంశాలు నా దృష్టిని ఆకర్షించాయి ఆ జాతీయ సదస్సు కార్యకర్తల క్రమశిక్షణ మిలిటరీ క్రమశిక్షణవలె పకడ్బందీ అయినది. షేక్ అబ్దుల్లా మాట తిరుగులేని ఆజ్ఞ. జాతీయ సదస్సు సేవాదళ్ సభ్యుల (వాలంటీర్ల) లో తుపాకీ, పిస్తోలు ఉపయోగించడంలో శిక్షణ పొందిన వారు అనేకులున్నారు పతాకాభివందనాన్ని తుపాకి కాల్పులతో సూచించారు అది నాకు కొంత వింతగా కనపడింది. షేక్ అబ్దుల్లాకు, ఆయన సహచరులకు అహింసా సిద్ధాంతంపట్ల ఏమీ అంత విశ్వాసం ఉన్నట్లు కనిపించలేదు అక్కడి రాజకీయ భావ వాతావరణంలో రష్యాతో కొంత అనుబంధం ఉన్నట్లు కన్పించి, అది నాలో ఆసక్తిని రేకెత్తించిన విషయమైంది ఇవీ ఆనాటి నా భావాలు

ఇటీవల నిర్బంధం నుంచి విడుదల పొందిన పిమ్మట, షేక్ అబ్దుల్లా చేస్తున్న ప్రసంగాలు జమ్ము - కాశ్మీర్ సంస్థానం భారత

దేశంలో పూర్తిగా విలీనం కావడం చూస్తామని ఆశించిన వారికి మనస్తాప కరంగా ఉన్నాయి మున్ముందు ఏమి జరుగుతుందో పరిస్థితులు ఎట్లా మారతాయో ఊహించడం ఎవరికీ సాధ్యం కాకుండా ఉంది సోవియట్ నాయకులతో అబ్దుల్లాకు సన్నిహిత సంబంధాలేమైనా ఉన్నాయేమో నేను చెప్పలేను కాని, సోవియట్ రష్యా, కాశ్మీర్‌ల భౌగోళిక సాన్నిహిత్యము, ప్రజల సాన్నిహిత్యము ఒకదానికొకటి కొంత తోడై అభివృద్ధి చెంది సోవియట్ భావాలు జాతీయ సదస్సులోకి చొచ్చుకొని పోయాయనే అభిప్రాయం నాలో కలిగింది. ఆ రెండు దేశాల నడుమ ఏదైనా ప్రత్యక్ష సంబంధం ఉందేమో అని ఊహించడం నాకుమించిన పని కాశ్మీర్ జాతీయ సదస్సు కార్యకర్తలు హైదరాబాదు స్వాతంత్ర్య పోరాటంపట్ల ఆసక్తి వెల్లడించారు ఈ రెండు సంస్థానాలలోనూ కూడా ప్రజావిముక్తి ఉద్యమాలు ఒక తరహాలో అభివృద్ధి చెందాలనే భావం సూచించారు తరచుగా వారు హైదరాబాదు పోరాటం మా పోరాటమే అని మనతో తమ తాదాత్మ్యాన్ని గుర్తించి “జంకవద్దు పోరాటంలో వెనక్కి తగ్గకండి అట్లా కనక జరిగితే మేము కూడా బాధలకు గురి అవుతాము” అని ఉషారిచ్చారు. నాకు జాగ్రత్తలెన్నో చెప్పారు అందుచేత హైదరాబాదు ప్రజల విముక్తి తమవిముక్తే అని భావించి ఆ రో                పుకొనడం నాకు ఏమీ వింతగా కన్పించలేదు నేను కూడా కాశ్మీర కార్యకర్తలతో పరస్పర సంబంధాలు పెంచుకున్నాను, మేము ఎప్పుడు కలిసినా సోదరులము, కామ్రేడ్‌లము అనేభావమే నాకు కలుగుతుండేది హైదరాబాదు పోరాటం పూర్తి అయింది కాని, కాశ్మీర్ కేసరి దృక్పథంలో మార్పు రావడం, ఆయనను జాతి వ్యతిరేక కార్యక్రమాలు తలపెట్టినందుకు జైలు నిర్బంధంలో వుంచవలసి రావడము, విధివైపరీత్యాలు

భారతదేశ స్వాతంత్ర్యం కోసం జరిగిన తుది పోరాటం హైదరాబాదు నడిగడ్డమీద జరిగి విజయం సాధించింది ఆ తరవాత మతావేశ రహిత సమాజపు ఏర్పాటుకోసం జరుగుతున్న పోరాటం కాశ్మీర్ దేశంలో కొనసాగుతుంది. ఆ పోరాట ప్రవాహంలో వ్యక్తమవుతున్న ఆటుపోటులే

ఈనాడు కాశ్మీర్ ప్రజా ఉద్యమంలో లుకలుకలుగా మనకు కనిపిస్తున్నాయి. అప్పుడప్పుడు షేక్ అబ్దుల్లా తిరిగి, తాను పూర్వమున్న స్థాయికి రావాలనీ జమ్ము-కాశ్మీర్ పూర్తిగా భారత ప్రజాస్వామ్యంలో [illegible] తన శక్తికొద్దీ కృషిచేస్తాడనీ ఆశిస్తుంటాను.

షేక్ అబ్దుల్లా, దేశరాజకీయాల్లో వేస్తున్న మొగ్గలు, పిల్లిమంతరాలు నాకు వ్యక్తిగతంగా ఎంతో హృదయావేదనకరాలు. కాని, వాటినిగురించి ఎవరు ఏమి చెయ్యగలరు ?

# 27. శిక్షణ తరగతుల ఏర్పాటు-ప్రభుత్వ నిషేధాజ్ఞ

పరిస్థితులు అన్ని విధాలా ఎదురు దెబ్బలు కొడుతున్నప్పుడు, సంస్థలు తప్పించుకొంటూ ఉన్నామంటూ పనిచేసే ప్రయత్నాలు చేయాలి. అట్లాగే మేము హైదరాబాద్ స్టేట్ కంగ్రెస్ అస్తిత్వాన్ని నిరూపించే మరో కార్యక్రమాన్ని కూడా తల పెట్టాము రాష్ట్రంలో వేర్వేరు చోట్ల "రాజకీయ కార్యకర్తల శిక్షణ కేంద్రాలు" నిర్వహించాలని నిర్ణయించాము. అందు వల్ల యువకులందర్నీ ఒక చోట చేర్చి, భవిష్యత్కార్యక్రమానికి వారిని సంసిద్ధులను చెసే టందుకు ఆవశ్యకమైన శిక్షణ ఇవ్వడానికి అనుకూలంగా వుంటుంది వారు, దేశంలో వెర్వేరు రాజకీయ సిద్ధాంతాల ధోరణులను యథార్థ దృష్టితో అవగాహన చెసుకొని, వాటిని ప్రజలకు విశదంగా (విడమరచి) చెప్పాలి అంతఃకరణ శుద్ధి, తెలివి తేటలు, అభినివేశము కల కార్య కర్తలను తయారు చెయ్యాలనేదే మా ఆశయము. అంతకు ముందు నడిపిన రెండు పోరాటాలలోనూ దేశస్వాతంత్ర్యం కోసం సర్వమూ త్యాగం చెయ్యడానికి కూడా సిద్ధంగా వున్న యువకులెందరో మాకు లభించారు. వారికి పూర్తి సామర్థ్యం లభించేటట్లు తోడ్పడాలి శిక్షణ కేంద్రాల వల్ల ఆ పని జరుగుతుంది.

శిక్షణకెంద్ర వ్యవస్థాపనకు బాధ్యత వహించ వలసిన వూచీనాది. అట్లా చెయ్యడం వల్ల శిక్షణ కేంద్రాన్ని కొందరు కాంగ్రెసు వాదులు నిర్వహిస్తున్నట్లు విస్పష్ట మవుతుంది. అది ఒక విధంగా ప్రభుత్వాన్ని సవాలు చెస్తున్నట్లుంటుంది నిషేధాజ్ఞ అమలులో వున్నప్పటికీ లక్ష్య పెట్టకుండా

మా పని మేము చేస్తున్నట్లు కూడా కనిపిస్తుంది. చాలా కాలం వరకూ ఈ పద్ధతిని ఎట్లా ఎదుర్కోవాలో ప్రభుత్వానికి దారి కనిపించ లేదు. కాని, అట్లా చాలా కాలం సహిస్తూ ఊరికే వుండరనే మేమనుకున్నాం. అప్పుడు మా మీద పడిన మొదటి దెబ్బ హైదరాబాదు నగరంలో రాష్ట్రంలో అన్ని ప్రాంతాల నుండి వచ్చిచేరిన 40 మంది కార్యకర్తలతో నడుస్తున్న శిక్షణ శిబిరాన్ని వెంటనే మూసివేయ వలసింది అనే ప్రభుత్వపు ఆజ్ఞ జారీ చేయడం ద్వారా పడింది.

ఆ శిక్షణకేంద్రంలో శిక్షణ ఇస్తున్నవారు, అధ్యయన విషయాలు, ఎవరు ఏ విషయాల గురించి చెప్పడానికి ఏర్పాట్లు జరిగాయో తెలుసుకొనడం ఈ నాడు కూడా ఆసక్తి దాయకంగా వుంటుంది. ఈ క్రింద పేర్కొన్న పెద్దలు, వారి పేర్ల వరసను ఇచ్చిన విషయాలను గురించి ఉపన్యాసాలు ఇచ్చారు

1. శ్రీ దిగంబర్ రావు బిందు హైదరాబాదు సంస్థానంలో రాజకీయ చరిత్ర.
2. శ్రీ మందుముల నరసింగరావు హైదరాబాదు సంస్థానపు సామాజిక ఆర్థిక విషయాల వివరణ.
3 శ్రీ బూర్గుల రామకృష్ణరావు · హైదరాబాదు సంస్థానంలో ప్రజా ఉద్యమం
4. శ్రీ వి డి దేశపాండే · స్వయం నిర్ణయము.
5. శ్రీ ఆర్. జి. నందాపూర్కర్ . స్వదేశ సంస్థానాల సమస్య
6. శ్రీ ఎస్. కె వైశంపాయన్ భారతదేశంలోని జాతీయ ఉద్యమ చరిత్ర
7. శ్రీ ఆర్ జి. వరాంజపే హిందూదేశ రాజకీయ జీవితంలో వివిధధోరణులు (వైఖరులు)
8 శ్రీ గోవిందదాస్ షరాఫ్ సంస్థా నిర్మాణ విధానాలు.

9. శ్రీ గోవిందదాస్ షరాఫ్ యుద్ధము అంతర్జాతీయ పరిస్థితి.

10. శ్రీ హరిశ్చంద్ర హెడా : గాంధీ తత్త్వము

11. శ్రీ కె ఎస్ వైద్యా . పరిపాలన (చట్టం)లో సంస్కరణలు

12 శ్రీ మందుముల నరసింగరావు· ఆహార సమస్య

13. శ్రీ సి డి చౌధరి · కమ్యూనిజము

14. స్వామిరామానంద తీర్థ : మన రాజకీయ (లక్ష్యాలు) గమ్యాలు.

నవాబ్ అలియవర్ జంగ్ అప్పుడు హోమ్ (పోలీసు) శాఖ కార్య దర్శి అని నాకు జ్ఞాపకము. శిక్షణ కేంద్రము నిలిపి వేయ వలసింది అంటూ నాకు జారీ చేసిన ఆర్డరుపై ఆయనే సంతకం పెట్టారు. నవాబ్ సాహేబ్ మంచి సమర్థత గల పరిపాలకుడని పేరు పొందిన వాడు. ఆయన తెలివైన వాడు కూడా. ప్రభుత్వ విధానాలన్నిటికీ ఆయనే ఆలోచనల పుట్ట అనే కీర్తి కలవాడు. అధికార నిర్వహణ చాకచక్యం ఆయనలో మూర్తీభవించింది. నేను ఆయనను అంతకు ముందెప్పుడూ కలియ లేదు మొదట ఆ ఆజ్ఞానుసారంగా నడవాలని నిశ్చయించాను. శిక్షణ కేంద్రాన్ని వెంటనే మూసివేశాము. ఆ విషయం ప్రభుత్వానికి తెలియ జేశాను నవాబ్ సాహెబ్‌ను కలిసి ఈ అంశాన్ని గురించి ఆయ నతో చర్చించే కోరికను వెల్లడించాను.

ఆయనతో జరిగిన సమావేశంలో నవాబ్ సాహెబ్ ఎంత సూక్ష్మ బుద్ధో గమనించ గలిగాను. ఆయన, శిక్షణలో సూచించిన విషయాలను గురించి రాజకీయాలలో మునిగితేలుతున్న వారు మాట్లాడటానికి ప్రభుత్వం అనుమతించేది లేదని సూటిగా చెప్పాడు. విశ్వవిద్యాలయాలలో విద్యా బోధన చేస్తున్న ఆచార్య వర్గం వారిని ఆహ్వానించి ఆ విషయాలపై మాట్లాడే ఏర్పాటు చేస్తే తమ కభ్యంతర మేమీ వుండదన్నాడు. తాను కూడా ఆ విషయాల్లో దేని మీదనైనా సరే మాట్లాడేటందుకు సిద్ధంగా వున్నానన్నాడు ! శిక్షణ కేంద్రంలోని వాతావరణం విద్యా సముపార్జనకు

సంబంధించినదై వుండాలే గాని రాజకీయాల కంపు కొట్టేటట్లుండ కూడ దన్నాడు! నేను ఆ మనిషిని ఆయన మనస్సులోని గూఢమైన మర్మజ్ఞ తను వెంటనే అర్థం చేసు కన్నాను ఆ విషయాన్ని మరింత పొడిగిస్తూ ఆయనతో చర్చించడం నిరర్థక మని తేలి పోయింది ప్రభుత్వం కాంగ్రెసు సంస్థతో ఏ కొంచెం సంబంధమున్న కార్య క్రమాన్నైనా సహించదనీ, మొగ్గగా వున్నప్పుడే త్రుంచి వేసి, నేలబెట్టి కాలరాసి వేస్తుం దనీ నిస్సందేహంగా తెలిసింది. ఎంత మందకొడిగా శాంతంగా సాగు తున్నా స్వాతంత్ర్యోద్యమానికి బలం ఇచ్చే ప్రతి ప్రయత్నానికీ అవ రోధం కల్పించాలనే ప్రభుత్వం నిర్ణయించినట్లున్నది అయితే, ఈ ఆర్డర్ని ధిక్కరించడమా? ఈ అంశం మీద వివిధ అభిప్రాయాలు వచ్చాయి వివరికి అందరూ నిర్ణయాన్ని నాకు వదిలారు నేను, "చూద్దాం, ఏమవు తుందో? తొందర పడవద్దు ఓర్పుతో కనిపెట్టుకొని వుండటమే ఈ సంధి సమయంలో మంచి పని" అని, భావించాను

కార్యకర్తలతో కలిసి మెలసి జీవించడంవల్ల, నాకు వారి మనశ్శక్తి అంటే అవగాహనాశక్తి, వివేచనాశక్తి ఎంత పరిమితంగా వున్నాయో గ్రహించగలిగాను. అది వారి తప్పుకాదు వారికి సిద్ధాంత పరమైన జ్ఞానం ఇచ్చి కాపాడించిన వారెవ్వరూ లేరు. హృదయావేశం దృష్ట్యా పరిశీలిస్తే వారు చక్కని మనుష్యులు స్వతంత్రం కొసం, ఉద్యమంలో ఏ బాధలైనా పడేటందుకు వారు సిద్ధంగా వున్నవారే ఆత్యాగ శీలానికి తోడుగా వారు సామాజిక ఆర్థిక మార్పులు తెచ్చే కార్య కర్తలుగా తయారవ్వాలంటే వారికి మరింత లోతైనవిజ్ఞానమూ సిద్ధాంత పరమైన విశ్వాసమూ వుండాలి. హైదరాబాదు ప్రజా ఉద్యమం ప్రారంభం నుంచి కూడా తగి నంత శ్రద్ధ తీసుకొని ఈ మౌలిక భావాలననుసరించిన సామాజిక మార్పు కాంక్షించే వారి నందరిని ఒకచోటికి చేర్చింది విప్లవోద్యమాల చరిత్ర పరి శీలించినట్లయితే ఇదిగో అని దారి చూపిస్తే అందుకొని పోయే తెలివైన సుశిక్షిత కార్యకర్తల అవసరం ఎంత ఆవశ్యకమో రుజువవుతుంది ప్రజా సామాన్యాన్ని ముందుకు దూకించి పని నిర్వహించ వచ్చు కాని, వారిసి

సరియైన సందర్భం గమనించి, ముందుకు దూకేటట్లు ఉత్సాహం కల్పించే తెలివైన కార్యకర్తలు ప్రజను నడిపించే దళవాయిలు, ఉండాలి

హైదరాబాదు సంస్థానము భారత దేశంలోని బ్రిటిషు సామ్రాజ్యతత్త్వపు భారమంతా కేంద్రీకృతమైవున్న గురుత్వ కేంద్రము · బ్రిటిషు ఇండియా నుంచి రవాణా అయిన మతావేశ పరులతో నింపి, బ్రిటిషు రాజకీయ వేత్తలు, దాన్ని ఒక ప్రత్యేక పద్ధతిలో తీర్చి దిద్దారు. భారత వ్యతిరేక కేంద్రంగా హైదరాబాదు సంస్థానాన్ని పెంపొందిస్తే మొత్తం భారత దేశపు ఐక్యతకు, స్థిరత్వానికి చేటుకలుగుతుంది అని వారిఅంచనా. మన కార్యకర్తలు ఈ అంశాన్ని పూర్తిగా అర్థం చేసుకోవాలి. అప్పుడే వారిలో ప్రతి ఒక్కరూ తాను తల పెట్టిన పనిలో ఉన్న కార్యభారం దాని ప్రాముఖ్యం పూర్తిగా తెలుసుకో గలడు.

మాట్లాడకుండా మూగవాళ్లలా ఉండే మంది అనుసరించడంవల్ల ఏ ఉద్యమానికీ సహజమైన బలం రాదని నా విశ్వాసం. వారికి ముందుకు చొచ్చుకొని పోయేశక్తి ఉండదు అందుచేత తన ఆలోచనపై నమ్మకం ఉన్న స్వంత వ్యక్తిత్వం ఉన్న కార్యకర్తల అవసరమే నేడు ఎక్కువగా ఉంది. మేము శాయ శక్తులా వారికోసం ఎంతో కృషి చేశాము శిక్షణ కేంద్రపు ఏర్పాటు ఆ ప్రయత్నాలలో ఒకటి.

హైదరాబాదు ప్రభుత్వానికి మా కార్యక్రమాన్ని కొనసాగనిచ్చే కోరిక లేదు అందు చేతనే వారు ఇంతకు ముందు తెలిపినట్లు, దాన్ని వెంటనే ఆపి వెయ్యాలని నోటీసు ఇచ్చారు.

—o—

# 28. రాజకీయ ఉద్యమము - ప్రజాబలము

క్విట్ ఇండియా ఉద్యమం హైదరాబాదు ప్రజాస్వాతంత్ర్యపోరా టానికి ఒక గొప్ప ఊపు ఇచ్చింది. సంస్థాన స్థాయిలో కేంద్రనాయకత్వం నుంచి లభించిన ప్రత్యేక మార్గదర్శకత ఏమీలేదు అయినా భారతదేశ పరిస్థితియొక్క ప్రభావం, హైదరాబాదు రాజకీయాల్ని ప్రభావితం చేసింది అందువల్ల చాలామంది యువకులు ముందుకువచ్చి, కష్టాలను సహించి, పని చేశారు. ప్రజలకోసం ప్రజాస్వామిక స్వాతంత్ర్యాన్ని సాధించాలనే స్థిర నిశ్చయం వారిలో వ్యక్తమైంది ఒక కొత్త బలం అవతరించింది ఆ బలాన్ని ఏ రీతిగా పాయిలు
అనేదే మా కెదురైన సమస్య.

ఆ పని ఏమీ అల్పమైంది కాదు వృద్ధతరం నాయకులు ఈ ఉద్యమానికి దూరంగా ఉన్నారు. కొత్త నాయకులు సంస్థానంలో అంతటా వేర్వేరు ప్రాంతాలలో పైకి లేస్తున్న కార్యకర్తలతో అనుబంధమును ఇంకా గట్టిపరచుకోలేదు హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమము ఆషామాషీని తేలేదికాదని పట్టుదలతో సాగించాలనీ వారికి కూడా తెలుసు రాజీ మాటల ప్రసక్తి పూర్తిగా మరిచి పోవలసిందే ననుకున్నారు అందరూ ఏకం కావడం త్వరగా జరగాలన్నారు అన్ని పక్షాలలో సంస్థానంలో అంతటా ఉన్న ముఖ్యులైనవారిని స్వయంగా కలుసుకొని వారి ఆలోచనలు తెలుసుకోవడం నేను చెయ్యవలసిన మొదటి పని. ఈ బలాలన్నీ ప్రాంతీయ సభలకు బలం చేకూర్చాలనీ అందువల్ల ఉద్యమం విస్తరించి, సామాన్య ప్రజలందరికీ స్వాతంత్ర్య సందేశాన్ని అందచేస్తు

దని అంగీకరించాము అందువల్ల, ఆ ప్రాంతీయ సభలు ఒక వంక ప్రజలకు ప్రతిరోజు ఎదురయ్యే సమస్యల గురించి పనిచేస్తూ వారితో నిత్య సంబంధం పెంచుకుంటూ, అసలైన ప్రజాసంస్థలుగానూ మరొక వంక గట్టి పునాదులు వేసుకు రూపొంది గట్టిపడి ఎడతెగకుండా పనిచేసే సంస్థలు గానూ అభివృద్ధి చెందాలని ఆశించాము. ముందుకు సాగాలనుకున్న వారందరి శక్తి సామర్థ్యాలను క్రమక్రమంగా కూడగట్టి సమన్వయం చెయ్యడం జరిగింది. హైదరాబాదు సంస్థాన రాజకీయ ఆకాశంలో (దిఙ్మండలంలో) స్పష్టమైన సామాజిక ఆర్థిక దృక్పథంకల ప్రగతిశీల వర్గాలు అవతరించడానికి నాంది అయింది.

ఈదశలో ఆంధ్ర మహాసభ వ్యవహారాల్లో ఒక హఠాత్సంఘటన జరిగింది మొదటి సత్యాగ్రహం తర్వాత ఆ సంస్థ వృద్ధ నాయకుల చేతుల్లోంచి జారిపోయింది నాయకత్వం గతితార్కికవాదుల చేతుల్లోకి వచ్చింది. అది మొదట యువకులకు నాయకుడైన శ్రీ మందుముల రాంచంద్రరావుకీ ఆతర్వాత శ్రీ రావి నారాయణరెడ్డికీ వచ్చింది ఈ రెండో నాయకుడు ఆనాటి ఆంధ్ర మహాసభ సభ్యులలో ఎక్కువమంది ఆమోదంతో అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. శ్రీ నారాయణరెడ్డి అప్పటికే కమ్యూనిస్టు పార్టీలో చేరాడు అందుచేత ఆంధ్ర మహాసభ వ్యవహారాల్లో భారత కమ్యూనిస్టు పార్టీ వారికి క్విట్ ఇండియా ఉద్యమంపట్ల ఉన్న వైఖరి ప్రభావం వ్యక్తం అయింది. క్విట్ ఇండియా ఉద్యమం తర్వాత ఆంధ్ర మహాసభతో తిరిగి ఒలవడిన జాతీయవాదులు దీన్ని తమ శక్తినంతా కూడ దీసుకుని తీవ్రంగా వ్యతిరేకించారు అందుచేత సంస్థలో ఆంతరంగిక కల్లోలం పొడచూపింది చట్టబద్ధంగా కార్యక్రమాలు కొనసాగించాలనే వృద్ధతరం నాయకులలో, సమాజంలో పై వరసల్లో ఉన్న వారిలోకూడా కొంత చురుకుతనం వచ్చింది. శ్రీ మందుముల నరసింగ రావు వారి తరఫు వ్యవహర్త. ఆ తరవాత జరిగే ఆంధ్ర మహాసభ 1946 వేసవిలో ఏర్పాటైంది. కాని ఈలోపునే ఆంధ్రమహాసభ రెండు

చీలికలైంది. వాటి నడుమ వచ్చిన విభేదాలు సర్దుబాటుచేసి ఐక్యత నిలబెట్టాలని నేను నా శక్తికొద్దీ కృషి చేశాను. కాని ఆ విభేదాలు మౌలికములైనందువల్ల రెండు వర్గాలూ విడిపోయాయి. ఆంధ్రమహాసభలో ఒక ముఖ్యమైన భాగము శ్రీ రావి నారాయణరెడ్డి ఆధిపత్యంలోనే ఉంది. జాతీయ ఆంధ్రమహాసభ శ్రీ నరసింగరావు అధ్యక్షత వరంగల్ దగ్గర ఉన్న మడికొండలో మొదటి సమావేశం జరుపుకొన్నది. జాతీయవాదుల్లో ప్రగతిశీల వర్గంవారు అసలు ఆంధ్ర మహాసభను వదలిపెట్టి కొత్తగా ఏర్పడ్డ జాతీయ సంస్థలో చేరారు.

ఈ సందర్భంలో ఆంధ్ర ప్రాంతంలో కార్యక్రమాలను నడిపే బలాల్ని అవగాహన చేసుకోవడం అవసరము. తెలంగాణాలో కార్యదక్షత ఉన్న వర్గము శ్రీ నారాయణరెడ్డి నాయకత్వంలో ఆంధ్రమహాసభలో లీనమై వుంది. ఆయనే స్వాతంత్ర్య పోరాటంలోకి దూకిన మొదటి యోధుడు కావడం దానికి కొంత కారణం కావచ్చు. ఆయన తెలంగాణా గ్రామీణ ప్రాంతంలో బలమైన సభాసంస్థను నిర్మించారు. తర్వాత ఆయన కమ్యూనిస్టు పార్టీలో చేరినంతనే ఆయన బలగంలో ఎక్కువమంది కమ్యూనిస్టుల్లో కలిసిపోయారు. వృద్ధ నాయకత్వంలో (లిబరల్) మితవాద వర్గానికి సత్యాగ్రహోద్యమంతో ఉన్న సంబంధం అతి తక్కువ, ఏమీలేదనే అనవచ్చు. అందుచేత వారు రెండు పక్షాల్లో కాకలుతీరిన వారు కమ్యూనిస్టులతో భిన్నాభిప్రాయాలు కలిగినవారూ అయిన వారి విశ్వాసాన్ని చూరగొనలేకపోయారు. అనేకమంది వర్ధిష్ణువులైన యువకుల్లో తార్కిక దృక్పథం పెంపొందసాగింది. శ్రీ కోదాటి నారాయణరావు రాష్ట్రంలోని అనుభవజ్ఞులైన కాంగ్రెసు వారిలో ఒకరు. ఆయన గ్రంథాలయోద్యమ అభివృద్ధికోసం కృషి చేశారు. అందులో గడించిన ఉద్యమ నిర్వహణానుభవంతో స్వాతంత్ర్యోద్యమంలో దూకారు. భవిష్యత్తులో సమాజాన్ని ఏ రీతిగా మలచుకోవాలో అనే విషయాన్ని గురించి స్పష్టమైన దృశ్యచిత్రమును మనో నేత్రంతో దర్శించిన ద్రష్ట. అందువల్ల తెలంగాణా యువకుల

నాయకుడు కాదగినవాడు శ్రీ కాశీ నారాయణరావు తెలంగాణా ప్రాంతంలో నాకు మొదటి సహచరుడు నేను మొదటిసారి వరంగల్ వెళ్ళినపుడు ఎంతో శ్రమ తీసుకొని ప్రమాదాన్ని కూడా లెక్కచేయకుండా ఒక సమావేశాన్ని ఏర్పాటు చేశాడు. ఆయనలోవున్న కలుపుగోలు స్వభావమే ఆయనకు ప్రమాదాలను లక్ష్యపెట్టని సాహసాన్నిచ్చింది. శ్రీ కొమరగిరి నారాయణరావు కూడా చాలాకాలంపాటు కాంగ్రెసులో అనుభవంగల కార్యకర్త స్వాతంత్ర్య పోరాటంలో ప్రవేశించి ఎన్నో అసౌకర్యాలను కష్టాలను ఎదుర్కొన్నవాడు ఈ ముగ్గుర్నీ నారాయణ త్రయం అని తెలంగాణా ప్రజల చరిత్రకారులు, ఆప్యాయంగా పేర్కొంటుంటారు. శ్రీ ముదిగొండ సిద్ధవీర రాజలింగం ఉద్యమంలో చైతన్యవంతమైన పాత్ర నిర్వహించారు ఆయన సూటిగా మనస్సులోకి చొచ్చుకొనిపోయే శక్తివంతమైన భాషలో జనరంజకంగా మాట్లాడగలిగిన మంచి వక్త; దృఢ మనస్కుడు ముందుకు చొరవగా పోగలిగినవాడు. అతి సామాన్యమైన కుటుంబంలో పుట్టి స్వయంశక్తితో ముఖ్యమైన ప్రాధాన్యం వహించిన స్థానాలు అలంకరించినవాడు శ్రీ టి. హయగ్రీవాచార్య కార్యశూరుడు పరిపాలనానుభవమూ సంస్థలు నిర్మించి అభివృద్ధి చెయ్యడంలో అనుభవముకలవాడు. స్వాతంత్ర్య పోరాటంలో ప్రవేశించినందువల్ల కలిగే చికాకులు, నష్టాలు, కష్టాలు అన్నీ అనుభవించినవాడు. శ్రీ వి పుల్లారెడ్డి (తియ్యగా మాట్లాడే) మధుర స్వభావంగల యువకుడు. లా డిగ్రీ పొందినవాడు గద్వాల వాస్తవ్యుడు, భూస్వాముల దౌర్జన్యాలను ఎదిరించి పట్టుదలతో ధర్మయుద్ధం సాగించి విజయం సాధించినవాడు పేద రైతుల ఆశలు ఆశయాలు, తనలో మూర్తీభవించుకొన్న ... శ్రీ కాంచనపల్లి వెంకట రామారావు బాగా చదువుకున్నవాడు సామాజిక ఆర్థిక సమస్యలపట్ల మంచి అవగాహనకల ప్రగతిశీలి. ఏ సమస్యనైనా విశ్లేషణాత్మకంగా పరిశీలన చెయ్యగల నేర్పరి, కమ్యూనిస్టుల ప్రాబల్యంగల నల్గొండ జిల్లాలో ప్రజాస్వామిక విధానాన్ని అనుసరించే బలమైన ప్రజాఉద్యమాన్ని నిర్మించినవాడు. ఆయన ఏ

ప్రమాదం ఎదురైనా లెక్క-చేయకుండా ప్రజలతోనే ఉన్నాడు శ్రీబొమ్మ కంటి సత్యనారాయణరావు ఉద్యమం గురించీ ప్రజల సమస్యల గురించీ లోతైన విజ్ఞానము కలవాడు స్వతంత్ర పోరాటాన్ని నడిపించడంలో ప్రముఖమైన పాత్ర వహించాడు ఈ మిత్రులందరికంటె శ్రీ ఎన్ కె. రావు రాజకీయాల్లో ఎక్కు-వ కాలం అనుభవం కలవాడు తెలంగాణా కార్యకర్తలందరిలో ప్రగతి వాదులకు కూడలి. అందరికి తగిన సలహా లిచ్చే సచివుడు. ఈ మిత్రులూ వీరితోపాటు అనేకులూ అవసరమైన నాయకత్వాన్ని వహించి నడిపించినందువల్ల తెలంగాణా ప్రజలు భూస్వామిక దోపిడి వ్యవస్థ బలాన్ని సమర్థతతో చైతన్యవంతంగా ఎదిరించ గలిగారు.

అది ప్రజాఉద్యమం గురించిన దృక్పథం క్రమక్రమంగా అభివృద్ధి అవుతున్న కాలం. బాధ్యతాయుత ప్రభుత్వాన్ని సాధించుకొనేటందుకు అవసరమైన పోరాటాన్ని, ఏమాత్రమూ వెనుకంజ వెయ్యకుండా గాలివాలును అనుసరించి మార్చకుండా విజయం లభించేవరకూ సాధించాలి. అందుకోసం, పునాదినుంచీ పైకి బలంగా ఉద్యమ నిర్మాణాన్ని కొనసాగించాలి. అందుకోసం ప్రజల సమస్యలు తీసుకొని ప్రభుత్వాన్ని ఎదిరించవలసినా వెనుకాడకుండా వాటి పరిష్కా-రానికి కృషి చెయ్యాలి ప్రభుత్వాధికారం ఆశించి ఎగ్జిక్యూటివు కౌన్సిల్‌లో ఏవో ఒకటి రెండు ఉద్యోగాలు అంగీకరించడంకోసం కాదు ఈప్రయత్నం అంతా. రావలసిన మార్పు పూర్తి సామాజిక మార్పు. స్వరాజ్య సాధనకు తగిన తయారీ అవసరము. దానికీ మూల్యము పునాదిగా చెల్లించాలి అది, ఆ సాధనలో పడవలసిన కష్టాల రూపంలో ఉంటుంది. అందుచేత కార్యకర్తలు కష్ట సహిష్ణుత అలవరచుకోవడం అవసరమవుతుంది. అంతేకాదు దోపిడీకి గురి అవుతున్న ప్రజాస్వామ్యాన్ని పెట్టుబడిదార్ల పిడికిలినుంచి విముక్తుల్ని చెయ్యాలనే విషయాన్ని తమ ఆశయంగా గ్రహించాలి హైదరాబాదు స్వాతంత్ర్య ఉద్యమానికి ఒక ప్రత్యేక లక్షణం ఉంది. దానిలో చూ:, పాల్గొని, నడిపించి విజయం సాధించిన యువ కార్యకర్తలలో ఎక్కు-వ

మంది నిరంకుశ భూస్వామ్య వ్యవస్థాత్మక పరిపాలననుండి లభించే విముక్తిని మాత్రమేకాక ప్రజాసామాన్యానికీ వారిలోనూ ముఖ్యంగా తెలంగాణా రైతులకు భూస్వాముల బానిసత్వంనుంచి విముక్తి లభించాలనే లక్ష్యంతో త్యాగాలు చేశారు. ఈ సామాజిక ఆర్థిక దృక్పథం ఎల్లప్పుడూ వారి ముందుంచబడినందువల్ల కార్యకర్తల దృష్టి దానిమీదనే కేంద్రీకృతమై వారి మనోభావాలు దానితో లయ కుదిరి స్పందించేవి. నేను ఏ భాషామండల సంఘానికీ చెందినవాణ్ని కాకపోయినా నాకు అన్ని భాషా సంఘాలవారితోటీ అన్ని సంస్థలలోనూ కలిసి ఉండి పనిచేసే భాగ్యము కలిగింది. కాలం గడచినకొద్దీ ఆయా వర్గాలవారితో సాన్నిహిత్యము, సాహచర్యము అభివృద్ధి చెందాయి. క్రమంగా ఆ సంఘాలన్నీ దగ్గరకు వచ్చి హైదరాబాద్ (స్టేట్) సంస్థానంలో ప్రజాస్వామిక శక్తులకు నాయకత్వం వహించాయి. వారినుంచి పందలాదిగా వచ్చిన త్యాగబుద్ధి నిరతులూ, యువకులూ నాకు ఎంతో ఉత్సాహం ఇచ్చారు. వారిలో ఒకడుగా మెలగుతూ వారితోకలిసి పని చెయ్యడం గొప్ప అదృష్టమని భావిస్తున్నాను. క్రమంగా కాలం పరిపక్వమై ఆ యువకులందరూ హైదరాబాదు స్టేట్ కాంగ్రెసుకు వెన్నెముకవంటి వారైనారు. వారిలో నానాటికీ అభివృద్ధి చెందిన సామాజిక - ఆర్థిక దృక్పథంవల్లనే వారు సంస్థలోఉన్న ఇతర వర్గాల వారితో అప్పుడప్పుడు వాద ప్రతివాదాలకు దిగడం కూడా జరిగేది.

నేను డిసెంబరు 1942 లో విడుదల అయిన వెంటనే హైదరాబాద్ స్టేట్‌లోని రాజకీయ పరిస్థితిని పరామర్శిస్తూ ఒక ప్రకటన చేశాను. "కాలంలో వస్తున్న మార్పులను గమనించి వాటిని హెచ్చరికలుగా గుర్తించి తమ ప్రవర్తనను మార్చుకోనవలసిందని, పరిపాలనా వ్యవస్థను పూర్తిగా ప్రజలు వాంఛించిన మేరకు కాకపోయినా ఏవి అత్యావశ్యకమూ తప్పనిసరి అయినవో వాటిని ఏమీ మినహాయింపులు లేకుండా ప్రసాదించడం ఉభయ తారకమనీ ప్రభుత్వ కర్తవ్యమనీ" చెప్పాను.

• హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసుపై నున్న నిషేధాజ్ఞలను రద్దు చెయ్యడం ప్రభుత్వం యొక్క ఆలోచనా సరళిని వెల్లడించే గీటురాయి పరీక్ష అనీ అట్లా చెయ్యడం వల్ల ప్రజలకు కలిసి సంఘంగా ఏర్పడటానికి అవకాశం కలిగించి, బాధ్యతాయుత ప్రభుత్వం కోసం కృషి చెయ్యడం ప్రాథమిక హక్కుని ప్రభుత్వం గుర్తించినట్లవు తుందని" వివరించాను ఆ ప్రకటన లోనే "హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు 1938, 1940,1942 సంవత్సరాలలో పోరాటాలు ఏ ఆదర్శాల కోసం కొనసాగిందో అవి ఫలించనే లేదని" కూడా ప్రజలకు గుర్తుచేశాను "ఇంతజరిగినా ప్రభుత్వం తన విధానాన్ని సవరించుకొని ప్రజల కోర్కెలను తీర్చేధోరణిలో పడనే లేదు. అందుచేత హైదరాబాదులో ప్రగతిశీలం కల ప్రజాసామ్య ప్రభుత్వం ఏర్పడాలని నమ్మేవారూ అందు కోసం పని చేస్తున్న వారూ అందరూ కూడా స్టేట్ కాంగ్రెస్‌పై నున్న నిషేధాజ్ఞలు రద్దు అయేటందుకు కృషిచెయ్యాలి స్టేట్ కాంగ్రెసు కొన్ని నియమాల ననుసరించి ఆదర్శాలకు కట్టుబడి ఉండి పని చేస్తూ రాష్ట్రరాజకీయ జీవితంపైనా, చరిత్రపైనా ముద్ర వేసింది. సంస్థాన ప్రజల స్వతంత్రము అంటే ఘనత వహించిన నిజాము ప్రభువుల ఆధి పత్యాన్ని అంగీకరించిన బాధ్యతాయుత ప్రభుత్వం అనే అర్థము మా నిర్వచనము ప్రజాస్వామ్య బలాన్ని, వ్యక్తులు, సంఘాలు అందరూ కలిసి ఈ ఆదర్శాన్ని ప్రజలలో ప్రచారంచేసి, ప్రజాభిప్రాయాన్ని దాని వైపు మళ్లించి స్టేట్ కాంగ్రెసు కోర్కెలు కొట్టి పారవేయడానికి వీలులేని వని ప్రభుత్వం విశ్వసించేటట్లు కృషిచేస్తారని నమ్ముతున్నాను" ఈ విన్నపము ప్రభుత్వాన్ని ఏమీ ప్రభావితం చెయ్యలేదు. కాని భాషల వారీ ప్రాంతీయ సభలు క్రమక్రమంగా ఎదిగి, ఆ ఆదర్శాన్నే గ్రహించాయి. కొంత కాలం వరకూ ఆ సంస్థలు తమ నియమావళిలో బాధ్యతాయుత ప్రభుత్వ ప్రసక్తిని తేకుండానే పనిచేసాయి, స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధాజ్ఞ ఉపసంహరించ వలసిందంటూ కోరిన కోరిక ప్రతిచోటు నుంచీ ప్రతిధ్వ నించింది. నాటి నుంచి నిషేధింప బడిన స్టేట్ కాంగ్రెసుకి క్రమంగా

ప్రజలలో బలం పెరగసాగింది. బాధ్యతాయుత ప్రభుత్వంకోసం పని చేసే సంస్థ అంటే ప్రభుత్వానికి సహజ వ్యతిరేకత ఉన్నట్లు వ్యక్త మైంది. అందుచేతనే ఒక్కొక్క అడుగే వేస్తూ భాషలవారీ ప్రాంతీయ సభలుకూడా ఈ ఆదర్శాన్నే సమర్థించాయి వాటి కార్యక్రమా లన్నింటినీ సమన్వయం చేసే జాయింట్ కో ఆర్డినేషను కమిటీ ఆ మూడు ప్రాంతీయ భాషా సంఘాల వారినీ ఒక చోటికి చేర్చి వాటిని మొత్తం సంస్థానం అంతటా పనిచేసే అఖిల హైదరాబాదు ప్రజాసభలో విలీనం చేసింది. ఈ కొత్త సభ లక్ష్యాన్ని వారు ఇట్లా వివరించారు .

"ఘనత వహించిన నిజాము ప్రభువుల ఆధ్వర్యం క్రింద బాధ్యతా యుత ప్రభుత్వం ఏర్పాటయేటందుకు చట్ట సమ్మతము, శాంతియుతము అయిన విధానాల ననుసరించి కృషి చేయడమే అఖిల హైదరాబాద్ ప్రజాసభ లక్ష్యము. అటువంటి ప్రభుత్వము ప్రజల ఆర్థికాభివృద్ధికి అవసరమనీ అది అనేక విధాలుగా కొనసాగుతున్న దోపిడీలను అరికట్టి అల్ప సంఖ్యాకులకు పూర్తిగా రక్షణ ఇచ్చేటందుకు శక్తి కలదిగా ఉంటుం దనీ నమ్ముతున్నాము."

అప్పుడు గవర్నమెంటు సందిగ్ధ స్థితిలో పడింది. ఒక వంక మేము స్టేట్ కాంగ్రెసు ఉంది అని అనుక్షణమూ మా కార్యకలాపాల ద్వారా గుర్తుచేస్తూ ఉన్నాము. మరొక వంక ప్రాంతీయ భాషలవారీ సభల సమ్మేళనంద్వారా స్టేట్ కాంగ్రెసు ఆదర్శాలతోటి పనిచేసే ఉమ్మడి సంస్థ రాజకీయ రంగంమీదికి దూసుకొని వస్తోంది స్టేట్ కాంగ్రెసుమీద ఉన్న నిషేధాజ్ఞను _ చెయ్యాలి లేదా ఈ కొత్త సంస్థను పుట్టి పెట్టకుముందే అది చట్టసమ్మతమైంది కాదని నిషేధించాలి. ఏం చెయ్యాలి? అని సంస్థాన ప్రభుత్వం ఇరుకున పడింది.

భారతదేశంలో పరిస్థితులు వేగంగా మారుతున్నాయి. మహాత్మా గాంధీని కాంగ్రెసు వర్కింగ్ కమిటీ మెంబర్లనూ ప్రభుత్వం విడుదల

చేసింది. బ్రిటన్‌లో కార్మికపార్టీ ప్రభుత్వంలోకి వచ్చి పరిపాలన చేపట్టింది. అంతర్జాతీయ పరిస్థితి నానాటికీ బ్రిటిషు సామ్రాజ్యతత్వానికి వ్యతిరేకంగా మారసాగింది పరిస్థితుల ఒత్తిడి మూలంగా బ్రిటిషు ప్రభుత్వము భారతీయులతో ఉండే సంబంధం స్నేహపూర్వకమైనదిగా మార్చుకో వలసిన అవసరం ఏర్పడింది బ్రిటిషువారి తాబేదారీ ప్రభుత్వాల దృక్ప థంలోకూడా ఈ మార్పుల ప్రభావం ఉండక తప్పదు. అందుచేత హైదరాబాదు సంస్థాన ప్రభుత్వ విధానంలోకూడా మార్పు రాక తప్పలేదు.

చట్టవిరుద్ధమైనవిగా పరిగణించబడిన కాంగ్రెసు వర్కింగ్ కమిటీ, ఆలిండియా కాంగ్రెసు కమిటీ (A I C C) వాటిపై నిషేధాజ్ఞలు ఉప సంహరింపబడినందున తిరిగి చట్ట సమ్మతములై పని చేస్తున్నాయి. హైదరా బాద్ ప్రభుత్వంకూడా తాను లోగడ చేసిన ప్రకటనను ఉపసంహరించి ఆ కమిటీలపైనున్న నిషేధాజ్ఞలు తొలగించింది అప్పుడు సహజంగా ఈ క్రింది ప్రశ్న వచ్చింది భారత జాతీయ కాంగ్రెసు సంస్థానంలో పని చేసేటందుకు అభ్యంతరంలేక పోయినప్పుడు హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు సంస్థానంలో పని చేసేటందుకు ఏందుచేత అభ్యంతరం ఉండాలి? ఆ రీతిగా హైదరాబాదు సంస్థాన ప్రభుత్వానికి మేము ఒక జాబు పంపాము. ప్రస్తుతం నిషేధాజ్ఞ ఉపసంహరించడానికి వీలుకాదని ప్రభుత్వం అన్నట్లు తెలిసింది. కాని, 24 సెప్టెంబరు 1945 నాడు కొందరు కాంగ్రెసు వారిని పిలిచి ఈ క్రింది షరతులను ఆమోదించి నట్లయితే నిషేధాజ్ఞను ఉపసంహరించడానికి ప్రభుత్వం సిద్ధంగా ఉందని చెప్పారు

ఆ షరతులు :

1 భారత జాతీయ కాంగ్రెసు అనే పేరు స్ఫురించ నటువంటి మరో పేరేదైనా గ్రహించాలి

2. నియమావళిలో సంస్థానానికి బైటఉన్న రాజకీయ సంఘా లతో వేటితోనూ అనుబంధాలు కలిగి యుండకూడదు

3 ఇందులో ఉద్యోగి వర్గంలో ఉన్నవారు మరే రాజకీయ సంఘంయొక్క ఉద్యోగి వర్గంలోనూ ఉండరాదు.

4. ఈ సంఘంలో మెంబరైన ప్రతి ఒక్కరూ ఘనతవహించిన నిజాము ప్రభుత్వముకు వినయ విధేయతలతో విశ్వాసపాత్రుడుగా ఉంటానని ప్రమాణం చెయ్యాలి

5. సంస్థానంలో స్థిరనివాసంగా ఉన్నవారు మాత్రమే ఇందులో మెంబర్లుగా ఉండటానికి అర్హులు

6. సంస్థాన పౌరులు తమ ఆశయాలను గురించీ, పరిపాలనలో ఎదురవుతున్న కష్ట నిష్ఠురాలను గురించీ సంఘంద్వారా విన్నవించు కొనేటప్పుడు చట్ట సమ్మతమైన, శాంతియుతమైన విధానాలనే అనుసరించాలి.

ఈ విషయాన్ని గురించి ఏంచెయ్యాలి ? అని, మాలో మేము చర్చించినప్పుడు భిన్నాభిప్రాయాలు వెల్లడి అయాయి మాలో కొందరికి మనస్సుల్లో ఏమీ సందేహం లేదు మేము భారత సంస్థాన ప్రజల కాన్ఫరెన్సులో అంతర్భాగం అందు చేత స్టేట్ కాంగ్రెసు పేరు మార్చడంలో ఏమీ కష్టం లేదు. 1941 లోనే దానికి మేము అంగీకరించాము. కాని, మరొకరు విధించిన షరతులకు లోబడి పని చెయ్యడము చట్టానికి లోబడి పని చెయ్యడము అనేవి సమ్మతం కాలేదు 'చట్టబద్ధమైన' అనే మాటకు ఒప్పుకోడానికి వీలులేదు దానికి బదులు 'న్యాయమైన' అని ఉంటె ఒప్పుకో వచ్చు అని, నేను వాదించాను రాజ్యాంగ చట్టబద్ధమైన అని ఒప్పుకొంటె సత్యాగ్రహం సాధనంగా గ్రహించము అని ఒప్పుకొన్నట్లే ఆ షరతు విధించడంలో ప్రభుత్వం యొక్క ఉద్దేశం ప్రజలు తమ లక్ష్య సాధనకు సత్యాగ్రహం నేమో. అణగ ద్రొక్కబడిన ప్రజలకు రాజ్యాంగ చట్టంలో ఉన్న అవకాశాలన్నీ నిష్ప్రయోజన కరం అయినప్పుడు మిగిలేది సత్యాగ్రహ సాధనం ఒక్కటే కదా ! ఆ సాధనాన్ని ఉపయోగించము అని నేను ఎవరెంత వాదించినా ఒప్పుకో లేను సంస్థలో ప్రతి సభ్యుడూ ప్రభువుకి వ్యక్తి పరంగా విధే

యుడుగా ఉంటానని ఒప్పుకోవాలనడం ఊహించ లేనంత తృణీకారము. 21 మార్చి 1946 నాడు స్టేట్ కాంగ్రెస్ కార్య క్రమాలతో సంబంధించిన వారందరమూ సమగ్రంగా చర్చించి, షరతులకు లోబడేది లేదని అభిప్రాయ పడ్డాము నిషేధాజ్ఞలు [illegible] వలసిందని కోరుతున్నట్లు మాత్రమే వ్రాసి పంపించాము.

ఈ నడుమ 10-7-1946న అఖిల భారత సంస్థాన ప్రజలసభ స్థాయి సంఘము ఢిల్లీలో సమావేశమైంది మూడు ప్రాంతీయ భాషలవారీ సభలూ సమన్వయ కమిటీ [illegible] న ప్రజల సభకు అనుబంధితమయాయి. ఉదయపూర్‌లో జరిగిన మహా సభకు హైదరాబాదు సంస్థానం నుంచి ఎంతో మంది ప్రతినిధులు వెళ్ళి పాల్గొన్నారు హైదరాబాదు స్వాతంత్ర్య పోరాటానికి అఖిల భారత ప్రజానీకపు మద్దతు లభించింది. ఆ సభ యొక్క స్థా [illegible] న్ని చర్చించి హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు మీద ఉన్న నిషేధాజ్ఞలు ఉపసంహరించక పోతే మరో ఉద్యమం చేపడేయాలని ప్రజ[illegible]కు సూచన చేసింది నిజానికి అది అఖిల భారత సంస్థ ఇచ్చిన కరుకైన [illegible]ది సందేశము వంటి [illegible]దని Ultimatum) అనవచ్చు జూన్, 10, 1946 నాడు అఖిల భారత సంస్థాన ప్రజల జనరల్ కౌన్సిల్ [illegible]ంచిన తీర్మానం ఈ క్రింది విధంగా వుంది

"హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ పైన నిషేధాజ్ఞలు ఇంకా అట్లాగే వున్నాయని జనరల్ కౌన్సిల్ ఆశ్చర్య పడుతోంది. భారతదేశం మొత్తంగా స్వతంత్రానికి చేరువగా ఉంటూంటే సంస్థానా లన్నింటిలోనూ బాధ్యతాయుత ప్రభుత్వాలు ఏర్పడాలని అందరూ అం[illegible]రించి అమలు జరుపుతూ వుంటే [illegible]గా న్యాయమైన రాజకీయ కార్యక్రమాలు కొనసాగించడం కూడదనే నిషేధాజ్ఞలు అట్లాగే వుండటం హైదరాబాదు సంస్థాన ప్రభుత్వం చాలా వెనుకబడి ఉందనేటందుకు స్పష్టమైన ఆధారం. ఈ వెనుకబడి, భూస్వామ్యతత్వపు పరిపాలనలో ఉన్న సంస్థానం [illegible] జనరల్ కౌన్సిల్ గమ

గొంతెమ్మ కోరిక వంటిది. దేశ పరిస్థితికి అనుగుణమైంది కాదు. ప్రజలకు తమ భావాలు చెప్పుకొనే అవకాశాలేమీ ఇవ్వని హైదరాబాదు ప్రభుత్వం ఆ రీతిగా చెప్పడం చాలా వింతగా కన్పించి,అది నిరంకుశ ప్రభుత్వాన్ని రక్షించుకొనేటందుకు వేసిన రాజకీయపు ఎత్తుగడ అనిపిస్తుంది. అటు వంటి కోరికను,ఆ ధోరణిలో ఉండే మరే కోరికలను మా సంఘం సహించ లేదు ఆ సంస్థానంలో ఉన్న ప్రజలకు మౌలికమైన పౌరహక్కులు లేక పోవడాన్ని కూడా ఇంకెంత మాత్రము సహించదు హైదరాబాదు సంస్థానం అట్లాగే వెనుకబడి ఉంటూ, ప్రజాస్వామిక స్వతంత్ర భారత దేశంలో నడిబొడ్డున నిరంకుశ పాలన కొనసాగిస్తూ ఉండే ద్వీపంలా సుర క్షితంగా ఉండగలనని భావించడము హాస్యాస్పదము,అసంభవము. భారత దేశపు భవిష్యత్తును గురించి జరిగే చర్చాగోష్ఠుల్లో తన పౌరులకు మౌలిక. మైన పౌరహక్కులను ఇయ్యని ఏ సంస్థానానికీ చోటుండదు హైదరాబాదు సంస్థాన ప్రభుత్వము, భారత దేశపు భావి ప్రభుత్వాన్ని గురించి చర్చలు జరుపుతున్న సమావేశాల్లో కూర్చునే అర్హత సంపాదించుటకు, తన విధానాలను పూర్తిగా మార్చుకొనాలి.

స్టేట్ కాంగ్రెసు పైన ఉన్న నిషేధాజ్ఞ ఇట్లాగే కొన సాగిస్తూ ప్రజలకు ఇతర మౌలిక పౌర స్వాతంత్ర్యానికి ఆటంకం కలిగిస్తూ ఉంటే స్టేట్ కాంగ్రెసు నిషేధాజ్ఞను మూలకునెట్టి సంపూర్ణ పౌర స్వాతంత్ర్యంతో వ్యవహరించ వలసి ఉంది ”

జనరల్ కౌన్సిల్ కావించిన ఈ తీర్మానాన్ని కార్య రూపంలోకి తీసుకొని రావడానికి నా అధ్యక్షను ఒక తాత్కాలికకమిటీ ఏర్పాటైంది, ఆ కమిటీ మొదటి సమావేశం హైదరాబాదులో జరిపేటందుకు నిశ్చయించి ఆ ప్రకారం నోటీసు ద్వారా తెలియ జేశాము సంస్థాన ప్రభుత్వం అఖిల భారత సంస్థాన ప్రజల సమ్మేళనం చేసిన తీర్మానపు ధోరణిని మా కార్యా చరణ నిశ్చయాన్ని తెలుసుకో గలిగింది.3 జూలై 1946 నాడు ప్రభుత్వం స్టేట్ కాంగ్రెసుపై నున్న నిషేధాజ్ఞను తొలగించింది.

నిషేధాజ్ఞ రద్దుతో ఎనిమిది సంవత్సరాల అజ్ఞాత వాసం పూర్తి అయింది బాధ్యతాయుత ప్రభుత్వం కోసం హైదరాబాద్ ప్రజలను సమీకరించి కృషిచేసే స్వాతంత్రం లభించింది. కొత్త ఆశా తరంగము గోచరించింది తాత్కాలిక కమిటీ సమావేశమై సంస్థానాలలో స్వతంత్రంకోసం జరిగిన పోరాటంలో పాల్గొని బాధలకు గురియైన వారి ధైర్యానికి అంజలి ఘటించింద

—o—

# 29. పరిపాలనా సంస్కరణల నిరాకరణ

నేను వెంటనే హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసును పటిష్ఠం చేసేపని చేపట్టాను. ఆంధ్రమహాసభలో జాతీయ పక్షానికి శ్రీ జమలాపురపు కేశవరావు నాయకత్వం వహించారు ఆయన, ఉత్సాహవంతులైన యువకుల దళాలు నిర్మించి క్రమంగా పెంచడం ప్రారంభించాడు. అభివృద్ధి(ప్రగతి)వాదులు కమ్యూనిస్టు ప్రభావంనుండి వదిలించుకొని ఏ హడావుడి చెయ్యకుండా పట్టుదలతో పనిచేసి సంస్థను కైవసం చేసుకున్నారు. వృద్ధ నాయకత్వం దానికి తల ఊపింది కమ్యూనిస్టులు తమ దురాలోచనలకు రూపకల్పన చేయసాగారు. క్విట్ ఇండియా ఉద్యమం సాగుచున్నప్పుడే హైదరాబాదులో కమ్యూనిస్టులు ప్రజా ప్రభుత్వం అనే నినాదాన్ని లేవదీసి బాధ్యతాయుత ప్రభుత్వం అనే ఆదర్శాన్ని దెబ్బకొట్టారు మరో కొంత ముందుకు కూడా నడిచారు ముస్లిము మతావేశపర సంస్థ అయిన ఇత్తెహాదుల్ ముస్లిమీన్ నాయకుల వాదాన్ని అంగీకరించి హిందూ ముస్లిమ్‌లకు సమాన ప్రాతినిధ్యం ఉన్న జాతీయ ప్రభుత్వం హైదరాబాదులో వెంటనే ఏర్పాటు కావాలనే ప్రచారం సాగించారు. ఈ వాదాన్ని కాంగ్రెసు వర్గాలు గట్టిగా నిరసించాయి ఈ రీతిగా కమ్యూనిస్టులు సాగిస్తున్న జాతి వ్యతిరేక కార్యక్రమాల మూలంగా స్టేట్ కాంగ్రెసు సహజంగా కాంగ్రెసు తత్వాన్ని అనుసరిస్తున్న ఆంధ్రమహాసభవారిని తనతో కలుపుకొన్నది

కర్నాటక పరిషత్ ఈసరికి బాగా అభివృద్ధి చెందింది.అనుభవజ్ఞుల

వళి ననుసరించి కృషిచేస్తూ ప్రజాసేవ చేస్తున్న కార్యకర్తలు తయారయే టందుకు ఉనికి పట్టయింది శ్రీ హనుమంతరావు అధ్యక్షత వహించిన కాలంలో సంస్థ ఉత్తేజంతో పని చేసేటందుకు కృషిచేస్తూ, యువకులు ముందుకు వచ్చి బాధ్యతలు వహించేటట్లు ప్రోత్సహించారు

ఆయన అంత పెద్దగా చదువుకొన్నవాడు కాకపోయినా యువ తరపు భావాలు, ఆశయాలు, వేగంగా వస్తున్న మార్పులు అర్థం చేసుకొని వ్యవహరించ గలిగినవాడు ఆ సభ (పరిషత్) కూడా స్టేట్ కాంగ్రెసుతో కలిసిపోయి దానిలో అంతర్భాగమైంది. బీదర్ (Bidar) పట్టణంవాడూ, యువకుడూ, తాత్త్విక చింతనకల అనాసక్త చిత్తుడూ, అయిన శ్రీ మురళీధర్‌రావు కామ్‌టికర్ స్వాతంత్ర్య పోరాటానికి ఏడుగడ. ఆయన మనఃస్ఫూర్తిగా ఈ పోరాటంలో దూకి అనేక బాధలు, కష్టాలు అనుభవించి, ఎన్నో తుపానుల నెదుర్కొన్న ధైర్యశాలి; కార్యకర్తలకు ఆదర్శమైనవాడు.

మహారాష్ట్ర మండలి (సభ)కుడా బాగా అభివృద్ధి చెందింది. వందల కొద్దీ యువకులు తెలివైనవారు, అభినివేశం కలవారు దాని నీడలో పని చేశారు శ్రీ పరాఫ్, అతని సహచరులూ దానికి శక్తినిచ్చి ప్రజాస్వామ్య శక్తులకు పుష్టికలిగించారు. వారు ఉపన్యాసాలూ, ప్రతి కార్యక్రమంలోనూ ఈ పోరాటంలో గర్భితమై ఉన్న సామాజిక ఆర్థిక దృక్పథాన్ని ప్రజ లకు వివరిస్తూ నడిపించారు మరాట్వాడా ప్రాంతంలో ఉన్న అనుభవజ్ఞులైన నాయకులు, ఆ ప్రాంతంలో స్వాతంత్ర్య పోరాట బలాలకు శక్తి సామర్థ్యాలు కలిగించే కృషిలో ముఖ్యపాత్ర వహించారు వారందరిలో శ్రీ ఎమ్ కె వహాడే అనుభవంలో పెద్దవాడు ఆయనకు వ్యవస్థమీద తిరగబడటంలో ఉన్నశక్తి సాహసములు అందరికీ బాగా తెలును మరాట్వాడా ప్రజాజీవనంపైన ఆయన చెరగని ముద్రవేశాడు శ్రీ ఎస్ కె. వైశంపాయన్ హైదరాబాద్ సంస్థానంలోనూ, అందులోనూ ముఖ్యంగా మరాట్వాడాలోనూ ప్రజా ఉద్యమనిర్మాణంలో సార్థకమైన పాత్ర వహించాడు నాందేడ్‌కు చెందిన శ్రీ శ్యామ్‌రావ్ బోఢంకర్ స్వాతంత్ర్య

పోరాటంలో ముఖ్యమైన పాత్ర నిర్వహించాడు ఉన్నత విద్యాభ్యాసం చేసినవాడు కాకపోయినా ప్రజా పీడనశక్తులను ఆయన మనసారా ఎదిరించాడు. నిరంకుశ ప్రభుత్వాన్ని వేళ్ళతో పెకలించడానికి జరిగిన ప్రతి ప్రయత్నంలోనూ తలెత్తిన ప్రతి ఉద్యమంలోనూ ఆయనే అగ్రగామి. ఆరోజుల్లో రాజకీయ వాదులకు ఆశ్రయమివ్వడం సామాన్యమైన విషయంకాదు, తను స్వయంగా చురుకైన కార్యకర్త తన సహాయాన్ని, సలహాలను, మార్గదర్శిత్వాన్ని కోరి, దగ్గరకు వచ్చినవారందరినీ ఆయన ప్రోత్సహించాడు. ఆయన ఇల్లు రాజకీయ భావాలుకల ప్రజలందరికీ తీర్థ క్షేత్రము. అది ప్రజాసేవకులందరికీ, వారు ఏ రాజకీయ పార్టీకి చెందిన వారైనప్పటికీ సరే, అన్నపూర్ణ సత్రము. ఆయన ప్రసక్తిలేకుండా మరాట్వాడాలోని రాజకీయ జీవితాన్ని పూర్తిగా వివరించడం సాధ్యం కాదు. ఆయన తనకున్నదంతా స్వాతంత్ర్య పోరాటంలో పణంగాపెట్టి కర్చుచేశాడు.

శ్రీ ఆర్. జి (బాబాసాహేబ్) పరంజపే ఈ ప్రాంతంలోని యువకులలో నూతన చైతన్యం కలిగించాడు ఆయన 33 సంవత్సరాల క్రిందిట నన్ను హిప్పర్గి (Hipparg!) లో కలుసుకున్నాడు నాటినుంచి నాతో కలిసిమెలిసి ఉంటూ అనేక ప్రజాహిత కార్యాల నిర్వహణలో కుడి బుజం అయాడు. ఆయన శ్రోతలను భావావేశంతో కదిలించగల ప్రతిభావంతుడు. మంచి వక్త. స్వాతంత్ర్య పోరాటంలో ఆయన పాత్ర ప్రశంసనీయము.

ఆయన గొప్ప మానవతావాది. ఆయన జీవితం పూర్తిగా ప్రజలకు అంకితమైంది. ఆయన జీవితంకోసం ఎప్పుడూ కొలువు చెయ్యలేదు. నాకు నా ఆధ్యాత్మిక జీవనయాత్రలో సహాయంచేసిన అతికొద్ది మందిలో, ఆయన ఒకరు.

శ్రీ ముకుందరావు పెడ్‌గాంకర్ మరాట్వాడాలోని కాంగ్రెసు వారిలో ఎక్కువ అనుభవం ఉన్నవాడు ఆయన స్వాతంత్ర్య వీరులను

సమీకరించడంలో నేర్పరి ఆయన వివిధ అనుభవాలు పరిపాలనాను భవమూ కలవాడు అందుచేత ఆయన చెప్పింది వేదం అనీ అధికార పూర్వకమైన సూత్రమనీ అనిపించేది శ్రీ దేవిసింగ్ చౌహాన్‌హిప్పర్గి స్కూల్‌లో తయారైన వాడు. పేదకుర్రవాడు, కష్టపడి విశ్వవిద్యాలయపు చదువుపూర్తిచేసాడు. అయినా స్వతంత్రపోరాటంలో దూకి చురుకుగా పని చేసి, అందువల్ల ... నష్టపోయిన వాడు.

శ్రీ భగవాన్ దావ్ గంజ్‌వె నాండేడ్ నివాసి, ఏమీ గడబిడ చేయకుండా నిదానంగా, శాంతంగా, పట్టుదలతో సేవా కార్యక్రమాలు నిర్వహించే మనిషి అందరూ గౌరవించే పెద్దమనిషి. మరాట్వాడా కార్మికలోకంలో ఈయన చోటు ఉన్నతమైనది మహారాష్ట్ర మండలిలో వృద్ధనాయకులు, యువతరం అనే విభేదాలు లేవు పాతకొత్త తరాలు రెండూ కలిసి పోయి, ఒకే ఒక ప్రగతిశీల వర్గంగా ఏర్పడి అది జిగిబిగి ఉన్న సంస్థఅయింది. అందువల్ల మరాట్వాడా యూనిట్‌కి విశేష శక్తి సామర్థ్యాలు కలిగాయి మరాట్వాడా యూనిట్, ఆంధ్ర, కర్నాటక యూనిట్‌లతో స్టేట్ కాంగ్రెస్‌లో లీనమైనప్పుడు దానికి ... చరణ శీలాన్ని, గతి శక్తిని విజయ పరంపర సాధన కావశ్యకమైన గమన లాఘవాన్ని కలిగించింది. స్టేట్‌కాంగ్రెస్ ఒకరూపంధరించగానే ఆ సంస్థకు కార్యదర్శిగా పనిచెయ్యగల సమర్థులు ఎవరు అనేది నా ముఖ్యమైన సమస్య అయింది ఆ కార్యదర్శి ఆంధ్ర ప్రాంతం వాడై వుంటె బాగుంటుంది నా దృష్టి శ్రీ మాడపాటి రామచంద్ర రావుపై పడింది ఆయన ఇంతకు ముందు ఉద్యమాలు నిర్వహించి, విశ్రాంతి తీసుకొనే ఉద్దేశంతో తన గ్రామానికివెళ్లి అక్కడ వున్నాడు ఆయనకు పరిస్థితులను గురించి మంచి అవగాహన వుంది ఆయన మంచి ద్రష్ట కార్యరంగంలో వుండి పనిచేసి పేరు పొందుతూ, పక్కకు తప్పుకొని వార్తలలో ... దోబూచు లాడుతూ కాలం గడుపుతున్న వాడు నేను ఆయనను కలుసు కొన్నాను. హైదరాబాదు ప్రజలకు ప్రజాస్వామ్య పరిపాలన సాధించె కార్యక్రమంలో నాతో కలిసి పనిచేయ ప్రసించని కోరాను. ఆయన వెంటనే అంగీకరించి తన సేవలు అర్పించిన త్యాగి. ... నా అత్యంత

సన్నిహిత సహచరుడు. ఆయన సూచనలు సలహాలు ఎంతో విలువైనవి, మా ఇరువురి మధ్యా పరస్పర ప్రేమ గౌరవాను బంధము పెరిగింది. అనేక సమస్యల గురించి నేను ఆయనతో విభేదించాను. అయినప్పటికీ నాకు ఆయన పట్ల ఉన్న గౌరవం ఎప్పుడూ తగ్గ లేదు.

చేయ వలసిన కొత్తపనులు, ఎన్నో మాకెదురైనాయి. మేము తుది పోరాటం జరపడానికి సంసిద్ధులం కావాలి: మా సంస్థ హైదరాబాదు రాష్ట్రం అన్ని మూలలకు వ్యాపించి చొచ్చుకొని పోవాలి మాకు ఐకమత్యంతో పనిచేస్తున్న కార్యకర్తలున్నారు నేను వారితో సమానంగా కలసిమెలసి మెలగే వాణ్ని.నాకు హైదరాబాదు స్వాతంత్ర్య పోరాటంలో త్యాగబుద్ధితో, శక్తినంతా ధారపోసి పనిచేసిన ధీమంతు లెందరితోనో బుజంబుజం కలిపి పనిచేసే అదృష్టం కలిగింది ఒకవైపున కమ్యూనిష్టులతోను, మరొక వైపున మతావేశ పరులతోను, మెత్తని మనస్సుతో ఒదిగి ఒదిగి వుంటూ సర్దుకు పోయే వర్గంతో ఇంకొకవైపునా పోరాడ వలసి వచ్చేది. ప్రగతి శీల వర్గాలను కూడగట్టుకొని నడిచే టప్పుడు సామాజిక ఆర్థిక దృక్పథం కచ్చితంగా నిర్మొగమోటంగా అనుసరించ వలసి వచ్చేది. అప్పుడప్పుడు సంస్థలో కొన్ని అసాధారణ పరిస్థితులు ఏర్పడే వంటే ఎమీ ఆశ్చర్య పడనవసరం లేదు. అవి వివిధ సమస్యలను అర్థం చేసుకొనడంలో, వాటికి సంబంధించిన అభిప్రాయాలలో కలిగిన భేదాల వల్ల సంభవించినవే అది తప్పదు. అందులో వ్యక్తిగతమైనదేమీ లేదు

స్టేట్ కాంగ్రెస్ పని చెయ్యడం మొదలు పెట్టిందో లేదో వెంటనే రాజకీయ రంగంలో ఒక క్లిష్ట పరిస్థితి ఎదురైంది. హైదరాబాదు ప్రభుత్వము, సంస్థానంలో పరిపాలనా విధానాన్ని పరిశీలించి దాన్ని మెరుగు పరిచేటందుకు సూచన లియ్యవలసిందిగా అయ్యంగార్ కమిటీని ఇంతకు ముందే నియమించింది. తర్వాత ఆ కమిటీ నివేదికను ఆధారంగా గ్రహించి ప్రభుత్వం కొన్ని సంస్కరణలు రూపొందించింది అవి అక్కర్లేదనీ వాటివల్ల ప్రయోజనం ఏమీ లేదనీ అందరూ నిరసించారు. అయినా అవేవీ లెక్కచెయ్యకుండా ఆ సంస్కరణ పథకాన్ని ప్రజలమీద

బలవంతంగా రుద్దాలని, ఇటీవల సంస్థాన ప్రభుత్వం నిర్ణయించింది. అదీ కొత్తగా ఏర్పడిన క్లిష్ట పరిస్థితి వివాదానికి కారణమైన ఆ సంస్కరణలు ప్రజాస్వామ్య భావాలన్నింటికీ వ్యతిరేకమైనవి. వృత్తిపనులు ఆధారంగా ప్రతినిధులను ఎన్నుకొనడము, అన్ని మతాల వారికి సమానపు ప్రాతినిధ్యము వాటి లక్షణాలు ఇందు వల్ల నిజంగా ముస్లిములకు అదనపు ప్రాతినిధ్యం లభిస్తుంది సంస్కరణలలో బాధ్యతాయుత ప్రభుత్వము అన్న మాటేలేదు ఇచ్చిన అధికారాలు అతి స్వల్పము. అసెంబ్లీకి (శాసనసభకు) ఎన్నిక అవాలంటే తన కులం, మతం, వృత్తి నియోజక వర్గం వోట్లలో 51 శాతం వస్తే చాలు ఇండియా స్వాతంత్ర్యాన్ని పొందేటందుకు తయారై ఉండగా, ఇతర స్వదేశ సంస్థానాలన్నింటిలో ప్రజాసామ్య పరిపాలన ప్రారంభం కాబోతూ వుండగా భూస్వామ్య భావాలున్న ముస్లిమ్ పెత్తందారీ హైదరాబాదులో మధ్యయుగం చరిత్ర నాటి చీకటికోణాల ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడానికి సంస్థాన ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్, అటువంటి అప్రస్తుత, అయుక్త, కాలదోషం పట్టిన పరిపాలనా సంస్కరణల పథకాన్ని అమలులోకి రానియ్యకూడదు అని భావించింది. కాని, ప్రభుత్వం అధికార గర్వంతో తన ఆలోచనలు మానలేదు సర్ మీర్జా ఇస్మాయిల్ వంటి అనుభవజ్ఞుడు కూడా హైదరాబాదు పరిపాలనా వ్యవస్థలో ప్రజా హితకరమైన మార్పులు చెయ్య లేక పోయినాడు బుద్ధిజీవులందరూ ఈ సంస్కరణల పట్ల తమ అసంతృప్తి తెలియ జేసారు సంస్థానం ఈ చివరినుండి ఆ చివరి వరకు అసంతృప్తి అల్లుకొని పోయింది ముస్లిముల కున్న ప్రత్యేక సదుపాయాలను తగ్గించే టటువంటి ప్రగతిశీల చర్య దేనినైనా సరే ఇత్తెహాదుల్ ముస్లిమీన్ వ్యతిరేకిస్తుంది. పరిపాలన కొనసాగించే ఉద్యోగి వర్గాలన్నీ స్టేట్ కాంగ్రెస్ కార్యకర్తలకు వ్యతిరేకము హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ స్థాయిసంఘము కచ్చితంగా ఏ సందేహానికీ అవకాశం లేని మాటలలో ఈ పథకానికి తన వ్యతిరేకతను ప్రకటించింది అంతేకాదు, ఆ పథకాన్ని అనుసరించి జరిగే ఎన్నికలను బహిష్కరించవలసిందని ప్రజలను ఆదేశించింది. స్థాయి

సంఘము, తన క్రియాశీల వ్యతిరేకతను ఈ క్రింది తీర్మానంలో సూచించింది —

"రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తర్వాత మానవజాతి, ప్రజాస్వామిక సమాజంగా మార్పు చెందుతోంది. ప్రజల బలాలు విజయవంతంగా అన్ని దేశాలలోనూ ప్రజాస్వామ్యాన్ని ఏర్పాటు చేయడానికి ముందడుగు వేస్తున్నాయి. హిందూదేశంలో కూడా ప్రజలు సామ్రాజ్యవాద దాస్యాన్ని వదలగొట్టుకొని సంపూర్ణ స్వాతంత్ర్యం లక్ష్యంవైపు పరుగిడుతూ ఒక గొప్ప నూతన సాంప్రదాయాన్ని రూపొందించి ఘనత కెక్కారు. బ్రిటిషు మంత్రివర్గ కమిషను ఇండియాను సందర్శించేటందుకు విచ్చేయడానికి, భారతజాతి వ్యక్తంచేసిన బలం, ప్రజల త్యాగాలు మొదలైన వానితోపాటు అంతర్జాతీయ పరిస్థితిలో ఏర్పడిన కొత్త దృక్పథం కూడా కారణమైంది. అయితే, వారి ప్రతిపాదనలు పరిశీలిస్తే వారు ఏషరతులు లేకుండా వెంటనే అధికారాన్ని భారతీయులకు దత్తం చేయ దలచినట్లు కన్పించదు. భారతదేశ స్వాతంత్ర్య సమస్య ముఖ్యంగా భారత ప్రజల సార్వభౌమత్వానికీ వారి భవిష్యత్తును ఏ నిర్బంధాలూ లేకుండా వారే ఎట్లా నిర్ణయించుకోవాలి అనే హక్కుకీ సంబంధించిన విషయమని హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు స్థాయిసంఘము వారు అభిప్రాయ పడుతున్నారు, కాని బ్రిటిషు మంత్రివర్గ కమిషనువారు, సంస్థానాలలోని ప్రజలపట్లా వారి ప్రతినిధుల యెడలా వ్యక్తంచేసిన చిన్నచూపు గర్హించవలసిన విషయమని భావిస్తున్నారు. సంస్థానాలలో కొనసాగుతున్న నిరంకుశ పరిపాలన గురించికాని, వాటిలో ప్రజాస్వామ్య పరిపాలనా విధానాలు ప్రవేశపెట్టవలసిన ఆవశ్యకతను గురించికాని, కమిషనువారు పెదవి కదపలేదు. సంస్థానాల ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రతినిధులకు భారత రాజ్యాంగ చట్ట నిర్ణయ సభలో ప్రాతినిధ్యమిచ్చే ఏర్పాట్లేవీ ఇంతవరకూ జరగలేదు. నిరంకుశ పరిపాలకుల పరిపాలనలో ఉన్న స్వదేశ సంస్థానాలు ఇండియన్ యూనియన్‌లో భాగస్వాములుగా ఉండకుండా, వెలుపలకాని విడివిడిగా స్వతంత్రులుగా గాని ఉండిపోయ

ఉన్నాయి. భారతదేశ ఐక్యతకు, స్వాతంత్ర్యానికి ప్రమాదం ఏర్పడగలదు. ఈ స్థాయీసంఘము, స్వతంత్ర భారతదేశము రాష్ట్రాల సమాఖ్యవంటిదై ఉండాలనీ, అది స్వేచ్ఛతో, స్వతంత్ర వ్యక్తిత్వం నిలబెట్టుకొంటూ, స్వపరిపాలన (autonomy) సాగించుకొంటున్న రాష్ట్రాల సమాఖ్య అనీ, ఆ రాష్ట్రాల వ్యవస్థీకరణకు సాంస్కృతిక భాషా విషయాలు ఆధారంగా ఉండాలనీ అన్ని రాష్ట్రాలలో పరిపాలనా ఒకే పద్ధతిలో ప్రజాస్వామ్య విధానాల ననుసరించి సాగాలనీ, అభిప్రాయ పడుతున్నది.

ఈ ప్రతిపాదనల తర్వాతకూడా సంస్కరణలని పేరుపెట్టిన పథకాన్ని హైదరాబాదు ప్రజలపై రుద్దినట్లయితే, వారికి పౌరస్వాతంత్ర్యం, బాధ్యతాయుత పరిపాలన ఉండదని చెప్పవచ్చు. ఈ పథకంలో పెట్టుబడి దారులు కొనసాగిస్తున్న పనులకు ప్రోత్సాహం ఉంటుంది నీతిబాహ్యము ప్రజాస్వామ్య వ్యతిరేక సూత్రము అయిన మత సమానత్వ విధానము 12 శాతపు అల్ప సంఖ్యాక వర్గాన్ని బహు సంఖ్యాక పరిపాలన వర్గంగా మార్చి వేయ గలుగుతుంది ప్రజలలో 18 శాతంగా ఉన్న హరిజనులకు వారి జనాభా నిష్పత్తి ననుసరించి ఎన్నికల ద్వారా భర్తీచేసే సీట్లలో ప్రాతి నిధ్యంఇవ్వ విషయాన్ని గురించి పట్టించు కొనక పోవడం వింతగా వుంది ఇతర అల్ప సంఖ్యాక వర్గాలవారికి ఎన్నికలలో పోటీచేసే అవ కాశం కూడా లేదు ప్రజలలో అధిక సంఖ్యాకులు కిసాన్‌లు (రైతులు) కూలీలు పరిపాలనలో వారి మాటకు ఏమీ చెలా మణీ లేదు

సభలో ఉండే 132 మంది మెంబర్లలో నామినేటెడ్ మెంబర్లు 56 మంది. అందుచేత మొగ్గు ఎక్కువగా నామినేటెడ్ మెంబర్లవైపే ఉంది. భూస్వాములు, వారితో వ్యాపార సంబంధాలున్న పెట్టుబడి దార్లూ అధికారమూ, పెత్తనమూ చెలాయిస్తారు వారందరూ కలిసి వజ్ర సన్నిభమైన (ముష్టి) పిడికిలి చూపించి ఏ మార్పూ రాకుండా యథాస్థిత వ్యవస్థను నిలబెడతారు. వోటువేసే హక్కు ఉన్నవారి సంఖ్య అతి పరిమితము. శాసనసభకు ఉన్న అధికారము కేవలము సిఫారసు చెయ్య డము మాత్రమే కాబట్టి అది చుట్టు గట్టి దడికట్టి (కంచెవేసి) బంధిం

చిన జైలువంటిదని అనవచ్చు. ఇది, సంపూర్ణ ప్రజాస్వామిక ప్రభుత్వం ఏర్పాటు చేసుకొనే దిశలో హుటాహుటిగా పెద్దపెద్ద అడుగులు వేసుకొంటూ నడవవలసిన కాలం ప్రజలదే సర్వాధికారాలూ అని గుర్తించాలి. ప్రజలకే సంస్థాన పరిపాలనకు కావలసిన చట్టాన్ని చేసేటందుకు ఆ చట్టంలో ఇండియన్ యూనియన్‌లో సంస్థానం ఒక భాగం అనే అంశాన్ని ప్రతి పౌరుడికీ ఉన్న మౌలిక హక్కులన్నీ, పొందుపరిచేటందుకూ హక్కు ఉంది. ఇట్లా చేయడంవల్లనే శాంతి, సౌఖ్యం, ఉండి దుఃఖము, దోపిడి లేని ప్రజాస్వామ్య జీవనానికి గట్టి పునాదులు ఏర్పాటుఅవుతాయి. ఆ రాజ్యాంగ చట్టమే ఘనత వహించిన ప్రభువుల ఆధిపత్యంక్రింద బాధ్యతాయుత ప్రభుత్వము కొనసాగాలని విధించాలి. వయోజన వోటింగు హక్కుద్వారా ఎన్నుకొనబడిన శాసనసభకే అన్ని విషయాల గురించీ పూర్తి అధికారాలు ఉండాలి. ఆ రీతిగానే భారత దేశీయ రాజ్యాంగ చట్ట నిర్మాణ సభకుకూడా సంస్థానం నుంచి ప్రతినిధులను జనాభా ప్రాతిపదిక మీద ఎన్నుకొని పంపించాలి.

పైన పేర్కొని, వివరించిన కారణాలవల్ల స్థాయిసంఘము ఈ కొత్త సంస్కరణల పథకాన్ని పూర్తిగా నిరాకరిస్తున్నది. వాటిని వెనుకకు తీసు (ఉపసంహరించు) కొనవలసిందని ప్రభుత్వాన్ని కోరుతున్నది. స్థాయి సంఘము ఇంతకుముందు తాను వివరించిన మౌలికమైన ప్రజాస్వామిక హక్కుల పరిరక్షణ కోసమూ సంస్కరణల పథకాన్ని అమలు చేయకుండా నిరోధించడానికీ, సమర్థమైన కార్యాచరణ పథకాన్ని రూపొందించవలసిందని వర్కింగ్ కమిటిని ఆదేశిస్తున్నది.

పైన చర్చించిన విషయాల ప్రాధాన్యతను, ఆవశ్యకతను గుర్తించవలసిందనీ ముంచుకొని వస్తున్న మతావేశపు ప్రమాదాన్ని గమనించ వలసిందనీ ఏ మతానికీ ప్రాధాన్యం ఇవ్వని రాజకీయ వ్యవస్థ నిర్మాణం, అవశ్యకమని గుర్తించవలసిందని స్థాయిసంఘము సంస్థాన ప్రజలను హెచ్చరించుచున్నది.

మౌలికమైన హక్కులు పౌరజీవనంలో ప్రతి పౌరుడికీ ప్రాణం వంటివి. హిందూదేశం తన భవిష్యత్సమాజాన్ని తీర్చిదిద్దుకొనేటందుకు పునాదులు వేస్తున్న ఈ నాడు వాటిని నిల బెట్టుకోవడం ప్రాణావసరం, అర్జంటు. అందుచేత ఈ సంస్కరణలను నిరాకరించ వలసిందనీ మీ హక్కులను స్టేట్ కాంగ్రెసు నాయకత్వం కింద పోరాడి త్యాగాలు చేసి సాధించు కొన వలసిందని ఆహ్వానిస్తున్నాము "స్టేట్ కాంగ్రెసు ఉద్దేశించిన ఈ కార్యక్రమం సంస్థా పరంగా స్వతంత్రమైంది. ఈ కార్యక్రమానికీ దీనికీ స్టేట్ కాంగ్రెసు ఇంతకు ముందు ప్రారంభించిన, మున్ముందు ప్రారంభించ నున్న (17 8 1946) మరే ఉద్యమం తోటీ ముడి (లింకు) లేదు అని, గమనించ వలసిందిగా స్థాయిసంఘం ప్రజలను కోరుతున్నది భారత కాంగ్రెసు వర్కింగ్ కమిటీ, వార్ధాలో సమావేశమైంది. అప్పుడు సంస్కరణల పథకాన్ని స్థాయిసంఘం చేసిన తీర్మానాన్ని వారి ముందుంచడం జరిగింది. అంతకు ముందేనేను మహాత్మాజీతో అందులోని విషయాలు చర్చించి,ఎన్నికల బహిష్కరణకు ఆయన ఆమోదాన్ని పొందాను పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, ఇతర సభ్యులూ కలిసి ఈ విషయాన్ని కూలంకషంగా సమగ్రంగా తరచి తరచి పరిశీలించి, స్థాయిసంఘం చేసిన నిర్ణయాన్ని సమర్థించారు. 13 ఆగష్టు 1946 నాడు వార్ధాలో భారతజాతీయ కాంగ్రెసు వర్కింగ్ కమిటీ పైవిషయాన్ని చర్చించి, రావించిన తీర్మానాన్ని ఈ క్రింద ఇస్తున్నాను

"హైదరాబాదు సంస్థానంలో పరిపాలనా చట్టంలో చేయ నున్న మార్పులను గురించి ఇటీవల జరిగిన ప్రకటనను వర్కింగ్ కమిటీ పరిశీలించింది ఆ ప్రతి పాదనలు సదుద్దేశంతో చేసినవి కావు వాటివల్ల లభించిన అవకాశాలు [illegible] వాటిని కూడా అందులో ఉన్న అడ్డంకులు, కేటాయింపులు నిర్జీవం చేస్తున్నాయి. వీటిని బహుశా ప్రజలకు ఏ మాత్రమూ స్వతంత్రం ఇవ్వకుండా ఇప్పుడు సంస్థానంలో కొనసాగుతున్న భూస్వామిక పరిస్థితులు శాశ్వతం చేసేటందుకూ పెట్టుబడి దారుల కున్న సదుపాయాలు నిరాటకంగా సాగించే టందుకు ఉద్దేశించినట్లు కనిపిస్తున్నది

ఈ సంస్కరణలలో వున్న సూత్రాలు వాటికి ఆధారమైన విషయాలు న్యాయ సూత్రాలకూ, ప్రజా స్వామ్యానికీ విరుద్ధంగా వున్నాయి. అందుచేత అవి ఏ కాలంలో అయినా సరే అభ్యంతరకరంగా వుంటాయి. ఇండియా స్వతంత్రం కానున్న సమయంలో ఈ సంస్కరణలు సందర్భోచితంగా గాని, పరిస్థితులకు తగినట్లుగా గాని, ప్రజల కష్టసుఖాలకు, అనుగుణంగా గాని లేవు స్వతంత్ర భారత దేశానికి సన్నిహిత భవిష్యత్తులో తీర్చిదిద్దనున్న రాజ్యాంగ చట్టంలో ఇముడ్చటానికి అసలే పొందిక లేదు ఒకవంక ఇండియాలో వున్న స్వదేశ సంస్థానాలన్నీ బాధ్యతాయుత పరిపాలన దిశలో వేగంగా అభివృద్ధి చెంది స్వతంత్ర భారతంలో స్వపరిపాలిత ప్రాంతాలుగా రూపు దిద్దు కొంటుండగా మరొక వంక ఆ దేశంలోని ముఖ్యమైన స్వదేశ సంస్థానమే, ప్రముఖమైన పౌరస్వత్వ హక్కులలో వెనుక బడి ఉండటం, ప్రగతి శీలమైన మార్పులకు విముఖంగా ఉండటం గమనించి విచారాన్ని వెల్లడిస్తున్నాము హైదరాబాదు ప్రభుత్వం వారిచే ప్రతిపాదింప బడిన సంస్కరణలు కనక అమలు చేసినట్లయితే ప్రజలకు ఇప్పుడున్న స్వతంత్రం కూడా వుండదు, అది స్వాతంత్ర్యాభి వృద్ధి అనిపించుకోదు అందు చేత కొత్త పరిపాలనా చట్టాన్ని ప్రజల ఇష్టంప్రకారం రూపొందించి ప్రజల ఆమోదం పొందవలసి వుంటుందనీ ఈ కమిటీ వారు అభిప్రాయ పడుతున్నారు

స్టేట్ కాంగ్రెసు స్థాయిసంఘము ఈ కొత్తపథకాన్ని నిరాకరించి అందులో పాల్గొనమంటూ తీసుకున్న నిర్ణయాన్ని ఈ కమిటి ఆమోదిస్తున్నది."

సంస్కరణలను వ్యతిరేకిస్తూ ఉద్యమాన్ని ప్రారంభించేటందుకు ఏర్పాటు చేయడంలో మేము నిమగ్నులమైనాము సంస్థానం అంతటా పెద్ద సమావేశాలు జరిపాము ప్రజల నుంచి వచ్చిన స్పందన అపూర్వం. పట్నం నుంచి పట్నానికి, పల్లెనుంచి పల్లెకి ప్రచారం సాగింది. ప్రత్యక్ష చర్య పథకాన్ని విఫలం చెయ్యాలని ప్రభుత్వం అనుకున్నది కాని,

చాలా పోలింగ్ బూతులలో వోటింగు జరగనే లేదు ప్రభుత్వం దారి ప్రభుత్వానిది అది ప్రజలు అంగీకరించనిది. ప్రజలదారి ప్రజలది అనే విషయాలు రుజువైనాయి

ముస్లిములు ఆయుధాలు ధరించి ఎన్నికల బహిష్కరణ ఉద్యమం సాగకుండా చేద్దామని ప్రయత్నించినట్లు నాకు రిపోర్టులు వచ్చాయి కాంగ్రెసు కార్యకర్తలు సమావేశాలు ఏర్పాటుచేస్తే, సాయుధులైన ముస్లిములు వారి చుట్టూ మూగేవారు. వారు ఇత్తెహాదుల్ ముసల్మీన్ వారే; కాంగ్రెసు కార్యకర్తలను కొట్టారు మహారాష్ట్రనుంచి వచ్చిన ఒక పేరున్న కాంగ్రెసు నాయకుణ్ణి సంస్కరణ పథకాన్ని బహిష్కరించవలసిందని చెప్పినందుకు నిర్దాక్షిణ్యంగా హత్యచేశారు శ్రీ గోవిందరావ్ పన్సారె మంచి శక్తిసామర్థ్యాలున్న కార్యకర్త ఆయన తన సేవాశక్తి మూలంగా ప్రజలకు ప్రేమపాత్రుడైనాడు. ఆయన హతుడవడంతో ప్రజాస్వామ్యవాదులందరికీ కనువిప్పైంది ఆయన హత్యోదంతం "ఉద్యమకారులు ఎదిరించవలసిన వారిలో ప్రభుత్వాన్ని ఒక్కటే మాత్రమే కాదు దాని ప్రక్కన ముస్లిమ్ ప్రజలలో అనేకమంది సాయుధులైనవారు కూడా ఉన్నారు" అనీ, రుజువైంది ఆ సాయుధులైన ముస్లిములు ప్రజాస్వామిక మార్పులకు వ్యతిరేకులు అల్పసంఖ్యాకులుగా ఉన్నవారు. కాని, అత్యధిక సంఖ్యతో ఉన్నవారిని మాట్లాడకుండా అణచివేస్తున్నారు.

సర్ మీర్జా సంస్థానానికి ముఖ్యమంత్రిగా నియమింపబడగానే గాంధీజీ ఆయనకు సంస్కరణలను గురించి ఈ రీతిగా వ్రాశారు. వాటిని నేను వార్తాపత్రికలలో చదివాను. అవి పేరుకే మాత్రమే సంస్కరణలు. అవి ఒక అడుగు వెనక్కు లాగున్నాయేగాని ముందుకు మాత్రం కాదు. మీరు వాటిని బాగా మనమ్మత చేసి మార్చగలరో లేదో నాకు తెలియదు కాని, వాటిని ఎందుకు చంపి పోనీయకూడదు - ఏ సంస్థానమైనా ఈ పరిస్థితిలో చేయగలిగింది ఆ సంస్థానంలో ఉన్న ప్రజల సదస్సుయొక్క ఆంతర్యాన్నీ, దాని బలాన్ని గుర్తించడమే. పండిట్ జవహర్లాల్ నెహ్రూ సంస్థాన ప్రజల సదస్సు అధ్యక్షుడు ప్ర--

బాగుకోసం వేసిన ఏ చట్టాన్నైనా అమలు చేసేముందు ఆయన ఆమోదం పొందితే మంచిది. అప్పుడది చకచకా సాగుతుంది మతావేశం రోజు రోజుకీ పెరిగిపోతోంది మేము ఎంత శాంతియుతంగా వాతావరణాన్ని ఉంచాలనుకున్నా మతద్వేషం రెచ్చగొట్టడం జరుగుతూనే ఉంది. నా కార్యక్రమ వివరాలు న్యూఢిల్లీలో భంగి కాలనీలో ఉన్న మహాత్మాజీ ముందుంచాను. వాటిని అంతకు ముందుగానే అఖిల భారత సంస్థాన ప్రజల సభస్సు అధ్యక్షుడు స్టేట్ కాంగ్రెస్ ఉద్యమ సారథి అయిన పండిట్ జవహర్లాల్‌తో చర్చించాను మేము అటవీ సత్యాగ్రహం పద్ధతి ప్రకారం కొంత కార్యక్రమం నడిపించాలనుకున్నాము కాని, మహాత్మాజీ ప్రమాదాన్ని శంకించి ఆ సత్యాగ్రహం వద్దు అన్నారు. కనీసం పరిమిత మైన సత్యాగ్రహమైనా చేబట్టాలని స్థాయిసంఘం మెంబర్లు, జిల్లాకమిటీల మెంబర్లు మాత్రమే సత్యాగ్రహం చెయ్యడానికి అనుమతిఇస్తే పెద్ద ఎత్తున ప్రజలలో మతకలహాలు జరిగే ప్రమాదం ఉండదు అనీ అనడం జరిగింది కాని, సంస్థానంలో అంతటా ఉద్రేక పరిస్థితులు నెలకొని ఉన్నందువల్ల ప్రత్యక్ష చర్య మానివేయాలనీ ఉద్యమాన్ని ఎన్నికల బహిష్కరణకు మాత్రమే పరిమితం చెయ్యాలనీ నిశ్చయం జరిగింది

ఈ చర్చలూ, నిర్ణయాలూ నేను పరిస్థితిని గురించి తీవ్రంగా ఆలోచన చేసేటట్లు కావించాయి ముస్లిమ్‌లు ఎందువల్ల ప్రజాస్వామ్య సిద్ధాంతాన్ని వ్యతిరేకించాలి ? ముస్లింలీగ్, బ్రాయిదే ఆజమ్‌కూడా ప్రజలలో విపరీతమైన అభిప్రాయాలు ప్రచారం చేశారు బ్రిటిషు సార్వభౌమాధికారము మతావేశపరులు, ఈరకపు ధోరణులు శ్రద్ధగా పెంచారు. హైదరాబాదు సమస్య దాని విషఫలితము ఆ సమస్య పరిష్కారానికి మానుండి సంపూర్ణ త్యాగం అవసరము. ఆ త్యాగఫలితంగా ఇండియాలో ఉన్న ప్రజాస్వామిక శక్తి సంపూర్ణంగా ఉవ్వెత్తుగా లేచి మతావేశ శక్తుల్ని నాశనం చేస్తుంది మరోదారిలేదు అందుచేత ఇప్పుడు ప్రజలలో కావలసింది బాధలు భరించి సహించేశక్తి, ఆత్మత్యాగము, కఠినపరీక్ష ఎదురుచూస్తోంది.

ఈ అధ్యాయాన్ని ముగించేముందు ఆనాటి హైదరాబాదు

రాజకీయ పరిస్థితిలో ఒక విషయాన్ని గురించి నిర్మొగమాటంగా నా మనసులో ఉన్నవి, ఉన్నట్లుగా చెప్పాలనే చాపల్యం కలిగింది. హైదరాబాదు సంస్థాన భూస్వామి తత్త్వం, మతావేశ సంకల్పం కలిసి రాజ్యమేలుతున్నాయి. అధికారం అనేది తాబేదార్లనూ ప్రజలనూ అవమానించడానికి మరో పేరు. హైదరాబాదు సంస్థానంలో అది ఏమాత్రం ఆత్మగౌరవం ఉన్నవాడైనా సహించలేనంత స్థాయికి దిగజారింది, అందుచేతనే సహజంగా సర్దుకుపోదాము అనే దృక్పథం ఉన్నవారితో కూడా ప్రభుత్వం ప్రకటించిన సంస్కరణలను, 'పోనీ అమలుచేసి చూద్దాం, ఏకొంతైనంత లాభాన్నైనా ప్రజలకు చేయగలుగుతాం' అనే వాళ్లెవరూ దొరకలేదు అందుచేత సంస్కరణల బహిష్కరణ ఉద్యమం తానంతట అదే విజయం సాధించుకొన్నది. ఆనాటి రాజకీయ పరిస్థితి మితవాద ('లిబరల్') రాజకీయవేత్తల ఆమోదంకూడా పరిపాలకులకు లభించనంత కిందికి దిగజారింది. బ్రిటిషువారి పాలనలో ఇండియాలో పరిస్థితి ఎన్నడూ ఇంతగా చెడిపోలేదు. మాంటేగ్ ఫర్డ్ సంస్కరణలు వచ్చినా, మరే సంస్కరణలు వచ్చినా ప్రభుత్వంతో సహకరించేవారు ఏకొందరో వారికి తప్పక దొరికేవారు కాని, హైదరాబాదు ప్రభుత్వానికి మాత్రం అట్లాంటి పరిస్థితి ఎప్పుడూ లభించలేదు.

ప్రభుత్వమూ, దానికి తాళంవేసే మజ్లిస్ వారూ మాత్రమే ఒకపక్షము, మిగిలినవారందరూ వారికి వ్యతిరేకం కాని, వారందరూ ఒక వర్గం కాదు వారిలో అనేక భేదాలున్నాయి. అయినా వారందరూ కలిసి స్వాతంత్ర్యం కోసం పోరాడారు ఆ పోరాటానికి స్టేట్ కాంగ్రెస్ నాయకత్వం వహించింది. అందుచేతనే స్టేట్ కాంగ్రెస్ కలగూరగంప వంటిది. కప్పల తక్కెడ అని ఒక విధంగా దుర్బలత్వం ఆ దుర్బలత్వం వల్లనే ఒక వర్గం మంచిపట్టులో ఉద్యమం కొనసాగిస్తున్నప్పుడు మరొక వర్గం ప్రభుత్వంతో సంప్రతింపులు, రాజీ బేరాలు మొదలు పెట్టడం జరిగింది.

మొత్తంమీద వివిధదృక్పథాలున్న వారందరిముందూ ఒక లక్ష్యం, ఒక ఆశయం, ఒక కార్యక్రమం వుంచి, నచ్చచెప్పి, బుజ్జగించి క్రమశిక్షణ చర్యలతో బెదిరించి నడిపించడం స్టేట్ కాంగ్రెస్ వంతు అయింది

# 30. తెలంగాణా అగ్నిపర్వతం పేలింది

ఈ కథ కొనసాగించడానికి ముందుగా, స్వాతంత్ర్యోద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన తెలంగాణా ప్రాంతంలో ఉన్న పరిస్థితులను గురించి నా అంచనాలను వివరించడమూ ఆసక్తిదాయకంగా ఉంటుంది. అక్కడి అసాధారణ భూసమస్య దానికి ప్రత్యేకత నిచ్చింది. అందువల్ల అక్కడ లేచిన అన్ని ఉద్యమాలలోనూ ఈ సామాజిక ఆర్థిక, అంశం యొక్క ప్రభావం ఉందని గుర్తించాలి ఎక్కడచూసినా గ్రామీణ ప్రాంతంలో రెండే రెండు వర్గాలవారు-భూములున్న ధనికులు (దొరలు) భూమిలేని రైతులు మాత్రమే కనిపిస్తారు. భూస్వాములు కొద్దిమందే ఉన్నా, వారికి పెద్దపెద్ద జమీలు ఉన్నాయి రైతులు, కూలి సంపాదించుకొనేటందుకు పనిచెయ్యాలి ఈ పరిస్థితి ఫలితంగా అన్నిరకాల అసమానతలూ కలిగాయి నిరంకుశ ప్రభుత్వము తన ఆధిపత్యాన్ని సురక్షితంగా కాపాడుకొనేటందుకు తన తాబేదార్లూ పెద్ద భూస్వాములు ఐన దొరలకు ఏ సమస్య వచ్చినా తప్పకుండా వారికే సహాయపడుతుంది సహజంగా దొరలు, తమ ఇనప పిడికిలినుంచి తప్పించుకొనడానికి రైతు కూలీచేసే ప్రయత్నాల నన్నింటిని నిరోధిస్తారు అందుచేతనే అతను (దొర) ముందుకు సాగుతున్న ప్రజాఉద్యమానికి ఆటంకాలు కలగాలని కోరుకొంటాడు హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు ఏ ఆస్తులు లేని వారందరినీ ఒక త్రాడుమీదికి పోగువేసే ప్రయత్నంలో, సంస్థలో ఉన్న కొన్ని వర్గాల వారినుంచీ, సంస్థ వెలుపలనున్న వారినుంచీ కూడా వచ్చిన వ్యతిరేకతను ఎదిరించవలసి వచ్చింది.

అసమానతలు, సలసలా మరుగుతుంటే పరిస్థితి పేలడానికి సిద్ధంగా ఉన్న అగ్నిపర్వతంలా ఉంటుంది. ఉవ్వెత్తుగా ప్రజలు తిరగ

ఎడె సూచనలు కనిపించాయి ఆ కాలంలో సర్ మీర్జా ఇస్మాయిల్ హైదరాబాద్ సంస్థానంలో ముఖ్యమంత్రి సంస్థానం యొక్క భావిభాగ్య విధాత ఆయన మంచి పరిపాలనాదక్షుడని నేను విన్నాను. ఆయిన, త్వరగా నిర్ణయానికి రాగలిగిన సమర్థుడనీ పరిపాలనలో అవరోధాలు కల్పించిన చిక్కు సమస్యలను అనన్య సాధ్యమైన నేర్పుతో రాజకీయ చాతుర్యంతో విడగొట్టగలిగిన ప్రతిభాశీలి అనీ కీర్తి వహించినవాడు ఇవన్నీ నేను విన్న మాటలు వీటిలో ఏది ఎమైనా నాకుమాత్రం ఆయనలో నిజమైన ప్రజాప్రభుత్వ సిద్ధాంత బీజాలు కన్పించలేదు చైతన్యవంతంగా ఐక్య మత్యంగా ఏకముఖంగా ముందుకు సాగుతున్న ప్రజా ఉద్యమాన్ని ఎట్లా ముక్కలు చెయిడమా అని ఆలోచిస్తున్న మనస్తత్వమే ఆయనలో నాకు వ్యక్తమైంది. మౌలికమైన మార్పులు ఏమీ తల పెట్టకుండా వీలైతే కొన్ని వర్గాల వారిని తనతో కూడగట్టుకొని ప్రభుత్వ యంత్రాంగం లోకి ప్రవేశపెట్టి కథ నడిపించాలనే ప్రయత్నాలు ఆయన చెయ్య సాగాడు కాని, ఆయనకు విజయం లభించ లేదు అందుచేతనే ఆయన పరిపాలనా కాలంలో స్వతంత్ర పోరాటం అప్పుడప్పుడు వంకరలు తిరిగినా నిర్విరామంగా సాగింది

గ్రామ సీమలు, ముఖ్యంగా తెలంగాణా ప్రాంతం అంతా అసంతృప్తితో కుత కుత లాడి పోతుంది. సర్‌మీర్జా ఇస్మాయిల్ పేలడానికి సిద్ధంగా ఉన్న అగ్ని పర్వతపు ముఖం మీద కూర్చున్నట్లున్నాడు. మతావేశపరులు, ఆయన అధికారంలో కొనసాగడం ఇష్టపడలేదు సంస్థానంలో తమ విశృంఖల విహారమే కొనసాగాలనే వారి కోరిక మతావేశపు అంటుజాడ్యంతో కలుషితమైన హైదరాబాదు పరిపాలనా యంత్రాంగం, ముఖ్యమంత్రి మాటలువిని ఆయన అడుగు జాడలలొ నడిచే స్థితిలోలేదు. తిండిగింజల రూపంలో పన్నులు వసూలుచేసే విధానము (లెవీ), తిండి గింజలసేకరణ విధానం, అవి అమలు జరుగుతన్న కరుకైన పద్ధతులు, గ్రామీణ ప్రాంతంలో ఉన్న రైతాంగాన్ని దుర్భరమైన కష్టాలకు గురిచెశాయి పోలీసుల దౌర్జన్యాలు, తిండిగింజల బలవంతపు సేకరణ,రెవెన్యూ

పోలీసు అధికారులు జిల్లాలలో చేస్తున్న క్రూర చర్యలు గురించిన రిపోర్టు వరుసగా రాజధానికి వచ్చి చేరేవి. ప్రజలు మరేదారీ కనిపించనందున గట్టిగా నిలబడి అధికారుల నిరంకుశ చర్యలను ఇంక తల ఒగ్గేది లేదని ఎదిరించి నిలబడ్డారు. ఈ రీతిగా గ్రామాల్లో అక్కడక్కడ చెదురు మదురుగా తిరగబడే స్వభావం ఉదయించింది దాన్ని సమన్వయంచేసే ఏర్పాట్లేవీ ఎవరూ చెయ్యనందు వల్ల అది శక్తివంతమైన ప్రజా ఉద్యమంగా రూపు దిద్దుకో లేదు కాని, ఏయే గ్రామాల్లో ప్రజలు గుంపులు, గుంపులుగా సమీకరణమైకూడి నడిచారో ఆ గ్రామాల్లో ప్రభుత్వోద్యోగులు అక్రమ చర్యలకు బలమైన పోరాటం ఎదురైంది.

తెలంగాణాలో కొంత భాగంలో కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలు పని చేస్తున్నారు ఆ ప్రాంతములోని ప్రజలు ముందుకు వచ్చారు. నల్గొండ జిల్లాలోని సూర్యాపేట తాలూకాలో కొన్ని గ్రామాలు ఈ రీతిగా తయారైనాయి వారు అధికారుల అణచివేత విధానాన్ని ఎదిరించారు. వాటి చుట్టుప్రక్కల వున్న గ్రామాల్లో అధికారుల దౌర్జన్యం మితిమీరడం దాని ఫలితంగా ప్రజలు తిరగబడి స్వల్పంగా దౌర్జన్యం [illegible] సంభవించింది హైదరాబాదు ప్రభుత్వము ఆ ప్రాంతాలకు సేనలు తరలించి వారిని అక్కడే నిలిపినారు వారు అనేక గ్రామాలలో భయం భ్రాంతి కలిగించి, అనేకమంది గ్రామస్తులను చచ్చేలా కొట్టారు. ఆ ప్రాంతాల[illegible] విలయం తాండవించింది స్త్రీలపై జరిగిన అనేక అత్యాచారాలు, అమానుష చర్యలు కిరాతక కృ[illegible] కి చేరాయి. కొందరు ప్రజా నాయకులు ఆ ప్రాంతాలను సందర్శించి ఆ రిపోర్టుల యాథార్థ్యాన్ని ధ్రువీకరించారు. స్టేట్ కాంగ్రెసు అధ్యక్షుడ నైనందున నేను స్వయంగా ఆ ప్రాంతాలు సందర్శించి పరిస్థితులు కళ్లారా చూశాను కొద్ది మంది సహచరులతో కలిసి అనేక గ్రామాలు సందర్శించాను ప్రజలు గ్రామాన్ని పూర్తిగా కాళీచేసి ఎక్కడో తలదాచు కొనేటందుకు పారిపోయారు అట్లాంటివి కొన్ని గ్రామాలు. గ్రామాలలోనే వుంటూ ఇండ్లలో దాక్కొని తలుపులు మూసుకొని ఉన్న ప్రజలతో శ్మశాన వాటికల్లా భీతిగొలిపే

గ్రామాలు కొన్ని వీటన్నింటికీ చుడగానే జాలికొలిపింది గ్రామాన్ని సమీ పిస్తున్న కారు చప్పుడు వారిని భయకంపితులుగా చేసింది. పోలీసులు వచ్చి గ్రామాన్ని చుట్టి బెదతారని వణికి పోయారు మేము వెళ్ళిన వాళ్లము ఆరుగురము ఒక వేపచెట్టుకింద అరగంట సేపు కూర్చున్నాము మాలో ఒక స్నేహితుడికి ఆ గ్రామంలో కొందరు పరిచితులున్నారు. ఆయన ఇంటింటికీవెళ్ళి ఆ వచ్చిన వారిలో పోలీసులెవరూ లేరనీ గాంధీజీ అనుయాయులు గ్రామస్తులతో మాట్లాడాలని వచ్చారనీ అరచి చెప్పాడు. అప్పటికీ ప్రజలు తాము దాక్కుని ఉన్న స్థావరాలనుంచి బైటికి రాలేదు ఒక గంట అయిన తర్వాత అక్కడికి దగ్గరనే ఉన్న గుట్టమీద దాగిఉన్న గ్రామీణులు వచ్చి వచ్చింది సాదా మనుష్యులేనని గుర్తించి, క్రమ క్రమంగా ఒక్కరొక్కరే వచ్చారు మొత్తంమీద చాల మంది గుమి కూడారు.

మా చుట్టూ చేరి, ఒకరి తర్వాత ఒకరుగా వారు పడిన కష్టాలూ దుఃఖాలు వింటుంటే కథలనిపించే టటువంటివి, మాకు చెప్పారు. మేము వారిచ్చిన వాఙ్మూలాలు వ్రాసుకొన్నాము పరిస్థితులను అదుపులో వుంచ డానికి అవసరమైనంత కంటె ఎంతో కఠినంగా పోలీసులు క్రూరంగా ప్రవర్తించినట్లు మాకు తెలిసింది అధికారులు తమకు దాసోహమని లొంగి పోకుండా న్యాయానికి నిలబడ్డ ప్రజల్ని అణచి పెట్టే ఉద్దేశంతో ప్రవర్తించి నట్లు స్పష్టమైంది ఆయుధాలు ధరించిన సైనికులను ఎదిరించి, ఇటుకలతో రాళ్లతో పోరాడి ఆత్మరక్షణ చేసుకొందని సలహాలిచ్చి కమ్యూ నిస్టులు కూడా కొంత వరకు ప్రజల్ని తప్పుదారి పట్టించారు. నిరాయుధు లైన ప్రజలు సాయుధులైన సైనికులతో ఎట్లా పోరాడగలరో నాకు అర్థం కాలేదు మీరు అహింసా యుతమైన పోరాటాన్ని కొనసాగించి ఉండ వల సిందనీ నేను ప్రజలతో వాదించాను క్రమంగా వారు తమస్థితిని అర్థం చేసుకునే ధోరణి లోకి వచ్చారు. పోలీసు దౌర్జన్యాలను మాత్రం ఏ విధం గానూ సమర్థించే అవకాశం లేదు. నేను హైదరాబాదు తిరిగి వచ్చిన తర్వాత మిలిటరీ జరిపిన అత్యాచారాలను నిరసించి, వెంటనే వారిని

ఆ ప్రాంతంనుంచి తొలగించడం అవసరమని పత్రికా ప్రకటన ఇచ్చాను. సాయుధులైన పోలీసు, మిలిటరీ వారిని ఎదుర్కొని హింసాయుత పోరాటం సాగించండని ప్రజలకు సలహా లివ్వడం కూడా తప్పేనని చెప్పాను.

తర్వాతి కాలంలోకొన్ని వర్గాల వారు నామీద పుంఖాను పుంఖంగా అపవాదులు, నిందా పూర్వకమైన ప్రచారాలు కొన సాగించే టందుకు ఆ పత్రికా ప్రకటన ఆహ్వానసూచన అయింది. అనేకులు నన్ను కమ్యూనిష్టు పక్షపాతిగా పరిగణించారు. ఆ వర్గాల వారు కమ్యూనిష్టులను చెడామడా విమర్శించే టందుకు మాత్రం ముందుకు దూకి ప్రజలపై జరిగిన అత్యాచారాలను లాంఛన ప్రాయమైన మొక్కుబడిగా విమర్శించి నిర్వర్తించే వారు. మొత్తం సమస్య పట్ల నా దృక్పథం మరోతీరుగా వుంది. భూస్వాములైన దొరల అధికారాన్ని ఎదిరించి నిలబడాలని రైతులకు నచ్చ చెప్పిన వారు ఎవరైనా ఏఇష్టులైనా ఒకటే. అన్యాయాన్ని ఎదిరించడాన్ని ప్రజా విజయం (achievment) లో ఒక అంశంగా లెక్కించాలి. రైతులలో వచ్చిన ఈ కొత్తదృక్పథాన్ని నేను హర్షించాను. దాన్ని దుర్బల పరచక ప్రయత్న పూర్వకంగా దాన్ని బలపరుస్తూ వారు కమ్యూనిష్టు ప్రభావ బంధంనుంచి విముక్తులయేటట్లు చూడాలి. కమ్యూనిష్టులను తూర్పార బట్టాలనే తొందరపాటుతో ప్రజలను అణచి వుంచిన ప్రభుత్వం, భూస్వామి వర్గాలకు బలం కలిగేటట్లు ప్రవర్తించాలనే ఉద్దేశం నాకు ఎంత మాత్రమూ లేదు. తెలంగాణా గ్రామ ప్రాంతాలలో ఉన్న సామాజిక వ్యవస్థలో, అమాయక బక్క రైతులు అనేక శతాబ్దాలనుంచీ ప్రభుత్వ అధికారులతో చేతులు కలిపిన బలిష్ట భూస్వాముల కాళ్ల కింద తొక్కబడుతూ నలిగి వుండి, ఎవరి చేయూత లభిస్తుందో అని ఎదురు చూస్తున్నారు.

ఈ నాటికి రైతుధైర్యం తెచ్చుకొని నిటారుగా నిలబడి తన దొరతో 'ఆగు' అనే స్థాయికి ఎదిగాడు. నా కార్యక్రమా లన్నింటిలో, దృక్పథంలో, మాటలలో అట్టడుగున ఉన్న పీడిత జనాంగాన్నే బలపరిచాను. భూస్వామిని, అతన్ని సమర్థించిన వారిని, అతనికి ఆధారమైన

వారిని అతని ఆధారంవల్ల వృద్ధి పొందిన వారినీ, అందరినీ విమర్శిం చాను తర్వాత గడచిన సంవత్సరాల్లో కూడా ఈ దృక్పథ కాలం నడి చిన పరీక్షలో నెగ్గింది అనేక ఇతర కార్యకర్తలు కూడా తెలంగాణా గ్రామీణ ప్రాంతాల్లో ఉన్న క్లిష్ట పరిస్థితులు తెలుసుకొని భూస్వామ్య వర్గా లను ఎదిరించి నిలబడేటట్లుగా రైతులను సమీకరించారు సామాజిక దృక్పథంలో విభిన్న మార్గాలు, తెలంగాణ రైతుల ముఖ్య సమస్యపట్ల ఉండే మౌలిక అవగాహనలో భేదాలు, స్టేట్ కాంగ్రెసు సంస్థలో అప్పుడ ప్పుడు చీలికలు (ruptures) కలిగించేవి. అప్పుడప్పుడు అపార్థాలకు గురి అయిన ఆ ఒడుదుడుకు లన్నింటినీ నిగ్రహించి సంస్థ ముందుకు నడిపించ వలసివచ్చేది. నేను నా విశ్వాసాలను వదలకుండా గట్టిగా పట్టుకొని, వాటి కోసమై అన్నింటికీ ఒడ్డి పని చేసే వాణ్ని. ప్రజాస్వామిక బలాలకు శక్తినిచ్చేటందుకు, ప్రతీప శ[illegible] ఆ మహాపరిస్థితే నాకు సహాయ కారియైందని చెప్పేటందుకు ఎంతో సంతోషంగా వుంది.

నా కార్య క్రమాలలో, ముఖ్యంగా తెలంగాణాలో, పీడిత జనాం గానికి చేయ గలిగిన సేవనే కొలబద్దగా గ్రహించే ప్రయత్నాలు చేశాను కమ్యూనిష్టు ప్రభావాన్ని తొలగించే టందుకు దోపిడీ నిర్మూలించడం ఒక్కటే దారి అని నా నమ్మకము. ఫలితం కనిపించే పనులు ద్వారా పేదరికాన్ని నిర్మూలించడం ఒక్కటే రైతాంగాన్ని సరియైన దారిలో నడి పిస్తుంది. కమ్యూనిష్టు వ్యతిరేకపు మాటలు చెప్పడం నాకు నచ్చదు. విమర్శ, ఖండన వల్ల ఏమీ లాభం కలుగదు ఫలితం కన్పించే పని చెయ్యడమే అవసరం ఈ మౌలికమైన దృక్పథాన్ని విశ్వసించి నందు వల్లనే నేను ఒక వైపున ప్రజా బలాన్ని సమీకరించి, వాటిని భూస్వామ్య ప్రతీప శక్తులకు వ్యతిరేకంగా నడిపించే టందుకు కృషి చేయడమూ, మరొకవైపున మనదేశంలో అప్పుడే నిలదొక్కు కుంటున్న ప్రజాసామ్య వ్యవస్థను కూలదోసే ఉద్దేశంతో రైతాంగాన్ని సాయుధ పోరాటంలోకి ఆకర్షిస్తున్న కమ్యూనిష్టులు కల్పించిన మైకం నుంచి ఆ రైతుల్ని తప్పించే టందుకూ కృషి చేయడమూ సంభవించింది

# 31. నిజాము కల

క్విట్ ఇండియా ఉద్యమం కలిగించిన ప్రభావము, అంతర్జాతీయ పరిస్థితి కలిగించిన ఒత్తిడి, కలిసి బ్రిటిష ప్రభుత్వం తమ పరిపాలనాధికారాన్ని భారతదేశానికి దఖలు చెయ్యాలని నిర్ణయించేటట్లు చేసాయి. బ్రిటిషు మంత్రివర్గపు కమిషను ఆ పరిపాలనాధికారపు బదిలీకి ఒక పథకాన్ని రూపొందించి తెచ్చింది. అధికారపు బదిలీ పద్ధతి శాంతియుతంగాను, హుందాతనంతోను ఉండాలని నిశ్చయమైంది. కాని, ఆ పద్ధతిలో ఒక గొప్ప లోపం ఉంది. ఇండియాపైన బ్రిటిషు ఆధిపత్యం ముగియగానే ఆనాటినుంచీ బ్రిటిషు సార్వభౌమత్వాధికారము ఎవరికి సంక్రమిస్తుందో ఆపథకంలో స్పష్టంగా పేర్కొనడం జరగలేదు. హిందూ రాజులకు స్వతంత్ర ప్రతిపత్తి లభిస్తుందా? అట్లాగ జరిగితే ఇండియా పటం స్వతంత్ర రాజ్యాలెన్నింటితోనో చదరంగపు గళ్లలాగ, కనిపిస్తుంది. దానిపరిస్థితి పరస్పర కలహాలతో పోటీలతో సతమత మవుతుండే యూరపుఖండంలో ఉన్న బాల్కన్ రాజ్యాల మాదిరిగా ఉంటుంది.

స్వదేశ సంస్థానాలకు స్వతంత్ర రాజ్యాలస్థాయి లభిస్తుందనే మాటలు గాలిలో వ్యాపించాయి. కొన్ని సంస్థానాల తరఫున మాట్లాడుతూ కొందరు తాము స్వతంత్రులము కానున్నామనికూడా ప్రకటించారు. అది చాలా ప్రమాదకరమైన భావము. ఆ దురాలోచనలను అరికట్టే టందుకు కట్టుదిట్టమైన ప్రయత్నాలు జరగాలి.

అవి అట్లా ఉండగానే మేము జనవరి 20, 1944 నాడు, స్టేట్ కాంగ్రెసు తరఫున బ్రిటిషు పార్లమెంటు ప్రతినిధి వర్గనాయకుడికి ఒక మెమోరాండమ్ సమర్పించాము. బ్రిటిషు పార్లమెంటు ప్రతినిధులముందు

హైదరాబాదు సమస్యను గళికాప్రాయంగా సమర్పించడమే మా ముఖ్యోద్దేశము. నిజామునుయొక్క మౌలిక అభిప్రాయాల మూలంగా ఏర్పడిన సమస్యల ప్రత్యేక స్వభావాన్ని వివరించాలని మేము ఉద్దేశించాము. బ్రిటీషు సామ్రాజ్యానికి విశ్వాసపాత్రుడైన ఆ మిత్రుడికి తన రాజ్యాధికారాన్ని గురించి కొన్ని అనాగరిక పురాతన భావాలు ఉండేటందుకు అవకాశ [illegible] జరిగిందనీ అందువల్ల ఆయన ఆధునిక చరిత్రానుసారంగా, మారిన పరిస్థితుల కనుగుణంగా, మార్పుచెందిన తనవంటి ఇతరులతో కలిసి నడిచేటందుకు అంగీకరించటంలేదు అనీ చెప్పాము. దానికి రుజువుగా 1944 జులై 26, 29 లలో నిజాం [illegible] త చేశాము. వాటిలో ఈ క్రింది విధంగా ఉంది.

సుబాదక్కన్, తేది 26 జులై 1944

హైదరాబాదు ఇండియాలోని ముఖ్యమైన సంస్థానము బ్రిటిషు ప్రభుత్వంతో చరిత్ర ప్రసిద్ధమైన ఒప్పందాల ద్వారా స్నేహపూర్వక సంబంధము, సార్వభౌమత్వ పరిపాలకుల రక్షణవున్న భారతీయ స్వదేశ సంస్థానాలలో (ముఖ్యంగా దక్కన్‌లో) నిజాము నియమించిన ప్రతినిధుల ద్వారాజరిగే పరిపాలనకంటెభిన్నమైన బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ప్రవేశ పెట్టేటందుకు ఏ పరిస్థితులలోనూ వీలులేదు. ఒక్కొక్క స్వదేశ సంస్థానం పరిస్థితిలో ఒక్కొక్క ప్రత్యేకత ఉంది. వాటి ఔన్నత్యస్థాయీ, స్థానమూ, వారికి ప్రసాదింపబడిన గౌరవమూ ఇతరులకున్నవాటికంటె వేరుగా ఉండటమేకాక వాటికి సహజమైన ప్రాముఖ్యము, విశిష్టతలుకూడా ఉన్నాయి ఈ పరిస్థితులలో ఆ సమస్యను వివరించవలసిన పనేలేదు. ఎందుచేతనంటే 'అందరికీ తెలిసిన అంశాన్ని ఎవరూ ఎవరికీ వివరించి చెప్పవలసిన పనే ఉండదు"

సుబాదక్కన్, తేది 29 జులై, 1944

(1) బహదూర్ యార్ జంగ్ మరణించిన తర్వాత మజ్లిస్-ఇత్తెహాదుల్ ముస్లిమీన్ కార్యకర్తలనడుమ మైన చెర్యాన్న విషయాన్ని

గురించి అనవసరంగా కొన్ని చర్చలు జరిగాయి. ఆ విషయాన్ని గురించి ఎవరికీ సంశయాలు లేకుండా చెయ్యడానికి అందరూ దాన్ని సరిగా అర్థంచేసుకొనేటట్లు చెయ్యడానికీ ఈ వ్యాఖ్యానం ఇస్తున్నాము,

2) ప్రతినిధులద్వారా జరిగే పరిపాలనా పద్ధతిని గురించిన వివరాలను సరియైన సమయంలో పొందవచ్చు. అవి కొన్ని సంవత్సరాల క్రిందట ప్రకటించిన పరిపాలనా సంస్కరణల పథకంలో ఉన్నాయి. బాధ్యతాయుత ప్రభుత్వంతో ఇక్కడ ఏ ప్రసక్తిలేదు.

ఈ వివరణ దృష్ట్యా పత్రికలమధ్యా మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మీన్ మధ్యా నడుస్తున్న చర్చలు ఆపాలి అది పూర్తిగా నిష్ఫలమైనపని.

(3) "ముఖ్యంగా దక్కన్" అనేమాట కుండలీకరణము చేయబడింది. దానికి హైదరాబాదు అని అర్థము

(4) మొత్తంమీద ఈ సూచనలూ, వాటి లక్షణాలూ పరిశీలిస్తే స్వదేశ సంస్థానాలు తమకు సార్వభౌమాధికారం కలవారితో ఉన్న సంబంధాలను ఏనాడైనా తెంపివేసుకొనడం సాధ్యంకాదు. సంస్థానాల ఉనికి, మనుగడ బ్రిటిషు ప్రభుత్వానుగ్రహ ఫలితమేనని చరిత్ర స్పష్టంచేస్తున్నది అందువల్ల యుక్తివాదము, రాజకీయ చాతుర్యము, తమ మంచికోసం కోరుతున్న ఈ వరాన్ని ప్రసాదించవలసిందనీ నిరాకరించవద్దనీ సమర్థిస్తున్నాయి.

"స్వదేశ సంస్థానాధిపతులకే వ్యక్తిగతంగా తమ ప్రజలకు ప్రాతినిధ్యం వహించే హక్కున్నదనీ అందువల్ల తనతో భారతదేశ ప్రజలకున్న సంబంధము సంస్థాన ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధులతో ఉండే సంబంధంకంటె సహజమైనదనీ శాశ్వతమైనదనీ నిజాము వాదన "ఆయన, తాను సంస్థానాధిపతి మాత్రమే కాక, ప్రజల స్వామిత్వము కూడా తనలో మూర్తీభవించిందనీ అంటాడు." కాని, అది అంతటితో ఆగిపోకుండా సంస్థానంలో ఉన్న ప్రతి ముస్లిమ్‌కీ ప్రసరించి ప్రతి

ముస్లిము తానే పరిపాలకుడననే అహంకారం కలిగిస్తున్నది. ఈ విషయా లన్నీ మేము బ్రిటిషు ప్రతినిధివర్గంవారి మనస్సు కెక్కేటట్లు తెలియజేసి సంస్థానంలో పుంజుకొంటున్న ప్రజాఉద్యమం ఉందని గుర్తించవలసిందిగా కోరాము. మా వాదపు సారాంశాన్ని తేల్చి స్పష్టంగా ఎవరికి హైదరాబాదు సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌తో విలీనం చెయ్యడమూ, సంస్థా నంలో బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటు చెయ్యడమూ జరగాలని చెప్పాము

ఆ రోజుల్లో అఖిలభారత స్వదేశ సంస్థాన ప్రజల సదస్సుస్థాయి సంఘము తరచుగా సమావేశాలు జరిపేది

నిజాము, అతనివంటి సంస్థానాధీశులు ఊహించిన ఊహలూ వేసిన ఎత్తులూ ఏమి కొనసాగకుండా ఆ స్థాయి సంఘంవారు తొక్కి పెట్టి ఉంచారు. నిజాము విప్పిననోరు కట్టబడేదికాదు. తాను స్వతంత్రుడ ననీ తాను స్వతంత్రంగా ఉండగోరు రున్నాననీ పత్రికలకు ప్రకటన లిచ్చేవాడు వాటన్నింటి అర్థమూ మాకు తెలుసు. అందుచేత బ్రిటిషు మంత్రివర్గంచేసిన ప్రతిపాదనలలో ఉన్న లోపం పూరించబడి, స్వదేశ సంస్థానాలు కూడా ఇండియన్ యూనియన్‌లో చేరడం జరిగితేగాని బ్రిటిషు మంత్రివర్గపు పథకాన్ని మేము ఆమోదించలేదు. పండిట్ జవహర్లాల్ నెహ్రూ మా అధ్యక్షుడు. ఆయన మాలో అరడజనుమందిమి ఢిల్లీలోనే ఉంటే సంప్రదింపులకు సదుపాయంగా ఉంటుందన్నారు. అంతే కాకుండా స్వదేశ సంస్థానాల విషయం ఏదైనా చర్చకు వచ్చినప్పుడు మేము తనతోపాటుగా వచ్చి సమాచారం అందించేటందుకు వీలవు తుందనికూడ చెప్పారు. షేక్ అబ్దుల్లానూ, నన్నూ తప్పకుండా ఉండ వలసిందనీ మా రెండు సంస్థానాలను గురించే ప్రమాదం వుందని అన్నారు. చర్చలలో ఒక అనూహ్య పరిస్థితి ఏర్పడింది. బ్రిటిషు మంత్రి వర్గ కమిషను మెంబర్లు స్వదేశ సంస్థానాధి పతులతోనే గాని, సంస్థాన ప్రజలతో ఎమీ ప్రమేయం పెట్టుకోరట! అందుచేత వారు మా వైపు చూడనేచూడం అన్నారు ఆ దృక్పథం మా సహనానికి మించింది. ప్రతీకార చర్యగా మా అధ్యక్షుడు వారిసికజుసు కొనిచచ్చే

టందుకు నిరాకరించాలని అన్నాము. ఆ అంశాన్ని గురించి షేక్ అబ్దుల్లా గట్టిగా నొక్కి చెప్పాడు చివరికి మేమే, కాంగ్రెసు నాయకులు మా వాదాన్ని సమర్థిస్తారనే నమ్మకంతో, మా పట్టు విడిచాము. అందుకు ముందుగా మే మందరమూ కలిసి మహాత్మాజీ దగ్గరకు వెళ్లడము పండిట్ నెహ్రూ ఆయనకు మా వాదం వినిపించడమూ నాకు గుర్తున్నాయి ఆ మాటలన్నీ విని, మీ వాదం గురించి మీరు ఏమీ భయ పడ వద్దని మహాత్మాజీ మాకు మాట ఇచ్చారు

చర్చలు ఈ దశలో ఉన్న సమయంలో రెండు మౌలికమైన భావాలు ఉత్పన్నమైనాయి. మొదటిది భారతదేశంలోఉన్న ప్రజలందరూఒకటే. బ్రిటిషు ఇండియాలో ఉన్నా స్వదేశ సంస్థానాలలో వున్నా మొత్తం మీద అందరూ ఒకటే రాజకీయపు ఎల్లలు వారిని ఏ విధంగాను వేరుచెయ్యలేవు. అందరూ కలిసిపోవలసిందే స్వదేశ సంస్థానంలో ఉన్న వారు ఆయా రాజులు ఎట్లాంటి విపరీతపు ఆశలుపెట్టు కొన్నప్పటికీ యధార్థంగా చూస్తే స్వతంత్రభారత పౌరులే రెండోది ప్రజలకు తమ్ముతాము పాలించుకొనే హక్కు స్థిరపడింది బాధ్యతాయుత ప్రభుత్వం విశ్వజనీనమైన అర్థింపు (కోరిక) ఒక్క వాక్యంలో చెప్పాలంటే ప్రతీ స్వదేశ సంస్థానం విషయంలోనూ బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపన, భారత ప్రభుత్వంలో విలీనము జరిగి తీరాలి

విలీన మయేటందుకు అంగీకారం తెలిపే ఒప్పంద పత్రము తయారైంది. సంస్థానాల ప్రభువులు, ఒకరి తరువాత మరొకరుగా సంతకాలు పెట్టారు కాని, నిజాము కదలలేదు, మెదలలెదు ఆయన, "నేనెందుకు ఇండియా ఆధిపత్యాన్ని అంగీకరించాలి ? బ్రిటిషు ప్రభుత్వానికి నాది విశ్వాస పాత్రుడైన హోదా; నేను వారి లావేదారును కాను. ఇక మీదట నా పరిపాలన నేనే చూసు కొంటాను " అని, అనుకొన్నాడు. సంస్థానంలోవున్న ముస్లిము పాలకవర్గము, మరికొన్ని ఇతర శక్తులూఆయన వెనకఉన్నారు. కాని, హైదరాబాదు ప్రజలు నిద్రపోవటం లేదు చైతన్య

రహితంగాలేరు ఇది ఉండటమా మానటమా అని వారు తేల్చుకోవలసిన అదృష్ట ఘడియ సమయం వచ్చింది. ఇప్పుడే ఉరకాలి. లేదా అవకాశం జారి పోతుంది అని, నినాదాలు చేస్తూ స్వతంత్ర భారతదేశంతో చేరాలని హైదరాబాదు ప్రజలు, నిజాము ప్రభువు వెల్లడించిన భావాలతో నిమిత్తం లేకుండా, గొంతెత్తి పలికారు.

ఇండియన్ యూనియన్‌తో చేరనని నిజాము చెప్పడం శత్రుత్వ చర్య కాదా ? స్వతంత్ర భారత పౌరు డెవడైనా అది సహించ గలిగిన నేరమేనా ?

భారతదేశ నూతన ప్రభుత్వం ఈ మొండి తనాన్ని కొనసాగ నిస్తుందా ? ఇవీ, ఇట్లాంటివే మరిన్ని ప్రశ్నలూ ప్రజలు తమకు తాము వేసుకున్నారు కాని, వీటన్నింటి కంటె ముఖ్యమైందీ అడగ వలసిందీ మనము హైదరాబాదు ప్రజలం; మరీ ఇప్పుడు మనమేం చేద్దాము ? అనివారను కున్నారు వారికి ఈ సవాలు ఎదురైంది. మనందీన్ని అంగీక రించాలి. దాని మూల్యం ఎంతైనాసరే చెల్లించక తప్పదు మా మీద బరు వైన బాధ్యత పడిందని గుర్తించాము హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు చివరి పోరాటంలోకి దూక వలసిందే. అందుకోసం ఇప్పుడు గట్టి ఏర్పాట్లు చెయ్యడం మొదలైంది.

హైదరాబాదు ప్రజల స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో అత్యంత క్లిష్ట సమయం ఆసన్నమైంది అయినా క్రొత్తగా ఎన్నికయిన సభ్యులతో హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు మొదటి సమావేశం జరిగింది నిజాము భారత ప్రభుత్వంలో చెరడనే విషయమూ ఒప్పందము చేసుకోడనే విష యమూ స్పష్టంగా తేలిపోయాయి అఖిల భారత స్వదేశ సంస్థాన ప్రజల సదస్సు, ముందుకు నడవండని మాకు అనుమతి నిచ్చింది. క్రొత్తగా ఎన్ని కయిన సంస్థాన కాంగ్రెసు అధ్యక్షుడుగా నేను పండిట్ నెహ్రూతో చర్చిం చాను ఆ సమావేశంలో చేయవలసిన తీర్మానపు పాఠాన్ని తయారు చేసి ఆయనకు చూపించి, ఆయన చేసిన సవరణలతో తుది రూపమిచ్చి తీర్చి దిద్దడం జరిగింది

అట్లా అంతా సిద్ధం చేసుకొని హైదరాబాదు వెళ్లడానికి రెడీగా ఉన్నాను. ఢిల్లీలో అనేక మంది మిత్రుల్ని కలిశాను. వీలైనంత మందిని చూశాను. ప్రతివారూ మా కెదురైన ప్రమాదకరమైన పరిస్థితిని ఎరుగుదురు. ఒక మిత్రుడు నన్ను కౌగలించుకొని "మళ్లీ కలుస్తామా ?" అని ఆర్ద్ర హృదయంతో అన్నాడు "భగవంతుడు అనుగ్రహిస్తేతప్పకుండా" అని, బదులు చెప్పాను."మనం మళ్లీ కలవకపోతే నేమి స్వాతంత్ర్యోద్యమం ముందడుగు వేస్తుంది." అని మరొకరు నా చెవులో చెప్పారు. నేను నా సహచరులందరి ఆశీస్సులతో శుభాకాంక్షలతో ఢిల్లీ వదిలాను

అప్పుడు శ్రీ ఎస్. నిజలింగప్పకూడా, అక్కడ ఉన్నారు. ఆ సందర్భంలో ఆయన కూడా స్వాతంత్ర్య పోరాటంలో విజయం లభించాలంటూ తన శుభాకాంక్షలు తెలియ జేశారు. ఆయన సంస్థాన ప్రజల ఉద్యమంలోనాకు సన్నిహిత మిత్రుడు అప్పుడప్పుడు ఆయనఇచ్చిన సలహాలు గ్రహించి లాభంపొందాను. 1947లో ఆగష్టు మొదటి వారంలో ఢిల్లీ వదలి తుదిపోరాటం ప్రారంభించాలనే కోరికతో నేను బైలుదేరినప్పుడు ఆయన నా మీద ఉన్న వాత్సల్యంతో ఆత్రంతో నాకు ధైర్యం చెప్పి హైదరాబాదు ప్రజలపట్ల కర్తవ్యం నెరవేర్చి విజయం సాధించ వలసిందని ప్రోత్సహించారు ఈ నాటి వరకూ ఆయనకు నా పట్ల అట్లాంటి బాంధవ్యమే వుంది

అతి ముఖ్యమైన హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ సమావేశము ఆలోచనా నిమగ్నమైన వాతావరణంలో ప్రారంభ మైంది లక్షలాది మంది ఆ సమావేశంలో పాల్గొన్నారు వారందరకూ కూడా తాము ఎదుర్కొన వలసిన సమస్యలు తెలుసు. కార్యక్రమంలోని అంశాలన్నీ బరువైన బాధ్యతలను సూచించేవే. స్వతంత్ర భారతదేశం తనను తీర్చిదిద్దుకొనే టందుకు తయారవుతూ వుంటే హైదరాబాదు బద్ధతతో క్రుంగి పోయి వుంది. ప్రతి వారూ సమస్యలను ముందుకుతోసి తుది నిశ్చయం తేల్చాలనీ తన శక్తివంచన లేకుండా హైదరాబాద్ ప్రజల స్వేచ్ఛకోసం త్యాగం చేయా

లనీ కృత నిశ్చయులైనారు మేము భారతీయులము నిజాము ఇష్టపడినా లేకపోయినా సరె హైదరాబాదు భారతదేశంలో విలీనమయేటట్లు చూస్తాము. అనే ధోరణి వ్యక్తమైంది.

ఈ సమావేశంలో తీసుకోవలసి ఉన్న నిర్ణయాలకు చాలా ప్రాధాన్యము ప్రాముఖ్యము ఉన్నందు వల్ల వాటికి దేశం మొత్తం మీద అందరి మద్దతు వుండాలనే లక్ష్యంతో సంస్థానం బైటనుంచి కూడా చాల మంది కాంగ్రెసు వారూ, సోషలిస్టులూ వచ్చారు. వారందరూ రావడంతో ఈ పోరాటాన్ని తుది వరకు కొనసాగించేటందుకు ఉత్సాహం కలిగింది అప్పుడు హోంమంత్రిగా వున్న అలియావర్ జంగ్ ఈ నాయకులెవ్వరూ, వారు హైదరాబాదు సంస్థానానికి బైటివారైనందు వల్ల, సమావేశంలో ప్రసంగించ కూడదన్నాడు ఆచార్య ఎన్. జి రంగా అప్పటికే మాట్లాడారు శ్రీమతి కమలా దేవి చట్టోపాధ్యాయ, తదితరులు మాట్లాడవలసి వుంది నన్ను హోంమంత్రి కొన్ని ముఖ్య విషయాలు చర్చించవలసి వుందని హఠాత్తుగా పిలిపించాడు. ఆయన చేతిలో నా అధ్యక్షోపన్యాస పాఠం వుంది అందులో కొన్ని వాక్యాలు ఎర్ర పెన్సిల్‌తో, మరికొన్ని నీలిరంగు పెన్సిల్‌తో గుర్తింపబడి వున్నాయి ఆచార్యరంగా ఉపన్యాస భాగాలు కూడా ఉన్నాయి. ఆయన వాటిని, పోలీసు ఇన్‌స్పెక్టరు జనరల్ ఎదుట వుంచి చదివి వినిపించాడు నేను మాట్లాడిన దాంట్లో ప్రతి మాటా బాగా ఆలోచన చేసి తూచి వాడినవేననీ నేను వాటిని నమ్ముతున్నాననీ చెప్పాను. ప్రభుత్వం, వాటిని గురించి పరిశీలిస్తున్నదనీ సమావేశంలో బైట నుంచి వచ్చిన వారినెవరినైనా మాట్లాడించినట్లయితే ప్రమాదకర మనీ సూచించాడు. అందుచేత వారెవరూ మాట్లాడకుండా వారికి నచ్చచెప్ప మన్నాడు అది ఒప్పుకోడానికి వీలుకాని సూచన వచ్చినవారందరూ గౌరవనీయ అతిథులనీ, బాధ్యత తెలిసిన నాయకులనీ మా అందరి ఆశయమూ ఒకటే అయినందున, వారిని మాట్లాడ కుండా ఊరుకోనందని చెప్పి, ఈ సందర్భంలో మీరు మీ పద్ధతి ప్రకారం నడ

చుకో వచ్చునని అన్నాను. అట్లా చెప్పి, నేను ఉదయాది గంటలకే తిరిగి నాచోటికి వచ్చేశాను

ఈ లోపుననే నన్ను అరెస్టు చేశారనీ, సమావేశం తాలూకు మిగిలిన కార్యక్రమాన్ని నిషేధించడం జరుగుతుందనీ వార్తలు నగరం అంతటా వ్యాపించాయి సమావేశానికి వచ్చిన కాంగ్రెసు వారిలో అలజడి కలిగింది కాని, వెంటనే ఆ భయం తొలగి పోవడం స్టేట్ కాంగ్రెసు తిరిగి తన రెండో, మూడోరోజు కార్యక్రమాలు జరుపు కొనడం సంభవించాయి.

విషయ నిర్ణయ సభలో తీవ్రమైన వాదోప వాదాలకు లక్ష్యమైన ముఖ్యతీర్మానాన్ని సర్వసభ్య సమావేశము ఏక గ్రీవంగా అంగీకరించింది. సర్వసభ్య సమావేశంలో ఆ తీర్మానాన్ని శ్రీ బూర్గుల రామకృష్ణ రావు ప్రతి పాదించారు. ఆయన నాతో అనేక అంశాలపై అభిప్రాయ భేదాలున్న వాడు అధ్యక్ష పదవికి అంతకు ముందు రెండుసార్లు పోటీచేసిన వాడు. ఆ అభిప్రాయభేదాలన్నీ చిన్న చిన్న విభేదాలు. పెద్ద అభిప్రాయ భేదం మాయమైంది ఒకే గొంతుతో స్టేట్ కాంగ్రెస్, నిరంకుశ ప్రభుత్వం వేసిన సంకెళ్లు త్రెంచివేసి స్వాతంత్ర్య వాయువులు పీల్చుకొనేటందుకు కృత నిశ్చయులమైనట్లు ఉద్ఘాటించింది ఆ తీర్మానాన్ని ప్రతిపాదించిన వెన్వెంటనే ఒక ఉపన్యాసకుని తర్వాత మరొకరుగా లేచి స్వాతంత్ర్య సాధన కోసం ప్రతిజ్ఞ చేశారు. అదే మంత సులువైన పని కాదని ప్రతి ఒక్కరికీ తెలుసు ఆ మహోన్నత కార్య సాధన (నిర్వహణ) ప్రాణ త్యాగానికి దారి, కారణము కావచ్చు. కాని, ఆ కార్య సాధన పూర్తికి ఏదీ అడ్డు కాకూడదు ఆ తీర్మానాన్ని వోటుకి పెట్టగా ఆ అనంత జనవాహిని ఉరుముల వంటి కరతాళ ధ్వనులతో అంగీక రించారు. ఆ తీర్మాన పాఠాన్ని ఈ క్రింద ఇస్తున్నాను.

హైదరాబాదు సంస్థానము, ఏ రాజ్యాంగ చట్ట సభలోనూ చేరడం లేదనీ బ్రిటిష సార్వభౌమాధికారము కాలదోషము వల్ల మాయమైనప్పుడు

ఘనత వహించిన నిజాము ప్రభువుకు సర్వస్వతంత్ర రాజ్యాధికార పద వికి హక్కు లభిస్తుందనీ తెలియజేస్తూ జారీచేసిన ఫర్మాను స్టేట్ కాంగ్రెసు వారు గమనించి తమ విచారమును వెల్లడించు చున్నారు అతి ముఖ్యమై ప్రజలకు ప్రాణం వంటిదైన ఈ ప్రకటనను సంస్థాన ప్రజలను ఏ విధం గానూ సలహా చెయ్యకుండా జారీ చెయ్యడం, సంస్థాన ప్రజల తరఫున స్టేట్ కాంగ్రెసు, ఇంతకు ముందు వెల్లడించిన భావాలకు అనుగుణ మైంది కాదు ప్రజామోదం పొందనిదే ఏ నిర్ణయాన్నీ అంగీకరించేటందుకు వీలు లేదు.

హైదరాబాదు సంస్థానంలో ఉన్న ప్రజలు, వారు హిందువులు కాని, ముస్లిములు కాని, ఆంధ్రులు కాని కన్నడిగులు కాని, అందరూ. పరిసర ఇరుగు పొరుగు రాష్ట్రాలలో వున్నవారి జాతికి చెందిన అన్న దమ్ములు కొన్ని చారిత్రిక సంఘటనలు, కృత్రిమ రాజకీయ సరిహద్దుల నిర్మాణానికి కారణా వారిని ఒకరి నుంచి ఒకరిని వేరుచేసాయి. అందు చేత హైదరాబాదు యొక్క సహజమైన స్థానం ఇండియన్ యూనియన్‌లో మాత్రమే వుంది అయితే ప్రభుత్వం జారీచేసిన ప్రకటన, ప్రజలను చీల్చి, దూరంచేసే విచ్ఛిన్నకర శక్తులతోటి, పెట్టుబడి దారులతోటీ, భూస్వాములతోటీ వారు చేతులు కలిపినట్లూ నిరంకుశాధికారాన్ని నిరవధి కంగా శాశ్వతంగా కొనసాగించ తలచినట్లూ స్పష్టం చేస్తున్నది

స్వదేశ సంస్థానాల ప్రభువులు (రాజులు, యువరాజులు) తమ ఉనికి, మనుగడ, క్షేమము బ్రిటిషు సామ్రాజ్యపు అనుగ్రహంపై ఆధార పడి ఉన్నవని నేటివరకూ భావించారు ఇండియన్ యూనియన్‌లో సహ జంగా ఒక భాగమైన హైదరాబాదు సంస్థానము దాని నుంచి వేరైనప్పుడు, ప్రజల సహకారము లభించనప్పుడు తనంతతానుగా నిలబడలేదు అంతే కాదు దుర్బలమై తన ప్రజలకు సేవ చేయలేదు. తన్ను తాను రక్షించుకో లేని ఆస్థితిలో అది శక్తివంతమైన పరాయిప్రభుత్వాన్ని ఆశ్రయింప వల సిన ఆవశ్యకత ఏర్పడు తుంది. అందువల్ల ప్రజల స్వాతంత్ర్యానికి,

అభివృద్ధికి ముప్పు కలుగుతుంది. భారతదేశ స్వాతంత్ర్యము, అనేక త్యాగాల ప్రయత్నాల ఫలితము అనేక మంది బాధలు పడి సాధించినది. వాటి అన్నింటి ఉమ్మడి ఫలితంగా బ్రిటిష సార్వభౌమాధికారము నీరు కారిపోయి మాయమైంది అందుచేత హైదరాబాదు సంస్థాన ప్రజలు ఎట్టి పరిస్థితులలోనూ తమర్ని భారత దేశపు ప్రజానీకం నుంచి వేరుచేసే ఏ ప్రయత్నాన్నీ చూస్తూ సహించి ఊరుకోరు. సంస్థాన ప్రభుత్వం హఠాత్తుగా గైకొన్న చర్యమూలంగా అత్యంత ప్రమాదకరమైన పరిస్థితి ఏర్పడింది అందువల్ల సంస్థాన ప్రజలకు, భారతదేశ ప్రజలకు మొత్తంగా అందరికి కష్టనష్టాలకు దారితీసే సంఘటనలు కలగవచ్చు. సంస్థానప్రజలు తమలక్ష్యమైన బాధ్యతాయుత ప్రభుత్వాన్ని, ఇండియన్ యూనియన్‌లో విలీనమైన తమ సంస్థానంలో నిర్మించుకొనే టందుకు శిల్పనైపుణ్యం చూపించ వలసిన అవసరం వచ్చిందని హెచ్చరిస్తున్నాము. హైదరాబాదు సంస్థానాన్ని ఇండియాలో విలీనంచెయ్యక వేరుగానుంచి నిరంకుశ పరిపాలన కొనసాగించే ప్రయత్నాలన్నింటిని ప్రతిఘటించండని వారిని స్టేట్‌కాంగ్రెసు ఆదేశిస్తున్నది. ఈ లక్ష్యసాధనకవసరమైన కార్యాచరణకు నిర్వహణకు, ఆవశ్యకమైన సంపూర్ణాధికారన్ని అన్ని బాధ్యతలను, ఏ అత్యవసర పరిస్థితిలోనైనా అవసరమయే ప్రత్యేక కార్యాచరణ నిర్ణయాలకు ఆ దేశాల నిచ్చుటకు కావలసిన అధికారాన్ని వర్కింగ్ కమీటీకి ఈ తీర్మానం ద్వారా అప్పగించడమైనది."

చర్చలను ముగిస్తూ 'ప్రజలదే సార్వభౌమత్వం అనే హక్కు స్థిర పరచుకోవాలని మనం ఈ నాడు గైకొన్న నిర్ణయాన్ని మనఃస్ఫూర్తిగా అమలు చెయ్యాలని' ప్రజలకు జ్ఞాపకం చేశాను హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు ఆదేశాలను కార్యరూపంలోకి తేవాలనే దృఢనిశ్చయంతో సభ పూర్తి అయింది.

—c—

# 32. తుది పోరాటము, ముఖ్యమైన ఎత్తుగడ

సంస్థానంలోని ప్రజాస్వామ్య వ్యతిరేకశక్తులు ఈనిర్ణయాలు తమకు సవాలు అని భావించినట్లున్నాయి వారుకూడ తమ బలాలు పుంజీకరించి స్వతంత్రపోరాటాన్ని ఎదుర్కోవాలని తలపెట్టారు ఇత్తెహాదుల్ ముసల్మీన్ వారు తమ సందేశాలు ప్రచారం చేసేవారు బెదిరింపులు, గట్టివార్నింగులు జారీచేశారు ప్రభుత్వాధి నేతలకంటె వారే ఎక్కువ ధాటీగా కబుర్లు చెప్పేవారు మంత్రి వర్గము విరామం లేకుండా కూర్చుని, ఉద్యమాన్ని ఆదిలోనే అంతంచేయడం ఎట్లాగ అని చర్చలు చేస్తున్నట్లు వార్తలు పైకి పొక్కాయి మమ్మల్నందరినీ వెంటనే అరెస్టు చేస్తారనే పుకార్లు (గాలి కబుర్లు) వచ్చాయి. అధికారులు అవలంబించే అనూహ్య పద్ధతులు పూర్తిగా తెలిసినందు వల్ల మేము దేనికైనా సిద్ధపడే వున్నాము స్వాతంత్ర్య పోరాటాన్ని తీర్చి దిద్దడము, నడిపించడము అనే బాధ్యతలు కొందరికి అప్పగించి, వాటిని నిర్వహిస్తున్న నాయకులు అధికారుల చేతుల్లో చిక్కకుండా మెలగాలని నిర్ణయించాము నేనూ మరి కొందరమూ సలహా కావలసినప్పుడల్లా అందుబాటులో వుండేటందు కోసం పట్నంలోనే వుండిపోయాము. పథకాలు వెయ్యడం ఇంకా జరగవలసే వుంది పోరాటానికి కచ్చితమైన వ్యూహం ఇంకా తీర్చిదిద్ద వలసిన పని కూడా వుంది. అందువల్ల ఈ ఏర్పాట్లు తప్పని సరి అయాయి. సర్వాధి కారాలూ కలిగి పోరాటాన్ని కొనసాగించ వలసిన వర్కింగ్ కమిటీని, అందులో వుండవలసిన మెంబర్లను నేను ఇంకా ఎన్నిక చేయలేదు ఏమీ ఆలస్యం చేయకుండా ఈ పనులన్నీ

చేసి, ఉద్యమ నిర్వహణకు ఉపయోగించే వారినందరినీ స్వయంగా కలుసుకొని, వర్కింగ్ కమిటీ మొదటి సమావేశం సంస్థానానికి వెలుపల జరుగుతుందని ఉద్యమం సాగినకొద్దీ దశలవారీగా వివరాలన్నీ నిర్ణయ మవుతాయనీ ప్రకటించాను.

ఇప్పుడు, నేనూ నా సహచరులూ అమలు చెయ్యాలని తలపెట్టిన ప్రధాన వ్యూహాన్ని గురించి కొంత వివరంగా చెప్పాలి స్వాతంత్ర్య పోరాటపు తుది దశ హైదరాబాదులో ఇండియన్ యూనియన్ సైన్యాల బల ప్రదర్శనతో పూర్తి అవుతుంది ఆ విషయం గురించి మాకందరకూ దృఢ విశ్వాసం వుంది కాని, దాని కంటె ముందు పెద్ద ఎత్తున సత్యాగ్రహోద్యమం జరగాలి. హైదరాబాదు సంస్థానంలో ఒక విపరీతమైన పరిస్థితి వుంది ప్రజలలో ఒక వర్గంవారు సాయుధులు, వారు ఆధునిక మారణాయుధాలను నేల నుండి నెత్తిదాకా ధరించివున్నారు సంస్థానాన్ని పాలించే నిజాము తాను స్వతంత్ర రాజుననే అహంభావంతో మత్తెక్కివున్న వాడు అందుచేత ఇండియన్ యూనియన్ సాయుధచర్యమినహా మరేది ఈ సమస్యకు తుది పరిష్కారాన్ని కల్పించ లేదు. హైదరాబాదు గడ్డమీదనే భారత స్వాతంత్ర్య యుద్ధంలోని తుది పోరాటం పోరాడక తప్పదనీ అక్కడ జరిగే తుది రణంలో స్వతంత్ర భారతదేశం పాల్గొని తన విజయం ద్వారా హైదరాబాదు సమస్యను తేల్చివేయ గలుగుతుందనీ మొదటి నుంచీ భావిస్తున్నాము అయినప్పటికీ, హైదరాబాదు ప్రజలు, నడవవలసిన ముళ్లదారి అంతానడిచి, చేయవలసిన గొప్పగొప్ప త్యాగాలు చేసి, భారతజాతి మనస్సును కదిలించి తమ స్వాతంత్ర్యము భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యానికి అంగరక్ష అని, నిరూపించ వలసి వుంది. అందువల్లనే ఆ ఉద్యమాన్ని తీర్చిదిద్ది నడిపించ వలసిన వారిలో కొందరు బైట ఉండటమూ, కాంగ్రెసు కార్యకర్తలు యావన్మందీ సత్యాగ్రహంచేసి జైళ్లలో ప్రవేశించడమూ అవసరమని నిర్ణయించాము.

వర్కింగ్ కమిటీ మొదటి సమావేశము షొలాపూర్‌లో జరిగింది. షొలాపూర్ హైదరాబాదు సంస్థానపు సరిహద్దులలో వున్న జిల్లా ముఖ్య పట్నము అప్పుడే నేను అరెస్టు అయిన వెంటనే సర్వాధికారాలతో వ్యవహరించ వలసిన కార్యాచరణ కమిటీని కూడా నిర్ణయించడం జరిగింది. ఆ కమిటీలో :

1. శ్రీ డి జి. బిందు
2 శ్రీ జె కె. ప్రాణేశాచార్య
3. శ్రీ గోవిందదాస్ షరాఫ్
4. శ్రీ జమ్లాపురం కేశవ రావు

మెంబర్లుగానూ శ్రీ బిందు, కమిటి చైర్మన్ గాను బాధ్యతలు వహిస్తారు. నేను ఈ కమిటి చైర్మన్‌ను గురించి మరికొంత చెప్పకపోతే ఈ కథ అసంపూర్ణంగా వుంటుంది శ్రీ బిందు స్వాతంత్ర్యోద్యమ ప్రారంభం నాటి నుంచీ, దాని కార్యక్రమాల్లో నిమగ్నుడైనాడు ముఖ్యమైన విషయాలన్నింటిలోనూ సిగ్గు అయిన నిర్ణయాలు తీసుకోవలసి వచ్చినప్పుడు ఆయన సలహాలకు నేను ఎక్కువ విలువ ఇచ్చాను. ఆయన విస్తృతమైన అనుభవము, సార్థకము సాఫల్యము అయిన ఆలోచనలు చెప్పే శక్తి సామర్థ్యాలు నాకు ఎల్లప్పుడు అందుబాటులో వుండి ఎంతో ఉపయోగించాయి ఆయన యువతరం కార్యకర్తలతో కలిసి పోయేవాడు. సంస్థలో ఆయన ప్రగతిశీల పక్షం వహించి ప్రగతి నిరోధకవాదుల్ని ఎదుర్కొనేవాడు పథకాలు తీర్చి దిద్దడంలో నైపుణ్యానికి, నిశితంగా లోతుగా పరిశీలించ డానికి సమర్థుడు శ్రీ షరాఫ్ అని నేను భావించి అభినందిస్తాను. అట్లాగే శ్రీ బిందు సమచిత్త సమభావుడనీ నిష్పక్ష పాతంగా సాధ్యాసాధ్యాలను బేరీజువేసి మార్గదర్శకత్వం వహించే ధీమంతుడనీ పరిగణించి మెచ్చుకొంటాను అందుచేత హైదరాబాద్ సంస్థాన ప్రజల స్వాతంత్ర్య పోరాట నిర్వహణను ఈ మిత్రుల చేతుల్లో వదలవచ్చునని నేను భావించాను. శ్రీ బిందు, నాకు చాలా కాలం నుంచీ మిత్రుడు. మేమిద్దరమూ

అనేక సమస్యల పట్ల ఒకే తీరుగా భావించే వాళ్లము. స్వాతంత్ర్యం లభించిన తరవాత అనేక సమస్యలపట్ల మాలో విభిన్నదృక్పథాలు పొడచూపినప్పటికి మా పరస్పర ప్రేమ గౌరవానుబంధము పూర్వపు రీతిగానే ఉంది. మేమిద్దరమూ కలిసి పడిన బాధలు, ఎదుర్కొన్న సమస్యలు నా స్మృతి పథంలో గర్వించే చిహ్నాలుగా మిగిలి సంతోషం కలిగిస్తాయి.

మా కమిటీ కేంద్ర కార్యాలయానికీ, ప్రాంతీయ కార్యాలయాలకూ సంస్థానానికి బైట అనుకూలమైన చోటు నిర్ణయించడము మాకు చిక్కు సమస్య అయింది. ఒక చోటి నుంచి మరొక చోటికి మారుస్తూ చివరకు బొంబాయి రాష్ట్ర కాంగ్రెసు కమిటీ ఆఫీసులో ఒక మూల సర్దుకున్నాము. ఆ కాంగ్రెసుశాఖ అధ్యక్షుడు శ్రీ ఎస్. కె. పాటిల్. మా ఆఫీసుకు కొంత కాలంపాటు అక్కడ వసతి ఇచ్చారు. ఇక్కడ మా ఆఫీసు అనే పేరు అక్కడి కుర్చీలకు వర్తింపజేసి వ్యవహరించినా అసలు పని అంతా మొదటి నుంచి సర్దార్ గృహంలో మాకు లభించిన వసతిగదులలో జరిగేది.

తెలంగాణా ప్రాంతానికి సంబంధించిన మండల కార్యాలయం బెజవాడలో ఉండాలనీ కర్నాటక ప్రాంతీయ కార్యాలయం గడగ్‌లో ఏర్పాటు కావాలనీ ఎన్నిక చేశాము. ఆ ఆఫీసుల్లో పనిచేయ వలసిన కార్యకర్తలను నిర్ణయించి మిగిలిన హంగులు సరంజామాలు, ఏర్పాటు చేసేటందుకు నేను నా దృష్టి కేంద్రీకరించాను.

శ్రీ వి బి. రాజుకు బెజవాడ ఆఫీసు అప్పగించాము ఆయన ఉద్యమానికి మంచి ప్రచారం చేసి, ప్రభావిత మొనర్చి ముందుకు నడిపించాడు సామాజిక - ఆర్థిక సమస్యలను గురించిన ఆయన దృక్పథం ప్రగతి శీలం కలది. ఆయనకు ఈ విషయాలను గురించి మంచి పరిజ్ఞానం వుంది. ఎంత గొప్పతుపాను ఎదురైనా ఆయన మెలకువతో మెలగి ప్రవాహపు వాలులో ముందుకు పోగలడు. వెల్లోడి మంత్రి వర్గంలో ప్రజలకు ప్రాతినిధ్యం కలిగించినప్పుడు, ఈయన మంత్రి పదవి వహించాడు

స్వర్గీయ శ్రీ అయ్యదేవర కాశేశ్వరరావు ఆంధ్ర కాంగ్రెసు వృద్ధ నాయకుల్లో ప్రఖ్యాతి పొందిన వాడు. ఆయన విజయవాడలో తన ఇంటిలోనే ఆంధ్ర ప్రాంతీయ ఆఫీసుకు వసతి ఇచ్చారు. శ్రీ కాశేశ్వరరావు చౌరవగల స్వాతంత్ర్య యోధుడు. నిరంకుశ ప్రభుత్వానికి పట్టుగొమ్మ అయిన హైదరాబాదుపై దాడిజరుగుతున్నప్పుడు ఆయన తన బలాన్ని, పూర్తిగా అందించి హైదరాబాదు సంస్థానంలో కొనసాగుతున్న స్వాతంత్ర్యోద్యమానికి మద్దతు ఇచ్చారు. ఆయన ఇల్లు స్టేట్ కాంగ్రెసు కార్యకర్తలకు తేనె పట్టులా కన్పించేది. ఆయనకు నేనంటే ప్రత్యేకంగా అభిమానము. అది మా ఇద్దర్నీ నానాటికీ మరింత సన్నిహితుల్ని చేసింది. మా మధ్య ఏర్పడిన దృఢస్నేహ బంధం, మేమిద్దరమూ కలిసి పనిచేయడాని, విశాలాంధ్ర ఏర్పడేటందుకు దారి సుగమం కావడానికి తోడ్పడింది.

స్వర్గీయ ఆంధ్ర కేసరి టి. ప్రకాశం నన్నెప్పుడూ ఆశీస్సులతో ముంచెత్తేవాడు. నా మార్గంలో ఎదురైనఅన్ని కష్టనిష్టూరాలలోనూ ఆయన నాకు ఎనలేనిబలం కలిగించే వాడు. సందర్భం లభించినప్పుడల్లా కలవడము కలిసినప్పుడల్లా పరస్పరాభిప్రాయాలు తెలుసుకొవడము మా ఆచారమైంది. ఆ రోజుల్లో నాకు ఆయన కొండంత అండగా వుండేవాడు.

డబ్బు సమస్య ఎప్పుడూ మిడిగుడ్లు వేసుకొని మావైపుదెయ్యంలా చూస్తూ భయం కలిగించేది. ఈ ప్రయాణం ప్రారంభించి నపుడు నా చేతిలో పైసా కూడా లేదు. సంస్థానంలో వున్న వారిలో కొందర్ని అడిగి చూశాను. వారికి ఇచ్చే మనస్సు పుట్టలేదు. బహుశా వారిలో ఇంకా ఆవేశం కలగ లేదేమో. ఏదెట్లావున్నా పోరాటం నడుస్తూ వుండవలసిందే. "ఉద్యమంసాగిన కొద్దీ డబ్బుదానంతట అదే వచ్చి పడుతుంది" అని, నేనూ నా సహకార్య కర్తలూ ఒకరికి ఒకరము ధైర్యం చెప్పుకొన్నాము. ఈ ధైర్యపు వచనాల వల్ల ప్రయోజనం ఏమిటి ? వేసిన ప్రతి పథకాన్ని దాన్ని అమలు చెయ్యాలంటె పెద్ద మొత్తాల్లో సొమ్ము కావాలి. బొంబాయి నగరంలో నిలబడి ఉండేటందుకు కూడా కొన్ని వేల రూపాయలు కావాలి

సాయం చేస్తామని మాట ఇచ్చిన కాంగ్రెసు మనుషులు కొందర్ని అడిగాను అది కూడా సకాలంలో అందలేదు. మా కార్యాచరణ కమిటీ ఆఫీసు బొంబాయిలో పని ప్రారంభం చెయ్యడానికి, శ్రీ జయప్రకాశ్ నారాయణ్ సంపాదించి ఇచ్చిన సొమ్ము ఆధారమైందని తెలుసుకోవడం చదువరులకు ఆసక్తి దాయకమైన సమాచారం కావచ్చు జయప్రకాశ్ అప్పుడు బొంబాయిలో వున్నాడు ఆయనతో కమిటీవారు, ఉద్యమ నిర్వహణ గురించి చాలసేపు చర్చించారు జయప్రకాశ్ హైదరాబాదు ప్రజల సమస్య తనదేనని చెప్పి, కమిటీవారు ఎప్పుడు పిలిస్తే అప్పుడు వస్తానని తన నుంచి అవసరమైన సలహాలు, సాయము అడిగిపొందండనీ చెప్పేరు. ఆ నాటి నుండి, నేటి వరకు కూడా ఆయన ప్రేమాను రాగాలు, సన్నిహిత్యమూ సౌజన్యమూ నన్ను పులకింప జేసాయి

క్రమముగా మండల కార్యాలయాలన్నీ పని మొదలు పెట్టాయి. అది చూసి తృప్తిచెంది, ఈ ఉద్యమం ప్రారంభించేటందుకు హైదరాబాద్ ప్రయాణం అయాను ఆగస్టు 7, 1947 నాడు "సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనం కావాలి" అనే నినాదంతో విలీనతాదినోత్సవము జరపాలని నిర్ణయించాము ఆ తర్వాత మరో వారం నాడు ఇండియా స్వతంత్రపు రాజ్యాంగా రూపొందుతుంది

విలీనతా దినోత్సవానికి ఇచ్చిన పిలుపు సంస్థానంలో అన్ని మూలలా ప్రతి ధ్వనించింది ప్రజలలో భారతదేశ పౌరులతో ఎడతెగని సంబంధాలు కల్పించుకోవాలనే గాఢమైన కోరిక ఉన్నట్లు వ్యక్తమైంది ఆ నిశ్చయం నుంచి ఎవరూ వారిని కదిలించలేరనీ ఏ అవరోధాలు దాన్ని అడ్డగించలేవనీ అనిపించింది. హైదరాబాదు నగరంలో ఆనాటి ఉదయం, సూర్యోదయానికి ముందే సుల్తాన్ బజారు ప్రాంతంలో వందలాది ప్రజలు చేరారు వారందరూ 'ఇండియన్ యూనియన్‌తో విలీనం కావాలి' అనే పతాకాలు ధరించి కాంగ్రెసు పతాకాన్ని ఎగురవేసి వందనం చేశారు.

ఆ ఉత్సవం శాంతియుతంగా జరిగింది. ఎవరూ అరెస్టుకాకుండా సాగిపోయింది. బహుశా ఇట్లాంటి ఉత్సవం జరుగుతుందని కాని, అంత పెందలకడే జరుగుతుందని కాని, అధికారులు ఊహించి ఉండకపోవచ్చు. ఆ సాయంకాలం అదే నినాదాలతో సుల్తాన్ బజార్ ప్రాంతంలో ముఖ్యమైన రహదారులగుండా ఊరేగింపు జరిగింది. నేనూ మరికొందరమూ అగ్రగాములమై ఊరేగింపులో పాల్గొన్నాము. ప్రజలు పెద్ద ఎత్తున రోడ్లమీదికి గుంపులుగా వచ్చి ఉత్సాహంతో నినాదాలు చేశారు. పోలీసు బందోబస్తు సాధారణంగా ఉండే దానికంటె ఎక్కువగానే ఏర్పాటైంది. లాఠీచార్జి జరిగింది. ఎవరికీ ప్రమాదం ఏమీ జరగలేదు. కొంతమంది వాలంటీర్లను అరెస్టు చేసి కొన్ని గంటలపాటు కస్టడిలో ఉంచి తరువాత విడుదల చేశారు.

కాని, జిల్లాలలో జరిగిన సమాచారం మరొక రీతిగా ఉంది. అధికారులు ఏదో జరుగవచ్చునని కొన్ని వారాలు ముందుగానే పసికట్టినట్లున్నారు. ప్రజానాయకులైన వారినందర్నీ ముందే అరెస్టుచేసి జైల్లో కుక్కిపెట్టారు. ఒక వారంలోనే వెయ్యిమంది అరెస్టయ్యారు.

కాని, పోలీసులు నన్నేమీ చెయ్యలేదు ముట్టుకోలేదు అందుచేత హైదరాబాదు నగరంలో కూడా అన్ని పేటలలోనూ ఊరేగింపులు నడిపించాలి. ప్రతివాడను గురించి ఆ బాధ్యతను ఒక ముఖ్య కార్యకర్తకు అప్పగించాము. ఆయన ఊరేగింపులో ముందుండాలి. ప్రతిరోజూ కొందరు కార్యకర్తలు అరెస్టయ్యేవారు. ముఖ్యులను నాయకులను అరెస్టు చేయకుండా వదలి వేసేవారు.

అప్పుడు నేను హైదరాబాదు సంస్థానంలో ఒక చివర మద్రాసు, రాష్ట్రపు సరిహద్దున ఉన్న మధిరకు ప్రయాణం అయాను. హైదరాబాదు సంస్థానం ఎందువల్ల ఇండియన్ యూనియన్‌లో విలీనం కావాలో అక్కడివరకు ప్రతిచోటా ప్రజలకు వివరించాలని నా ఉద్దేశ్యం. ఖాజీపేటనుంచి మధిరవరకూ ఉన్న ముఖ్యమైన రైలు స్టేషన్ లన్నింటిలోనూ

నా మాటలు వినాలని ప్లాట్‌ఫారంమీద వేలకొద్ది జనం పోగయ్యారు. పోలీసు ఆఫీసర్లు నన్ను రైలులోనుంచి డిస్ట్రిక్ట్ సూపరింటెండెంట్ ఇంటికి తీసుకొనిపోయే ప్రయత్నాలు చేశారు నేను కదిలేటందుకు నిరాకరించి, వారంట్ చూపించి నన్ను అరెస్టు చేయవచ్చునని వారితో చెప్పాను. తర్వాత ప్రజలకు ఉపన్యసించి ముందుకు సాగిపోయాను డోర్నకల్ జంక్షన్‌వద్ద జనం మా రైలుకోసం ఎదురుచూస్తున్నారు పోలీసులు నన్ను ప్రజలతో మాట్లాడ నియ్యలేదు రైలు ఖమ్మంమెట్టు స్టేషన్ చేరేసరికి పట్టాలకడ్డంగా వేలమంది జనం కొన్ని మైళ్ళవరకూ అడ్డ నిలిచారు ప్రజలు తమ మౌలిక హక్కులకోసం త్వరగా సమీకృతమై దృఢ నిశ్చయంతో పోరాడగలరని రుజువైంది రైలు, సాయంత్రం అయేప్పటికి మధిర చేరింది. నేను రైలు దిగాను. పోలీసులు కాపలావేసి ఎవరినీ నాదరికి రానీయలేదు అయినప్పటికీ నలుగురు వాలంటీర్లు కాంగ్రెసు పతాకాలు చేత ధరించి నినాదాలు చేశారు. వాలంటీర్లు నన్ననుసరిస్తూ వచ్చారు.

నా చుట్టూ పోలీసులు పరివేష్టించారు. ఇట్లా పట్నంలోకి రెండు ఫర్లాంగులు నడిచి ఒక స్నేహితుడి ఇంటి వసారాలోకి చేరాము. సభ ఉపన్యసించడానికి వీలులేదని పోలీసు ఆఫీసరు నాతో చెప్పారు. ఆనాటి మాట అర్థరు మన్నించ నక్కరలేదు. కాని, వారు నా చుట్టూ ఉండి నన్ను కదలనియ్యలేదు. రాత్రి, చీకటి, అయినా పరిసర గ్రామాలనుంచి వేల సంఖ్యల్లో ప్రజలు నినాదాలు చేస్తూ వచ్చారు వారు చేస్తున్న నినాదాల ధ్వని మా చెవుల బడుతోంది పోలీసు అధికార్లకు భయం కలిగినట్లుంది వారు నేను ఆ మధిర పట్నం వదలి వెళ్ళిపోవాలని కోరారు నేను నిరాకరించగానే వారు నన్నూ నా కార్యదర్శి దామోదర్ పంగ్రేకర్‌ను నిర్బంధంలోకి తీసుకొని ఆ రాత్రే రైలెక్కించారు. మమ్మల్ని ఉదయం ఖాజీపేటలో రైలునుంచి దింపి అక్కడినుంచి కారులో హైదరాబాదు కొనితెచ్చి నా మకాము దగ్గర దిగబెట్టారు. ప్రభుత్వం ఇంకా మరేదో జరుగుతుంది, అప్పుడు చర్య తీసుకోవచ్చు అని తటపటా

యిస్తున్నట్లున్నది మాపై గట్టి చర్యలు తీసుకొనకపోవడానికి అది తప్ప నాకు మరే కారణమూ కనిపించదు.

ఈ సందర్భంలో శ్రీ దామోదర్ పంగ్రేకర్‌ను గురించి కొంత చెప్పడం తగిన పని అతను నాపట్ల వినయ విధేయతలు, భక్తి ఉన్న సహచరుడు ఇరవై సంవత్సరాలకు పైగా నా కార్యక్రమాలన్నింటిలోనూ చేదోడుగా ఉంటూ కార్యదర్శిగానూ ఇతర విధాలుగానూ ఉపచరిస్తున్న సేవావ్రతుడు హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ నడిపిన అన్ని సత్యాగ్రహోద్యమాలలోనూ పాల్గొన్నవాడు 1938 లో సత్యాగ్రహం చేసి చంచల్ గూడా జైలుకు వచ్చినప్పుడే నేను అతనిని మొదటిసారి చూశాను స్వాతంత్ర్యోద్యమ సందర్భంలో లేచిన తుఫానులన్నింటి తాకిడినీ ధైర్యంతో అనుభవించినవాడు. ఆయన తన జీవితాన్ని ప్రజాసేవ' కంకితం చేసినవాడు. నా సంతోషాల్లో, సుఖాల్లో పాలుపంచుకొంటూ కాదు లేదు అనకుండా ఉండే స్నేహితుడు ఎదిగే వయసువాడై నప్పుడు నా దగ్గరకువచ్చి సన్యాసిని సేవించడంవల్ల ఎదురయ్యే అనిశ్చిత జీవిత విధానాలను అన్నింటినీ సహిస్తూ ఎదిగాడు. అత నెన్నుకొన్న దారినుంచి ఎవరూ కూడా అతనిని పక్కకు మళ్ళించలేరు ఆయన తెలివి తేటలుకలవాడు కష్టపడి పని చేస్తాడు. లోక వ్యవహారానుభవమూ, పరిపాలనా సామర్థ్యమూ, ఉన్నవాడు నిష్కల్మష హృదయము, కర్తవ్య పరాయణత్వము అతను గడించుకొన్న కానుకలు మృదుస్వభావంతో అతను నన్ను నడిపిస్తాడు నే నెన్నుకున్న మార్గంనుంచి కొంచెం పక్కకు తిరిగినట్లు కనుక అతను గమనిస్తే మర్యాదాపూర్వకంగా ఆ విషయాన్ని నా దృష్టికి తెచ్చేటందుకు వెనుకాడని సాధుశీలి నేను అతనికెంతో రుణ పడి ఉన్నాను

15 ఆగష్టు 1947 న ఇండియా స్వతంత్ర రాజ్యంగా అవతరించింది అర్ధరాత్రి గడియారం 12 గంటలు కొట్టబోతోంది రేడియోలన్నీ ఢిల్లీ కేంద్రానికి అనుసంధానమయాయి పండిట్ జవహర్లాల్ నెహ్రూ డాక్టర్ రాధాకృష్ణన్‌లు ఇచ్చిన ఉపన్యాసాలు అప్పుడే అవతరించిన

నూతన శకం, రూపుదిద్దుకొంటున్న నూతన సమాజం ఎట్లా ఉంటాయో సూచించాయి. మేమందరమూ కూడా ఆ మాటలలో వెల్లడియైన భావాలకు పులకించి భావసమైక్యత పొందాము. హైదరాబాదు నగరంలో ఆనాడు (15-8-1947 నాడు) ఇండియన్ పతాకాన్ని ఆవిష్కరించడం జరుగుతుందని మాట ఇచ్చాము. తగిన ఏర్పాట్లు చేయవలసిందని రహస్య సందేశాలు పంపాము పండిట్ జవహర్లాల్ నెహ్రూ ఢిల్లీలో నాకు ఇచ్చిన పతాకాన్ని నేను జాగ్రత్తగా తెచ్చుకొన్నాను. అది బైటికి తీసి సుల్తాన్ బజార్ ప్రాంతంలో ఒక బహిరంగ ప్రదేశంలో ఆవిష్కరింపేటందుకు ఇచ్చాను. మేము అనుకొన్నట్లుగానే నన్నూ, డాక్టర్ జి ఎస్. మేల్కోటేను పోలీసులు 15-8-1947 న తెల్లవారుజామున 3 గంటలకు నిర్బంధంలోకి తీసుకొని చంచల్‌గూడా జైలుకు పంపారు పతాకావిష్కరణ చెయ్యవలసిన జట్టులో శ్రీ కృష్ణాచార్య జోషి ఒకరు. ఆయన పేరు కూడా జైలుకు వచ్చిన వారిలో ఉంది పథకం ప్రకారం అన్ని లాంఛనాలతోటీ పతాకావిష్కరణం జరిగింది. అందులో పాల్గొన్న వారం... అరెస్టు చేశారు ఈ తీరుగా స్వతంత్ర పోరాటంలో ఆఖరు దశ ప్రారంభమైంది హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు తీసుకొన్న ప్రతిజ్ఞను పాలించడం జరిగింది.

బొంబాయి నగరంలో వున్న మా కార్యాచరణ సమితి (కమిటీ) ఈ సంఘటనలను చర్చించింది ఉద్యమ నిర్వాహణను వారు తమ చేతుల్లోకి తీసుకున్నారు కార్యకర్తల యూనిట్లన్నింటికీ సత్యాగ్రహం ఎట్లా చెయ్యాలో సూచనలు పంపారు రెండు నెలల్లో 21,000 మంది సత్యాగ్రహం చేసి జైళ్లకు వెళ్లారు వారి ఉత్సాహం తగ్గకుండా పెదిగెట్లు ప్రజలు ప్రోత్సాహం ఇచ్చారు. అరెస్టులు ఎక్కువైనకొద్దీ ఉద్యమంలో పాల్గొనే వారు పెరిగారు.

గ్రామాల నుంచి వచ్చిన రైతులు, కాలేజీ విద్యార్థులు, లాయర్లు, వర్తకులు, ఫ్యాక్టరీలలోని కార్మికులు, అన్ని తరహాలవారు ఎవరూమినహా

యింపు కాకుండా ఉద్యమ విజయానికి శక్తికొద్దీ కృషి చేశారు. హైదరాబాద్‌లో ప్రజానీకము ఒక్క మనిషి ఉవ్వెత్తుగా లేచినట్లు లేచి స్వాతంత్ర్య సిద్ధికోసం త్యాగంచేసినా అదిఅల్పమే అని ఋజువుచేశారు.

కార్యాచరణకమిటీ (సమితి)కి సంస్థానంలో అంతటా చెదిరిపోయిన దారాలన్నిటినీ చేతబట్టి తిరిగి మరొ పన్నిక పన్ని పని నడిపించేటందుకు కొంత కాల వ్యవధి అవసరమైంది. సత్యాగ్రహోద్యమాన్ని ఎట్లా నడిపించాలో అందులో ఏయే అంశాలు ముఖ్యమో వివరించ వలసి వచ్చింది. దీనికి తోడుగా ఒక సంస్థను ఏర్పాటు చెయ్యవలసిన అవసరం కూడా కలిగింది హైదరాబాద్ ప్రజలు సత్యాగ్రహంచేసేటందుకు ఒక తేదీ నిర్ణయించారు

రాబోతున్న ఉద్యమం యొక్క ప్రభావం ఏమిటో ప్రభుత్వానికి పూర్తిగా తెలుసు. తెరవెనుక సంప్రతింపులు జరిగాయి పరిపాలనలో మార్పులు రాబోతున్నాయిఅని ప్రకటించారు మంత్రివర్గం మారిపోతుంది. కొత్త ముఖ్యమంత్రి పరిపాలనా బాధ్యత వహిస్తాడు అని చెప్పసాగారు. ప్రజా నాయకులు, ప్రజా సేవకులు అని చెప్పుకుంటూ అపుతున్న కొందరు మంత్రి వర్గంలో చేరే అవకాశాలున్నాయని గాలి కబుర్లు చెలరేగాయి జైలులో ఉన్నందు వల్ల నేను ఈ రాజకీయపు ఎత్తుగడ ఏమిటో పూర్తిగా అర్థం చేసుకో లేక పోయాను. హఠాత్తుగా ఒక నాడు నా దగ్గరకు జైళ్ల శాఖలో ఇన్‌స్పెక్టర్ జనరల్ వచ్చి నన్ను కొన్ని గంటల సేపు పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫీసుకి తీసుకెళ్ల వలసి ఉందనీ అక్కడ వున్న కొందరు మిత్రులు నాతో ప్రస్తుత పరిస్థితిని గురించి చర్చించ గోరుతున్నారనీ చెప్పాడు. నన్ను మూసిన కారులో తీసుకొని వెళ్లారు. అక్కడ మీర్ లాయక్ అలీనీ, నేను ఎంతో గౌరవించే మరో పెద్ద మనిషినీ చూసి ఆశ్చర్య పోయాను. మీర్ లాయక్ అలీ ఒక్కడే నాతో మాట్లాడాడు. నేను నిశ్శబ్దంగా వింటూ కూర్చున్నాను. నా ఇతర మిత్రుడు తన్నుకాదన్నట్లు కూర్చున్నాడు. లాయక్ అలీ ప్రజా ప్రభుత్వం అంటే ... ...

ఒక కొత్త సిద్ధాంతం ప్రతిపాదించి, తాను ముఖ్యమంత్రిగా, మరికొందరు అనధికారులు, అధికారులు మంత్రులుగావుంటే అది ఎట్లా ప్రజాప్రభుత్వం అవుతుందో వివరంగా చెప్పాడు. ఇండియాతో విలీనం కావడం గురించి కాని, బాధ్యతాయుతప్రభుత్వంగురించిగాని సూచనగానైనా మాటమాత్రంగానైనా పేర్కొనలేదు. అదంతా విని, సహజంగా, నేను ఆ ప్రతిపాదనలను పరిశీలించే అవకాశంలేదని చెప్పాను. కాని ఆయన నన్ను అంతటితో వదలలేదు. సెలవు తీసుకొనబోతూ తాను తిరిగి ఒకటి రెండు రోజుల్లో నన్ను కలుసుకొంటానన్నాడు. ఆయన వ్యవహరిస్తున్న పద్ధతిలో నమ్మకం కుదరనందున నన్ను ఆయన ఒక వారం తర్వాత కలుసుకోవలసిందన్నా అప్పటికి ప్రజా ఉద్యమం ప్రారంభమవుతుంది కనక, మనం కలుసుకోవలసిన అవసరమే కలుగక పోవచ్చుననీ చెప్పాను. ఉద్యమాన్ని బలహీన పరచే మొదటి ప్రయత్నాన్ని ఈ విధంగా వమ్ము చెయ్యడం జరిగింది.

అరెస్టులు జరుగుతునే వున్నాయి. ప్రజలలో ఉత్సాహం కూడా పెరుగుతూ వచ్చింది. వాటితో పాటు ఉద్యమాన్ని అణచివేసే చర్యలు కూడా ఎక్కువయాయి. అయినప్పటికీ వందలు వేలుగా వస్తున్న కార్యకర్తల ఉత్సాహం దేనికీ బెదరిపోలేదు. ఉద్యమం ఎందుకు అవసరమో వారికి తెలుసు. స్వతంత్రం ఇప్పుడే, లేదా ఎప్పటికీరాదు అనేది వీరి నినాదం అయింది. ఇండియన్ యూనియన్‌తో హైదరాబాదు విలీనం కావాలంటే దాని విలువ పూర్తిగా చెల్లించక తప్పదని కూడా వారికి తెలుసు. కొందరు తమ శిరస్సులు అర్పించారు. అప్పటి పరిస్థితి అట్లావుంది.

స్వతంత్ర భారతదేశం హైదరాబాదు ప్రభుత్వంపైన పెడుతున్న ఒత్తిడికూడా ఎక్కువ కాసాగింది. కడపటి బ్రిటిషు (గవర్నర్ జనరల్) రాజప్రతినిధియైన మౌంట్‌బాటెన్ ప్రభువు తాను పదవీ విరమణచేసే లోపుగానే హైదరాబాదు ఏదో విధంగా ఇండియన్ యూనియన్ పరిధిలోకి

రావాలనీ గాఢంగా వాంఛించాడు. ఆ రెండింటి మధ్య మొట్టమొదట ఏర్పడిన బంధము చాలా వదులుగా ఉన్నా తృప్తిచెందే ధోరణినే ఆయన వ్యక్తం చేశాడు హైదరాబాద్, ఢిల్లీ నగరాల నడుమ ఇటూఅటూ ప్రతినిధి వర్గాల రాకపోకలు జరిగాయి. హైదరాబాదు ప్రభుత్వం ఒక్కొక్కసారి ఒక్కొక్క క్రొత్త ప్రతిపాదన చేసేది స్వర్గీయ సర్దార్ వల్లభ్‌భాయి పటేల్ అప్పుడు ఇండియా ప్రభుత్వంలో హోంశాఖ మంత్రి. ఆయన తన అనన్య సామాన్యమైన పద్ధతిలో అన్ని సూచనలనూ పరిశీలిస్తూ నిజాము దృక్పథాన్ని గౌరవిస్తున్నట్లుగా ప్రవర్తించేవాడు అందరు స్వదేశ సంస్థానాధిపతులూ సంతకాలు పెట్టిన ఒడంబడిక పత్రం పైన ఉన్న పేరుమాత్రం సహజీవన నియమావళి అని మార్చిలోపల ఉన్న షరతులు యథాతథంగా ఉంచాడు కాని, హైదరాబాదు ప్రభుత్వపు వైఖరిలో అది తాను మొట్టమొదట ఏ పట్టు పట్టిందో అదే కాని, దాన్ని సడలించే ఆలోచన ఎంతమాత్రమూ కనిపించలేదు.

ఉద్యమం విపరీతంగా విజృంభించింది ప్రజలందరూ ఉద్యమాన్ని సమర్థించారు అది సహజమే ఎందుచేతనంటే ఈసారి జరుగబోతున్న పోరాటంలో తాడోపేడో తేలిపోతుంది రాజీబేరాలు తాత్కాలికపు ఒప్పందాలు లేనేలేవు; కాని, మరల ఒకసారి కాంగ్రెసు వారిలో కొందరు శాంతి వాదులు సంప్రతింపుల ద్వారా పరిష్కారం సాధిద్దామని అనుకున్నారు

అధికారులు మరెవరితో రాజీ కుదుర్చుకున్నా పని జరుగదని గుర్తించి నాతోనే సంభాషణలు మొదలు పెట్టారు. స్టేట్ కాంగ్రెసు తన యావచ్ఛక్తినీ కూడగట్టుకొని ఏటూ దృష్టిని చలించనీయకుండా జీవన్మరణ సమస్యవంటి పోరాటం జరుపుతూఉండగా అందరూ ఏకాభిప్రాయంతో దాసదృశ్య కాఠిన్యంతో వ్యవహరించవలసిన సంకట పరిస్థితిలో దుర దృష్టం తన్నుకొచ్చినట్లుగా రాజీ బేరాలవల్ల లాభాల కాశపడి ఉద్యమాన్ని బలహీనపరచడం శోచనీయము అత్యంత, విషాదకరము. నేను రెండో

సారి అరెస్టయినప్పుడే పోరాటనిర్వహణకు వ్యూహారచననుపూర్తిచెయ్యడం జరిగింది. అది అమలు జరుగుతున్న సమయంలో ఈ వర్గాలవారే తిరిగి సంప్రతింపులు ప్రారంభించారు. శ్రీ జి. రామాచారి పీపుల్సు కాంగ్రెస్ మనిషి. ఆయన మంత్రివర్గంలో ఒక పదవిని అంగీకరించాడు. బహుశా ఆయన సహచరులు, తమకు కూడా పదవులు కావాలనుకున్నారో ఏమో పరిపాలనలో మార్పులు రావాలని ప్రచారం చేశారు వింతైన విషయం ఏమిటంటే ఉద్యమం మంచి పట్టులో సాగుతున్నప్పుడు తలపెట్టారు ఈ వెన్నుపోటు చర్యనుగూర్చిహైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌తరపునమాట్లాడ గలిగింది ఒక్క కార్యాచరణ కమిటీ మాత్రమే దానికి ఈ సంప్రతింపు లతో సంబంధం ఏమీలేదు అందుచేత ఈ పక్షీషణులు స్టేట్ కాంగ్రెస్‌ను త్రోసి రాజని, దాని కేమీ సంబంధం లేకుండానే ఈ సమస్యను పరిష్క రించే ప్రయత్నాలు చేశారు. ఈ ప్రవర్తనవల్ల పోలీసు చర్యకుముందే స్టేట్ కాంగ్రెస్ ముగ్గురు పేరున్న కాంగ్రెసు వాదుల్ని క్రమశిక్షణ చర్యగా పార్టీనుంచి బర్తరఫ్ చెయ్యడం జరిగింది ఆ చర్య మరికొంత కాలం గడచిన తర్వాత కాంగ్రెసు చీలికలవడానికి కారణమైంది. శ్రీ జి. రామాచారికి హైదరాబాద్ సంస్థానంలో తెలిసిన వారెందరో ఉన్నారు. వారిలో వేర్వేరు అంతస్థులకు చెందిన పెద్ద వారుకూడా ఉన్నారు అందుచేత, ఆయన ఎప్పుడూ సంప్రతింపులంటే ఆసక్తి చూపించేవాడు ప్రజాఉద్యమం వెల్లువకి సాగుతూ ఉన్నందువల్ల ఆయన యొక్క రాజీ ప్రయత్నాలు నిష్ఫలమయ్యాయి

ఒకనాడుదయము జైలులో నా గదికి హోంశాఖ కార్యదర్శి వచ్చాడు. ఆయన నాతో ఒంటరిగా మాట్లాడాలని కోరాడు. అప్పుడు నేను నా కార్యదర్శిని పక్కకు తప్పుకోవలసిందిని కోరాను. ఆ తరవాత మేమిద్దరమూ రెండు గంటలు మాట్లాడుకున్నాము. ఆయన, హైదరాబాదు ప్రభుత్వము స్వతంత్ర భారతదేశానికి తమకు నడుమ ఉన్న వ్యవహారం చూసుకొంటుంది అందుచేత దాన్ని గురించి మీరేమీ కలవరపడ నక్కర లేదు. ఇప్పుడు మీరు బాధ్యతాయుత ప్రభుత్వం గురించి మాత్రమే

ఆలోచించండి. ఈ సూచనల వెనకాల ఏదో కుట్ర, దురాలోచన ఉండ వచ్చునని నేను పసిగట్టినప్పటికీ ఏ రకపు ప్రజాప్రభుత్వం గురించి చెపు తాడో విందామని చెప్పమన్నాను. వివరాలు గురించి ప్రశ్నించగా 11 శాతం ముస్లిమ్‌లు మాత్రమే ఉన్న సంస్థానంలోని మొదటి మూడేళ్లు శాసన సభ్యత్వ మెంబర్లలో ముస్లిమ్‌లు 75 శాతం ఇతరులు 25 శాతం ఉంటారనీ మరో మూడేళ్ళు ముస్లిమ్‌లు, ముస్లిమేతరరులు సమానంగా ఉంటారనీ ఆరేళ్లు గడిచిన తరవాత ముస్లిమ్‌లు 25 శాతము ఇతరులు 75 శాతం ఉంటారనీ చెప్పారు. అది విని తొమ్మిదేళ్ళ తరవాత ఏమి జరుగుతుందీ అని అడిగితే తెలియదు అన్నాడు.

మన చర్చల సారాంశం మీరు వ్రాసి పట్టుకొనిరండి. మనం ఇద్దరం సంతకాలు చేద్దాము అన్నాను వెళ్ళేముందు, మంత్రివర్గము, ఈవిలక్షణమైన శాసనసభకు, బాధ్యత వహిస్తుందా ? అని అడిగితే నిష్క పటంగా అది నాకు తెలియదు అని చెప్పాడు.

మరునాడు ఆయన తిరిగి వచ్చాడు ఈ సారి ఆయన తనతో టైపు చేసిన కాగితాలు తెచ్చాడు అవి నన్ను చదువుకోమన్నాడు. వాటిలోని విషయం ఆయన అంతకుముందు నాతో చెప్పిందే కాని,కొత్తగా ఒక వాక్యం మాత్రం చేర్చబడింది. "ఇండియా పాకిస్థాన్‌ల మధ్య యుద్ధం జరిగితే హైదరాబాదు తటస్థంగా ఉంటుంది."

ఆ మాటతో హైదరాబాదు పరిపాలకుల అసలు రంగు బైటపడింది. ఈ వాక్యం ఎందుకు చెర్చవలసి వచ్చింది అని అడగ్గా పాకిస్థాన్ ముస్లిమ్‌దేశము ముస్లిమ్‌రాష్ట్రమైన హైదరాబాదు దానితో జరిగే యుద్ధంలో పాల్గొనదన్నాడు అప్పుడు నేను తరచితరచి ప్రశ్నలువేసి, మరో ముస్లిమ్ దేశ మేదైనా హిందూదేశం మీదికి దండెత్తివస్తే హైదరాబాదు ఏం చేస్తుంది ? అని అడిగాను ఆయన గడుసుతనం వెల్లడిస్తూ మాట్లాడ కుండా ఊరుకున్నాడు. అప్పుడు, మీరు మొట్టమొదట భారత ప్రభుత్వంతో ఏలీనత గురించిన వ్యవహారం పడుటబడచుకొనండి ఆ తర్వాతనే నాతో

సంభాషణలు అని అన్నాను మా సంప్రతింపులు ఆ రీతిగా పూర్తి అయాయి, ఆయన లైపు కాపీ నాకు పంపిస్తానంటూ వెళ్ళిపోయాడు అది నాకు చేరనేలేదు.

జైలులో ఆఫీసర్లుగా ఉన్న కొందరు మిత్రులద్వారా కబురు పంపి ఆ ప్రతిపాదనలను గురించి నా విశ్వాసానికి పాత్రులైన పెద్దల భావాలు తెలుసుకొన్నాను. ఢిల్లీ అధినేతలకు కూడా జరిగిందంతా పూస గుచ్చి నట్లు తెలిపాను నా మాటలు చర్య సరియైనవేనని వారు ఆమోదించారు.

హైదరాబాదు ప్రభుత్వము నన్నూ, కొందరు ప్రముఖ కాంగ్రెసు నాయకులను విడుదల చేయడానికి తొందరపడుతున్నట్లూ తద్వారా ఉద్య మానికి బలం తగ్గుతుందని వారు నమ్ముతున్నట్లూ తోచింది.

నేను వారి ఆలోచనలు వమ్ము చేయాలనుకొన్నాను. అందుచేత అప్పుడు ముఖ్యమంత్రిగా ఉన్న లాయక్ ఆలీకి, హోమ్‌శాఖ కార్యదర్శి ద్వారా నాకు వచ్చిన ప్రతిపాదనలు ఆమోదయోగ్యమైననికావనీ, హైదరా బాదు స్టేట్ కాంగ్రెసుకు సంబంధించినంతవరకు సంప్రతింపులు ముగిసి నట్లేననీ వ్రాసి పంపాను. ఆ తర్వాత ఒక్క సంవత్సరంపాటు ఇండియా హైదరాబాదుల మధ్య సంబంధాలు ఉన్నవి ఉన్నట్లుగా కొనసాగించే యధాతథపు ఒడంబడిక నిశ్చయమైందని తెలిసింది. ఆ ఏడాది పూర్తి కాకముందే తాజా సంప్రదింపులు, నిర్ణయాలు జరగాలి

నేను వ్రాసిన ఉత్తరం అందగానే నన్నూ మరో డజనుమందినీ విడుదల చేసినప్పటికీ రాజకీయ ఖైదీల సందర్భి విడుదల చెయ్యడం ఆపి వేశారు విడుదల కాగానే నేను చేసిన మొదటి పని - మద్రాసులో నా కోసం కనిపెట్టుకొని ఉన్న కార్యాచరణ కమిటీ మెంబర్లను అను సంధించటము నన్ను హైదరాబాదు నుంచి బైటికి పోనిస్తారో లేదో నాకు తెలియదు. హోంశాఖ కార్యదర్శి నన్ను తిరిగి వెంటాడ్డం మొదలు పెట్టాడు. నన్ను రాజకీయ వ్యవహారాల శాఖకు సంబంధించిన ప్రభుత్వ మెంబర్లు, నవాబ్ మొయిన్ నవాజ్ జంగ్ బహదూర్‌ను కలియవలసిందని

చెప్పాడు. ఆ సమావేశం గురించి మా ఇద్దరిలో ఎవరికీ ఉత్సాహంలేదు అందుచేత అది జరగనేలేదు ఈ సందర్భంలో విషయాంతరమైనా మరొక మాట చెప్పవలసి ఉంది. నన్ను ఈరీతిగా కలుసుకున్న మెంబరు తర్వాత హైదరాబాదు ఖజానానుంచి తనకు లభించినంత సొమ్ము మూట గట్టుకొని యు. ఎన్. ఓ (U N O) కు వెళ్ళే ఉద్దేశంతో లండన్‌కు పారిపోయాడు

అత్యంత సామర్థ్యంతో దేశం నలుమూలలా హైదరాబాద్ సమస్య అందరికీ తెలిసేలా ప్రచారంచేసి, ప్రజాబలాన్ని ఎదురు లేనిదిగా తీర్చి దిద్ది, పోరాటాన్ని కొనసాగించిన మా కార్యాచరణ సభ్యులతో పరిస్థితులు చర్చించేటందుకు నేను విమానంలో మద్రాసు వెళ్ళాను.

నేను మద్రాసు చేరిన వెంటనే హైదరాబాద్ ప్రజాఉద్యమం భారతదేశాన్ని ఎంత ప్రభావితం చేసిందో తెలుసుకో గలిగాను. ప్రజా వాహిని క్రమశిక్షణతో ప్రవర్తించడాన్నీ, దాన్ని నాయకులు నడిపించిన తీరునీ అందరూ మెచ్చారు దేశంలోని ధీమంతులందరూ ప్రజల దృఢ నిశ్చయాన్నీ ధైర్య సాహసాల్నీ అభినందించారు

హిందూదేశ స్వాతంత్ర్య యుద్ధంలో చివరి ఘట్టం నడుస్తున్న దనీ ప్రజలకు తప్పక విజయం లభిస్తుందనీ అన్నారు. సహజంగా ప్రతి వారూ ఈ ఉద్యమ విజయానికి తోడ్పడేటందుకు తమ శక్తికొద్దీ సాయం చేస్తామన్నారు.

మద్రాసు అసెంబ్లీ (శాసన సభ) స్పీకర్ అయిన శ్రీ బులుసు సాంబమూర్తిగారి అధ్యక్షతన జరిగిన సభ నాకు బాగా జ్ఞాపకం ఉంది. అందులో వివిధ రంగాలలో ప్రముఖులైన మద్రాసు నగర పౌరులు పాల్గొన్నారు

మనకు సహకారం అందించేటందుకు వారందరూ ఒక మనిషిగా ముందుకు వచ్చారు నా మాటలు శ్రద్ధాసక్తులతో విన్నారు. అది జైలు నుంచి బైటికివచ్చిన వెంటనే నేను చేసిన మొదటి ఉపన్యాసం అందులో

ఉద్యమం ముమ్ముందు ఏ రీతిగా సాగుతుందో సూచిస్తానని హైదరాబాదు ప్రభుత్వ చర్యలమీద వాటి ప్రభావం ఉంటుందనీ అందరూ ఆశించారు. నేను కచ్చితమైన ధోరణిలో 15 ఆగస్టు 1947 నాడు ప్రారంభమైన ఈ ఉద్యమంలో ముందడుగే కాని వెనుతీయడం కాని, జంకడంకాని, సంప్రతింపులుగాని లేవనీ భారతదేశంతో విలీనం కావడం బాధ్యతాయుత ప్రభుత్వపు ఏర్పాటు సాధించటమే ఉద్యమ లక్ష్యమనీ చెప్పాను. మద్రాసులోను, ఢిల్లీలోను కూడా హైదరాబాద్ జైళ్ళల్లో ఉన్న సత్యాగ్రహుల క్షేమం గురించి స్థితిగతుల గురించి కూడా తెలుసుకొనడానికి పదేపదే ప్రశ్నించి ఆత్రతం చూపినారు అందుచేత నేను అనేకసార్లు వారి విషయాన్ని గురించి మీరు కంగారుపడవద్దనీ, జైలు శిక్షకు సిద్ధపడిన సత్యాగ్రహులు ఏది జరిగినా ఏ పరిస్థితి ఎదురైనా జంకేరకం కాదనీ దృఢ చిత్తంతో ఎదుర్కొనగలరనీ చెప్పవలసి వచ్చింది.

నేను జైలు వెలుపలఉన్న కొద్ది కాలంలోను పోరాటంలో తరువాతి దశకు రంగ స్థలాన్ని సిద్ధంచేయడం జరిగింది. భారతదేశ ప్రజలందరికీ ఉద్యమంయొక్క స్వరూప స్వభావాలు. లక్ష్యాలు పూర్తిగా తెలిశాయి. ఏ తప్పటడుగు పడినా ఎంత నష్టకరమో తెలిసింది.

—o—

# 33. చేసిన ప్రతిజ్ఞ నెరవేరింది

29 నవంబరు 1947 నాడు నైజాము యథాతథ ఒడంబడికమీద సంతకం పెట్టడం జరిగింది నైజాము తన రాజ్యాధిపత్యం కొనసాగే షరతుకు వ్యతిరేకంగా ఉండే ఏ ఒప్పందానికీ అంగీకరించడనే యథార్థం కళ్ళకు కట్టినట్లు వ్యక్తం అవుతుంటే భారత ప్రభుత్వం ఆయనతో ఎందువల్ల చాలా నెలలపాటు ఓర్పుతో సంప్రతింపులు ఉద్దేశపూర్వకంగా కాలయాపన చేస్తూ ఉన్నదనే విషయం నాకు అప్పుడప్పుడు ఆశ్చర్యం కలిగించేది భారత ప్రభుత్వంతో సమాలోచనలు జరిపేటందుకు నైజాము తరపున ప్రాతినిధ్యం వహిస్తూ వెళ్ళిన వర్గాల ధోరణి, నైజాము భారత ప్రభుత్వంతో ఆధిపత్యాన్ని గురించిగాని, సంస్థాన ప్రజలకు పరిపాలనాధికారం ఇవ్వడం గురించిగాని సంబంధంలేని సమాన ప్రాయా ఒప్పందము చేసుకొనాలని మాత్రమే ఆశిస్తున్నట్లు నిస్సందేహంగా తెలియజేసింది ఢిల్లీ వెళ్ళినప్పుడల్లా నైజాము ప్రతినిధి వర్గము వేర్వేరు ప్రతిపాదనలు భారత ప్రభుత్వం పరిశీలనకు సూచించేది. అందువల్ల సంప్రదింపులతో కాలయాపన చెయ్యడమే వారి ముఖ్యాశయమని కూడా విస్పష్టమైంది ఒకసారి నైజాము, హైదరాబాదు సంస్థానానికి అధినివేశ రాజ్యాల సమాఖ్య అయిన బ్రిటిష సామ్రాజ్యంలో అధినివేశ రాజ్యానికుండే ప్రతిపత్తి ఉందనీ అట్టి రాజ్యాలకున్న ప్రత్యేక హక్కులూ సదుపాయాలు ప్రాతిపదికలుగా హైదరాబాదు భారత దేశంతో తనకు ఉండే సంబంధాన్ని స్వతంత్రంగా నిర్ణయించుకొనే అవకాశం మాత్రమే ఉందని చెప్పడం జరిగింది ఈ హక్కును పురస్కరించుకొని, భారత దేశం బ్రిటిషవారితో తెగతెంపులు చేసుకొని అధినివేశ రాజ్యాల సమాఖ్య

నుండి వైదొలగినా హైదరాబాదు దానితో నిమిత్తం లేకుండా స్వతంత్రంగా వ్యవహరించవచ్చునని అన్నాడు. ఇండియన్ యూనియన్ (భారత ప్రభుత్వం) లో చేరే ఆలోచన, భారత ప్రభుత్వ అధికారానికి లొబడి ఉండటము అనే విషయాలు ఎప్పుడూ నైజాము మనస్సు కెక్కలేదు. రుచించలేదు ఈ సంప్రతింపులు జరుగుతున్న కాలంలో ఒక దశలో ఇండియన్ యూనియన్ (భారత ప్రభుత్వము) తన సంస్థానంపై చేస్తున్న ఒత్తిడి ఇట్లాగే కొనసాగితే తన సంస్థానం పాకిస్తాన్‌తో విలీనం అవు తుందని బెదిరించాడు.

అట్లాంటి బెదిరింపు సందేశం తెచ్చిన ప్రతినిధివర్గంతో హిందూ దేశపు నడిబొడ్డులో (నడుమ) ఉన్న హైదరాబాదు సంస్థానం భౌగోళిక కారణాలవల్ల ఇండియన్ యూనియన్‌లో చేరవలసి ఉందనీ అట్లా చెయ్య కపోతే దేశ సుస్థిరతకు భంగం కలుగుతుందనీ అందువల్ల మరే ఆలోచ నలకూ అవకాశం లేదనీ, ఆనాటి వైస్రాయిమౌంట్‌బాటెన్ ప్రభువూ, దేశ పరిపాలనా శాఖలో ఉన్నతాధికారి శ్రీ వి పి మీననూ నొక్కి చెప్పడం జరిగింది. అయినా నైజాము, సలహాలవంటి ఆ సూచనలు లెక్కచెయ్యలేదు.

ఇత్తెహాదుల్ నాయకులు హైదరాబాదు సంస్థానం, కనక ఇండియన్ యూనియన్‌లో విలీనం అయితే దక్షిణ హిందూదేశంలో నెత్తురు వరదలై పారుతుందని ఉద్రేక పూరిత ఉపన్యాసాలు కావించ సాగారు. నైజాము ప్రభుత్వంతో కార్యవర్గ సభ్యుడుగా ఉన్న అలియవర్‌జంగ్, "హైదరాబాద్ సంస్థానం ఇండియన్ యూనియన్‌లో చేరితే హైదరాబాద్ నగరం జనాభాలో సగం మంది (50 ) అయిన ముస్లిమ్‌లు సహించరనీ వారు లేవదీసే కల్లోలము అదుపుచేయడం అసాధ్యమవుతుందనీ అది జిల్లాలకు కూడా పాకిపోయే ప్రమాదం ఉందనీ" ఒక దిగ్భ్రమగొలిపే ప్రకటన చేశాడు. (ఇండియాలొ స్వదేశ సంస్థానాల విలీనము: వి వి. మీనన్ పేజీ 324). మహమ్మదలీ జిన్నాతో నైజాము సంభాషణ

జరపడం మానాము. పాకిస్తానులోని కరాచీ నగరానికి రాయబారులను పంపడం, సంప్రతింపులు జరపడంకూడా జరిగింది. ఆ సంభాషణలు, సంప్రతింపులు అసలు ఏ సూత్రాలు ఆధారంగా జరిగాయో చెప్పడంకష్టము అవి అత్యంత గూఢమైన రహస్యంగానే ఉండిపోయాయి. కాని, ఇత్తెహాద్ పత్రికా ప్రకటనలు, నాయకుల ఉపన్యాసాలు కలబోసి చూస్తే వారు ప్రజలకు, హైదరాబాదు సంస్థానానికి హిందూదేశంతో యుద్ధంవస్తే సంస్థానానికి పాకిస్తాను తమ పక్షాన ఉంటుందనే నమ్మకాలు భ్రమలు కలిగించే యత్నాలు చేశారు అనిపించింది తమకు జిన్నా మద్దతు లభించినందువల్ల పాకిస్తాను సైన్యము తోడ్పాటు లభిస్తుందనీ, హైదరాబాదు సంస్థానము భారతదేశ సైన్యాన్ని ఎదిరించి విజయం సాధించగలదనీ ప్రజా సామాన్యంలోని ... ఎట్లా నమ్మించగలమని వారను కొన్నారో అని నాకు ఆశ్చర్యం కలుగుతూ ఉండేది

సంప్రతింపులు జరుగుతున్నప్పుడు భారత ప్రభుత్వం హైదరాబాద్ సమస్యా పరిష్కారానికి ప్రజాభిప్రాయ సేకరణను సూచించడం జరిగినట్లు తెలుస్తున్నది ఆ సూచన మౌలిక సూత్రాల కనుగుణమైంది కాసందున, పరిగణనలోకి తీసుకొనరాదని భావించి నేను దాన్ని వ్యతిరేకించాను ప్రజాభిప్రాయ సేకరణకు ఏమంత అవసరం వచ్చింది? దాని ఫలితాన్ని గురించి నాకేమీ సందేహంలేదు కాని, అది ఆధారంగా ఈ సమస్యకు పరిష్కారం జరగాలనే నిర్ణయం ఆమోదయోగ్యం కాలేదు. జైలులో ఉన్నందువల్ల నేను నా అభిప్రాయాలు ఎవరికీ తెలియజేసే అవకాశం లభించలేదు కాని, కార్యాచరణ సంఘ సభ్యులలో కొందరు ఈ అభిప్రాయాన్ని తెలియజేశారు అందువల్ల ప్రభుత్వం ఆ సూచనను వదలి వేయడం జరిగింది

ఆ రోజుల్లో కాసింరజ్వీ దాఢ్యరహితంగా ఉపన్యాసాలు ఇచ్చాడు. పరిస్థితి అదుపు తప్పి చెయ్యి జారిపోయినట్లయితే తర్వాత చింతించి ప్రయోజనం ఉండదనీ వెనకకు తిరగడం జరగదనీ భారత

ప్రభుత్వం స్పష్టంగా చెప్పినప్పటికి హైదరాబాదు సంస్థాన ప్రభుత్వం, పరిస్థితులు ఇంకా దిగజారేవరకూ చూస్తూ ఊరుకుంది. కాశింరజ్వి ఏప్రిల్ 12, 1948 నాడు "మా ప్రభువుల పాదాల్ని బంగాళాఖాతం (తూర్పు సముద్రం) లోని జలాలు ప్రాళనంచేసే రోజు అనతికాలంలోనె వస్తుంది." (స్వదేశ సంస్థానాల విలీనము - వి పి మీనను -పేజి 350) అని ఉద్రేకపూర్వకంగా ఉపన్యసించాడు. అంతటితో అతని ఆవేశం ఆగలేదు. 'ఆసఫ్‌జాహీ నవాబుల పతాకం. ఢిల్లీలోని ఎర్రకోటపై రెపరెప లాడుతూ ఎగురుతుంది,' అనేవరకూ విజృంభించింది. మీనను వెల్లడించిన అభిప్రాయాల ప్రకారము "కాశింరజ్వీ కత్తి ఝళిపింపులు ఎక్కువగా చెస్తూ హైదరాబాదు ముస్లిములను దూసిన కత్తులను సర్వస్వతంత్ర ఇస్లామిక్ రాజ్యం ఏర్పాటు చెసుకనేవరకూ ఒరలలో పెట్టవద్దని ఉద్బోధిస్తూ రెచ్చగొట్టినట్లు" (స్వదేశ సంస్థానాల విలీనము- వి పి మీనన్-పేజి 350) సాక్షాధారాలతో రుజువైనట్లు భావించవచ్చు కాశింరజ్వీ ముస్లిము లను కురాను ఒక చేతిలోనూ, కత్తి ఒక చెతిలోనూ ధరించి శత్రు వులను వేటాడ వలసిందని ఉద్బోధించాడు అతని ఉపన్యాసాలన్నింటి లోనూ అత్యంత ప్రమాదకరమైన ప్రకటన ఒకటి చెశాడు ఇండియన్ యూనియన్‌లోఉన్న 45 మిలియన్ల (నాలుగున్నర కోట్ల) ముస్లిములు ఇండియన్ యూనియన్ పౌరులైనప్పటికి హైదరాబాదు - ఇండియన్ యూనియన్‌ల మధ్య జరిగె ప్రత్యక్ష పోరాటంలో హైదరాబాదు పక్షాన వహించి, గూఢచారులుగా అంతఃశత్రువులుగా పని చేస్తారనేదే ఆ ప్రకటన

వి పి. మీనన్‌యొక్క ప్రశంసనీయమైన నిశిత పరిశీలనాశక్తి, సంప్రతింపులు జరపడంలో వ్యక్తమైన అపరిమితమైన ఓర్పు ఫలితంగా నవంబరు 29, 1947 నాడు హైదరాబాదు - ఇండియన్ యూనియన్‌ల నడుమ యథాతథపు ఒడంబడిక జరిగింది పోలీసు చర్య జరిగిన తర్వాత నేను అనేక పర్యాయాలు ఆయనను కలిసి వివిధ సమస్యలను

చర్చించాను. ప్రతి సమస్య పరిష్కారానికి అనేక పరిష్కార మార్గాలు సూచించడంలో ఆయన వ్యక్తం చేసిన శక్తిసామర్థ్యాలు నాకు ఎంతో ఆశ్చర్యం కలిగించేవి. మీనన్ సర్దార్ పటేల్‌కు ఎదురుచెప్పని విశ్వాస పాత్రుడు. పటేల్ నమ్మకం చూరగొన్నవాడు. మంత్రిగా పటేల్ ఇచ్చిన ఆజ్ఞలను అక్షరాలా అమలుచేసి ప్రజల మెప్పు పొందినవాడు. వి. పి. మీనన్‌వంటి లౌకిక దృష్టికల విషయ పరిజ్ఞాత సేవలు సర్దార్ పటేల్‌కు లభించకపోయినట్లయితే స్వదేశ సంస్థానాల విలీనం మరెన్నో సమస్యలకు దారి తీసేది.

తర్వాత రోజుల్లో కాశింరజ్వీపై నేరారోపణలు చేయడం, న్యాయ స్థానాలలో విచారణ చెయ్యడం, జరిగాయి. ఆరోజుల్లో అందరూ అతనిని నర రూప రాక్షసుడుగా పేర్కొనేవారు. అది సరియైనది కాదని నా అభిప్రాయము. రజ్వీ సామాన్యమైన ప్రతిభావిశేషాలుకలవాడు. మంచి వక్త. నీవు ఇంతవాడవు అంతవాడవు ఉన్నతుడవు అని ఎవరైన అంటే పొంగిపోయే స్వభావం కలవాడు. ఆ పొగడ్తలన్నీ నిజమే అని భ్రమించే రకం మనిషి. అతను నైజాం చేతిలో పరికరము. ఎట్లా ఆడిస్తే అట్లా ఆడిన కీలుబొమ్మ. నైజాం తానే స్వయంగా కాశింరజ్వీని, తన దురాశా పరిపూర్తికి సాధనంగా వినియోగించుకొన్నాడు. అందుకొసమే అతనికి సహాయం ప్రోత్సాహం ఇచ్చి హైదరాబాదు ప్రభుత్వ సేనకు ఉపాంగంగా, రజాకార్లనే పేరుతో (ప్రైవేటు) అనధికారపు సైనికుల గుంపు ఏర్పడేటందుకు అవకాశం కలిగించాడు.

మౌంట్‌బాటన్ ప్రభువు వెల్లడించే అభి
పత్రికా ప్రచార ప్రకటనల [illegible] అలెన్ కేంబెల్ జాన్సన్ 16 మే 1948 నాడు నైజామును సందర్శించాడు. ఈనాడు సంస్థానం ఉన్న పరిస్థితులలో వ్యవహార పరిష్కారానికి అసలు తాళం చెవి నైజాం చేతుల్లోనే ఉందని, ఇండియన్ యూనియన్‌కీ సంస్థానానికీ నడుమ ఉండవలసిన పరస్పర సంబంధాల వ్యవహారంలో ఆయన ఆమోదం లేకుండా

ఎవరూ ఏదీ చెయ్యటంలేదనీ కేంబెల్ జాన్సన్ అభిప్రాయపడ్డాడు. ఆయన ఈపరిస్థితిని అంచనావేసి వైస్రాయికినివేదిక సమర్పిస్తూ నైజాము దృక్పథంలో దురుసుతనమూ "కానున్నదికాక మానదు. ఘటన ఎట్లా ఉండే కర్మగతి అట్లాగే ఉంటుంది. అనే భావమూ వ్యక్తమవుతున్నాయి." అని తెలియ జేసాడు. (స్వదేశ సంస్థానాల విలీనము పేజీ 158) నైజాము అట్లా ప్రవర్తించినా భారత ప్రభుత్వం ఏ కారణాలవల్ల ఆయనకు, అర్హతకు మించిన గౌరవాదరాలు ప్రసాదించిందో నాకు ఆశ్చర్యం కలిగించింది. రాజకీయాలలో అనుగ్రహాలు పొందేటందుకు వాటి దారులు వాటికి ఉంటాయి. ఇండియన్ యూనియన్‌ను శత్రువుగా భావించి అనేక చర్యలు నడిపినా ఆయనను తర్వాత రాజప్రముఖ్‌గా నియమించారు. ఈ విషయాన్ని గురించి నేను భారత ప్రభుత్వంతో చర్చించాను. రాజ ప్రముఖ్ పదవులను ఒక క్రమాన్ని అనుసరించి కల్పన చెయ్యడం జరిగింది. అప్పుడు హైదరాబాద్ విషయంలో ఆక్రమం తప్పించి మరొక విధంగా చేసే అవకాశం లేదు.

లాయక్‌అలీ, మంత్రి వర్గాన్ని ఏర్పాటు చెయ్యడంతో రజాకార్ల నాయకుడైన కాశింరజ్వీ అంతవరకూ చెలాయిస్తున్న ప్రముఖపాత్ర పని పూర్తి అయిందనే అందరమూ ఊహించాము. హైదరాబాదు భారత ప్రభుత్వాల నడుమ సహజంగానే నత్తనడకతో సాగుతూ అనేక అడ్డంకుల నెదుర్కొంటూ ఒడుదుడుకులపాలై ఎప్పుడు ఎట్లా ముగింపు అవుతాయో అనిపించిన సంప్రతింపులు ఇత్తిహాదుల్ ముసల్మీన్ సంస్థ అభిప్రాయాల వల్ల చాలా ఎక్కువగా ప్రభావితం అయాయి. ఆ వర్గాలవారి అభిప్రాయం హైదరాబాదు భవిష్యత్తులో సర్వతంత్ర స్వతంత్రమైన రాజ్యంగా ఉండాలనీ ఆ ప్రాతిపదికమీద రెండు రాజ్యాలూ అంగీకరించిన సంబంధాలు మాత్రమే వాటి నడుమ ఉండాలనీ ఘంటాపథంగా చెప్పేవారు. ఆ పరిధిలోనే సంప్రతింపులు జరగాలనేవారు. వాటి ఫలితం స్పష్టంగా కనిపించింది. సంప్రతింపులకోసం పెట్టిన గడువు ఒక సంవత్సరము పూర్తికావచ్చినా శాశ్వత పరిష్కారం లభించనేలేదు.

యథాతథపు ఒడంబడిక ప్రకారం ఈ మధ్య కాలంలో భారత ప్రభుత్వం హైదరాబాదులో ఉండేటందుకు తన ఏజెంటు జనరల్ ఒకరిని నియమించవచ్చు నేను కొన్ని వారాలపాటు జైలులో ఉండకుండా బైట ఉండటం జరిగింది అప్పుడు నా సహచరులతో ఢిల్లీలోని నాయకులతో పరిస్థితులు చర్చించడం జరిగింది అప్పుడు పరిస్థితులు చాలా త్వరితంగా విషమిస్తున్నాయనీ సత్యాగ్రహోద్యమం ఆపి మీ శక్తిసామర్థ్యాల నుపయోగించి ఆత్మరక్షణ చేసుకొనండనీ, మీధన మాన ప్రాణాలు మీరే రక్షించుకొనవలసిన క్లిష్ట పరిస్థితి వచ్చిందని ప్రజలకు చెప్పడం భావ్యమని గుర్తించాము. స్పష్టంగా చెప్పాలంటే ప్రజలు ఎవరికి దొరికిన ఆయుధాలు వారు ఉపయోగించుకొని స్వయం రక్షణ చేసుకొనండని సలహా ఇచ్చినట్లే ఒక వంక అనేక ఆయుధాలు ధరించి సేనలోనూ, ఇతర విధాలుగాను సమీకరణమై నిరాయుధులైన ప్రజలమీద దాడులు జరుపుతున్నప్పుడు, మరొక వంక సత్యాగ్రహం చేసి, జైలు కటకటాల వెనక కూర్చుండిపోవడం రాజకీయంగా అనౌచిత్యమనిపించింది ఆ దశలో 21000 మంది సత్యాగ్రహులు జైళ్ళలో ఉన్నారు అయినా సత్యాగ్రహం విరమించవలసి వచ్చింది అప్పుడు అమాయిక ప్రజారక్షణకు ఏ చర్యలు తీసుకోవాలో నిర్ణయించవలసిన బాధ్యత భారత ప్రభుత్వాని దవుతుంది నేనూ నా సహచరులూ ఢిల్లీలోని అగ్రనాయకులకు ఈ పరిస్థితులలో మా నిర్ణయాన్ని నచ్చచెప్పడానికి ప్రయత్నించాము ఆ సందర్భంలో ఏజెంటు జనరల్ నియామకం కూడా ఒక ముఖ్యాంశం అయింది ఆ ఉద్యోగ బాధ్యతలకు ఎవరిని ఎన్నిక చెయ్యాలి అనే ఆలోచనలు కూడా అవసరమైనాయి. నేను ఢిల్లీలోఉన్న ఆరోజుల్లోనే సర్దార్ పటేల్ కొందరి పేర్లు సూచించారు. నా అభిప్రాయాలు తెలుసుకొన్న తర్వాత ఆయన కె యం మున్షీని ఆ పదవిలో నియమించేటందుకు నిశ్చయించారు. నేను ఆయన ఎన్నికకు మనఃస్ఫూర్తిగా ఆమోదం వెల్లడించాను. సర్దార్ పటేల్ నేను హైదరాబాదుకు తిరిగి వెళ్ళేలోపున బొంబాయి వెళ్ళి మున్షీని కలుసుకొనవలసిందని చెప్పారు.

ఈ సందర్భంలో ఒక సంఘటన చెప్పడం తగిన పని అని నేను భావిస్తున్నాను అది, నేను భంగీ కాలనీలో మహాత్ముణ్ణి కలిసినప్పుడు జరిగింది. నేను మహాత్మునితో అనేక విషయాలు మాట్లాడి వాటితో పాటు ఏమీ చాటూమాటూ లేకుండా "మీకు ఎట్లా సాధ్యమైతే అట్లా ఆత్మరక్షణ చేసుకొనండని హైదరాబాదు ప్రజలకు సూచించినట్లు" చెప్పాను ఈ మాటల్లో ఆయుధాలు వాడవచ్చుననే సలహా ఇమిడి (గర్భితమై) వుంది. నిర్మొగమాటంగా నా మనస్సులోఉన్న ఆవేదనను సూచించిన ఆ మాటలు విని మహాత్ముడు కొంత మెప్పు, దయారసము వ్యక్తం చేస్తున్న గొంతుకతో "అవును. మంచిది. పిరికితనంతో పారిపోవడం కంటె ఆ పరిస్థితుల్లో అదే మంచిది దౌర్జన్యమార్గం చేపట్టినప్పటికీ సాహసికులూ వీరులూ అనిపించుకుంటారు వారి పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు" అన్నారు. నేను మహాత్మాజీ చెప్పిన మాటలు సరిగ్గా ఆయన చెప్పినట్లే వ్రాయలేదు. ఆయన మాటల సారాంశం మాత్రమే పొందుపరిచాను. మొత్తం పది సంవత్సరాల కాలంలో ఆయనతో అనేక విషయాలు చర్చించి గడించిన అనుభవం మూలంగా నాకు యధార్థాన్ని ఆయన ముందుంచినట్లయితే క్షమాగుణంతో ఆదరించి తప్పులన్నింటినీ సరిదిద్దుకొనే అవకాశము, శక్తి ప్రసాదించే మహాపురుషుడే ఆయన అనే నమ్మకం కలిగింది

భవిష్యత్కార్యక్రమం నిశ్చయం కాగానే నేను మా కార్యాచరణ సంఘ సభ్యులను కలుసుకొని, తుది నిర్ణయం గైకొనేటందుకు బొంబాయి వెళ్ళాను. అప్పుడు సర్దార్ పటేల్ బొంబాయిలోనే ఉన్నారు. ఆయనను నేను వారి ఇంట్లోనే కలిశాను

ఆయన చూస్తే కాలహరణం చేయతగదని ఆత్రపడుతున్నట్లు తోచింది. నన్ను చూడగానే వెంటనే ఏమి ఆలస్యం చెయ్యకుండా హైదరాబాదు వెళ్ళమన్నారు. ఆయన భావాలు అర్థం చేసుకొని నేను రెండు రోజుల్లో బొంబాయి వదలి హైదరాబాదు చేరుకున్నాను

శ్రీ మున్షీతో నేను చాలాసేపు వివరంగా చర్చించాను నేను అరెస్టు అయేలోపుగా నైజాముకి ఒక ఉత్తరం పంపించాలని నిశ్చయించాము నేను హైదరాబాదు వెళ్ళిన తర్వాత తిరిగి మున్షీని కలుసుకొనే అవకాశం లభిస్తుందో లేదో అనే నా సందేహము. అక్కడ ఆయన 'స్టేట్ జనరల్‌గా గట్టి రక్షణ బందోబస్తులో' వుంటారు అందు చేత నేను వెంటనే ఉత్తరం ముసాయిదా వ్రాశాను మున్షీ నాకు కొన్ని సూచన లిచ్చారు నేను వాటిని చేర్చి సాఫు వ్రాసి హైదరాబాదులో ప్రవేశించగానే వెంటనే పంపించేటందుకు సిద్ధం చేశాను నేను విమానంలో ప్రయాణం చేసి, హైదరాబాదు చేరాను జాబు బొంబాయిలోనే పోస్టు చేశాను. దాని కాపీ మరొకటి హైదరాబాదులో పోస్టు వెయ్యడానికి నా దగ్గర సిద్ధంగా వుంది మూడవ కాపీ నాతోనే విమానంలో ప్రయాణంచేస్తున్న ఒక మిత్రుడి కిచ్చాను నేను విమానాశ్రయంలో దిగగానే అరెస్టయితే, దాన్ని పంపించే బాధ్యత నీది అని అతనికి అప్పగించాను కాని, విమానం దిగగానే ఏమీ జరగలేదు. నా ఇష్టం వచ్చినచోటికి నన్ను వెళ్ళనిచ్చారు ఆ జాబు ముఖ్యమైంది. కనక దాని కాపీ ఇక్కడ యిస్తున్నాను.

ఘనత వహించిన నైజాము ప్రభువులకు దయతో పరిశీలించ వలసినదని కోరుతూ వ్రాయునది.

గత కొంత కాలంగా హైదరాబాదు సంస్థానంలోని ప్రజలు, హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ నాయకత్వం కింద రెండు లక్ష్యాలు సాధించే టందుకు సత్యాగ్రహోద్యమం కొనసాగిస్తుండటం తమకు విశదమైన విషయమే.

హైదరాబాదు సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనం కావడము, సంస్థానంలో పూర్తిగా ప్రజలు బాధ్యత వహించే పరిపాలన యేర్పాటు అనేవే ఆ రెండు లక్ష్యాలు ఆ ఆశయ సాధనకు వేలాది మంది అరెస్టయారు వందలకొద్దీ జనం ప్రాణాలు అర్పించారు ఘనత

వహించిన ప్రభువులైన తమ ప్రజలు ఒక్కుమ్మడిగా కదలి ముందుకు వచ్చి తమకు వెంటనే ప్రజాస్వామ్య స్వాతంత్ర్యము ప్రసాదించవలసిం దని ఒకే గొంతుకతో అడిగారు.

హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు, ఘనతవహించిన ప్రభువరేణ్యుల ఆధిపత్యం కిందనే బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటుకావాలని అడిగింది. కాని, తమ స్వార్థానికే ప్రాధాన్యమిచ్చిన కొన్ని వర్గాలవారు, దానికి తమకు నచ్చిన రంగుపూసి, ఈ వుద్యమం ప్రభువులపట్ల వ్యక్తిగత విద్రోహాత్మకమని వర్ణించే ప్రయత్నాలు చేశారు హైదరాబాదు సంస్థానం యొక్క స్థిరత్వము, ఘనతవహించిన ప్రభువరేణ్యుల వంశం వారు వంశ పారంపర్యంగా పరిపాలించే హక్కు, హైదరాబాదు సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనమైతేనే సాధ్యం అవుతాయి ఆ మార్గ మొక్కటే సంస్థానం వుండేటందుకు ఏకైకమార్గము. దీని ప్రాధాన్యాన్ని ఆవశ్యకతను గుర్తించకుండా హైదరాబాద్ రాష్ట్రప్రభుత్వం ఉద్యమాన్ని అణచివేసేటందుకు ప్రయత్నించింది బందిపోట్లు, గృహదహనాలు, హత్యలు, నిత్య కార్యక్రమాలైనాయి. సైన్యము, రిజర్వు పోలీసులు, ఇత్తెహాదుల్ ముసల్మీన్ వారు ఇష్టంవచ్చినట్లు స్వేచ్ఛగా ప్రవర్తిస్తూ సంస్థాన స్వాతంత్ర్య ప్రతిపత్తికి, శాశ్వత ఘనత వహించిన ప్రభువరేణ్యులైన తమ పరిపాలనకు భద్రత కలిగిస్తున్నామనే ముసుగువేసుకొని ప్రజల్ని అణచివేసేటందుకు సాధ్యమైన పద్ధతలన్నీ అమలు చేశారు; చేస్తున్నారు. హైదరాబాదు ప్రజలు ఇత్తెహాదుల్ ముస్లిమీన్ అధికారం చెలాయించడం చూసి విసిగిపోయి వున్నారన్న విషయము ఘనతవహించిన ప్రభువరేణ్యులైన మీకు తెలిసినదే ఆ సంస్థయొక్క కరాతు చర్యలకు చట్టబద్ధమైన అంగీకారం అధికారం ఇచ్చేటందుకే అన్నట్లు ఆ సంస్థ ప్రతినిధులు, తాబేదార్లుతో కూడిన మంత్రివర్గాన్ని ఏర్పాటుచేయడం జరిగింది హైదరాబాదులో ఈ నాడు ప్రభుత్వం చేస్తున్నది ఇత్తెహాదుల్ ముస్లిమీన్ అని భావించేటందుకు అవకాశమేర్పడిందని ఘనతవహించిన ప్రభువులైన తమకు కొంత చనువు తీసుకొని విన్నవం చేసుకుంటున్నాను.

నిజామాబాద్‌లో జైలులో సత్యాగ్రహులను చితక గొట్టడం జరిగింది. బీబీనగర్ ప్రజలు వర్ణించడానికి అశక్యమైన హింసలకు గురి అయినారు. పరిపాలనా యంత్రాంగం పూర్తిగా మతావేశపు పిచ్చితో ఇత్తెహాదుల్ ముస్లిమీన్ నడిపిస్తున్న అమానుష కిరాతక చర్యలకు సహాయపడుతోంది. ఈ పరిస్థితులు పరిపాలనకు మచ్చ అవి. నిరాఘాటంగా ఇట్లాగే కొనసాగడం సంస్థానం మనుగడకు ముప్పు. ప్రజాస్వామిక భారత దేశపు శత్రుబలాలకు ఈ పరిస్థితులు ఆశ, ప్రోత్సాహం కలిగించి నట్లయితే అది అత్యంత విషాదకరమైన దినంగా పరిణమిస్తుంది. అటువంటి పథకాలు ఉన్నాయని, ఆలోచనలు జరుగుతున్నాయని నాకు తెలుసు. వాటికి సంబంధించిన సమాచారం కూడా నాకు ఎక్కువగా తెలుసు. బీబీనగర్‌లోను సంస్థానంలోని ఇతర ప్రాంతాలలోను ప్రజలపై జరిగిన అత్యాచారాలను నా మనస్సాక్షి నిరసించి యెదిరిస్తుందని ఘనత వహించిన ప్రభువులకు మనవి చేసుకుంటున్నాను.

ఆ కిరాతక చర్యలను వెంటనే ఆపించాలని, బీబీనగర్ సంఘటనల విచారణకొరకై ఒక కమిషన్‌ను తక్షణమే నియమించాలని ఘనత వహించిన ప్రభువు వారిని కోరుతున్నాను. అంతేకాకుండా తమ భవిష్యత్తును నిర్ణయించుకొనేటందుకు ప్రజలకు గల హక్కును గుర్తించి నట్లుగా సంస్థానంలో వెంటనే బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసి ప్రజాస్వామ్య భారత దేశంలో హైదరాబాదు సంస్థానం ఒక భాగంగా విలీనమవుతుందన్న ప్రకటన చేయవలసిందని కూడా ఘనతవహించిన ప్రభువులను కోరుతున్నాను. అదొక్కటే సంస్థానం నిలబడేటందుకు మార్గము. అది ఎంత త్వరగా జరిగితే సంస్థానానికి సంబంధించిన వారందరికీ అంత మంచిది.

ఘనత వహించిన ప్రభువుల నుండి జవాబుకోసం రెండురోజుల పాటు యెదురుచూస్తూ వుంటాను.

మీ విశ్వాసపాత్రుడు
(సం) స్వామి రామానంద్ తీర్థ

తేది: జనవరి 23. 1948 అధ్యక్షుడు, హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు.

నేను మద్రాసులో వున్న స్వల్పకాల వ్యవధిలో రమణమహర్షి దర్శనం చేసే అవకాశం లభించింది. ఆయనను గురించి నేను అంతకు ముందు విన్నాను. నాకు అత్యంత సన్నిహిత సహచరుడైన డాక్టర్ జి. ఎస్. మేల్కోటె ఆ మహర్షి భక్తుడు. ఆయన రమణ మహర్షి ఆశ్రమానికి వెళ్ళి ఆయన ఆశీర్వాదం పొందిన తర్వాతనే నన్ను హైదరాబాదు రావలసిందని కోరాడు. నేను దానికి అంగీకరించాను. మే మిద్దరమూ కలిసి మహర్షి ఆశ్రమానికి వెళ్ళి ఆయనను దర్శించాము. మహర్షి పక్కనే నేను కొన్ని గంటలసేపు కూర్చుండి గడిపాను. మహర్షి ఏవో కొద్ది మాటలు మాత్రమే మాట్లాడారు. కొంతసేపైన తర్వాత కార్యాచరణ సంఘం వారు ప్రకటించిన మా ఉద్యమ వివరాలు తాను చదివినట్లు చెప్పారు. ఉద్యమం నడుస్తున్న తీరు సరిగా వుందని మెచ్చుకొన్నారు. అనురాగ పూర్వకంగా ఆయన మమ్మల్ని ఆశీర్వదించారు. మహర్షి ఆశీర్వాదబలంతో అనుగ్రహంతో నెలవంది వీడ్కొన్నాను.

ఈ అధ్యాయాన్ని పూర్తిచేసేముందు ఒక ముఖ్యమైన సంఘటన వివరించడం వుపయోగకరంగా వుంటుంది.

నేను హైదరాబాదుకి బైలుదేరేముందు బొంబాయిలో సర్దార్ పటేల్‌ను కలిసి హైదరాబాద్ పరిస్థితులు వ్యవహారాలు గురించి ముచ్చటించాను. నేను తిరిగి జైలుకి వెళ్ళడం అవసరమని భావిస్తున్నట్లు చెప్పాను. తిరిగి హైదరాబాదులో సంప్రతింపులు ప్రారంభించే ప్రయత్నాలు జరుగుతున్నట్లు తెలిసింది. అప్పటికే ఏజంటు జనరల్ పదవీ స్వీకారం చేసిన మున్షీకి ఆ విషయమూ సంప్రతింపులు జరిపే ఆలోచన నాకు లేదనీ తెలియజేస్తూ వ్రాశాను. సంప్రతింపులవల్ల ఏదో జరుగుతుందనే ఆశ కలగడం, ప్రజలకు ఉత్సాహం చప్పబడటం జరుగుతుంది. అందుచేత పోరాటాన్ని మరింత ప్రజ్వలింప జేయడమే ప్రస్తుతం వెంటనే జరగ వలసినపని. అందువల్ల సంప్రతింపులతో సంబంధం ఏమీ లేకుండా నేను తిరిగి ఉద్యమంలోకి దూకుతాను.

ఈ నిర్ణయానికి వారం రోజులు ముందుగా స్వదేశ సంస్థాన వ్యవహారాల శాఖలో కార్యదర్శిగా వున్న వి. పి. మీనన్ హైదరాబాద్ వెళ్ళవలసివుంది. ఈ సందిగ్ధావస్థలో ఆయన హైదరాబాదు యాత్ర అపార్థాలకు దారితీస్తుంది. నేను నా అభిప్రాయం మీనన్‌కు వ్రాశాను, ఢిల్లీ నాయకుల మనస్సుల్లో వున్న ఆలోచనలు తెలిసినవాడనవటంచేత హైదరాబాద్‌లో వున్నవారిలో యెవరూ ఈ వ్యవహారాలతో సంబంధం వున్నవారు మరెవరూగాని ఎవరినిగానీ ఏ సందర్భంలోనూ హైదరాబాదు స్వాతంత్ర్యోదమాన్ని వెన్నుపోటు పొడిచేటందుకు అవకాశం లేకుండా రక్షించుకోవలని వచ్చింది. ఈ పోరాటం సంపూర్ణ విజయం సాధించాలనే లక్ష్యంతో సాగిస్తూ ఉన్నప్పుడు, ఈ దశలో సంప్రతింపులు యెందుకు? అనే నా భావన. అయితే, ఏదో ఒక కారణంవల్ల వి. పి. మీనన్ అప్పుడు హైదరాబాద్ రాలేదు.

నాకు లభించిన కొద్దికాలపు స్వేచ్ఛావకాశాన్ని, నేను నగరంలో వున్న వేర్వేరు గ్రూపులవారికి, పోరాటంలో విజయం చేరేటందుకు ఆఖరి దశలో వున్నామని చెప్పి దాని ప్రాధాన్యాన్ని వివరించేటందుకు వుపయోగించాను. జంటనగరాలలో వున్న విద్యార్థి బృందాలు ఈ సవాలును ఎదుర్కొనేటందుకు ముందుకు వచ్చారు. నైజాము దగ్గరనుంచి వచ్చే జవాబుకోసం ఎదురుచూడ (ప్రతీక్షించ) వలసిన కాలవ్యవధి గడచిన తర్వాత, తిరిగి సత్యాగ్రహం చెయ్యాలని నేను నిశ్చయించుకొన్నాను, అన్ని పేటల్లోనూ (మొహల్లాల్లోనూ) గ్రూపు మీటింగులు పెట్టి సమస్య స్వరూపాన్ని క్షుణ్ణంగా వివరించడం జరిగింది. పత్రికలవారితో మాట్లాడేటందుకు సిద్ధం అవుతుండగా నన్ను అరెస్టుచేసి స్వాధీనంలోకి తీసుకున్నారు.

ప్రజలను భయభ్రాంతులను చేసే అరాచక చర్యలు సంస్థానం అంతటా నలుమూలలా కొనసాగాయి. స్త్రీలను హింసించడం, మానభంగం చెయ్యడం నిరాయుధులైన సంస్థాన ప్రజల్నిలెక్క చెయ్యకుండా అన్ని రకాల అవమానాలకు హింసలకు గురిచెయ్యడం, సామాన్యమైంది. అధికా

రులు తమ కండ్లు మూసుకొని పెద్దగు ఇస్తుంటే సాయుధులైన రజాకార్లు గ్రామాల మీదికు దండు వెడలి ప్రజల ఆస్తి పాస్తులకు మాన ప్రాణాలకు ప్రమాదం కలిగించారు. ఈ బాధలకు గురియైన ప్రజలలో ధనవంతులూ మధ్యతరగతివారూ ఎక్కువ మంది సామాన్య ప్రజలు తమ స్థానాల్లోనే వుండి రజాకార్ల ప్రమాదాన్ని ధైర్యంగా ఎదుర్కొన్నారు ఆత్మ రక్షణ కోసం వారు ఆయుధాలు వాడి వుండవచ్చు ఈ విషయాన్ని గురించి నేను మహాత్మాజీకి విన్నవించినట్లు ఇంతకుముందే చెప్పాను పరిస్థితుల ప్రాబల్యంవల్ల ప్రజలు ఆత్మరక్షణ కోసం ఏది చెయ్యగలిగితే అది చేసారు.

సంస్థానంలో ప్రజల ఆస్తిపాస్తులకూ ప్రాణాలకూ అపాయంరాగానే ప్రజలు, ముఖ్యంగా యువకులు, చేజిక్కిన ఆయుధాలు ధరించి నిలబడి తమ్ముతామే రక్షించుకొనే యత్నాలు చేసారు వాలంటేరు దళాలు ఏర్పాటైనాయి. వాటి ఏర్పాట్లు ఎక్కువగా సంస్థానపు సరిహద్దు ప్రాంతాల్లోనే జరిగింది ఇతర దేశాలలో స్వాతంత్ర్య యోధులు ప్రజల ప్రభుత్వం ఏర్పాట్లుచేసి నడిపించిన సమాచారం కొందరిని ఉత్తేజితుల్ని చేసింది. అందువల్ల వీరుకూడ అట్లాంటి కృషి చేసారు. కొన్ని ప్రాంతాల్లో అట్లాంటి పోటీ ప్రభుత్వాలు కొంత కాలం పని చేశాయి. వాటంతట అవే జరిగినట్లె ఈ ప్రయత్నాలూ ఏర్పాట్లూ దేశభక్తివల్ల ప్రభావితమైనాయనే అనాలి. అట్లాంటి పరిస్థితుల్లో కొన్ని ఏర్పాట్లు జరిగినప్పుడు సహజంగా వాటిలో కొన్ని అవకతవకలు రావడం అసాధారణ చర్యలు గైకొనడం సంభవిస్తాయి ఈ వివిధ ప్రయత్నాలవల్లా ప్రజలు ఎంత గట్టి నిశ్చయంతో వున్నారో విస్పష్టమైంది. మొత్తంమీద ఈ ఉద్యమాలన్నీ సిద్ధం అవుతున్న పోలీసు చర్య తొందరగా జరిగేటట్లు త్వర పెట్టాయి అది ఇంకా ఆలస్యం చేస్తే ప్రజల్లో మరింత ఎక్కువ నిరాశా నిస్పృహలు కలిగేవి. సత్యాగ్రహ ఉద్యమం విరమించడం జరిగింది. యూనియన్ ప్రభుత్వ చర్యకోసం ఆత్రంతో ఎదురు చూడటం ప్రారంభమైంది.

తమ రక్షణకోసం సాయుధులైన దళాలవారు పోలీసు చర్య పూర్తికాగానే తమ ఆయుధాలు అధికారులకు సమర్పించి, తమ శాంతికాముకత్వాన్ని వెల్లడించడం ప్రశంసనీయం. ఇప్పుడు, కె. ఎమ్. మున్షీ వ్రాసిన 'ఒక శకం ముగిసింది' (The End of an Era) అనే పుస్తకంలో వెల్లడించిన అభిప్రాయాల విమర్శనాత్మక పరిశీలన అవసరం అని నా భావన. ఆయన ఒకచోట స్టేట్ కాంగ్రెస్ కమ్యూనిస్టులతో కలిసి సంయుక్త పోరాటాన్ని కొనసాగించేటందుకు ఒప్పందము జరిగింది, అని వ్రాశాడు. అది నిజంకాదు. ఆయన వ్రాతలకు ఆయనకు అందిన అబద్ధపు సమాచారము, స్వాతంత్ర్య పోరాటానికి అప్పటివరకూ దూరంగా ఉంటూ మున్షీ రాగానే ఆయన చుట్టూ చేరిన భజనపరుల, ఇచ్ఛకాల మనుషుల మాటలూ ఆధారమైనాయి. అట్లాంటివారు, పోరాటం ఇంకా సాగుతున్నప్పుడు ఆ ఉద్యమంయొక్క ప్రాధాన్యాన్ని ప్రభావాన్ని తగ్గించాలనే దురుద్దేశాలతో అనేక రకాల మాటలు ప్రవాదాలు ప్రచారం చెయ్యడం సహజము. కార్యాచరణ సంఘము సంపూర్ణమైన అధికారాలతో తన బాధ్యతమీదనే ఉద్యమాన్ని నడిపింది అది కమ్యూనిస్టుల తోడ్పాటునుగాని, వారే వర్గంవారి తోడ్పాటునుగాని అర్థించలేదు. కాంగ్రెసు నాయకులను తమ వైపు తిప్పుకొనేటందుకు కమ్యూనిస్టులు ప్రయత్నాలు చేయడం జరిగింది. నేను విజయవాడలో ఉన్నప్పుడు వారి నాయకులలో కొందరు నన్ను కలిశారు. నేను వారితో ఈ ఉద్యమం స్టేట్ కాంగ్రెసు ప్రారంభించిన ఉద్యమం అని స్పష్టంగా చెప్పాను. "స్టేట్ కాంగ్రెసు లక్ష్యాలతోటి ముఖ్య సాధనమైన సత్యాగ్రహంలోను విశ్వాసమున్న వారెవరైనా ఈ ఉద్యమంలో చేరవచ్చు. వారికి ఆ స్వేచ్ఛ ఉంది." కమ్యూనిస్టులను వారి దారికి వారిని వదలి వెయ్యడమైంది. ఈ క్రింద ఇచ్చిన తీర్మానపాఠం ఈ విషయాన్ని స్పష్టం చేస్తుంది.

"ఇటీవల వరంగల్, నల్లగొండ జిల్లాలలో కమ్యూనిస్టులు అవలంభిస్తున్న విధానాలను, వారు 'ప్రజాయుగం', 'ప్రజాశక్తి' అనేపార్టీ పత్రికల్లో

చేస్తున్న ప్రచారపు ధోరణులను హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు కార్యాచరణ సంఘము ప్రజా స్వాతంత్ర్య పోరాటంలో విజయం సాధించే దృష్టితో పరిశీలించింది. "స్వామీ రామానందతీర్థ, ప్రభుత్వపు రాయబారి, మరికొందరు ఇతర సంస్థల ప్రతినిధులు కలిసి, ఒక ఒప్పందం చేసుకొన్నారంటూ వచ్చిన వార్తలు నిరాధారములు అసత్యమైనవి అని ఈ కమిటి అధికార పూర్వకంగా నిర్ధారణగా తెలియ జేస్తున్నారు. స్టేట్ కాంగ్రెసు, తాను ప్రజల లక్ష్యాలుగా ప్రతిపాదించిన మౌలిక సూత్రాలకు కట్టుబడి ఉండి, అచంచలమైన ఆత్మ విశ్వాసంతో సంస్థానం అంతటా నిరవధికమైన పోరాటాన్ని కొనసాగిస్తున్నది ముఖ్య సూత్రాలను త్రోసిపుచ్చి ఒప్పందాలను, అపవిత్రమైన మైత్రీ సంబంధాలను ఎల్లప్పుడూ వ్యతిరేకిస్తూ స్టేట్ కాంగ్రెసు ఈ పోరాటం సాగిస్తోంది. ఇటువంటి సందర్భంలో కమ్యూనిస్టు పార్టి చేస్తున్న ప్రచారం స్టేట్ కాంగ్రెసును అప్రతిష్టపాలు చెయ్యాలనే దురుద్దేశంతో చేస్తున్న అసత్య ప్రచారమని నిరసించి అది, తనంతట తానే రూపుమాసిపోతుందని విశ్వసిస్తున్నారు.

"కమ్యునిస్టులు వర్గ పోరాటపు చర్యలు ప్రారంభించి, రాజకీయ స్వాతంత్ర్య సాధన కోసం నడుస్తున్న మహోద్యమాన్ని పక్కదారి పట్టించేటందుకు, దాని, ఉద్ధృతం తగ్గించేటందుకు తోడ్పడే కృషి నిర్వహిస్తున్నట్లు గమనించి ఈ కమిటీ వారు తమ విచారాన్ని వెల్లడి చేస్తున్నారు. మధ్య తరగతి ప్రజలకూ, మధ్యతరగతి వారిలో క్రింది తరగతికి చెందిన రైతులకూ వ్యతిరేకమైన చర్యలు, బెదిరించి బలవంతంగా సామాన్య ప్రజలనుంచి వసూళ్లు చెయ్యడము, ప్రజలలో భయభ్రాంతులు విస్తరించటకు కారణమై ప్రజాస్వాతంత్ర్య శత్రువులైన వారు లాభంపొంది ప్రజలను మరింత అణగ ద్రొక్కేటందుకు వారికి సహకరిస్తున్నాయి.

"అంతేకాదు. నైజాము నిరంకుశ పరిపాలనను ఎదిరించి తమ ప్రాణాలను ఒడ్డి జీవన్మరణ పోరాటం కొనసాగిస్తున్న కాంగ్రెసు వారి

పైన, కేవలం వారు తమ రాజకీయ ప్రత్యర్థులన్న కారణంచేత ఎంత మాత్రమూ ఓర్పు వహించక కమ్యూనిస్టు కార్యకర్తలు దౌర్జన్యాలు చేసిన సంఘటనలు గురించి కమిటీకి రిపోర్టులు నివేదికలు వచ్చాయి.

సర్వనాశనం చేస్తున్న నిరంకుశ భూస్వామిక బలాన్ని ఎదిరించి తీవ్రమైన పోరాటం జరుపుతున్న స్వతంత్ర యోధులపైన దౌర్జన్యాలు జరగడం ఎంతో దురదృష్టం. అవి జరిగినచో కచ్చితమైన చర్యలను గైకొని అణచి వెయ్యాలి ఈ ప్రమాదకర ధోరణులను కమిటీ వారు శ్రద్ధగా పరిశీలించి, అట్లాంటి సంఘటనలు (పునరుక్తం కాకుండా) తిరిగి జరగకుండా జాగ్రత్తలు తీసుకొనవలసిందని కమ్యూనిస్టులను హెచ్చరిస్తున్నారు.

కమ్యూనిస్టులు కొనసాగిస్తున్న చర్యలపట్లా వారు స్టేట్ కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఈ విషమావస్థలో చేస్తున్న ప్రచారంపట్లా కాంగ్రెసు కార్యకర్తలలో నానాటికీ చెలరేగుతున్న ఆగ్రహావేశాన్ని ఈ కమిటీ గుర్తిస్తున్నది.

అయినప్పటికీ, ఓర్పు వహించండనీ నిరంకుశ ప్రభుత్వాన్ని కూలదోసే కార్యక్రమం పైనే దృష్టి కేంద్రీకరించండనీ స్టేట్ కాంగ్రెసు తన కార్యకర్తలను ఆదేశిస్తున్నారు. సామాజిక ఆర్థిక దోపిడీని అంతు లేకుండా కొనసాగించినట్లయితే ప్రజాస్వామ్య స్వాతంత్ర్యము ( నేతి బీరకాయవంటిదై) నిరర్థకమైన దవుతుందని స్టేట్ కాంగ్రెసు విశ్వసిస్తున్నది. ఈ ఆశయ సాధన బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడిన పిమ్మటనే ఫలించగలదని కూడా నమ్ముతున్నది అందుచేత విజయం లభించేవరకూ నిరంకుశ పరిపాలనను అంతం చేసేటందుకు జరుగుతున్న పోరాటాన్ని జంకూగొంకూలేని దృఢ నిశ్చయంతో యావచ్ఛక్తి కేంద్రీకరించి నడిపించటము అత్యావశ్యకము."

ఈ తీర్మానపు విషయం సుబోధకంగా ఉందనుకుంటున్నాను మున్షీ పుకార్లను, చెప్పుడు మాటలు ఆధారంగా గ్రహించి అసలు చరిత్రను

వక్రీకరించే వ్రాతలు వ్రాయడం దురదృష్టము కార్యాచరణ కమిటీ సభ్యులందరూ, కమ్యూనిష్టులతో చేతులు కలిపి, ఉద్యమాన్ని నడపడం తప్పుటడుగు అని స్పష్టంగా నమ్మినవారే. ఈ సందర్భాలన్నీ పరిగణించకుండా మున్షీ వ్రాసిన వ్రాత నిరాధారమైందని కొట్టిపారెయ్యాలి. గాంధేయ సిద్ధాంతాన్ని (అహింసను) పాటిస్తూ 21 వేల మంది జైలులో సత్యాగ్రహోద్యమం గాంధేయ సిద్ధాంతాలకు వ్యతిరేకంగా జరిగిందని ఆయన వివరించడం నాకు చాలా విచారం కలిగించింది.

ఈ స్వాతంత్ర్యోద్యమం మొదటి దశలో క్రమానుసారంగా వేసిన అడుగులు మున్షీ శ్రద్ధగా పరిశీలించలేదనే అనాలి మొదటినుంచీ పోరాటానికి వ్యూహరచన పకడ్బందీ తీరుగా ఉండటము అవసరం అని నిశ్చయించడం జరిగింది హైదరాబాదు సంస్థానంలో ఉన్న ప్రత్యేక పరిస్థితులు, సమస్యలో ఉన్న క్లిష్టత పరిగణించి, కార్యాచరణ సమితి సంస్థానం వెలుపలనే అజ్ఞాతవాసంలో ఉండి, పనులు సాగించాలని నిర్ణయించాము. ఈ నిర్ణయానికి రెండు కారణాలున్నాయి. మొదటి కారణం, బాధ్యత వహించిన మనుషులు హైదరాబాదు సంస్థానంలోని పరిస్థితులను గురించి అధికార పూర్వకంగా భారత ప్రభుత్వంతో మాట్లాడగలిగిన సామర్థ్యం ఉన్నవారు, భారత ప్రభుత్వం ఇచ్చే సలహాలను ప్రజలు పాటించేటట్లు చేయగలిగినవారు, వారికి అందుబాటులో ఉండాలి. ఎప్పుడో ఒకప్పుడు భారత ప్రభుత్వం కలగచేసుకోనకపోతే ఈ సమస్య పరిష్కారం కాదని మా దృఢమైన విశ్వాసము అందుచేత, సలహా గ్రహించేటందుకు, ఇచ్చేటందుకు సంస్థాన ప్రజల సంఘం అవసరం. రెండో కారణం, సంస్థానంలో ఉన్న ప్రత్యేక పరిస్థితులవల్ల అప్పుడప్పుడు సరియైన సూచనలిచ్చి ఉద్యమాన్ని సక్రమంగా నిర్వహించడం అవసరమైంది. అందువల్లనే నేను, ఉద్దేశపూర్వకంగా నే నా సన్నిహిత సహచరులలో కొందరిని సంస్థానం బైట ఉండమన్నాను ఉద్యమం ప్రారంభమైన నాటి , గదగ్, బొంబాయి నగరాల్లో

కార్యాచరణ సమితి ఆఫీసులు ఏర్పాటైనాయి ఈ నిర్ణయం ఉద్యమం మధ్య దశలో ఉన్నప్పుడుగాని, రజాకార్ల దాడుల ఫలితంగా గాని తీసుకున్నది కాదు

మున్షీ, నన్ను జైలునుంచి విడుదల చెయ్యించడానికి లాయక్ అలీకి నచ్చచెప్పేటందుకు ప్రయత్నం చేస్తూ నాకు సంబంధించిన విషయాల్లో చాలా అన్యాయంగా మాట్లాడాడు వారిద్దరి సంభాషణలో లాయక్ అలీకి "స్వామి రామానందతీర్థ దౌర్జన్యపూరితమైన కార్యక్రమాల్లో పాల్గొన్నట్లు మాదగ్గర సాక్ష్యాధారాలున్నాయి అందుచేత ఆయన్ని జైలు నుంచి విడుదలచేసే ఆలోచనలు సాధ్యంకావు" అని అన్నాడట. అప్పుడు మున్షీ, "నీ మాటలు యథార్థంకాదు స్వామి రామానంద తీర్థ ఉద్యమం నడుస్తున్న కాలంలో జైలులోనే ఉన్నాడు. తను దౌర్జన్యంతో సంబంధించిన ఉద్యమంలో పాల్గొనని సర్దార్ పటేల్‌కు ఆయన మాట ఇచ్చాడు. అసలు విషయంతో నిమిత్తంలేకుండా ఆయనను జైలునుంచి విడుదల చెయ్యడం మీ సహృద్భావ సూచకంగా వుంటుంది, భారతదేశం యావత్తు హర్షిస్తుంది" అన్నట్లు ఆయన వ్రాశాడు.

నన్ను ఎట్లాగైనా విడుదల చేయించాలని ఆత్రంతో మున్షీ ఆ రీతిగా మాట్లాడి వుండ వచ్చు. కాని, ఆయన వహించిన బాధ్యతకు చేపట్టిన ఉద్యోగపు హోందా తనానికీ ఈ మాటలు అనుగుణంగా లేవు. నేను సర్దార్‌పటేల్‌తో మున్షీ వ్రాసిన ధోరణిలో ఎప్పుడూ మాట్లాడనూ లేదు. నేను మాట ఇచ్చానన్న విషయంకూడా సత్యదూరమైన విషయము.

ఆనాటి పరిస్థితులు ఎంత భయంకరంగా ఉన్నాయంటే ఇత్తెహాదుల్ ముసల్మీన్ నాయకుల మతావేశపు ప్రేలాపనలకు ఎదురు చెప్పినా విమర్శించినా వారికి ప్రాణ భయం సంభవించేది. ముస్లిమ్‌లలో కొందరు దేశభక్తులైన వారు సాహసించి, నైజాము బూజుపట్టిన రాజనీతి భావాలను బాహాటంగా ఎదిరించారు. వారు సంస్థానంలో సంపూర్ణ బాధ్యతాయుత

ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయ్యడాన్నీ ఇండియన్ యూనియన్‌లో భాగంగా విలీనం కావలసిన ఆవశ్యకతనూ సమర్థించారు నిర్ద్వంద్వంగా ఎక్కడా సందేహాలకు అపార్థాలకు తావులేని భాషలో నైజాము ఆయన మాటలకు తల ఊపే దుండగీండ్లూ అవలంభిస్తున్న విధానాలు ఆత్మహత్యా సదృశ్యములైనవని తూర్పారా బట్టారు.

షొయబుల్లాఖాన్ అనే ఒక యువ పత్రికా రచయిత. అట్లాంటి దేశభక్త్యుద్దీపితుడైన ఉత్సాహమూర్తి అతనిని ఆగష్టు 22, 1948 నాడు పత్రికా కార్యాలయంనుంచి ఇంటికిపోతూ ఉండగా హైదరాబాదు నగర వీధుల్లో కిరాయి దుండగులు కాల్చి చంపారు అప్పటికీ కసి తీరక అతని చేతులు కూడా నరికి వేశారు

కొందరు ప్రభుత్వాన్ని విమర్శించిన ముస్లిం ఆఫీసర్లు తమ ఉద్యోగాలు పోగొట్టుకొనడం కూడా జరిగింది. అనేకమంది అనుమానితుల జాబితాలో నమోదైనారు వారు, తాము నమ్మిన విషయం కోసమై కష్టాలు పడేటందుకు వెనుకాడకపోవడం నాకెంతో మెప్పు కలిగించింది. వారిలో కొందరు నన్ను తర్వాత స్వయంగా కలుసుకొనడం కూడా సంభవించింది. స్వానుభవం ఆధారంగా గ్రహించి ముస్లిములు వారిలోనూ ఉన్నత పదవులలో ఉన్న వారు చాలామంది బాహాటంగా ఉద్యమ కార్యకర్తలుగా పని చేయకపోయినప్పటికీ ఉద్యమాన్ని సమర్థించారు

ఈ స్వాతంత్ర్యోద్యమంలో భయోత్పాతం కలిగించడం, గృహ దహనాలు, దోపిడీలు, బందిపోట్లు, హత్యలు అతిసామాన్య విషయాలై ఒక కొత్త రకం అపేర్భవించింది ఆయుధపాణులైన ముస్లిమ్‌ల ఊరేగింపులు సంస్థానంలో అన్ని ప్రాంతాలలోనూ నిత్య కార్యక్రమాలైనాయి. ఇత్తెహాదుల్ ముసల్మీన్ నాయకులు తమ ఉపన్యాసాలలో జాతి విద్వేష పూరితములూ విద్రోహాత్మకములూ అయిన నినాదాలు చేసేవారు. ఒక్కొక్కప్పుడు వారు, అమాయికులైన ప్రజాసామాన్యంతో పాకిస్తాన్ సైనిక సహాయం పంపేటందుకు సిద్ధంగా ఉంది అని, చెప్పేవారు ఒక

రకమైన ఆవేశము ఉన్మాదము వారిని ఆవేశించా యనిపించేది ఇట్లాంటి వాతావరణంలో ప్రతినిధుల నడుమ జరిగిన సంప్రతింపులు, రాయబారాలు సహజంగా నిష్ఫలం అయినాయి ఆనాటినుంచి ఆనాటికి పరిస్థితి విషమించి, తెగతెంపులు జరిగే ముహూర్తం దగ్గరపడుతోన్నట్లు కన్పించింది.

నన్ను హైదరాబాదు సెంట్రల్ జైలునుంచి, సంగారెడ్డి జిల్లా జైలుకు మార్చి ఏకాంత వాసంలో ఉంచారు సంగారెడ్డి జైలులో ఒక నెల గడిచింది తర్వాత ఒకనాటి రాత్రి హఠాత్తుగా గుల్బర్గా జైలుకి మార్చారు. మహాత్మజీ హత్య కావింపబడిన వార్త నాకు సంగారెడ్డిలో ఉన్నప్పుడే చేరింది.

నేను గుల్బర్గాలో ఉండగా నాకు సహవాసిగా ఒక సత్యాగ్రహిని పంపారు అతనిద్వారా సాధారణ సత్యాగ్రహులు జైలు జీవితం గడచిన సమాచారం నాకు అందింది. అది సహించరాని కష్టాలతో కూడి-ఉంది ప్రతిక్షణమూ ఏదో ప్రమాదం రావచ్చుననే భయంతో వారు కాలం గడుపుతున్నారని తెలిసింది. జైలుశిక్ష అనుభవిస్తున్న వారిపై లాఠిచార్జీలు తరచు జరిగేవి. గుల్బర్గా జైలులో నా చుట్టుపక్కలనే ఒక సత్యాగ్రహిని జైలు ఉద్యోగులు చావబాది చంపారు. అయినప్పటికీ సత్యాగ్రహులు జంకిపోలేదు. అనేక అవమానాలకు గురి అయినా కష్టసహిష్ణుతతో నిశ్చిత మానసంతో ప్రతి సత్యాగ్రహీ శిలవంటి దనిపించుకొన్నాడు.

ఆ కాలంలో గుల్బర్గా జైలు సూపరింటెండెంటు తరచు నా దగ్గరకు వచ్చేవాడు. ఇష్టాగోష్ఠిగా ఉపనిషత్తుల గురించీ, సంస్థానం ఇండియాలో విలీనమయే సమస్యను గురించీ నాతో చర్చించేవాడు. ఆయన కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం (బ్రిటను)లో చదివి రెండు డిగ్రీలు పొందిన విద్యావంతుడు. ఆయన నా దగ్గరకు వచ్చి కనీసం ఒకటి రెండు ప్రశ్నలైనా అడగని రోజుండేదికాదు. ఆయన ప్రభుత్వోద్యోగి అయినా రాజకీయ సమస్యలపై ఎందుకింత ఆసక్తి వ్యక్తం చేస్తున్నాడు ? అని, నేను

ఆశ్చర్య పడేవాణ్ని ఒక్కొక్కప్పు డాయన రజాకార్లు సాగిస్తున్న దండగాల గురించిన భయంకర వార్తలు తెలియజేసేవాడు అంతటితో ఆగిపోకుండా రజాకార్ల నాయకుడైన కాశింరజ్వీని అభిశంసించేవాడు ఎప్పుడైనా ఒకప్పుడు ఆయన నైజామే ఈ సమస్యలకూ కష్టాలకూ మూల కారణము అనేవాడు ఈ ధోరణితో నాలో ఏ ఉద్దేశంతో ఆయన అతి ప్రమాదకరమైన సంభాషణలు చేస్తున్నాడు అని ఆశ్చర్యం కలిగేది గవర్నమెంటు ఉద్యోగిగా ఉంటూ ఆయన నాతో అట్లాంటి చర్చ సాగించే అవసరం లేదు కొంత ఆలోచించిన మీదట 'ఆ చర్చలకు వెనకాల ఏదో అంతర్గతమై దాగి ఉన్న ఉద్దేశం ఉందేమో' అనే అనుమానం కలిగింది. సంస్థాన ప్రభుత్వం బహుశా నా మనోభావాలు ఎట్లాగున్నాయో తెలుసుకోవాలనుకుంటున్నారేమో; సాధ్యం అయినట్లయితే మొత్తం సమస్యను గురించి నేనేమనుకుంటున్నానో తెలుసుకొనేటందుకు విషయ సేకరణ చేయాలనుకుంటున్నారు కాబోలు మా సంభాషణలలో నడుమ అప్పుడప్పుడు ఆ సూపరింటెండెంటు, లాయక్ అలీ తమ జైలుకి రావచ్చుననీ నాతో రాజీ సంభాషణలు జరపవచ్చుననీ మాట వరసగా అన్నట్లు అనేవాడు నాకు సంస్థాన ప్రభుత్వంతో రాజీ సంభాషణలు చేసే ఆసక్తిలేదు అంతేకాకుండా కొద్ది నెలల్లో భారత ప్రభుత్వ సైన్యము హైదరాబాదు సంస్థానంలోకి జొరబడుతుంది అనే విషయం నాకు పూర్తిగా తెలుసు అందువల్ల ఆ సూపరింటెండెంటుతో జరిగిన సంభాషణలలో నేను నిర్భయంగా మనసులో మర్మం లేకుండా మాట్లాడేవాణ్ని. లాయక్ అలీ శ్రమ తీసుకొని వచ్చి నన్ను చూడవలసిన పనిలేదనీ సంస్థాన కాంగ్రెసు కోరిన రెండు కోరికలను గురించీ ఆయన కార్య నిశ్చయం చెయ్యాలనీ ముందుగా హైదరాబాదు ఇండియన్ యూనియన్‌లో విలీనం కావడము, సంస్థాన ప్రజలకు బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పాటు చెయ్యడం అవి రెండూ జరగనిదే మా పరస్పర సంభాషణలవల్ల ప్రయోజనం ఉండదనీ అవి అనావశ్యకములని స్పష్టంగా చెప్పాను. బహుశా ఈ భావాలను ఆ సూపరింటెండెంటు సంస్థాన ముఖ్యమంత్రికి

తెలియజేసి ఉండవచ్చు అందువేత రావచ్చునని అన్న ముఖ్యమంత్రి రావడం జరగలేదు.

నగరంలో ఉన్న రజాకార్లు జైలు పరిసరాల్లోకి ప్రవేశించి దౌర్జన్య చర్యలు జరిపినట్లు రిపోర్టులు వచ్చాయి వారి ప్రవేశాన్ని ఆపే సాహసం ఉన్న అధికారు లెవ్వరూ అక్కడలేరు. ఇంచుమించుగా అట్లాంటి పరిస్థితులే అన్ని జైళ్ళలోనూ ఉన్నాయి ఈనాడు గతించిన ఆనాటి పరిస్థితులు నాకు జ్ఞాపకం వచ్చినప్పుడు సత్యాగ్రహులు చూపించిన తెగువ, జైళ్లలో ఎదుర్కొన్న ప్రమాదాలు, వ్యక్తం చేసిన దృఢనిశ్చయము, కళ్ళకు కట్టి హృదయం కంపితమవుతుంది

నాకు సంబంధించినంతవరకు 'ఏమి చెయ్యాలి? ఏమి చెయ్యకూడదు?' అనే ఆలోచనే లేదు కార్యాచరణ సంఘ సభ్యుల శక్తి సామర్థ్యాలతో నాకు సంపూర్ణమైన విశ్వాసం ఉంది. ఉద్యమ నిర్వహణ, దానికి నాయకత్వము వహించి విజయం సాధించడము, వారి కర్తవ్యాలు, ఢిల్లీలో ఉన్న నాయకులమీద కూడా నాకు విశ్వాసం ఉంది. తగిన సమయంలో వారు తగిన చర్య తీసుకుంటారు నేను చెయ్యవలసిందల్లా జైల్లో ఉన్న సత్యాగ్రహుల ఉత్సాహం క్రుంగిపోకుండా చెయ్యడం, ఆ పనిని నేనున్న పరిస్థితులలో వీలైనంత సమర్థవంతంగా నిర్వహించాను.

హఠాత్తుగా గుల్బర్గా సెంట్రల్ జైలు సూపరింటెండెంటు నా దగ్గరకు వచ్చి ఆ రాత్రే నన్ను ఎక్కడికో తెలియని చోటికి మార్చనున్నట్లు తెలియజేశాడు జైలు అధికారులలో ఒకరు నన్ను సైనిక శాఖ అధికారులకు అప్పగింత పెడతారనీ వారు నన్ను నైజాము ప్రభుత్వాన్ని ధిక్కరించిన రాజద్రోహ నేరానికి విచారణ చేస్తారనీ చెప్పారు. ఈ వార్తలూ స్థానం మార్పూ నా కేమీ చింత కలిగించలేదు ముసుగువేసిన కారులో ఎక్కించి నన్ను తిరిగి హైదరాబాదు జైలులో నా పాతగదిలో పాత సత్యాగ్రహి మిత్రుల సాహచర్యంలో వదలడం ఎంతో ఆశ్చర్యం కలిగించింది.

1926 లో కలిగిన అనారోగ్యంవల్ల దెబ్బతిని నన్ను శాశ్వతంగా అవిటివాణ్ని చేసిన నా వెన్నెముక చాల కాలంపాటు కొనసాగిన ఏకాంత వాస జైలుశిక్ష ప్రభావంవల్ల మరికొంత బాధ కలిగించి మరింత అసౌక ర్యకరమైంది. వైద్యులు పరీక్షలుచేసి నా వెన్నెముక పరిస్థితి మరింత క్షీణించకుండా తగిన జాగ్రత్తలు తీసుకోవలసి ఉంటుందని సూచించారు. ఆ పరిస్థితిలో చంచల్‌గూడా జైలులో ఉన్న నాకు నాతోపాటు శిక్ష అనుభ విస్తున్న శ్రీ విశ్వనాథం చికిత్స చేసేటందుకు అనుమతి ఇచ్చారు. శ్రీ విశ్వనాథం హనుమాన్ వ్యాయామశాలను అతి ఉత్సాహంతో నడుపు తున్న కార్యకర్త ఆయన మంచి ఆరోగ్యవంతుడు దేహాన్ని ఎట్లా శ్రద్ధగా నడిపించాలో తెలిసినవాడు ఏమీ అంతగా చదువుకొన్నవాడు కాకపోయినా నిరాడంబరుడు నిస్వార్థ, త్యాగశీలి అని పేర్గాంచిన కార్యకర్త.

భారత సైన్యం కదలడం ప్రారంభమైందనే వార్తలు ఫిల్టరైంచి ఆ నోటా ఆనోటా వచ్చి చేరడం జరిగింది ఏ రీతిగా చర్య నిర్వహిం చడం అని శ్రీ షా విజయవంతమైన కార్యాచరణ వ్యూహానికి పథకం నిశ్చయిస్తున్నారు హైదరాబాదు సమస్యా పరిష్కార విధానం, చర్యా నిర్వహణ పూర్తిగా భారతదేశపు ఉక్కుమనిషిగా పేరుపొందిన సర్దార్ పటేల్ చేతుల్లో వదలడం జరిగిందని కూడా తెలిసింది జైలులో ఉండి మేము ఆచర్య తీసుకోవడం త్వరగా జరగాలని కోరడం మాత్రమే చేయ గలిగాము. ప్రజలకు ఓర్చుకొనే శక్తి పూర్తిగా నశించింది భారత ప్రభుత్వం వెంటనే చర్యతీసుకొనకపోతే సర్వనాశనకర ప్రళయము, అరాజకము తప్పవు. కాని, ఏదైనా తీవ్రమైన చర్య తీసుకొనేముందు దాని పూర్వాపర సాధక బాధకాలన్నీ ఆలోచనలు చేసేటందుకు అవసర మైనంత కాలవ్యవధి కావాలనేది కూడా యథార్థమే అందుచేత ప్రజల్ని శాంతంగా ఉండండని కంగారుపడకండని సలహాలు ఇవ్వడం జరగాలి. జైలు నిర్బంధంలో లేకుండా స్వేచ్ఛగా ఉన్నవారు, దేశభక్త్యుద్దీపిత భావాలచేత ప్రబోధితులై తమ శక్తినంతా ధారపోసి ప్రజాస్వామ్యంలో

ఆశ, ధైర్యం, కలిగిస్తూ ప్రశంస నీయమైన కృషి చేశారు విద్యార్థులు హుందాతనంతో ప్రవర్తించారు లాయర్లు ముందుకు వచ్చి తమకు సాధ్యమైన పద్ధతులలో స్వాతంత్ర్యయోధుల బలాన్ని పెంపొందించారు. అన్ని వర్గాలవారూ ఒకరితో ఒకరు పోటీపడి తమ పాలబడిన (వాటాకు వచ్చిన) బాధ్యతలను నిర్వహించారు. ఎట్టకేలకు అనిశ్చయంగా ఉన్న కాలం ముగిసింది సెప్టెంబరు 13, 1948 నాడు భారత దేశపు సైన్యాలు హైదరాబాదు సంస్థానపు సరిహద్దులు దాటి లోపలికి ప్రవేశించినట్లు వార్తలు అందాయి. చర్య త్వరగా తక్కువ కాలవ్యవధిలో చకచకా పూర్తి అయింది. నైజాము, లాంఛనప్రాయంగా సెప్టెంబరు 17, 1948 నాడు ఓడిపోయినట్లు ఒప్పుకొని భారత ప్రభుత్వానికి శరణు అని అన్నాడు.

నా ప్రతిజ్ఞా నిర్వహణ పూర్తి అయింది. హైదరాబాదు సంస్థాన ప్రజలు తమ శక్తి సామర్థ్యాలు నిరూపించారు. భారత్ యావత్తు విజయానందం పొందింది భారత స్వాతంత్ర్య సమరంలో చివరి యుద్ధ రంగంలో లభించిన ఈ విజయంతో స్వతంత్ర సాధన పూర్తి అయింది భారత దేశమాత శరీరంలో పుండుగా ఉన్న సంస్థానాన్ని శాశ్వతంగా తొలగించే శస్త్రచికిత్స పూర్తి అయింది ఈ విజయోత్సవాన్ని కాశ్మీర్ ప్రజలు ఆనందాతిరేకంతో దీపావళిగా జరిపారు.

నాకు సంతోషం కలిగినప్పటికీ మనల్ని దీవించేటందుకు మహాత్మాజీ మన నడుమ లేరన్న భావంవల్ల చింత కలిగింది. ప్రతి పర్యాయమూ ఇప్పుడు అప్పుడు అనకుండా, నేను మార్గదర్శియైన ఆయన దగ్గరకు పరుగెత్తేవాణ్ని. నిర్బంధం నుంచి విడుదలైనప్పుడు వెంటనే ఆయన దగ్గరకు సేవాగ్రాం వెళ్ళి సలహాలు గైకొనడం నా కర్తవ్యంగా భావించేవాణ్ని. హైదరాబాదు సంస్థాన స్వాతంత్ర్యోద్యమానికి రూపకల్పన చేసిన శిల్పి విజయం సిద్ధించిన సమయంలో సజీవుడై ఉండి విజయాన్ని కళ్లారా చూడటం జరగలేదు.

సామాన్య పరిస్థితుల్లో అయితే ఈ స్మృతులు (జ్ఞాపకాలు) ఇంత టితో ఆగిపోవలసి ఉంది. ఒక యుగం (శకం) పూర్తి అయింది. మరొక యుగం (శకం) ప్రారంభమైంది. కనక అట్లా చెయ్యడంలో ఔచిత్యం ఉంది. కాని, స్వాతంత్ర్యము లభించిన తర్వాత సంభవించిన కొన్ని సంఘటనలకు ప్రజాజీవితంలో ఎంతో ప్రాముఖ్యం ఉంది అవి కూడా స్వాతంత్ర్య సాధనతో ముడిపడి ఉన్నవి ఆ పోరాటంలో ఉపాంగముల వంటివి అనవచ్చు. అందుచేత వాటికి సంబంధించిన విషయాలను సంగ్రహంగా వివరించడం జరిగింది.



# 34. జైలునుంచి విడుదల - ఆ తర్వాత

భారత ప్రభుత్వ సైన్యం ముందుకు చొచ్చుకొని వస్తూంటే రజాకార్లలోని అతివాద వర్గాలు, కాలదోషం పట్టిన పాత ఆయుధాలు ధరించి కొన్నిచోట్ల ఎదిరించారు. ఉస్మానాబాద్ జిల్లాలోని నల్‌దుర్గ్‌లో కొంత గట్టిగా ఎదిరించినట్లు రిపోర్టులు వచ్చాయి ఔరంగాబాద్‌లో ఒక పిచ్చివాడి చర్యవంటి దొకటి జరిగింది. గవర్నమెంటు ఇంటర్మీడియేట్ కాలేజీలోని ఆచార్యు డొకడు నూరుమంది విద్యార్థులకు ఆయుధాలిచ్చి పట్నంవైపు వస్తున్న సైనికుల్ని యెదిరించి పోరాడమని ఉసిగొల్పి పంపాడు పాపం ఆ పసివాళ్ళు బలి అయిపోయారు. ముఖ్యమైన బెటాలియన్ హైదరాబాద్ నగర పరిసరాల దగ్గరకు వస్తూండటం చూసేసరికి 'శరణు' అనడం తప్ప నైజాముకి మరోదారిలేదనే ఆలోచన అందరికీ కలిగింది.

సెప్టెంబరు 17, 1948 నాడు నేను ఇతర సత్యాగ్రహులతోకలిసి వుంటున్న బారక్స్‌కు మధ్యాహ్నంవేళ పోలీసు శాఖ డైరెక్టర్ జనరల్ వచ్చి, నన్ను వెంటనే విడుదల చెయడం జరుగుతుందని చెప్పాడు భారత సైన్యం, హైదరాబాదు సంస్థానంలోకి బాగా చొచ్చుకొని వచ్చినట్లు తెలిసి నప్పటికి సంస్థానంలో వున్న పరిస్థితిని గురించి నాకేమీ తెలియలేదు. చర్య పూర్తి అయేలోపున ఏమి జరుగుతుంది? ఏది జరిగినా జరగవచ్చు అందుచేత వేల సంఖ్యలోవున్న సత్యాగ్రహుల నందరినీ వారిగతికి వారిని వదలి నే నొక్కణ్నే విడుదల అయేటందుకు నాకు అంగీకారం కలగ లేదు కొన్నివారాల క్రిందటనే సత్యాగ్రహులపై దాడిజరిపే ఆలోచనలతో జైలు పరిసరాల్లోకి దొంగచాటుగ ఆయుధాలు రవాణా చెయ్యడం

జరిగింది కానీ, జైలు సూపరింటెండెంటు సయ్యద్ మొహమ్మద్ హసన్ ఎంతో చాకచక్యంతో వ్యవహరించి చురుకుతనంతో చర్యలు తీసుకోవడం వల్ల ఒక విషాదకర సంఘటన తప్పిపోయింది అందువల్లనే పరిస్థితి పూర్తిగా అదుపులో వున్నదని తెలిస్తేగాని, నేను బైటికి వెళ్ళడానికి వెనుకాడాను అందుచేత, పోలీసుశాఖ డైరెక్టర్ జనరల్‌ని అసలు విషయం ఏమిటి? నన్ను విడుదలచేస్తూ వేసిన ఆర్డరు నేను స్వయంగా చూడాలి అని అన్నాను ఆయన నాకు దాన్ని చూపించాడు పోలీసు చర్య ఫలితంగా నైజాము చేతులు జోడించి శరణు వేడుకొన్నాడనీ లాయక్ అలీ మంత్రివర్గం రాజీనామా ఇచ్చిందనీ భారత ప్రభుత్వపు సూచనల ప్రకారం నన్ను వెంటనే విడుదల చెయ్యడం జరిగిందనీ తెలిసింది. నేను బైటపడడం ప్రజలను అదుపులో వుంచడానికి అవసరమనీ భారత సేనలు హైదరాబాదు నగరం చేరేటందుకు మరొక 24 గంటల కాలం పట్టవచ్చుననీ ఆ డైరెక్టర్ జనరల్ నాతో చెప్పాడు ప్రజల చేతుల్లో ఆయుధాలు చెల్లాచెదురుగా ఉన్నాయి. పరిస్థితి పేలడానికి సిద్ధంగావున్న అగ్నిపర్వతంలా వుంది శాంతి భద్రతలు కాపాడటం, పూర్తిగా మనస్సు చెదిరిపోయి, నైతికంగా పతనమైన అధికారులవల్ల సాధ్యం అవదు. ఇవన్నీ తెలిసిన తర్వాత నేను వారితో బైటికిరావడానికి అంగీకరించాను.

పట్నంలోని పరిస్థితి చూస్తే ప్రజల ఉత్సాహం పట్టపగ్గాలు లేకుండా ఉరకలు వేస్తోంది గత అనేక సంవత్సరాలుగా చెప్పలేనన్ని బాధలు పడ్డ జనం ఒక్కసారి వాటి నుంచి విముక్తి కలిగిన వార్త వినగానే అట్లాగ ప్రవర్తించడం సహజము మొత్తంమీద స్వతంత్రం లభించింది నన్ను విడుదల చేశారని కూడా విన్నారు వెంటనే వేలకొద్ది ప్రజలంతా సుల్తాన్‌బజార్‌లో వున్న నా మకాము దగ్గర పోగుపడ్డారు నేను ప్రజావాహినికి అభినందనలు, శుభాకాంక్షలు తెలిపాను. మిలిటరీ (సైన్యం) వచ్చి పట్నాన్ని రక్షించే బాధ్యత చేపట్టేవరకు శాంతిభద్రతల బాధ్యత ప్రజలదే అని సలహా యిచ్చాను ఏ దురదృష్టకరమైన సంఘటనా జరుగకూడదని నొక్కి చెప్పాను ప్రజల ఉత్సాహం వెల్లువ పొంగినట్లు

పెరిగిపోతోంది. అదిచూసి, నేనే పట్నంలో వేర్వేరు ప్రాంతాలలో ఉన్న ప్రజలను స్వయంగా కలుసుకొని నా సందేశాన్ని సూటిగా వారికే అందించాలనుకున్నాను

ఈ లోపుగా నాకు కె యమ్. మున్షీ నుండి కబురు వచ్చింది. ఆయనను కూడా రజాకార్ల దళాలు నిర్బంధంలో వుంచాయి పోలీసు చర్య ప్రారంభంకాగానే ఆయనను కూడా ...... ఆయన నన్ను వెంటనే తన మకాముకి రమ్మని వ్రాస్తూ తాను నైజామును కలుసుకొనే టందుకు వెళుతున్నట్లు తాను తిరిగి వచ్చేవరకూ నన్ను వేచివుండమనీ కోరాడు.

ఈ సందర్భంలో ఈ నాటివరకూ నాకు అర్థం కాకుండా సమన్వయం కాకుండా మిగిలిపోయిన వింతగొలిపే సంఘటన ఒకటి వుంది. ఇప్పుడది వివరించడం అవసరమనిపిస్తోంది. శ్రీ మున్షీ అప్పుడు వెళ్ళింది రేడియో స్టేషన్‌కి. తన ప్రసంగాన్ని రేడియోలో ప్రసారం చెయ్యడమే ఆయన చేస్తున్న పని ఆ ప్రసంగంలోని ముఖ్యాంశంగా "భారత ప్రభుత్వానికి శరణాగతి కావలసిందనీ భారత సేనలను ఆహ్వానించవలసిందనీ నైజాముకి తాను సలహాయిచ్చినట్లూ" ప్రజలకు చెప్పడం జరిగింది మున్షీ ప్రసంగంగాని, నైజాము ప్రసంగంగాని నేను పూర్తిగా వినలేక పోయాను నేను విన్న కొద్దిమాటలవల్లా భారత ప్రభుత్వం నుంచి ఏ విధమైన సూత్రాలూ సూచనలూ లేకుండా ఆయన తానుగా చొరవ తీసుకోనడం, చర్యనడపడం అనుచితమైన కార్యమనిపించింది నైజాముకి ఆయన ఇచ్చిన సలహా అప్రస్తుతము భారత ప్రభుత్వం అనుసరిస్తున్న విధానానికి అనుగుణమైందికాదు. ఈ అభిప్రాయం వెల్లడించింది నే నొక్కణ్ణేకాదు. ఇంకా చాలామంది అట్లాగే అన్నారు. భారత సేనలు హైదరాబాదు సంస్థానంలో ప్రవేశించగానే మున్షీ అధికార బాధ్యతలు ముగిసినట్లే ఆయన ఏజంట్ జనరల్ గిరీ పదవి, స్వపహాల దృష్టితో చూస్తే, రద్దయినట్లే పరిస్థితులకు తగిన నిర్ణయాలు తీసుకోవలసి

బాధ్యత, అధికారము మిలటరీ కమాండర్‌ది అందుకోసం అవసరమైన సూచనలను సలహాలను భారత ప్రభుతం ఆయనకు యిచ్చే ఉంటుంది.

మున్షీ రేడియో స్టేషన్‌నుంచి తిరిగి రాగానే “శరణు వేడమని నైజాముకి మీరే కారణంవల్ల సలహా ఇచ్చారు ?” అని అడిగాను ఆయన జవాబిచ్చేలోపునే ఢిల్లీనుంచి వైర్‌లెస్ వార్త రావడం, ఆయిన అటువైపు వెళ్ళడం జరిగింది ఢిల్లీ నాయకులతో మున్షీ అప్పుడు జరిపిన సంభాషణ ఘర్షణవంటిదైనట్లు నాకు తోచింది. కొంతసేపైన తర్వాత పండిట్ జవహర్లాల్ నాతో టెలిఫోన్‌లో మాట్లాడ కోరారు ఆయన నా ఆరోగ్యాన్ని గురించి అడిగి ఢిల్లీవచ్చి తనతో మాట్లాడేవరకూ ఏ ప్రకటనలూ చెయ్య వద్దని కోరారు ఇప్పుడు సైనిక పరిపాలన ఏర్పాటైంది కనక ప్రజలం దరూ తమ దగ్గర ఉన్న ఆయుధాలను అప్పగింత పెట్టవలసిందని, వారికి చెప్పమని సూచించారు. మున్షీకి తీవ్ర జ్వరం వచ్చినందున ఆయన మూడు నాలుగు రోజులు పక్కమీదనే ఉండవలసి వచ్చింది. ఆ తర్వాత ఆయనకు ప్రత్యేక విమానం ఏర్పాటుచేసి మిలిటరీ గవర్నరు బొంబాయి పంపించారు.

ఈ సంఘటన గురించి ‘ఒక శకం ముగింపు’ అనే పుస్తకం 232 పేజీలో మున్షీ ఈ రీతిగా వ్రాశారు.

నేను రాత్రి 8-15 గంటలకు ఇంటికి వచ్చేటప్పటికి పండిట్‌జీ పంపిన వార్త నాకోసం కనిపెట్టుకొని ఉంది దాని సారాంశం ·

“నీవు ఈ రాత్రి రేడియోలో ప్రసారం చెయ్యవద్దు. మాతరఫున నీవు, మా దగ్గర నుంచి సూచనలు అందితేనేగాని ఏమీ వాగ్దానాలు చెయ్యవద్దు

హైదరాబాద్ సేన, భారత సేనాధిపతికి లాంఛనంగా లొంగి పోవాలి మేము మరేవైనా సూచనలు, ఆజ్ఞలు, ఇచ్చేవరకు మా సేనా నాయకుడే పరిపాలన నిర్వహిస్తాడు

---

సేన లొంగిపోవడం మిలిటరీకి సంబంధించినది. అందులో నీవు పాల్గొనకూడదు. భారత సేనలతో నీవు సికిందరాబాదు ప్రవేశించరాదు ”

పండిట్ నెహ్రూ పంపించిన ఈ సందేశము ఎంతో అర్థవంతమైనది. సెప్టెంబరు 18, 1948 నాడు ఢిల్లీనుంచి భారత ప్రధాని రేడియోలో ఒక ఉపన్యాసం ఇచ్చారు అందులో ఉన్న విషయాలన్నింటిని నేను ఆమోదించాను

“నైజాము ప్రజల విశ్వాసాన్ని కోల్పోయాడు. అందువల్ల హైదరాబాదు పరిస్థితి వర్తమానంలో గాని, భవిష్యత్తులోగాని ఎట్లా ఉండాలి ? అనే సమస్యల గురించి నైజాము చెప్పవలసింది ఏమీలేదు” అని నెహ్రూజీ ఘంటా ఘోషణంలా చెప్పారు.

“నైజాము ఇచ్చిన రేడియో ప్రసంగము అసందర్భమైనదనీ నేటి పరిస్థితిలో ఇమిడేదికాదనీ అందుచేత భవిష్యత్‌ను గురించి నిర్ణయాలు చేసే సమయంలో దానికి విలువ ఇవ్వవలసిన పనిలేదనీ” నేను ప్రధాన మంత్రి నెహ్రూజీకి వ్రాశాను.

పోరాటం తుది దశలోనూ పోలీసు చర్య తరవాత పరిస్థితులు మామూలు ధోరణిలోకి వచ్చిన తర్వాత నేను అప్పుడప్పుడు సర్దార్ పటేల్ సలహాలను అడిగి గ్రహించడం జరిగింది. అప్పుడు ఆయిన స్వదేశ సంస్థాన వ్యవహారాల మంత్రిగా ఉన్నందువల్ల అట్లా చెయ్యడం అవసరమైంది ఈ సాన్నిహిత్యానికి పూర్వం, నేను ఈ భారతదేశపు ఉక్కు మనిషికి సన్నిహితం అవడానికి వీలులేనంత దూరంగానే ఉండేవాణ్ని. భారతదేశ నాయకత్వంలో ఆయనకున్న ఉన్నత స్థానం నాకు ఆయనపట్ల గౌరవంతో మిశ్రితమైన బెదురు కలిగించేది. అందువల్ల నేను ఆయనతో పరిచయం పెంచుకోలేదు మా నడుమ పరిచయం పెరిగిన కొద్దీ మా ఇద్దరి దృక్పథాలూ ఒకదానికొకటి చాలా దూరంగా ఉన్నాయని తెలుసుకున్నాను నన్ను సిద్ధాంతపరంగానూ భారతదేశ సమస్యల

అవగాహనలోనూ నెహ్రూ అనుయాయుణ్నని పరిగణిస్తారు. సాంఘిక ఆర్థిక విషయాలలో నేను పండిట్ జవహర్లాల్ నెహ్రూనే అనుసరించాను. మా నడుమ ఉన్న ఈ దృక్పథాల సామ్యంతోపాటు, పండిట్‌జీ అఖిల భారత స్వదేశ సంస్థానాల ప్రజా కాంగ్రెసు అధ్యక్షుడు అయినందున కూడా ఆయన సూచనల ప్రకారం పని చెయ్యవలసిన బాధ్యతకూడా నాకు ఉంది. నేను సలహాలకోసం ఢిల్లీ వెళ్ళినప్పుడల్లా తప్పకుండా ఈ ఇద్దరు మహానాయకుల్ని కలిసేవాణ్ని. బహుశా ఈ పరిస్థితులన్నీ నాకు సర్దార్‌తో ఐక్యం అయేటంత సాన్నిహిత్యం ఏర్పడకపోవడానికి అవరోధాలుగా పని చేశా యనవచ్చు.

మహోన్నతులైన ఈ ఇద్దరు నాయకుల నడుమ ఉన్న విభేదాలూ బాగా తెలిసినవే అన్ని రాష్ట్రాలలోను ముఖ్యమైన బాధ్యతలు నిర్వహించవలసిన కీలక స్థానాల్లో తన మనుష్యుల్ని నియమించే భావం సర్దార్‌కు ఉంది. నాతో ఒకసారి ఒక మిత్రుడు నేను రెండు గుర్రాలమీద ఒకేసారి స్వారి చేస్తున్నానని చమత్కారంగా అన్నట్లు అన్నాడు. అందువల్ల సర్దార్‌పట్ల నాకున్న విశ్వాసము మనస్పూర్తియైనది కాదనే శంక ఆయనకున్నట్లు ఆ మిత్రుడు నాకు సూచించినట్లు నేను అర్థం చేసుకుంటున్నాను. అదే ఆయన (సర్దార్) అభిప్రాయమైతే దానికి నా బాధ్యత లేదు దృక్పథము, ప్రజా సమస్యల పరిష్కార విధానాలు. వాటికి మార్గాలు అన్వేషించే ధోరణి- అనే వాటన్నింటిలోనూ నేను పండిట్ జవహర్లాల్‌తో ఏకీభవించాను. అందువల్ల సర్దార్ పటేల్‌ను ఆయన చెప్పిన మాటలు విని, ఎదురు వాదం చెయ్యకుండా తల ఊపి, అక్షరాలా అమలుచేసి, ఆయన మెప్పుపొందే విశ్వాసపాత్రుల కోవకు చెందినవాణ్ని కాకపోయి ఉండవచ్చు. హైదరాబాదు సంస్థానంలో మిలిటరీ పరిపాలనకు ఆశ్వాసాంతం జరిగి, రాజకీయ వాతావరణం కొంత కల్లోలితంగా ఉన్నప్పుడు నేను ఆయన ఆగ్రహానికి కొంతవరకు గురి కావలసిన పరిస్థితి ఏర్పడింది. హైదరాబాదు స్టేట్ వ్యవహారాల్లో కర్ణధారి (ముఖ్యమంత్రి)

ఆయన పూర్తిగా తాను గీచిన గీటు దాటని స్వభావం ఉన్న మనిషే ఉండాలని కోరినట్లు కనిపించింది. అయినప్పటికీ సర్దార్ పటేల్‌పట్ల నాకున్న గౌరవం ఎప్పుడూ క్రమక్రమంగా పెరుగుతూనే ఉంది. త్వరగా ఒక నిశ్చయానికి రావడం, ఆ నిశ్చయాన్ని దృఢ విశ్వాసంతో అమలు చెయ్యడం. ఆయన సహజ గుణాలు. ఆయన సునిశితమైన రాజకీయ ధౌరంధుర్యము ప్రభుత్వానికి లభించకపోయినట్లయితే భారతదేశంలో స్వదేశ సంస్థానాల విలీనత అనే సమస్య, ఇంత శీఘ్రంగా సజావుగా పరిష్కారమయ్యేదికాదు. ఆధునిక భారత జాతి నిర్మాతలలో అగ్రగణ్యులైనవారిలో ఆయన ఒకరు అని పేర్కొనదగినవాడు. ఈ నాటి విషమ పరిస్థితులలో సర్దార్ పటేల్ ఉన్నట్లయితే మనకు ఎంతో సహాయకరంగా ఉండేది అని, అనేకమంది అనుభవజ్ఞులైన అగ్రనాయకులు భావిస్తున్నారు. అది అట్లాగే ఉంచినా భారత దేశపు ప్రజానీకము, వారిలోనూ ముఖ్యంగా హైదరాబాదు ప్రజలు ఆయనను ఎప్పుడూ కృతజ్ఞతాపూర్వక గౌరవంతో తలచుకుంటూనే ఉంటారు.

దేశానికి స్వతంత్రం లభించిన తర్వాత, భారత కమ్యూనిస్టు పార్టీ ప్రపంచ రాజకీయ పరిస్థితులను విమర్శనాపూర్వకంగా పరిశీలించి, అంచనాలు వేసికొని ఇండియా సామ్రాజ్యవాదాన్ని పరిరక్షించే కోట అని నిర్ణయించి అట్లాగే పరిగణించారు. నెహ్రూ ప్రభుత్వం సామ్రాజ్యవాదుల చేతుల్లోఉన్న కీలుబొమ్మ అనీ, తొత్తు అనీ నిర్దేశించి, దాన్ని కూలద్రోసేటందుకు తీవ్రమైన పోరాటం సాగించాలనే నిర్ణయం గైకొన్నారు. ప్రజలు దానిపై తిరుగుబాటుచెయ్యాలని ఆదేశించారు. ప్రజా ఉద్యమం, గొరిల్లా పద్ధతిలో సాయుధ పోరాటాలు నడిపించాలన్నారు. జైలులో ఉన్నప్పుడే నేను కొంత కొంతగా ఈ వ్యూహారచనా ధోరణులు, మాతోపాటు ఒకే బేరక్స్‌లో నిర్బంధంలోఉన్న కమ్యూనిష్టు డిటెన్యూల గుసగుసల చర్చలు ఆధారంగా ఊహించాను. ఎట్లా జేలులోనుంచి బైట పడాలనే ఆత్రంకూడా నాకు వారిలో కనిపించేది. నైజాము పరిపాలన

ఉంతపెంచినా తమకు స్వేచ్ఛ లభించకపోవచ్చుననీ మరికొంత కాలం తాము నిర్బంధ వాసంలోనే ఉండవలసి వస్తుందనీ అనుకున్నారు. కాని, ఏవో ఎక్కడో జరిగిన పొరపాటువల్ల వారిలో కొందరి పేర్లు మొట్ట మొదటిలోనే విడుదల పొందవలసిన వారి పేర్లలో ఉన్నాయి. వారు విడుదల అయారు. తర్వాత ఆ పొరబాటు గుర్తించడం జరిగింది. కాని, ఆ విడుదల ఆర్డరు మార్చకముందే వారి విడుదల అమలు జరిగిపోయింది. ఆర్డరు మార్చేటప్పటికి ఆలస్యం అయింది జరగవలసిన ప్రమాదం జరగనే జరిగింది విడుదలపొందిన వారు బైట ఉన్న తమ బలగాలతో కలిసిపోయి పార్టీ ఆదేశాల ననుసరించి విద్రోహకర చర్యలు కొన సాగించారు.

—o—

# 35. కమ్యూనిస్టుల సాయుధ పోరాటం, నా శాంతి సందేశ యాత్ర

తెలంగాణాలో రైతాంగం, భూస్వాముల నిరంకుశత్వం దౌర్జన్యంవల్ల అణగద్రొక్కబడి ఉన్నారు. వాళ్ళ నరాల్లో ఏమీ లేశమైనా బలం మిగలలేదు. తరతరాలుగా అనుభవంలో ఉన్న పేదరికంతో వాళ్ళు దొరలకు, (పెద్ద మనుషులను తెలంగాణాలో సంప్రదాయకంగా పేర్కొనే పేరు) అత్యంత వినయంగా ఒదిగి, అణగిమణగి ఉంటూ తమ జీవితం వెళ్ళబుచ్చుకోవాలి అన్న విధాలా వాళ్ళు భూస్వాములకు బానిసలుగా బ్రతికారు. కట్టుకునేటందుకు ఒళ్ళు నిండిన గుడ్డలులేక అర్ధ నగ్నంగా ఉంటూ తక్కువ కూలికి, ఎక్కువ కాయకష్టంచేస్తూ, ఎముకలగూడుల్లా కనిపిస్తారు. గ్రామాలలో సమాజంలో స్పష్టంగా రెండు చీలికలు(వర్గాలు) కన్పిస్తాయి. అరడజను మందికంటె తక్కువగా ఉండే కలవారు ఒక వర్గం. చాలా గ్రామాల్లో వీరు ఒకే ఒక [illegible]వారు కావడం కూడా కనిపిస్తుంది. గ్రామంలో మిగిలిన వారందరూ రెండో వర్గం, లేనివారు. గ్రామంలో ఉన్న భూమిలో ఎక్కువ పాలు తక్కువ సంఖ్యలో ఉన్న "కలవారి" స్వంతం అయి ఉంటుంది. కమ్యూనిస్టులు నడిపిస్తున్న సాయుధ పోరాటం జరుగుతున్నప్పుడు నేను ఒక గ్రామం సందర్శించాను ఆ గ్రామానికి చెందిన 1400 ఎకరాల భూమిలో 1300 ఎకరాలు ఒకే ఒక దేశముఖ్ ఆస్తి. ఆయన హైదరాబాదులోనే నివసిస్తూ ఏడాదికి ఏదో ఒకటి రెండు పర్యాయాలు గ్రామానికి వచ్చి పోతూ ఉంటాడు ఆయన భూముల్ని గ్రామంలో ఉన్న పేదప్రజలే సేద్యంచేసి పండించి ఆ దొరకే ఇస్తూ ఆయన ఎంత ఇస్తే అదే తమ కూలిగా తీసుకుంటున్నారు. ఈ విషయాలు

తెలియగానే నాకు ఎంతో ఆశ్చర్యమైంది తరతరాలుగా ఈ పద్ధతినే తండ్రులనుంచి కొడుకులు క్రమం తప్పకుండా కొనసాగిస్తున్నారు. నెహ్రూ పరిపాలన కూలదోయాలనే తమ పార్టీ కొత్త వ్యూహరచన అమలు చేసేటందుకు అనుకూలమై సారవంతమైన భూమి ఇదే అని తెలంగాణాను తమ కార్య క్షేత్రంగా కమ్యూనిస్టులు ఎన్నుకొనడం నాకు ఆశ్చర్యం కలిగించలేదు రైతుకు భూమిపట్ల ఉండే ఆశను వారు పూర్తిగా వినియోగించుకొంటున్నారు "నెహ్రూ ప్రభుత్వం పేదప్రజల దురవస్థలన్నింటికి మూల కారణము ఈనాడు లభించిన స్వతంత్రం నిజమైన స్వతంత్రంకాదు అందుచేత మనం ఈ పరిపాలకులతో గట్టి పోరాటం జరిపి, భూస్వాములనుంచి విముక్తి సాధించాలి అందుకోసం వీలైన మార్గాలన్నింటినీ అనుసరించాలి," అని ఆలోచించి జమీందార్ల గడీలను మేడలను నేలమట్టం చేశారు వారి గాదెలను (తిండి గింజలు నిలవఉన్న గోదాములను) పశువులను, గడ్డిమెట్లను తగలబెట్టారు. ఈ కార్యక్రమాలు సమర్థించని వారిని క్రూరంగా ఖూనీ చేశారు. నల్గొండ జిల్లాలోని హుజూరునగర్, మిర్యాలగూడ తాలూకాలలో ఉద్యమాలు నిర్వహిస్తూ అజ్ఞాతవాసంలో దాగి ఉన్న కమ్యూనిస్టులు ప్రత్యామ్నాయ ప్రభుత్వ పరిపాలన కూడా ఏర్పాటు చేసినట్లు వార్తలు వచ్చాయి తెలంగాణాలో విప్లవజ్వాలలు చెలరేగాయి భారత సైన్యం ఈ ప్రాంతాన్ని తన వశంచేసుకొన్నది. అందుచేత అది అనేక కాల్పులు, ఎదురు కాల్పులతో దృశ్యమానమైన రణరంగమైంది. ప్రజలలో ధైర్యము నిబ్బరం నశించి భయభ్రాంతులైనారు ఆ ప్రాంతాలనుంచి వచ్చిన నా సహకార్యకర్తలు హృదయ విదారకమైన అనేక సంఘటనలు వివరంగా చెప్పారు. పట్టపగలు మిలిటరీవారి జులుమువల్ల భయమూ రాత్రి కమ్యూనిష్టుల దాడి భయమూ వారిని భయకంపితులగునట్లు కావించాయి. ప్రజలు మానవులము అన్న విషయాన్నే మరచి అధోగతికి దిగజారిపోయారు. నల్గొండనుంచి వచ్చిన మిత్రులు కొందరు ఈ పరిస్థితుల్లో నేను అక్కడకు వెళ్ళి ఆ ప్రాంతంలోనే నివసించాలని, అందువల్ల ప్రజ

లకు మనోధైర్యం తిరిగి వస్తుందని విశ్వసిస్తున్నామనీ చెప్పారు. ఆ ప్రాంతంలో అడుగుపెట్టడానికి ఎవరికీ సాహసంలేదని కూడా చెప్పి, నేను అక్కడకు వెళ్ళి ఉండాలని నిశ్చయిస్తే తమలో కొందరు నన్ను అనుసరిస్తామనికూడా చెప్పారు. నేను అక్కడకు వెళ్ళేటందుకు నిశ్చయించాను [illegible] ఊరి బైటనైనా, మా బృందం అంతా ఉండే టందుకు ఒక కుటీరము నిర్మించవలసిందని కోరాను. అది పూర్తికాగానే నేను నా నిశ్చయాన్ని భారత ప్రధానికి తెలిపి నా మకాము పల్లెపల్లెకి మార్చాను.

ఆ పరిసరాల్లో ప్రజాజీవితం స్తంభించిపోయి ఉంది. సేద్యపు పనులుకూడా అన్నీ ఆగిపోయాయి దగ్గరే గూడెంలో ఉన్న పల్లె ప్రజలు మాకు సాయంకాలం నాలుగు గంటలకు ఏటినుంచి నీరు తెచ్చి ఇచ్చి, ఆ తర్వాతనే తమ తమ ఇండ్లకు పోయేవారు. దేవాలయంలో ఉత్సవాలు మానివేశారు ప్రజల చూపుల్లో భయం తాండవిస్తోంది. ఆ పరిస్థితుల్లో ఏంచెయ్యడమో నాకేమి తోచలేదు. ఆ ప్రాంతంలో డ్యూటీలోఉన్న మిలిటరీ కమాండరు, బహుశా తనపై అధికారులనుంచి వచ్చిన తాఖీదుల ననుసరించి వచ్చాడో ఏమో నన్ను కలుసుకొని నాకేమైనా రక్షణ ఏర్పాట్లు కావాలా అని అడిగాడు. అవేమీ అక్కరలేదని చెప్పి నా దారిని నన్ను నా ప్రజలతో వదిలివేయమని కోరాను. వారి రక్షణలో నేను సురక్షితంగా ఉన్నాననీ, భగవదిచ్ఛ మరో రీతిగా ఉంటే ఎవ్వరు ఎంత కృషి చేసినా నన్ను మరేదీ రక్షించలేదని చెప్పాను

మేము రెండు రోజులు కుటీరంలోనే గడిపి, ఆ తర్వాత ఇటూ అటూ సంచారం చేయాలని నిశ్చయించాము. పగలు, సమీపంలోఉన్న ఏదో ఒక గ్రామాన్ని సందర్శించి, సాయంత్రానికి తిరిగి మా చోటు చేరుకునేవాళ్ళము. మా భోజనానికి ప్రజలపైన ఆధారపడటం మంచి పని కాదని అనుకున్నాము అందుచేత పొద్దున్నే ఉపాహారాన్ని తీసుకొని మరీ బైలుదేరే వాళ్ళము కాని ప్రయాణ సదుపాయం విషయము సమస్య అయింది నేను, నా అపిటీతనంవల్ల నడవలేని స్థితిలో ఉన్నవాళ్ళ

ఒకరు, తమ ఎడ్లబండినీ ఎడ్లనూ ఇస్తామన్నారు. కాని, బండితోలేటందుకు ఎవరూ ముందుకు రాలేదు. నా కార్యదర్శి, శ్రీ దామోదర్ ఆపని చేపట్టాడు మా బృందంలో ఐదుగురం ఉన్నాము. నల్లగొండ జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు, కాంగ్రెసు నాయకులలో సీనియరు అయిన శ్రీ ఉమ్మెత్తల కేశవరావు ఆ రోజుల్లో నాకు తోడు నీడవంటి వాడైనాడు. తెలంగాణా రైతాంగానికి సేవ చెయ్యాలనే హృదయ పూర్వకమైన భావావేశము ఆయనలో వ్యక్తమై నన్ను ముగ్ధుణ్ని చేసింది. ఆయన అనుచర వర్గంలో ఎందరో యువకులున్నారు అయన తమ హితాభిలాషి అని (మంచికోరే వాడని) సామాన్య ప్రజలు గుర్తించారు.

మేము మా కార్యక్రమానికీ జీవిత విధానానికి ఒక పద్ధతి ఏర్పాటు చేసుకొన్నాము ఏ గ్రామంలోనైనా మేము ప్రవేశించగానే చుట్టూ విశాలమైన స్థలం ఉన్న చెట్టుసీడలో కూర్చునేవాళ్ళము. మేము కూర్చుండేటందుకు మాతోటి మా కంబళ్లు తీసుకొనిపోయి వాటిని పరచుకొని కూర్చునేవాళ్ళము మేము ఎవరింటికీ వెళ్ళేవాళ్ళము కాము అట్లా వెళ్ళి ఉంటె మేము వాళ్ల తరఫు మనుష్యులమని, మమ్మల్ని మాకు ఆతిధ్య మిచ్చిన గృహస్థుల్ని ఒక వంక మిలిటరీ అధికారులు మరొక వంక కమ్యూనిష్టులూ జమకట్టి మమ్మల్ని అనుమానించడమో మాకు దూరం కావడమో జరిగేది. మేమట్లా కొంతసేపు కూర్చున్న తరవాత గ్రామంలోని ప్రజలు ఒకరి తరవాత ఒకరుగావచ్చి చేరేవారు. వారితో మేము స్నేహభావంతో వారి కష్ట సుఖాలు పరిస్థితులు గురించి అడిగేవాళ్ళము వాళ్ళు ముందు జంకేవారు. తర్వాత పొడిమాటలతో అసలు విషయం తెలిసేట్లు ఒకరొక మాట దానికి జతని మరొకరు ఇంకోమాట ధోరణిలో చెప్పేవారు

ఒక పదిహేను రోజులపాటు మేము ఈ ప్రాంతంలో ఈ రీతిగా వ్యవహరించిన తర్వాత మాకు అసలు పరిస్థితుల నిజస్వరూపము కొంత కొంత బోధపడింది అంతవరకు నిర్జీవంగా ఉన్న ప్రజలలో కొంత జీవం

కనిపించసాగింది వారు క్రమక్రమంగా ధైర్యం తెచ్చుకోనడం ప్రారంభించారు నేనుకూడా వారితో ఎప్పుడు మాట్లాడినా వారిని కమ్యూనిష్టులకు గాని మిలిటరీ వారికి గాని భయపడకూడదని ఉద్బోధించ సాగాను ప్రభుత్వంతో జరుగుతున్న ఈ సాయుధ పోరాటంపట్ల మీకు విశ్వాసం లేకపోతే, మీ దౌర్జన్య విధానాలతో మేము ఏకీభవించటంలేదని, మీకు ఆశ్రయమివ్వలేము మేము అనుమానితులమై మిలిటరీవారి ఆగ్రహానికి గురి (పాత్రులము) కావాలనీ కోరటంలేదు, అనీ కమ్యూనిష్టులతో స్పష్టంగా చెప్పండి మీరు కమ్యూనిష్టులకు ఆశ్రయం ఇవ్వకుండా ఉంటే మిలిటరీ ప్రభుత్వము మాదైనందిన జీవితానికి ఎంతమాత్రము అడ్డం రాదు." ఇవీ నేను వారితో చెప్పిన మాటలు. వారికి క్రమక్రమంగా నా మాటల [illegible] ర్భంలో తెలంగాణా పరిస్థితుల ప్రత్యేకత, విశిష్టత గురించి ముచ్చటించడం అసందర్భంగా ఉండదని భావిస్తున్నాను. గ్రామీణ యువకులైన కమ్యూనిష్టులు విద్యావంతులై మంచి సామర్థ్యం ఉన్న నాయకుల నాయకత్వం కింద పనిచేస్తూ ఉండటం చూసిన రైతులు వారు తమ్ము భూస్వాముల దాస్యంనుంచి విముక్తి చెయడానికి అవతరించిన రక్షకులనే భావించసాగారు అంతేకాని వారికి జాతీయ అంతర్జాతీయ కార్మిక పోరాటాలు దానికోసం రూపొందించిన వ్యూహరచనా రీతులు, ఏమీ తెలియవు ప్రజలకు అవన్నీ అర్థం చెసుకొనేటందుకు అవసరమైన జ్ఞానం ఎంతమాత్రమూ లేదు అందుచేత వారు అజ్ఞానంలో మునిగి ఉన్నారు

తాము గొప్ప ఆపదలో మునిగి ఉన్నప్పుడు కమ్యూనిష్టులు తమకు ఆసరాగా నిలబడి, సాయంచేసి తిరిగి తలెత్తుకొని తిరగ గలిగేటందుకు తోడ్పడినారన్న కృతజ్ఞతా భావమే ప్రజలు వారిని తమవారుగా భావించడానికి తగినంత కారణమైంది మిలిటరీ ఆఫీసర్లలో కొందరు సీనియరు అధికారులు తమ కర్తవ్య నిర్వహణ చాలా కష్టనిష్ఠురాలతో మానసిక పరిస్థితుల ప్రాబల్యం కల్పించే అవరోధాలతో కూడి ఉన్నదని చెప్పారు అవును, రైతులు తమకు లాభదాయకమైన కార్యక్రమాలు నిర్వహించిన

ఉపకార పరాయణులను తమకు నిజమైన మిత్రులని నమ్మినవారిని, ఏ కారణాలు పురస్కరించుకొని మిలిటరీ నాయకులకు అప్పగిస్తారు ? చాలాచోట్ల, మిలిటరీకూడా అత్యంత క్రూర హింసలు చేసింది. అనేక మంది యువకులను, కసితీర్చుకొనే చర్యలుగా కాల్చి చంపారు. రెండు వర్గాలవారూ అనేక విషాద గాథలు చెప్పారు నేను సందర్శించిన ఒక గ్రామంలో నాకు స్త్రీలు, పసిపిల్లలు, ముసలివారు మాత్రమే కన్పించారు 'ఏమిటిదీ ?' అని నేను అడిగితే గత కొన్ని మాసాలుగా మిలిటరీవారు జబ్బ సత్తువఉన్న గ్రామీణులందర్నీ ఆ గ్రామానికి రెండు మైళ్ళ దూరంలో ఉన్న మిలిటరీ క్యాంపు నిర్బంధంలో ఉంచుతున్నారనీ వారు కమ్యూనిస్టులకు ఆశ్రయ మివ్వకుండా వారితో కలిసిపోకుండా ఆపేటందుకు ఈ ఏర్పువేసినట్లు భావిస్తున్నామనీ చెప్పారు. అక్కడ గస్తీ ఉన్న మిలిటరీ యూనిట్ కమాండర్‌ను అడిగితే ఇది 'కమ్యూనిస్టు గ్రామం' అని జవాబు చెప్పాడు. 'గ్రామానికి గ్రామం అంతా కమ్యూనిష్టులెట్లా అయారు' అని నేను ఆయనను ఆ తర్వాత అడిగాను మిలిటరీ మనిషి దగ్గరనుంచి ఆ ప్రశ్నకు జవాబు రాబట్టుకోవడము నిష్ఫలము మరొక గ్రామంలో ప్రజలు నన్ను చూడగానే అందరూ నాచుట్టు మూగి వలవల ఏడ్వసాగారు వారిని ఓదార్చి 'ఏమి జరిగింది?' అని అడగగా వారు తమ గ్రామానికి చెందిన నలుగురు యువకులు అరెస్టయారని చెప్పారు.

ఆ విషయాన్ని సి.ఐ.డి. వాకబు చెయ్యగా ఆ యువకులొక గూర్ఖా సైనికుణ్ని కాల్చి చంపినట్లు నేరారోపణ జరిగిందని వారిని కాల్చిచంపడం జరుగుతుందనీ తెలిసింది. కమ్యూనిస్టుల ఘాతుక కృత్యాలు కూడా అంత క్రూరంగానూ ఉన్నాయి. పదిమంది మెనిలేచోట పట్టపగలే కమ్యూనిస్టు గొరిల్లాలు కాల్చి చంపిన మనుషుల శవాలుపడి ఉండటం చూశాను. ఆ హతులు కమ్యూనిస్టుల చర్యలను ఆమోదించనివారై ఉంటారు. ఎవరికి వ్యతిరేకంగా ఈ ఉద్యమం ప్రారంభమైందో ఆ ఘనస్వాములు దూరంగా రాజధాని నగరంలో సురక్షితంగా ఉన్నారు. కమ్యూనిస్టుల

అడుగుజాడలలో నడవడానికి ముందుకు రానటువంటి సామాన్య జనులే హింసలకు, దోపిడీలకు, గృహ దహనాలకు, హత్యలకు గురికావడం జరిగింది. ఒక గ్రామంలో ఒక వృద్ధని ఇద్దరు కొడుకులనూ, యువకులైన వారిని, స్థానిక కమ్యూనిష్టు నాయకుడి ఆజ్ఞలను పాలించలేదనే సాకుతో కాల్చి చంపడం చూశాను. అట్లా ఘాతుక చర్యలకు గురియై మరణించిన వారి శవాలకు సగౌరవంగా మతానుసారంగా సంస్కారాలు జరిగేటట్లు శ్రద్ధ వహింపడము మా బృందంలోని వారు నిర్వహించిన ముఖ్యమైన పనులలో ఒకటి ఆ శవాల దగ్గరకుపోవడడానికి కూడా ఎవరూ సాహసించలేదంటే ఈ పనిలోని ప్రాధాన్యం వెల్లడి అవుతుంది.

పరిస్థితి ఎంత విషాదకరంగా ఉందో వెల్లడించేటందుకే ఈ కొద్ది ఉదాహరణలూ వివరించాను ప్రతివారమూ ప్రధాన మంత్రికి నా అనుభవాలను నివేదికల రూపంలో పంపించేవాణ్ని. ఆవిధంగా ఈ పరిస్థితి కొనసాగి, చివరకు మామూలు పరిస్థితులు ఏర్పడ్డాయి కమ్యూనిష్టులు తాము గురితప్పి వ్యవహరించినట్లు గుర్తించారు, వారు తమ ఉద్యమం సామాజిక వ్యతిరేక శక్తుల చేతుల్లోకి జారిపోయినట్లు గ్రహించారు. అందువల్ల వారిలో యుక్తాయుక్తాలెరిగినవారు ఆత్మవిమర్శ చెసుకొన్నట్లు కన్పించింది తర్వాత వారు లాంఛనప్రాయంగా ఉద్యమాన్ని విరమిస్తున్నట్లు ప్రకటించాలని నిర్ణయించాడు గ్రామస్థులుకూడా అప్పటికి కమ్యూనిష్టుల ఆలోచనా సరళిని, వారి ఎత్తుగడలను గ్రహించి, వారిని గుడ్డిగా అనుసరించడం మానివేశారు యథార్థం చెప్పాలంటే ఉద్యమం విఫలమైంది కమ్యూనిష్టులలో చిన్న స్థాయిలోఉన్న నాయకులు నా సహచరులను రహస్యంగా కలుసుకొని ప్రభుత్వ వైఖరిలో మార్పువచ్చేటట్లు వాదించవలసిందని అభ్యర్థనలు చెయడంకూడా జరిగేది చిట్టచివరకు కమ్యూనిష్టు పార్టీమీద ఉన్న నిషేధాన్ని తొలగించడము, మొదటి సార్వత్రిక జనరల్ ఎన్నికలలో వారు పాల్గొనే అవకాశం లభింపజేయడమూ [illegible]

ఈ అధ్యాయాన్ని ముగించేటందుకు ముందు కమ్యూనిష్టు పార్టీ తెలంగాణా శాఖ ప్రచారం చేస్తూన్న ఒక భ్రమనూ అది ఎంత అసం

దర్భమైనదో అనే సంగతినీ వివరించవలసిన ఆవశ్యకత ఉన్నట్లు భావిస్తున్నారు భూస్వాముల భూములు భూమి ఎంతమాత్రములేని వ్యవసాయ కూలీలకు పంచిపెట్టినట్లుగా వారు చెప్పకొంటున్నారు అది నిజంకాదు. చాలా సందర్భాలలో వారు తమ చెప్పుచేతులలో ఉండి తమకు మద్దతు ఇచ్చిన వారికే భూములు పంచిపెట్టారు నా పర్యటనలలో అట్లాంటి సంఘటన లెన్నో నా కండ్లపడ్డాయి అసలు జరిగింది ఏమిటంటే జమీందార్ల సొంత భూముల్ని రైతులు తమ ప్రాంతీయ కమ్యూనిష్టు యూనిట్ల సూచనలు, ఆజ్ఞలు, ప్రోద్బలం మూలంగా అక్రమించుకొని సేద్యం చేశారు. ఈ అభిప్రాయాన్ని నేను, రాష్ట్రపతి సందేశంపైన మొదటి లోక్ సభలో జరిపిన ప్రసంగంలో వెల్లడించడం కూడా జరిగింది. శ్రీ రావి నారాయణరెడ్డి మిలిటరీ పరిపాలన చర్యలు రైతులకు పీడాకరంగా పరిణమించాయని పేర్కొని వాటిపై న్యాయ విచారణ జరిపించాలని అభ్యర్థించారు. ఆ సందర్భంలో, కమ్యూనిష్టు పార్టీ అవలంబించిన జాతీయతా వ్యతిరేకపు ధోరణులను లోక్‌సభ [illegible] కనువిప్పు కలుగునట్లుగా వివరించి, యధార్ధం స్థాపించవలసిన కర్తవ్యం నా పాలబడింది. ఈ ఉద్యమం భూమికోసం రైతలు లేవదీసిన తిరుగుబాటు అంటూ తెలంగాణా కమ్యూనిస్టులు నొక్కిచెప్పి మొదటినుంచీ ప్రచారంచేస్తూ ఉన్నారు కానీ, అది పూర్తిగా అబద్ధము. తెలంగాణాలో ఆనాడున్న ప్రత్యేక పరిస్థితులను అవకాశంగా గ్రహించి, కమ్యూనిస్టుపార్టీ తన రాజకీయ ప్రయోజనాలకు అనుకూలంగా మలచుకొనేటందుకు జమీందార్ల భూములన్నీ [illegible] రైతులకు వాగ్దానం చేసింది. క్రమక్రమంగా ఆ వాగ్దానంలోవున్న ఆసందర్భాన్ని అందరూ గుర్తించడం జరిగింది.

తెలంగాణాలోవున్న ముఖ్యమైన సమస్య రైతుకి భూమికి సంబంధించిన సమస్యే జమీందార్లు కొనసాగిస్తున్న విపరీతమైన దోపిడీ వేరే రైతులపైన కమ్యూనిస్టుల ప్రభావం పడేటందుకు అనుకూలమైన ఆధారమైంది. వారిని, దానినుంచి తప్పించాలంటే భూమి సమస్యను సూటిగా

ఏ మాయామర్మమూ లేకుండా పరిష్కరించడం ఒక్కటే ఏకైకమార్గము. కమ్యూనిష్టులపై నేరం మోపడంవల్ల ఏమీ ప్రయోజనం లభించదు. రైతుల చేతుల్లో ఏదైనావడే పరిష్కార విధానంచూడాలి. అందుచేతనే నేను హైదరాబాదు సంస్థానంలో మొట్టమొదటి ప్రజాప్రభుత్వ మంత్రివర్గము ఏర్పాటు కాగానే, భూసంస్కరణలు చట్టబద్ధం చేసి తీరాలని పట్టుపట్టాను. పండిట్ జవహర్లాల్ నెహ్రూకీ ప్లానింగ్ కమిషన్ సభ్యులకు ఆ కార్యక్రమం ఎంత అత్యవసరమైందో ఎంత ఎక్కువ ముఖ్యమైందో నచ్చచెప్పే ప్రయత్నం చేశాను. వారు పరిస్థితిని చక్కగా అవగాహన చేసుకొన్నారు, ఆవశ్యకతను గుర్తించారు. శ్రీ గుల్జారిలాల్‌నందా, శ్రీ ఆర్. కె. పాటిల్‌లు భూసమస్యలను పరిశీలించిన నిపుణులతో కలిసి హైదరాబాదు వచ్చేసి మాలో కొందరితో చర్చలు జరిపారు. వాటి ఫలితంగా చివరకు భూకమతాలకు గరిష్ఠ పరిమితిని చట్టబద్ధం చేయడానికి నిర్ణయం జరిగింది

ఆ చర్చలలో పాల్గొన్న నాయకులలో కొన్ని వర్గాలవారు ఇట్లాంటి చట్టం చెయ్యడమే తా మొప్పుకొనకూడదని భావించి, దానికి అడ్డంకులెన్నో చూపించారు. కాని, సుదీర్ఘమైన చర్చల తర్వాత తుది నిశ్చయం తీసుకొనడం జరిగింది. అయితే ఈచట్టం తీర్మానం కావాలని నిర్ణయించిన నాటినుంచి అవి అమలులోకి వచ్చేవరకూ కొన్ని నెలల కాలం గడచింది. భూకమతాలకు గరిష్ట పరిమితులు నిర్ణయించడంలో హైదరాబాదు సంస్థానం మొదటిదై ఇతర రాష్ట్రాలన్నింటికీ దారి చూపిన కీర్తి వహించింది. కాని, చెట్టం చెయ్యడంతో కనిపించిన పట్టుదల దాన్ని అమలు చేసే కార్యాచరణలో వ్యక్తం కాలేదు.

లంబాడీ తండాలు సైనికుల దౌర్జన్యాలకు ప్రత్యేక లక్ష్యాలైనాయి. ఈ తాండాలు ఇక్కడా అక్కడా పలచపలచగా ఆయా ప్రాంతాల్లో చెదిరి ఉండటమువల్ల అవి రహస్య జీవనం గడపుతూవున్న కమ్యూనిష్టుల సమావేశాలకు, చర్చలకు అనుకూలమైన స్థావరాలుగా ఉన్నాయి. లంబాడీలు కమ్యూనిష్టులకు రక్షణ కల్పిస్తున్నారనీ, వారి హింసాయుత

చర్యలకు మద్దతు ప్రోత్సాహం ఇస్తున్నారనీ కూడా అనుమానించారు. ఈ లంబాడీలు ఏమీ తెలియనివారు వారు సంచార జాతి అయినప్పటికి ఉండకుండా ఒకచోట స్థిరపడి, సేద్యం చేసుకొంటూ ఉన్నారు. లంబాడీలు పశువులనుకూడా శ్రద్ధగా పెంచుతున్నారు వారుమంచిరైతులు, వారిలో కొంతమంది సంపన్నులు బాగా ఉన్నవారు సంప్రదాయ సిద్ధమైన తమ ప్రత్యేక సంస్కృతిని, సామాజిక కట్టుబాట్లను సాంఘిక నిర్మాణాన్ని శ్రద్ధగా రక్షించుకొంటారు ప్రతి తాండాకి ఒక నాయక్ లేదా పెద్ద ఉంటాడు. తాండాలోని వారి నడుమ ఏదైనా విభేదంవస్తే ఆనాయక్‌దే తుదిమాట తీర్పు. ఆయనే కుల పెద్ద, అంటే తాండాలో వున్న వారందరికీ పెద్ద తాండా వ్యవహారాలన్నీ కుల గౌరవానికి తగినట్లు తీర్మానం చేస్తారు తాండాలోని వారందరికి కొన్ని కారణం తెలియని నమ్మకాలు (మూఢ విశ్వాసాలు) న్నాయి రాత్రి వేళల్లో పిశాచాలు తిరుగుతూ దీపం ఉన్న చోటికి వస్తాయని లంబాడీలు నమ్ముతారు. అందుచేత వారు రాత్రి దీపం లేకుండా కాలం గడపుతారు సహజంగా అట్లాంటి నివాసాలు కమ్యూనిస్టులు తలపెట్టిన కార్యక్రమాలకు చాలా అనుకూలమైనవని రుజువైంది

నేను ప్రతి తాండా సందర్శించి ప్రజలతో మాట్లాడుతూ చాలా సేపు గడిపాను తాండా చాల చిన్న గూడెంవంటి దైనందువల్ల, పెద్ద, చిన్న అనే భేదం లేకుండా అందరూ వచ్చి నా మాటలు వినేవారు కాని, వారు తమ మనసులో వున్నవి చెప్పడానికి భయపడుతున్నట్లు నేను గమనించాను. అందుచేత వారితో పరిస్థితులు ఎట్లా క్రమంగా మారాయో విపులంగా తీరికగా చెప్పి వారు కమ్యూనిస్టుల గుప్పెట్లోనుంచి తప్పించుకోవలసిన అత్యావశ్యక బాధ్యతను గురించి, నచ్చచెప్ప వలసి వచ్చింది. అట్లా నేను నచ్చచెప్పగలిగితేనే ఆ ప్రాంతం నుంచి మిలిటరీని తొలగించడానికి వీలవుతుంది

అపారమైన మిలిటరీ బలం, తన కఠిన ముష్టి బంధంతో తాండాలలో వున్నవారిని బాధించింది. తాండాలను వున్న చోటి నుంచి మార్చి

గ్రామ పరిసరాల్లో ఎక్కువమందితో కలిసి జీవించేటట్లు పునరావాసం చెయ్యడం కమ్యూనిస్టుల బాధకు ఒక విరుగుడు మార్గం అని మిలిటరీ పాలకులు భావించారు. వెంటనే ఆ సంబంధమైన ఆజ్ఞలు జారీ అయినాయి. లంబాడీలు తాము వున్నచోటు వదలి కొత్త చోట్లకు కదలవలసి వచ్చింది. అప్పుడు వారి కెదురైన బాధలు, సమస్యలు లెక్కించడానికి వీలుకాదు. అనుకూలమైన వాతావరణము, చాలినంత మంచినీటి వసతి, పశువులను మేపడానికి వచ్చిక భూములు వున్నచోటు వదలి కొత్తచోట్ల కొత్త పరిస్థితులకు అలవాటు పడటం వారికి ఎంతో కష్టమైంది. కొత్త చోట్లలో జీవితావసరాలు ఏమీలేవు. త్రాగే మంచినీరు తెచ్చుకొనడం కూడా సమస్యే అయింది. అందుచేత వారు ఎన్నో రోగాల పాలయారు. వందల కొద్దీ పిల్లలూ, ముసలివారూ మరణించారు. వారి పశువులు కూడా రోగాల పాలయాయి. అందుచేత ఎటుచూసినా కన్నీరు, వెక్కిళ్ళు. ఏ తాండాలోకి వెళ్ళినా మిలిటరీ సైనికులు, కమ్యూనిస్టులు, చేసిన దురాగతాలు కళ్ళబడేవి. అప్పుడు జరిగిన సంఘటన ఒకటి వివరించడం అవసరమని భావిస్తున్నాను. అప్పుడు సాయంకాలం అవుతోంది. నేను ఒక పెద్ద తాండాకు వెళ్ళాను. దానికి, కమ్యూనిస్టుల ఇనపకోట అనీ కమ్యూనిస్టు ఉద్యమానికి పట్టుగొమ్మ అనీ, పేరుంది. ఆ రాత్రి అక్కడే గడిపాలని నా ఉద్దేశం. వారు ఆ రోజు పండుగ యేర్పాటు చేసుకున్నారు. గత రెండు సంవత్సరాలలోనూ యెప్పుడూ ఏ రోజూ సంతోషంగా గడపలేదని చెప్పి పండుగ చేసుకొంటున్నామని అన్నారు.

మిలిటరీ అధికారులు రాత్రివేళ మంట వెయ్యకూడదని నిషేధించారు. అందుచేత వాళ్ళకు అత్యంత ప్రీతి పాత్రమైన సంగీతం, నాట్యం మానుకోవలసివచ్చింది. స్త్రీలు కూడా తమ పాత వినోద కార్యక్రమాలు పునరుద్ధరించాలని గాఢంగా కోరుతున్నట్లు చెప్పారు. కొంత తీవ్రంగా ఆలోచనలుచేసి, దగ్గరనే వున్న మిలిటరీ అధికారితో లంబాడీల కోర్కెను నేను మన్నిస్తున్నానని వారి పండగ వినోదాలు కొనసాగుతాయని వార్త చెప్పి పంపించాను. ఆ రాత్రి నేనక్కడే వుంటానని ఉదయం అయిన

తర్వాతనే వెడతాననీ కూడా చెప్పాను. ఆ మాట వినగానే వారి సంతోషం కట్టలు లేకుండా విజృభించింది. నాకు వారి ఆటలు పాటలు కార్యక్రమంలో ప్రత్యేకంగా ఆసక్తి లేకపోయినా ఆ మూలాగ్రం అది చూడ వలసివచ్చింది. వ్యక్తిత్వము, ప్రదర్శనా చాతుర్యము, రంగస్థల మర్యాద మెప్పు కలిగించాయి. ఎంతో సంతోషంతో నేను మరునాడు తాండావదలి వెళ్ళాను.

తర్వాత సుమారుగా అన్ని తాండాల నాయకుల్ని ఒకచోట సమావేశపరచి వారితో చట్టవిరుద్ధమైన దౌర్జన్య చర్యలు, రాజకీయ కుట్రలు సహించడం జరగదని, వాటికి దూరంగావుండి వారు (లంబాడీలు) శాంతియుత జీవితం గడుపుతూ తమ సేద్యము, అనుశ్రుతంగా చేసుకుంటున్న వృత్తులు చేసుకోవచ్చునని హితోపదేశం చేశాను. అట్లాగే అని వారు అంగీకరించారు. క్రొత్తగా వలసపోయిన ప్రాంతాల నుంచి తిరిగి వారు తమ నివాసాలకు వెళ్ళడం జరిగింది.

వేరే సందర్భంలో గ్రామాల్లో దాగివున్న అనుమానితులైన కమ్యూనిస్టు కార్యకర్తలను పట్టి అప్పగించేటందుకు ముందుకు వచ్చేటట్లు ప్రజలకు నచ్చచెప్పడం కష్టంగా వుందని మిలిటరీ అధికారులు భావించే భావించేవారని నేను చెప్పడం జరిగింది. ప్రజలతో కలిసిపోయి, వారి దైనందిన సమస్యలు అవగాహన చేసుకొని వీలైనంత సమర్థవంతంగా వాటిని పరిష్కారం చేసుకొనేటందుకు వారికి తోడ్పడుతూ భారత కమ్యూనిస్టు పార్టీ తెలంగాణా శాఖ రైతులకు ఎంతో గాఢమైన సేవ చేసింది. అందువల్ల గ్రామప్రాంతాలలో వారికి స్థిరమైన స్థావరం లభించింది. ప్రజాసామాన్యంలో కమ్యూనిస్టు పార్టీపట్ల కృతజ్ఞతా భావం పాతుకొని పెరిగింది. తమ్ము ఆదుకొనేవారెవరూ లేని కష్ట సమయంలో పక్కన నిలబడి వారని తమవారని గుర్తింపదగినవారని, ప్రజలనుకోవడం అత్యంత సహజం. కమ్యూనిస్టు కార్యకర్తలు కూడా కమ్యూనిస్టు సిద్ధాంతాలను జీర్ణం చేసుకొని, క్రమశిక్షణ పాటిస్తూ ప్రజలలో ముందుకు చొచ్చుకొనిపోతూ పనిచేసేవారు. తెలంగాణా సాయుధ పోరాటానికి

ముందు వారితో ముచ్చటించేటందుకు అవకాశం కలిగినప్పుడల్లా, వారికి స్థానిక జాతీయ సమస్యలను గురించి మంచి అవగాహన ఉందని నేను గమనించాను. వారందరు సునిశితమైన ప్రజ్ఞ, పాండిత్యం కలవారు. కాంగ్రెసు తెలంగాణా ప్రాంతంలో ప్రజలలోకి చొచ్చుకొని పోవలసిన అవసరము, పరిస్థితి ఇప్పటికీ అట్లాగే మిగిలి ఉన్నాయి. ఉద్యమ ప్రారంభ దశలో కాంగ్రెసుకు చెందినవారము అని చెప్పుకొనే వారందరూ గ్రామాల లోని యథార్థ పరిస్థితుల నెదుర్కొనేటందుకు కావలసిన గుండె ధైర్యము సాహసములేనివారనే అనాలి. అందుచేత అసలైన కాంగ్రెసు కార్యకర్తలు ఇంకా రావలసేఉంది. కొత్త నాయకత్వం క్రమక్రమంగా అంకురిస్తోంది. 'క్విట్ ఇండియా ఉద్యమం' కాంగ్రెసు సిద్ధాంతాల ననుసరించి తెలంగాణాలో పని చేస్తున్న ప్రగతిశీల కార్యకర్తల ఆలోచనలకు కొత్త జీవం ఇచ్చింది. వారి ఆవిర్భావంతో కాంగ్రెసు సంస్థ ఒక రూపం ధరించి ఆతర్వాతి కాలంలో (నెలల్లో) ప్రజలపై జరిగిన కమ్యూనిస్టు దాడుల్ని ఎదిరించడము, కమ్యూనిష్టు పార్టీ ప్రభావం నుంచి ప్రజల్ని తప్పించడము చేయగలిగింది.

ఈ స్థాయిని సాధించేటందుకు ప్రగతి శీలమైన సాంఘిక ఆర్థిక సిద్ధాంతాల అవగాహన అవసరమైంది. ఆ సిద్ధాంతాలు తరతరాలుగా దోపిడీకి గురి అయిన రైతాంగానికి విముక్తి కలిగించేటటువంటివై ఉండాలి. హైదరాబాదు సంస్థానంలో ఎక్కువ మేర వ్యాపించివున్న తెలంగాణాలో ప్రత్యేక పరిస్థితి ఉంది. అక్కడ సూటిగా ఎదుర్కొనవలసిన విషమ సమస్యలున్నాయి. వాటి పరిష్కారానికి ఒక పథకం ప్రకారం అర్జంటుగా నిర్వహించవలసిని కార్యక్రమం అవసరం. ఉపశాంతి కలిగించే మాటలుగాని, ఆవేశం రెచ్చగొట్టే నినాదాలుగాని నిష్కల్మష హృదయులు నిరాడంబరులు అయిన ప్రజల మనస్సుల కెక్కవు.

వారు కమ్యూనిష్టులు ఉపయోగిస్తున్న విధానాలపట్ల శంకిత స్వాంతులే కాని, వారితోపాటు నేనుకూడా ఉన్నాననే అపుత్తెవరూ

మరొకరు లేడు. ఈ పరిస్థితులలో హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు జెండా నీడను పనిచేస్తూ రైతాంగంమీద అప్పటికే వ్యాపించివున్న కమ్యూనిస్టు ప్రభావాన్ని చాలావరకు తొలగిస్తూ, తమలో తాము ఐకమత్యంతో ఉంటూ పనిచేసే యువకులు కొందరు ముందుకువచ్చి నాయకత్వం వహించారు హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు సామాజిక ఆర్థిక లక్ష్యాలు, ఆ సంస్థ నియమావళి ఆశయాలు రూపొందించిన సందర్భంలో వాటిని ఈ క్రింది విధంగా పేర్కొనడం జరిగింది -

హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు (లక్ష్యము) ఆశయము న్యాయ సమ్మతము శాంతియుతము అయిన విధానాలను అనుసరిస్తూ ఘనత వహించిన నిజాము ప్రభువు ఆధిపత్యం కింద బాధ్యతాయుత ప్రభుత్వాన్ని సాధించడము. అటువంటి ప్రభుత్వము ప్రజలకు అనేక రక రకాల( విధాలుగా సాగుతున్న ) దోపిడీలనుంచి విముక్తి కలిగించేటందుకు అభివృద్ధికి, సుఖశాంతిమయ జీవితానికి, ఆవశ్యకమైన సాధనము ఆ ప్రభుత్వంలో అల్ప సంఖ్యాకులకు సంపూర్ణ రక్షణ ఉంటుంది"

ఇంతకుముందు ఒక అధ్యాయంలో తెలంగాణా ప్రాంతంలో స్టేట్ కాంగ్రెసు సంస్థ నిర్మాణం కృషి చేసిన అగ్రనాయకులను కొందరిని గురించి పేర్కొన్నాను (వ్రాశాను) ఇప్పుడు మరొక కార్యకర్తను గురించి వ్రాయడం అవసరం అని భావిస్తున్నాను శ్రీ పి. వి. నరసింహారావు కార్యకర్తలకు సిద్ధాంతపరమైన అవగాహన ఇవ్వడంలో సహకరించిన మనిషి ఆయన రెండు డిగ్రీలు పొందినవాడు బహు భాషావేత్త ఆనాడు ప్రజలను కలవరపెడుతున్న సామాజిక ఆర్థిక సమస్యలను గురించి క్షుణ్ణంగా తెలుసుకున్న వ్యక్తి. సామాజిక శాస్త్రాన్ని సవిమర్శంగా అధ్యయనం చేసినవాడు తన లాయరు వృత్తిని వదలి స్వాతంత్ర్యోద్యమంలోకి హృదయ పూర్వకంగా దూకినవాడు పోలీసు చర్య పూర్తి అయిన తర్వాత ఆయన హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు కార్యదర్శిగా బాధ్యతలు చేబట్టి యువ కార్యకర్తల వర్గానికి బలం కలిగించాడు. రాష్ట్రం అంతటా కార్యకర్తల శిక్షణకు అధ్యయ

నానికి శిబిరాలు నిర్వహించాలని కృషి చేశాము, ఆ కృషి, హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు కొక ప్రత్యేకత నిచ్చి నిజాము ప్రభుత్వానికి చివరి చావు దెబ్బ కొట్టే శక్తిని సమకూర్చింది

కమ్యూనిస్టుల గురి తప్పింది రైతుల మనస్సు తెలుసుకొనడంలో వారు విఫలులయారు ప్రజలలో కొన్ని వర్గాల - ఆలోచనలు చెయ్యకుండా ఆయుధాలు సప్లయి చెయ్యడం పొరపాటని వారే గుర్తించారు. రైతులకు వారు నూరిపోసి 'పోరాటంలో పాల్గొంటే మీకు భూమి లభిస్తుంది' అన్నదే ఆ భావము. వారి ఉద్యమం గ్రామాలలో ఉన్న సంఘ వ్యతిరేక శక్తుల చేతుల్లోకి పోయింది. అప్పుడు దాడులు, గృహదహనాలు, బందిపోట్లు, హత్యలు, పెద్ద ఎత్తున జరిగాయి సరళహృదయులు, సూటిగా న్యాయంగా వ్యవహరించే సామాన్య ప్రజలు తాము కమ్యూనిస్టుల కుట్రలలో పడి మోసపోయామని గుర్తించి కమ్యూనిస్టు పార్టీ గుప్పిట్లో (పిడికిలి) నుంచి బైటపడ్డారు ఆ తర్వాత వారు కమ్యూనిస్టుల్ని ఎదిరించడానికి కొంత కాలం పట్టడం మాత్రమే జరిగింది తర్వాత జరిగిన సంఘటనలు, కేవలం కమ్యూనిస్టు వ్యతిరేక భావాలు ప్రచారం చెయ్యడంవల్ల రైతులకు నచ్చచెప్పడం సాధ్యంకాదనీ వారి చేతుల్లో పడేది వారికి జరిగేది ఏదో స్పష్టం చెయ్యాలనీ వివరించాయి ఆ తర్వాతి సంవత్సరాల్లో కమ్యూనిస్టుల ప్రభావం తగ్గింది కాని ఒక వంక తెలంగాణాలో భూమి సమస్య సంతృప్తికరంగా పరిష్కరించి, మరొక వంక సామాజిక ఆర్థిక సమస్యల గురించి ప్రగతిశీల లక్ష్యాలతో ప్రజల నడుమ పనిచేసే కార్యకర్తలను ఏర్పాటు చేసినట్లయితేనే కమ్యూనిస్టు ప్రమాదాన్ని తుడిచిపెట్టడానికి వీలు కలుగుతుంది.

ఈ సంఘటనలు జరిగిన కాలంలో తెలంగాణా యథార్థ పరిస్థితిని గురించిన నివేదికలద్వారా పండిట్ జవహర్లాల్ నెహ్రూకి విషయం సమగ్రంగా తెలియచేయడం జరిగింది. పోలీసు చర్య జరిగిన వెంటనే నేను ఆయనకు కమ్యూనిస్టులు జరిపిన సాయుధ పోరాటం ఇమిడి ఉన్న సమస్యలు వివరించాను. ఆయన భూమి సమస్యను పూర్తిగా అర్థం

చేసుకొన్నారు. తెలంగాణా రైతాంగంలో భూమి కావాలనే ఆకలి, తృష్ణ ఎంత తీవ్రంగా ఉన్నాయో అది తీర్చడం ఎంత అవసరమో కూడా ఆయన గుర్తించినట్లు కన్పించింది. పోలీసు చర్య జరిగిన కొంతకాలం తర్వాత ఆయన హైదరాబాదు నగరానికి విచ్చేసినప్పుడు మాలో కొందరము ఆయనతో భూమి సమస్యల గురించి ఉదాహరణ పూర్వకంగా చర్చించినప్పుడు ఆయన కమ్యూనిస్టులు పంపకం చేసిన భూముల సమస్య సమగ్రంగా పరిశీలించవలసి ఉంటుందనీ తొందరపడి ఆ భూములు జమీందార్లకు తిరిగి దాఖలుపరచవద్దనీ (స్వాధీనం చెయవద్దనీ) చెప్పారు. బహుశా ఢిల్లీలోవున్న ఇతర అగ్రనాయకులు, ఉద్యోగులు, అనధికార ప్రముఖులు మరొక తీరుగా ఆలోచనలు చెశారు కాబోలు. పండిట్ నెహ్రూ అభిప్రాయాలు అమలులోకి రాలేదు. భారతీయులలో అత్యున్నత స్థాయికి చెందిన నాయకుడు తన సహచరులలో, ఒక వంక సామాజిక మార్పులను వ్యతిరేకించే కన్సర్వేటివు వర్గంతోటీ, మరొక వంక బ్రిటిషువారు వారసత్వంగా ప్రసాదించిన ఉక్కు చట్రపు ఉద్యోగి వర్గంతోటీ తనకు కలిగిన అభిప్రాయ భేదాలవల్ల సతమతమవుతూ ముందుకు అడుగు వేయలేకపోవడం గమనిస్తే నాకు నిశ్చయంగా ఎంతో విచారం కలుగుతుంది.

తెలంగాణా సమస్యా పరిష్కారానికి నేనిచ్చిన సూచనలలో కొన్నింటిని ఈ క్రింద పొందుపరుస్తున్నాను :-

1. భూమి మీద స్వంతము ఎవరిది అనే సమస్యే తెలంగాణా సమస్య; భూమి సేద్యం చేస్తున్న రైతే ఆ భూమికి సొంతదారు అంటూ వెంటనే అమలలోకివచ్చే ప్రత్యేక అత్యావసర న్యాయచట్టం ప్రకటించాలి. అందువల్ల రైతుకి భూమి తనదనీ తన్ను ఎవరూ దానినుంచి గెంటి వేయలేరనీ నమ్మకం కలుగుతుంది. కమిటీలలో చర్చలు, బిల్లులపై చర్చలు వంటివి కాలయాపనకు కారణాలై అత్యవసర పరిస్థితిలోనున్న రైతుకి ఏ విధమైన తృప్తినీ, ధైర్యాన్ని కలిగించలేవు, కలిగించవు.

2. ఇప్పటి కౌలుదార్ల రక్షణ చట్టాన్ని కచ్చితంగా అమలు చెయ్యాలి అత్యవసర యంత్రాంగాన్ని ఏర్పాటుచేసి, చట్టం ఇచ్చిన రక్షణలను త్రోసిరాజని, తాము సేద్యం చేస్తున్న భూములనుండి అన్యాయంగా తొలగించబడిన రైతుల కేసులను త్వరగా పరిష్కారం చేయించాలి. ఈ సూచనను మేము మిలిటరీ పరిపాలనలో ఉన్న ప్రభుత్వానికి చేశాము వారు దాన్ని సూత్రప్రాయంగా అంగీకరించినప్పటికీ అమలు చెయ్యాలని ఎప్పుడూ ప్రయత్నించలేదు. ఒక సందర్భంలో ఒక తహసీల్దారు భూమినుంచి తొలగించబడిన రైతుకు అనుకూలంగా తీర్పు చెప్పాడు కాని, ఆ భూమిని తిరిగి రైతు స్వాధీనం చేయడానికి వీలులేదనీ, జాగ్రత్త అని దేశముఖ్, పెద్ద ఉద్యోగులు ఆ తహసీల్దారును బెదిరించడం జరిగింది ఈ యంత్రాంగంపట్ల ఎక్కువ విశ్వాసం కలిగేటందుకు అందులో ఉద్యోగులు, ప్రజల విశ్వాసం చూరగొన్న అనధికార ప్రముఖులు, నియమితులై ఉండాలి వారికి కేసులు ఎక్కడ జరిగిన వాటిని అక్కడే తీర్మానం చేసేటందుకు సంపూర్ణమైన హక్కు బాధ్యతలు ప్రసాదించాలి

3 కేవలం అనుమానంవల్ల అరెస్టు చేసిన ప్రజలందరి కేసులను సక్రమంగా విచారణచేసి నేరం చేసినట్లు రుజువులేమీ లేని వారిని వెంటనే విడుదల చేయాలి. ఒక ఉద్యోగి, ఒక కాంగ్రెసు కార్యకర్త, పరిస్థితినీ పరిసరాలను, నేరారోపణ జరిగిన వారిని స్వయంగా తెలిసిన పెద్ద మనిషి, విచారణ కమిటీ సభ్యులుగా ఉండాలి

4 గ్రామాలలో ఆర్థిక వ్యవస్థ గత కొన్ని మాసాలలో బాగా దెబ్బ తిన్నది. అందువల్ల అవసరమైన సందర్భాలన్నింటిలోనూ తక్కావీ అప్పులు పంపిణీ చెయ్యాలి

5 వ్యవసాయ కూలీ ఏ వృత్తిపనీ లేకుండా నిర్వ్యాపారిగా ఉన్నాడు అతనికి పొట్టగడిచే దారిలేదు అట్లాంటి వారికి రోడ్లు, చెరువులు మొదలైన నిర్మాణపు పనులలోను అట్లాంటివే అయిన ఇతర పనుల లోనూ, పనులు ఇచ్చి వ్యవసాయపు పనులు దొరకని కాలంలో ఆకలితో మాడిపోకుండా బ్రతికేటట్లు చర్యలు తీసుకోవాలి

# 36. శాంతిదూత వినోబాజీ

తెలంగాణాలో వ్యాపించిన హింసాత్మక వివరాలు, ఆచార్య వినోబాభావేకి అందాయి. ఆయన మనస్సుకి ఎంతో కలత కలిగింది తెలంగాణా రైతుల పరిస్థితిని గురించి ఆయన మనస్సు, హృదయము సంక్షుభితమయాయి ఈ అశాంతికి మూల కారణము వ్యవసాయదారుల ప్రాథమిక సమస్యలేనని, ఆయన అర్థం చేసుకున్నారు ఈ పరిస్థితిని, కమ్యూనిస్టులు తమ ప్రయోజనాలకు అనుకూలంగా మలచుకొన్నారు ఈ సమస్యకు అసలైన పరిష్కారం, తప్పుదారి పట్టిన రైతు కూలీల్ని విద్రోహులని భావించి పగతీర్చుకొనే లక్ష్యంతో కొనసాగించే మిలిటరీ చర్యలవల్ల లభించదు ఆ పద్ధతివల్ల ప్రజలలో నిరాశా నిస్పృహలు మరింత వ్యాపించడము, ఆ పరిస్థితిలో వారు మరణానికిగాని, సర్వనాశనానికిగాని వెనుకాడకుండా తెగించి మరింత హింసావాదులు కావడం మాత్రమే జరుగుతాయి. అందుచేత, ఈ సమస్యకు శాంతియుతమైన పరిష్కార విధానం ఒకటే తరణో పాయము. అప్పుడే ప్రజలను కమ్యూనిస్టు ప్రభావాన్నుంచి మళ్ళించ గలుగుతుంది. ఈ క్లిష్ట పరిస్థితులలో ప్రజలకు ఆశాజనక మైనటువంటిదీ విశ్వాసం కలిగించేటటువంటిదీ అయి, వారికి తరణోపాయంగా పరిణ మించే దారి చూపించడం అవసరమైన కర్తవ్యము ఈ రీతిగా ఆయన ఆత్మభావ మథనం చేసుకొంటూ అఖిల భారత సర్వోదయ సమ్మేళనం సందర్భంలో 'శివరాంపల్లి' (హైదరాబాదు) వచ్చారు. ఆ వచ్చిన వినో బాజీని, మేము తెలంగాణా ప్రాంతంలో పర్యటించవలసిందనీ ప్రజలను స్వయంగా కలుసుకొని, ముఖాముఖిగా వారితో ముచ్చటించవలసిందనీ

కోరాము. ఆయన మా విన్నపానికి ఆమోదం తెలియజేయడానికి ముందు ప్రాతిపదికగా హైదరాబాదు సెంట్రల్ జైలులో నిర్బంధంలోఉన్న కమ్యునిష్టు కార్యకర్తలతో సంభాషించి వారి అభిప్రాయాలు తెలుసుకొన వలెననే కోరిక వెల్లడించారు దానికి ఏర్పాట్లు జరిగాయి అప్పుడు వినో బాజీ కమ్యునిష్టు కార్యకర్తలలో నిగ్గుతేలిన గట్టివారినే కలుసుకొన్నా రని నాకు జ్ఞాపకము వారి నడుమ జరిగిన సంభాషణలలో కమ్యునిష్టు సోదరులు తాము వేసింది తప్పటడుగు అనీ వారు చేసింది పొరపాటు అని భావిస్తున్నట్లూ ద్యోతకమైంది జరిగిందానికీ, చేసిన దానికి వారు పశ్చాత్తాపం వెల్లడించారనడం సరియైన వివరణ అవదు. కాని కమ్యు నిష్టులు తాము గురితప్పినట్లూ అందువల్ల తాము తమ లక్ష్యాన్ని సాధించ లేకపోయినట్లూ తాము మరొకసారి తమ కార్యక్రమాన్ని పునర్విమర్శ చేసుకోవడం ఆవశ్యకమని భావిస్తున్నట్లూ అనడం సత్యదూరం కాబోదు. ఆ పరస్పర భాషణల అనంతరమే వినోబాజీ చరిత్రాత్మకమైన తన 'పాదయాత్ర' కార్యక్రమానికి పథకాన్ని రూపొందించారు అది గమ నించగానే మా మనస్సులు హర్షోత్ఫుల్లమయాయి. ఆశాపూర్ణ దృక్కు లతో, మేము 'క్లిష్ట సమస్యకు శాంతియుత పరిష్కారం లభిస్తుంది' అని తృప్తిచెంది 'అమ్మయ్య' అనుకొని నిట్టూర్చాము ఈ రీతిగా భూదానగంగ ఉద్యమోత్పత్తికి కారణమైన వాతావరణం సిద్ధించింది. వినోబాజీ కొన్ని మాసాలు పర్యటించి, కల్లోలిత తెలంగాణాలోని గ్రామాలు సందర్శించారు ఓదార్పు కలిగించారు. ఆయన దర్శించిన ప్రతి గ్రామంలోనూ ఆయన ఉపదేశాల ఫలితంగా లభించిన భూదానాలు, పేద ప్రజలలో తమ సమస్యకు శాంతియుత పరిష్కారం లభిస్తున్నదనే ఆశ వారి కళ్ళ యెదుటనే రూపుదిద్దుకొంటున్నట్లు ప్రత్యక్షమైంది ఈ విధానం హిందూదేశంలో భూమి సమస్యా పరిష్కారానికి శాంతియుత మైన ఒక క్రొత్త పద్ధతి, 'నభూతో'వంటి విలక్షణమైన విశిష్ట పద్ధతి, అనే భావం వ్యాప్తిచెంద సాగింది. ఈ పాదయాత్రలో వినోబాజీ తన సలహాలు గైకొనేటందుకు వచ్చిన కమ్యునిష్టులను కలుసుకొనేవారు. వారు, తాము

దాగుకొని ఉన్న రహస్య స్థావరాలనుంచి వచ్చి, ఆయన్ని బహిరంగంగా కలుసుకొనేవారు. ఆయన, అప్పుడు నా ఆవాసమైన బిర్లేవర్లికి కూడా దయచేశారు. నేను తర్వాత వినోబాజీని అనేక పర్యాయాలు కలుసుకొన్నాను. ఆ సమావేశాల్లో భూమి సమస్యను అనేక దృక్కోణాలనుంచి ఆయనతో చర్చించడము, ఏ రీతిగా ఆ సమస్య తిరిగి వెర్రితలలు వెయ్యకుండా పరిష్కరించడము అనే విషయాలకు తగిన సూచనలు చెయ్యడముకూడా జరిగింది. ఒకసారి నేను వినోబాజీ ప్రతినిధిగా తెలంగాణా కమ్యూనిష్టుపార్టీ నాయకుడైన శ్రీ రావి నారాయణరెడ్డిని ఆయన బొంబాయి రాష్ట్రంలోని ప్రాంతంలో అజ్ఞాతవాసం చేస్తున్నప్పుడు, కలుసుకొన్నాను. వినోబాజీ సందేశాన్ని వివరించాను శ్రీ నారాయణరెడ్డిలో అప్పటికే పూర్వపు దృక్పథం నుంచి మార్పు వచ్చింది. అందుచేత ఆయన ఆనాటి పరిస్థితులలో తమ కర్తవ్యం ఏమని భావిస్తున్నదీ నాకు సూచనప్రాయంగా తెలియజేశారు కాని, వెంటనే హైదరాబాదు రాజ్యానికి తిరిగి వచ్చే ఆలోచన లేనట్టేదని అట్లా తిరిగివస్తే తను అరెస్ట్ కావచ్చుననీ అప్పుడు ఏమి చెయ్యడానికీ వీలుకాదనీ అన్నారు ఈ సమాచారాన్ని నేను వినోబాజీకి తెలియజేశాను.

విరాగి, సాధువు, కాషాయ వస్త్రాలు ధరించిన సన్యాసీ అయిన వినోబాజీని దర్శించగానే ప్రజలు ఉత్తేజంపొంది తమ త్యాగ భావ సూచకంగా తమ భూమిలో కొంత దానం చెయ్యసాగారు ఆయన జనసామాన్యంలో కొనివచ్చిన విప్లవాత్మకమైన మార్పు, మన హిందూదేశం అనుసరించతగిన జీవిత విధాన సరళిని సూచించింది క్రమక్రమంగా భూదాన ఉద్యమం బహుముఖాలుగా వ్యాపిచెందుతూ ఆర్థిక సామాజికాభివృద్ధి సాధనకొక శక్తివంతమైన పరికరంగా పరిణతి చెందింది పది సంవత్సరాల కృషి మూలంగా భూదాన కార్యక్రమం వికాసం చెంది, గ్రామ స్వరాజ్య సిద్ధాంతం ఒక సమర్థవంతమైన, ఆచరణీయమైన, పద్ధతి అని నిరూపించింది ఈ సందర్భంలో దాన్ని గురించి ఇంతకంటె ఎక్కువ చర్చించవలసిన అవసరం ఉందని నేను భావించటంలేదు నేను చెప్ప

దలచిందీ చెప్పవలసిందీ 'నేను భూదాన ఉద్యమంవల్ల ఎక్కువ ఆకర్షితుడనయ్యాను' అనేది ఒక్కటే. ఇప్పుడు ప్రచారంలో ఉన్న సిద్ధాంత విధానాలన్నింటిలోనూ గ్రామ స్వరాజ్యమనే పద్ధతిలోనే పేదరికమనే సామాజిక ఆర్థిక సమస్యకు సరియైన పరిష్కారం ఇమిడి ఉందనీ, వికేంద్రీకరణం చెందిన ప్రజాస్వామ్య విధానంద్వారా 'భూమి మీద స్వామ్యం' సమాజానికే ఉండాలనే సిద్ధాంతానికి అదే మూలాధారమనీ నాకు గోచరించింది. వినోబాజీ ఆశిస్తున్నదంతా సమగ్రంగా ఆచరణలోకి రాలేదు. ఈనాడు పరిమితమై సంకుచితమై ఉన్న మానవదృక్పథము, మనమున్న పరిస్థితులు కలిగించే అవరోధాలవల్ల అది ఆచరణ సాధ్యం కాకపోవచ్చు. కాని, ఈనాడు మన సమాజం ఎదుర్కొంటున్న ఆర్థిక సామాజిక సమస్యలకు శాంతియుతమై సమర్థవంతమైన పరిష్కార విధానాన్ని, భూదాన విధానం సూచిస్తున్నది. ఈ భావం ప్రజలలో వ్యాపించి, వారి ఆలోచనా పద్ధతిలో కొంత మార్పు తెచ్చింది. ఈ విషయాలు ఎవ్వరూ కాదనలేరు, నిరాకరించలేరు.

భూదాన ఉద్యమం ఒక కొత్త జీవిత తత్త్వాన్ని ప్రసాదించింది. ప్రజాసామాన్యంయొక్క దృష్టి, ఐహిక ఆర్థిక సంపదలను పెంచుకొనడంవైపూ పదవులు సాధించుకొనడం వైపూ లగ్నమై ప్రయాణం చేస్తున్న సమయంలో దాన్ని భూదాన ఉద్యమం మానవ జీవితంలో ఆవశ్యకమైన ధార్మిక, నైతిక సిద్ధాంతాలవైపు మళ్ళించింది. ఈ జీవిత విధానం మన సంస్కృతికీ, సంప్రదాయలకూ అనుగుణమైంది. ఈనాటి సామాజిక పరిస్థితిలోనూ ఆర్థిక వ్యవస్థలోనూ మార్పు తెచ్చి పరస్పర సహకారము, సౌహార్దము పునాదులుగా ఉండే నూతన సామాజిక ఆర్థిక వ్యవస్థను రూపొందించాలనేదే భూదాన ఉద్యమం లక్ష్యము. తనకున్నది ఇతరులతో పంచుకొనడం సిసలైన ప్రజాస్వామ్య వ్యవస్థలో అభివృద్ధికి శాంతిసాధనకు ఏకైక విధానం. ఈ ఉద్యమ ప్రభావం క్రమక్రమంగా ప్రపంచం అంతా వ్యాప్తి చెందుతోంది. ప్రజాసామాన్యపు మనోఫలకాలమీద ఈ ఉద్యమం వేసిన ముద్ర, కాలం గడచినకొద్దీ పరిణతిచెంది, చెరిగిపోకుండా శాశ్వతమైనది కాగలదని నా విశ్వాసము.

ఆర్థిక సామాజిక శాస్త్రవేత్తలలో కొందరు నిపుణులు, యేదో కొందరికి, కొన్ని ఎకరాల భూమి పంచిపెట్టడంవల్ల, పేదల నిరు పేదరికంలో చాల కొంచెం, ఇతరులు పంచుకొనడం మాత్రమే అవుతుందని అపార్థం తీశారు. విశాలమైన పంట భూముల్ని ?, లేదా 5 ఎకరాల చిన్న చిన్న కమతాలుగా చీలికలు చెయ్యడంవల్ల వ్యవసాయ పంటల దిగుబడులు విపరీతంగా తగ్గేటందుకు దోహదం చెయ్యడం జరుగుతుందన్నారు. అందుచేత స్వల్ప భూదానాలు పేదరికం తగ్గడానికి సహాయపడవు అని, వారు భావించడమే ఆ వ్యతిరేక మూలకారణము. పెద్ద పెద్ద భూస్వాముల విశాల భూఖండాల్ని పరిమితం చేసి అందువల్ల లభించిన భూమిని పేదలకు పంపిణీ చేస్తున్నారు. అప్పుడు సహజంగా ఏర్పడిన చిన్న చిన్న కమతాలను తీర్చిదిద్దడం తప్పనిసరి. అందుచేత దేశం మొత్తంమీద పంటల దిగుబడికి కొంత బాధాకరం కావచ్చు. కాని, భూదాన్ ఉద్యమం విస్తృతమై 'గ్రామదాన్' భావాన్ని రూపొందించి ఈ అనుమానాలు, భయాలు ఆధార రహితమైనవని విస్పష్టం చేసింది. గ్రామీణుల ఆర్థిక జీవితంలో అత్యంత ప్రాధాన్యత వహించిన 'భూమి మీది హక్కు' (భూస్వామ్యం) సమాజానికి చెందుతుంది, అనే నిర్ణయాన్నే గ్రామదాన్ భావం ప్రతిపాదించింది. దాన్ని అనుసరించి ఆరువేల గ్రామాలకంటె ఎక్కువ గ్రామాలు, గ్రామదాన్ గ్రామాలుగా రూపొందాయి. ప్రఖ్యాత ఆర్థిక శాస్త్రవేత్తలైన డాక్టర్ డి.ఆర్. గాడ్గిల్, డాక్టర్ సి.డి. దేశముఖ్‌లు "గ్రామదాన్‌లో అత్యంత విప్లవాత్మక భావం ఇమిడి వున్నది. అది, నేటి భారత దేశంలోని గ్రామాల్లో నిశ్చైతన్యంగా రోగగ్రస్తమై వున్న ఆర్థిక జీవితానికి పునర్వికాసం కలిగించే ఔషధం" అనే అభిప్రాయాలు వెల్లడించారు.

భూమి, అన్ని పంటలకూ, సంపదకూ మూలాధారము. అందుచేత సామ్యవాద వ్యవస్థ ఏర్పడాలనే సాంఘిక శాస్త్రవేత్తలు, భూమిని జాతీయం చెయ్యాలి, అన్నారు. ఏ సంపదుత్పత్తి సాధనాలూ ఏ ఒకరి స్వత్వమూ కాకుండా జాతీయమై ఉండాలనేది సామ్యవాద సిద్ధాంతంలో కీలకమైన సూత్రము. గ్రామదాన్, ఆ లక్ష్యం ఆచరణ సాధ్యమేనని

సూచించింది జాతీయం చెయ్యడం ప్రభుత్వం చట్టంద్వారా చెయ్యవచ్చు. కాని, అది నిరంకుశ అధికార పూర్వకచర్య అవుతుంది. కాని, గ్రామ దాన్‌లో అట్లాకాదు. ప్రతివ్యక్తీ తన స్వత్వాన్ని స్వయంగా బుద్ధిపూర్వకంగా సమాజపరం చెయ్యడం జరుగుతున్నది అందువల్ల పరస్పర పోటీలతో నడుస్తున్న ఆర్థికవ్యవస్థ స్థానంలో పరస్పర సహకారంతో నడిచే కో ఆపరేటివ్ (అంజుమాన్) వ్యవస్థ యేర్పడుతుంది. జాతి, క్లిష్టమైన పరిస్థితుల నెదుర్కొంటున్నదనీ ప్రజలలో నైతిక విలువల స్థాయి సడలిందనీ అది పతనోన్ముఖమై ప్రజాస్వామిక జీవన విధానానికే ప్రమాదకరంగా వున్నదనీ గుర్తించినప్పుడు భూదాన్, గ్రామదాన్ ఉద్యమాలు అవతరించడం జరిగింది. అవి, ఇరుగుపొరుగు వారి నడుమ సౌహార్ద్ర భావం పునాదిగా ఉండే క్రొత్త జీవిత విధానాన్ని ప్రత్యక్షం చేశాయి. తనకున్నది తోటి గ్రామీణ సమాజంతో పంచుకొనే త్యాగబుద్ధికి ఉత్తేజం కలిగించాయి ఇది, హైందవ జీవిత విధానంలో అనాదిగావున్న ఉత్తమ సంప్రదాయమైన పరిష్కారము. [illegible] వారిని దోచుకొనే దోపిడీ పద్ధతికి బదులు అతని బాధలను సానుభూతితో గమనించి తనకున్న వసతులలో కొంత త్యాగం చెయ్యాలనే విధానం హింసాపద్ధతితో సంబంధం లేకుండా సమాజంలో సంపూర్ణమైన మార్పుతేగలము అనే ఆశను కలిగించింది

సర్వోదయ మార్గాన్ని అనుసరించాలనే దీక్షా కంకణం ధరించిన వారందరినీ భూదాన ఉద్యమం ఒక వేదికమీద సమీకరించింది. వారిలో పొడచూపిన నిస్పృహను నిర్మూలించింది ప్రపంచ రాజకీయ పరిస్థితులు ఒకవంక తీవ్రమైన సంఘర్షణలకు దారితీస్తున్నాయి న్యూక్లియర్ మారణాయుధాల నిర్మాణము, ప్రయోగాత్మక పరీక్షలు, విస్ఫోటనాత్మక ప్రేలుడులు, మానవజాతికి దిగ్భ్రమ కలిగిస్తున్నాయి. వాటికి మానవ జాతినే నాశనం చేసే సామర్థ్యం వుంది వాటి ప్రయోగంవల్ల ఇప్పుడు జీవించివున్న మానవులేకాక, వెయ్యి సంవత్సరాల భవిష్యత్కాలంలో పుట్టబోయే తరాల వారందరూ కూడా నశించే ప్రమాదం వుంది.

ఈ విపత్కర పరిస్థితి మనదేశంలోనూ ఇతర దేశాల్లోనూ కూడా అణ్వా యుధాలకు వ్యతిరేకమైన ప్రజాభిప్రాయాన్ని రూపొందిస్తున్నది. అది, నానాటికీ బలపడి ప్రపంచ శక్తిగా పరిణతిచెంది, ఎప్పుడైనా ఏ నిర్ణ యాన్ని గురించిన చర్చ వచ్చి కట్టి పెరెయ్యాాసి. వీలులేనంత స్థాయికి పెరిగింది. విజ్ఞాన శాస్త్రాలు, యాంత్రిక సాధనాలువాడే పరిశ్రమలూ, మానవులందర్నీ మరింత సన్నిహితుల్ని చేశాయి. ఈ సాన్నిహిత్యం అర్థవంతము, ప్రయోజనకరి అవాలి; పెంపొందాలి పరస్పర అసూయా ద్వేషాలు ప్రేమానురాగాలుగాను, పోటీలు సహకారంగాను, యుద్ధోన్మాదం విజిగీష, శాంతి అహింసలుగాను మారవలసి ఉంది ఈ పన్నెండు సంవత్సరాల స్వల్పకాల పరిమితిలోనూ భూదాన ఉద్యమం సుసాధ్య మొనర్చిన భావవిప్లవం ఆశ్చర్యకరమైంది విజ్ఞాన శాస్త్రాలూ, ఆధ్యాత్మిక చింతన ఒక దానితో ఒకటి చేతులు కలిపి సహకరిస్తూ మానవ జాతిని ముందుకు తీసుకొనిపోవలసి ఉంటుందని, ఆచార్య వినోబాభావే అవిరా మంగా నొక్కి వక్కాణిస్తూ ఉన్నారు సర్వ మానవ సౌభ్రాతృత్వ లక్ష్యంతో ముడిపడివుంటేనే అవి మానవులలో ఆకలి మంటలను నిర్మూ లించి, శాంతియుత సహజీవనాన్ని స్థాపించేటందుకు సహకరిస్తాయి అట్లాటి విచక్షణము ఉండకపోతే నేడు వైజ్ఞానిక పరిశీలనల ఫలితంగా మానవజాతికి లభించిన అణ్వాయుధాలు భారీగాతయారవడమూ అవి, సర్వనాశనకర హింసాత్మక చర్యలకు వినియోగపడటమూ జరుగుతుంది

'భూదాన ఉద్యమం విఫలమైంది' అని ప్రచారం చేసేవారూ, చెప్పేవారూ కొందరున్నారు వారు దాని ప్రభావాన్ని సరిగా అవగాహన చేసుకోలేనివారని నా నమ్మకము "భూదాన ఉద్యమాన్ని త్రికరణశుద్ధిగా కొనసాగిస్తూ కృషిచేస్తే మన దేశంలో భూమి సమస్య పరిష్కారం అవుతుంది" అనే విశ్వాసాన్ని ఈ ఉద్యమం ప్రజలలో కొందరిలో మాత్రమే [illegible]గాని, సర్వవ్యాప్తంగా కలిగించలేకపోయింది.

అంతేకాదు, నూతన భావాలు మానవ మనోక్షేత్రాలలో వేరు తన్నుకొని పెరిగి, పుష్పించి, ఫలించి, ఆఫలితాలు చేతికి అందించేటందుకు

తగినంత కాలం వేచియుండవలసి ఉంటుంది, అని, ఆ విమర్శలకు జవాబు చెప్పవలసి ఉంటుంది

విప్లవాలు అందరూ అనుకొనేటట్లు హఠాత్తుగా సంభవించవు. ప్రతి విప్లవాత్మకమైన మార్పు సంభవించేటందుకు ముందుగా దాని పూర్వరంగంలో అనేక దశాబ్దాలపాటు ప్రజలలో ప్రచారాత్మక కృషి కొనసాగుతుంది. అదే ఆ విప్లవానికి పునాది. మనుష్య స్వభావంలో సహజంగా ఉండే మంచితనాన్నీ త్యాగశీలాన్నీ సరిగ్గా మలచడంపైనే భూదాన ఉద్యమం ఆధారపడింది. దాని ప్రభావం పుంజుకొని వ్యక్తం కావడానికి మరెంత కాల వ్యవధి అవసరము, తప్పనిసరి అని అనడం ఎవరూ తప్పనలేరు.

భారతదేశం సైజులో పెద్దది క్రమబద్ధంగా అభివృద్ధి చెందుతున్న దేశం అందుచేత అది, తన బలహీన వర్గాల వారిని గురించి, ప్రత్యేక శ్రద్ధ తీసుకోవలసిన అగత్యం ఉంది అట్లా చెయ్యకపోతే సంఘంలో దౌర్జన్యంతో కూడిన తిరుగుబాట్లు తప్పకుండా లేస్తాయి. భూదానఉద్యమం వేళ్లు ప్రజలలో అత్యంత బలహీనులైన వారిలో వ్యాపించి ఉన్నాయి. పంచవర్ష ప్రణాళికద్వారా మన ప్రభుత్వం సాధించిన ఘనవిజయాలను కొంత దూరంగా ఉంచి మిగిలినవాటినే చూస్తే అత్యంత బలహీన వర్గాల వారి అభివృద్ధికోసం ఏమీ పని జరగలేదనీ కొంత జరిగినా అది లెక్కలోకి వచ్చేటంత పరిమితిలో లేదనీ అనక తప్పదు. ఇట్లా అనవలసి ఉండటం దురదృష్టకరం. అందుచేతనే అంటే బలహీనవర్గాల వారి అసంతృప్తిలోనే భారత ప్రజాస్వామ్యానికి ప్రమాదంవచ్చే అవకాశం ఉంది.

వారిని సంతృప్తిపరచాలనీ ఉద్దేశించిన భూదాన ఉద్యమమే మన దేశంలోని ప్రజాస్వామ్యానికి రక్షణ, బలం ఇచ్చేటటువంటిది అంతే కాదు. దాని విజయం ఏటి కెదురీదుతన్నట్లు కృషి చేస్తూ విశ్వశాంతి సంరక్షణకోసం కృషిచేస్తున్న వ్యక్తులందర్నీ కూడగట్టి, వారు మరి

కొంత ముందుకు సాగేటందుకు తోడ్పడింది. ఈనాడు మానవత సమూలంగా పెకలించివేయబడుతున్నది. మనం భూదాన ఉద్యమాన్ని ఇనక దృఢ విశ్వాసంతో కొనసాగించి విజయాలు సాధిస్తే 'మానవత'ను రక్షించగలుగుతాము. కాలం గడిచినకొద్దీ భూదాన ఉద్యమంలో ఉన్న ఈ విప్లవాత్మక భావనను మన ప్రజలు అర్థం చేసుకొని ఆమోదించి అనుసరిస్తారని నేను నమ్ముతున్నాను

భూదాన ఉద్యమం ఇప్పుడు గ్రామదాన ఉద్యమంగా వృష్టించింది. భూమిపై వ్యక్తులకున్న స్వత్వము తొలగిపోవాలి అది గ్రామ సభలకు అంటే గ్రామంలో ఉన్న వారందరికి, సంక్రమించాలి ఈ భావమే ఎంతో విప్లవాత్మకమైంది ఇందులోనే కొత్త సమాజ నిర్మాణానికి పునాది ఉంది, ప్రజాస్వామ్యం నిజమైన ప్రజాస్వామ్యంగా పని చెయ్యాలంటే అది ప్రజలకు స్వతంత్రాన్ని, శాంతిని, సామాజిక న్యాయాన్ని సాధించుకొనే బలాన్ని ఇయ్యాలి అవి లభించినప్పుడే అత్యంత హీనస్థితిలో ఉన్నవారు కూడా పైకివచ్చి అభివృద్ధి చెందేటందుకు అవకాశ ... ది.

ఈనాడు మన దేశంలో శాంతియుత విప్లవ కార్యక్రమం మూడు ముఖాలుగా ముందుకు సాగుతోంది గ్రామదాన, గ్రామీణ పరిశ్రమాభి ముఖ ఖాదీ, 'శాంతి సేన' అనేవి మూడూ ఆ భూదాన ఉద్యమంలో ప్రధాన అంశాలు.

మొత్తంమీద ఈవిధంగా మనదేశంలో కొనసాగుతున్న ఈ శాంతి యుత విప్లవం తన స్థానాన్ని సాధిస్తే మానవ జీవితానికి ఒక కొత్త లక్ష్యాన్ని కొత్త అర్థాన్ని, కొత్త విధానాన్ని సమర్పించగలుగుతుంది.

—o—

# 37. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ

ఏ ప్రజా సంస్థలోనైనా సరే వేర్వేరు ధోరణులలో ఆలోచించే వ్యక్తులుండటం సహజము హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌లో కూడా అట్లాగే ఉండేవారు. ఆ విభేదాలు రాజకీయ సంస్థల్లో స్పష్టంగా ఉంటాయి. ముఖ్యంగా హఠాత్తుగా ఒక మార్పు వెంట మరొక మార్పు చకచకా వస్తున్నప్పుడు సభ్యులలో అభిప్రాయ భేదాలు మరింత వ్యక్తం అవుతాయి సాపేక్షికంగా శాంతియుత పరిస్థితులు ఏర్పడినప్పుడు ఒక వర్గానికి చెందినవారు కొందరు సమీకృతం కావడం, వేర్వేరు వర్గాలవారు ఒకరితో ఒకరు ఘర్షణపడడం సహజం కాని, హైదరాబాదులో ఉన్న పరిస్థితుల ప్రత్యేకత మూలంగా విభిన్న వర్గాలమధ్య ఉన్న భేదాలు, వారు విడిగా చీలిపోయేటంతవరకు లాగేటటువంటివికావు ఎవరి దృక్పథం ఏమైనా ప్రజాస్వామిక స్వాతంత్ర్యాన్ని సాధించేటంతవరకు అందరూ చేతులు కలిపి పనిచెయ్యడం

అవిరామమైన పోరాటాన్ని కొనసాగించడం, అ[illegible]మైన త్యాగాలు చేయడము హైదరాబాదులో గట్టిగా పాతుకొనిపోయి ఉన్న మతావేశిత నిరంకుశ ప్రభుత్వాన్ని కూలదోయడానికి అవసరమనే విషయంలో నాకెట్టి సందేహమూ లేదు. ప్రభుత్వాన్ని ముఖాముఖీగా, పూర్తిగా ఎదిరించవలసి ఉంటుంది సంకుచితమైన వ్యవస్థపట్ల గౌరవ భావాలకు ఈ పోరాటంలో ఎక్కడా చోటుండదని స్పష్టం చేసేటందుకు ఆ ఒక్క విషయమే చాలు అందుచేత హైదరాబాదు విముక్తి ఉద్యమము శాంతియుత ప్రజా ఉద్యమాల వంటిదికాదు వాటికి వ్యతిరేకమైనది ప్రజలను ఉద్రిక్తులను చెయ్యడము, నిజమైన ప్రజావాహినీ శక్తిని పూన్చి, [illegible]

సమస్యలను తాడో పేడో తేల్చివేయడానికి నడిపించడము ఎంతటి దుర్గమ దుస్సాధ్య ప్రతిఘటననైనా ఎదిరించే చొరవ కలిగించడమూ అందుకు అవసరమైన కష్టనిష్ఠూరాలు సహించి త్యాగాలు చెయ్యడానికి ప్రజలను సిద్ధంచేయడము, అనేవి ఈ ఉద్యమంలో అవసరమైనాయి. ఈ పద్ధతిలో కొనసాగిన పోరాటంలో కాలానుగుణం కానివీ, తొందర పాటుతో మనోవైకల్యం (విరికితనం) వల్ల చేసినవీ, సంప్రతింపులవల్ల రూపొందించేవీ, తాత్కాలిక ప్రయోజనాలకు ఉపయోగించేవీ, అయిన ఒడంబడికలూ, సర్దుబాట్లూ అసలు పోరాటపు లక్ష్యాన్ని మూలచ్ఛేదం చేసేటటువంటి, గొడ్డలి పెట్టువంటివి అనవచ్చు హైదరాబాదు విముక్తి ఉద్యమం రూపొందేటప్పుడు, ప్రారంభమైనప్పుడు, అట్లాంటి ప్రమాదాన్నే ఎదుర్కొనవలసి వచ్చింది కొందరు వ్యక్తులు సంప్రదింపులతో కార్యసాధన సాధ్యమనే విశ్వాసం కలిగినవారు, అప్పుడప్పుడు ప్రభుత్వంతో, స్టేట్ కాంగ్రెస్ ఆమోదంతోగాని, నిర్ణయాలతోగాని, ఏమీ సంబంధం లేకుండా, సంప్రతింపులు జరిపేవారు. అది ఎంతో ఇరకాటం కలిగించేది. సహజంగా ఈ ప్రయత్నాలవల్ల స్టేట్ కాంగ్రెసులోని వేర్వేరు వర్గాల మధ్యనున్న విభేదాలు నాటికి స్పష్టమై పైకి వచ్చాయి

అంతేకాదు దానికి తోడు మాకు సామాజిక ఆర్థిక సమస్యల పట్ల ఉన్న దృక్పథాలలో కూడా భేదాలున్నాయి భూస్వాముల చేతుల్లోనూ, పెట్టుబడి దారుల చేతుల్లోనూ, సంపద, అధికారము పూర్తిగా కేంద్రీకృతమై ఉన్నాయి. అందుచేత అన్ని రకాల దోపిడీలను రద్దుచేసే సామాజిక ఆర్థిక వ్యవస్థను రూపొందించడమే అన్ని సమస్యలకూ పరిష్కారము అందుకోసమే మా కృషి, ఈ పోరాటము ఇవీ మా భావాలు. నేనూ నాతో ఏకీభవించిన మిత్రులూ, ప్రజా ఉద్యమానికి జీవగఱ్ఱగా ఇచ్చిన లక్ష్యము ఈ భావాలు పుంజుకొని వేగవంతమై పటిష్టత పొంది, కార్యకర్తలను ఉద్యమంలోకి ఆకర్షించాయి ఈ ఉద్యమం కేవలం రాజకీయ స్వాతంత్ర్య సాధనకోసం మాత్రమే ఉద్దేశించిందికాదు. ప్రజాస్వామ్యం అంటే మా దృష్టిలో రాజకీయ దాస్యత్వంనుంచి విడుదల

మాత్రమే కాదు పేదరికంనుంచి, ఆకలి మంటలనుంచి, శాశ్వతంగా జీవితాంత పర్యంతము విముక్తి నిచ్చేది అని మా నిర్వచనము అట్లాంటి స్వతంత్రము. దోపిడీకి అవకాశంలేని సామాజిక వ్యవస్థలోనే సాధ్యమని నా దృఢమైన విశ్వాసము దీన్ని మేము కేవలం నినాదంగా మాత్రమే గ్రహించలేదు. పేదలు తమర్ని అన్ని విధాలా దోచుకొంటున్న వర్గం వారు వేసిన ఆర్థికసంకెళ్ళ నుంచి, మెడ బిగించిన ఉరిత్రాడు నుంచి విముక్తి చెందితేనేగాని, సమాజంలో తమ స్థానాన్ని తాము పొందలేరు అని మేము త్రికరణ శుద్ధిగా విశ్వసించాము అయినప్పటికీ పోలీసుచర్య (14-17 సెప్టెంబరు 1948) వరకు హైదరాబాదు, స్టేట్ కాంగ్రెసు తన సభ్యులందరినీ ఒకత్రాటి పైన నడిపిస్తూ హైదరాబాదు ప్రభుత్వంలో ప్రజాస్వామిక రాజకీయ వ్యవస్థను సాధించడము, హైదరాబాదు భారతదేశంలో విలీనమయేటట్లు ఒత్తిడి చెయ్యడం అనే జంట లక్ష్యాలను ప్రథమ కర్తవ్యాలుగా గ్రహించి పనిచేసింది.

రాష్ట్రంలో భూ సంస్కరణల సమస్యను ఈ పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని మరీ ఆలోచన చెయ్యవలసి ఉంటుంది. కమ్యూనిష్టు పార్టీ కార్యక్రమాలకు తెలంగాణా ఎందువల్ల పెట్టని బలమైన కోట అయిందో అర్థంచేసుకొనేటందుకు ఏమీ ఎక్కువ శ్రమ పడేపనిలేదు తెలంగాణా రైతాంగం సులువుగా విప్లవాభిముఖులయే పరిస్థితిలో ప్రేలుటకు సిద్ధంగావున్న అగ్నిపర్వతంలా ఉన్నారు కమ్యునిస్టులు తమ ఆశయాలకు అనుగుణంగా ఉండే ఏ ప్రజా ఉద్యమాన్ని ప్రారంభించినా అందులో దూకేటందుకు సిద్ధంగా ఉన్నారు తెలంగాణాలొ భూమి సమస్యే పరిస్థితులకు కీలకప్రాయమైందనే విషయాన్ని గురించి నాకేమీ సందేహం లేదు దాన్ని ముఖాముఖీగా ఎదుర్కొని సామర్థ్యంతో, సంతృప్తి కరంగా పరిష్కరిస్తేనే తప్ప పరిస్థితి మెరుగుపడదు. శాంతియుతమైన ప్రజాస్వామికి జీవనం, ఆ ప్రజల జీవితసారాన్ని దోపిడీ విధానం ద్వారా అణచిపెట్టి వుంచడం ద్వారా ఓడ్చివేసి శుష్కింప చేస్తుంటే ఎట్లా శాశ్వతంగా మనగలుగుతుంది? అనే మేము అనుకున్నాము. అందువల్లనే

మేము మా కార్యక్రమంలో భూమి సమస్యకే ముఖ్యమైన స్థానం ఇచ్చాము కార్యకర్త ల భావాలు, ప్రజల ఆశయాలు ఈ రీతిగా ప్రధాన లక్ష్యం పట్ల ఒకే తీరుగా ఉన్నాయి

స్టేట్ కాంగ్రెస్‌లోని సాధారణ కార్యకర్తలకు ఈ సిద్ధాంత పరమైన శిక్షణ ఇవ్వడము, వారిని తీర్చిదిద్దడము జరిగింది భూ స్వామి వర్గం పరిపాలన తొలగి ప్రజలనుంచి వచ్చిన మంత్రివర్గం ఏర్పాటు అయిన వెంటనే ఈ ముఖ్య సమస్య పరిష్కారం కోసం మేము, సహజంగా ప్రయత్నాలు చేశాము పండిత్ జవహర్‌లాల్ నెహ్రూ కూడా మాతో ఏకీభవించారు సమగ్రంగా చర్చలు జరిపిన తర్వాత ఆయన ఇక్కడి పరిస్థితులకు అనుగుణమైన భూ సంస్కరణ ప్రతిపాదనలను రూపొందించేటందుకు మాతో కలిసి ఆలోచనలు చేసేటందుకు నిపుణులను పంపారు. ఆ ప్రతిపాదనలు ప్రగతి శీలమైనవి, సమర్థవంతమై ప్రభావితం చేసేవి, ఆచరణ సాధ్యమైనవి కావాలని స్థూలంగా నిర్ణయించడం జరిగింది. రెండు వారాలపాటు అనేక విషయాలు మా చర్చలకు అనుబంధంగా పొడచూపిన వాటిని చర్చించడం కూడా జరిగింది ఇప్పుడు భూ స్వాముల స్వాధీనంలో ఉన్న భూములకు ఏదైనా గరిష్ఠ పరిమితిని నిర్ణ ణ ని అంగీకరిస్తే ఏ గరిష్ఠ పరిమితి నిర్ణయించాలి? అనేది చర్చనీయమైన ముఖ్యాంశమైంది కాంగ్రెసు సంస్థలోను, ప్రభుత్వంలోను ఉన్నత స్థాయిలో ఉన్న కొందరు గరిష్ఠ పరిమితి నిర్ణయించడం అనే సూత్రాన్నే సిద్ధాంత దృష్ట్యా వ్యతిరేకించారు వ్యక్తుల వ్యావసాయిక భూకమతాల గరిష్ఠ పరిమితి నిర్ణయించడం తగదని కూడని దని వారెన్నో కారణాలు పేర్కొని వాదించారు ఆ వర్గంవారి దృక్పథం ప్రధాన పథకానికి అడ్డంకి అయి నిర్ణయానికి సరైన రూపం రాకుండా చేసింది. కాని, శ్రీ గుల్జారిలాల్ నందా, శ్రీ ఆర్ కె పాటిల్‌లు వెల్లడించిన దృఢమైన విశ్వాసము, చర్చలలో పాల్గొని వాదించిన విధానము, అచంచలమై సడలకుండా ఉన్న మా నిర్ణయము అన్నీ కలిసి ఈనాడున్న వ్యవసాయ భూములకు గరిష్ఠ పరిమితిని చట్ట బద్ధంగా నిర్ణయించడము

ఆవశ్యకమని కమిటి అంగీకరించడం జరిగింది ఈ నిర్ణయము ఒక ఘన మైన విజయమే కాని, అసలు సమస్యా పరిష్కారం, కలవారి ఆస్తులకు గరిష్ఠ పరిమితి నిర్ణయించడం వల్ల లభించదు. గరిష్ఠ పరిమితి ఎంత ఉండాలి అనే స్థాయి నిర్ణయానికి కూడా అసలు సమస్యా నిర్ణయానికి ఉన్నంత ప్రాధాన్యత ఉంది ఆ పరిమితి వీలైనంత ఎక్కువగా ఉండే టట్లు ప్రయత్నాలు జరిగాయి. ఇటూ అటూ లాగుతూ సంప్రతింపులు ఎంతోకాలం పొడిగించిన తర్వాత ఆ పరిమితిని నిర్ణయించడము చట్టం ముసాయిదా తయారు చెయ్యడము జరిగాయి అది మాకు సంతృప్తి కరమైంది కానప్పటికీ మేము దాన్ని అంగీకరించి దానికి మద్దత్తు ఇచ్చాం ఎందుచేతనంటె మొత్తంమీద చూస్తే అది ప్రగతి శీలమైన చట్టము అది ప్రస్తుత పరిస్థితిని గతం నుంచి వేరువేసి భవిష్యత్తులోకి ముందడుగు వేసే టందుకు తగిన దారి వేసే స్వభావం కలది త్వరగా, కచ్చితంగా ఆ పథ కాన్ని (చట్టాన్ని) అమలు చేస్తే ఎక్కువ న్యాయం చేకూరుతుంది కాని, దాన్ని చట్టబద్ధం చెయ్యడం వెంటనే జరగలేదు ఎంతో కాలయాపన జరిగింది ఆ వ్యవధిలో విస్తృతమైన భూములున్నవారు వాటిని తమ కుటుంబంలో ఉన్నవారికీ తమ చెప్పుచేతల్లో ఉన్నవారికీ పంచి యివ్వ డమో విక్రయించడమో చెయ్యడం జరిగింది ఈ తీరుగా ఏ లక్ష్యంతో చట్టాన్ని రూపొందించడం జరిగిందో అది చాలా వరకు నిష్ఫలమైంది. మేము ఈ నిర్ణీతమైన గరిష్ఠ పరిమితి, ఈ చట్టాన్ని రూపొందించిన నాటినుంచీ అమలు చేయాలనీ ఆ తేదీ తర్వాత జరిగిన భూముల పంప కాలు, అమ్మకాలు చెల్లవనీ నిర్ణయించాలనీ పట్టుపట్టాము కాని, మా ప్రయత్నాలు ఫలించలేదు ఈ భూ కమతాల గరిష్ఠ పరిమితి నిర్ణయ చట్టం వల్ల పేదలకు మానసికమైన సంతృప్తి లభిస్తుందే కాని వారికి వచ్చేది, ఒరిగేదీ ఏమీ ఉండదని ప్రభుత్వములో ఉన్నవారు మాతో అప్పు డప్పుడు చెప్పడం మాత్రమే జరిగింది. చట్టం పాసైన తర్వాత దాన్ని అమలు చెయ్యడం ప్రారంభించడానికి కూడా ఎంతో జాప్యము జరిగింది. ప్రభుత్వం వెంటనే పట్టుదలతో ఈ భూసంస్కరణ చట్టం ప్రజలకు ప్రసా

డించిన షరతులను అమలుచేసి ఉన్నట్లయితే పేదప్రజలకు మరింత ఎక్కువ లాభాలు సదుపాయాలు లభించేవని నా విశ్వాసము. కాని, ఆ నాటి పరిస్థితులూ అమలులోఉన్న నిర్బంధాలు ఈ చట్టంవల్ల లభించే ఫలితాన్ని అత్యంత పరిమితం చేశాయి. అయినప్పటికీ ప్రభుత్వం వ్యక్తుల ఆస్తిపాస్తులపై గరిష్ఠ పరిమితి నిర్ణయం చేయవచ్చుననే భావం ప్రజల మనస్సులలో దృఢంగా పాతుకొని పోయింది. భారతదేశంలో ఇట్లాంటి ప్రగతి శీలం గల చట్టం చెయ్యడంలో మొట్టమొదటిదైన హైదరాబాదు రాష్ట్రమే ముందడుగు వేసింది.

ఈ విషయాన్ని నేను కొంత విస్తృతంగా చెప్పడానికి ఒక కారణంవుంది. ఆనాటి ముఖ్యమైన రాజకీయ భావప్రవాహాల ధోరణులను, కాంగ్రెస్సులో ఉన్న వేర్వేరు గ్రూపుల అభిప్రాయాలు, సిద్ధాంత ధోరణులు వాటి మధ్యనున్న మౌలికమైన భేదాలు పూర్తిగా అవగాహన చేసుకొనే టందుకు ఇంత వివరంగా తెలపడం అవసరమని తోచింది. ఆ పరస్పర భేదాభిప్రాయాలు వ్యక్తిగతమైన భేదాభిప్రాయాలు ఎంతమాత్రమూ కావు. ఒకవంక ప్రజావాహిని తన స్థానం సాధించుకొనడం జరుగుతూంటే, ఆ సంఘటనల వెను వెంటనే చిరాకు కలిగించే చిన్న చిన్న విషయాలు కూడా ఉత్పన్నమయేవి. వాటిని కొందరు వ్యక్తిగత శత్రుత్వ ఫలితాలని చిత్రించే ప్రయత్నాలు చేశారు. కాని, అవేవీ వ్యక్తిగత దూషణలకు తిరస్కారాలకు పదవీ బాధ్యత నుంచి తప్పించేటందుకు జరిగే కుట్రల వంటివి కాలేదు.

పరిస్థితుల మిశ్రమ స్వభావము స్టేట్ కాంగ్రెస్‌లో ఉన్న ఈ వివిధ భావాల సమ్మేళనము నన్ను కమ్యూనిస్టు పక్షం వాడినని వర్ణించే టందుకు కారణాలు. ఏదైనా ఉద్యమానికి ఒక చెడ్డపేరు తగిలించి దాన్ని అప్రతిష్ఠ పాలు చెయ్యడం చాలా తేలికైన పనే. కాని, అది త్వరగానే మానిపోయింది. క్రమక్రమంగా ప్రజలలో విచక్షణా జ్ఞానమూ, శక్తీ, పెరగగానే దానితోపాటు యదార్థ పరిస్థితి అవగాహన పెరగడము, జరిగి

నందువల్ల నాది ప్రచ్ఛన్న కమ్యూనిజము అనే మిథ్యాప్రవాదము నీటి బుడగవలె నశించిపోయింది.

కొందరు కాంగ్రెసేతర వర్గాలవారు, ఆసఫ్‌జాహి వంశం ఏదో ఒక రూపంలోనో, మరో రూపంలోనో అధికారంలో కొనసాగాలనీ, వారి పరిపాలనలో తాము ఈ నాటి వరకూ అనుభవిస్తున్న ప్రాధాన్యము, గౌరవ పురస్కారాలు నిరాటంకంగా కొనసాగాలనీ భావించి దానికి తగిన కోరికలు వెల్లడించేవారు. వారు ఇప్పటికి వచ్చిన ఉప్పెన వేగంతో ఇంకా వస్తూ ఉన్న గొప్ప మార్పులకు సిద్ధపడలేదు. సాధ్యం అయినయిట్లతే వారు పాత పరిస్థితులనే గట్టిగా పట్టుకొని, వీలైనంత తక్కువ మార్పుతో, అదే యథాతథంగా కొనసాగించాలని తలపోసేవారు. హైదరాబాదు కాంగ్రెసు, నైజాము, ఆసఫ్‌జాహి వంశము రాజరికాన్నుంచి తొలగించబడాలని, సంస్థానాన్ని పునర్వ్యవస్థీకరించి దానికి ఇరుగుపొరుగుల నున్న మూడు భాషలరాష్ట్రాలతో విలీనం చెయ్యాలనీ భావించింది. వాదించిందిఅట్లాగే. అందు కోసమే యావచ్ఛక్తి ధారపోసికృషి చేసింది. మొదటి అంశముకొందరికి రుచించకపోయినప్పటికీ, చివరకు అందరు అంగీకరించడంజరిగింది. కాని, రెండవ అంశాన్ని గురించి ఎక్కువ వ్యతిరేకత ఎదురైంది. అయినప్పటికి పరిస్థితులలో త్వరత్వరగా మార్పులు సంభవించడం వల్ల రెండు లక్ష్యాలు సిద్ధించడమూ వాని ఫలితంగా దక్షిణ హిందూ దేశ పటమే పూర్తిగా మారిపోవడమూ, కొత్త చరిత్ర సృష్టికి దారితీయడమూ జరిగాయి.

స్టేట్ కాంగ్రెసు సంస్థకుచెందిన వారే అయినా ఈ ఘట్టాలలో వేరే అభిప్రాయాలతో విభిన్న మార్గాలలో కృషి చేసిన వర్గాలకు చెందిన వారి ప్రోత్సాహంతో కొందరు స్టేట్ కాంగ్రెసు ఉద్యమం అహింసాత్మకం కాదనీ అగాంధేయమనీ వివరించడము, ప్రచారము చేయడం జరిగింది. ఢిల్లీలో ఉన్న కాంగ్రెసు అగ్ర నాయకులకు,భారత ప్రభుత్వపు ఏజెంటు జనరల్‌గా హైదరాబాదులో ఉన్న శ్రీ కె. ఎమ్. మున్షీ ఎన్నో కట్టుకథలు చెప్పడమూ, సంభవించింది. వాటిని మరో చోట సూచించాను. ప్రజా ఉద్యమంతో సంబంధం లేని కొన్ని సంఘటనలు సంభవించడం తప్పదు. హైదరాబాదు

స్టేట్ కాంగ్రెస్ నడిపిన ఉద్యమం దానికి అపవాదుకాదు. హైదరాబాదు సంస్థా సమస్యాపరిష్కారము చివరకు భారత దేశ ప్రభుత్వం తీసుకొన్న పోలీసు చర్యమూలంగా లభించిందన్న విషయం గమనించిన వారికి స్టేట్ కాంగ్రెసు ఉద్యమ లక్షణాల్ని విమర్శించడము, పూర్తిగా అహింసాత్మకం కాదని తప్పులు పట్టడము అవసరము అవదు స్టేట్ కాంగ్రెసు ఉద్యమం లగాంధేయమని పేర్కొనడాన్ని ఎవ్వరు హర్షించ లేదు

ఈ అంశాన్ని గురించి కొందరు, ఒక క్రమాన్ననుసరించి ప్రచారం చేసే వారని, వారికి మరి కొందరు ప్రోత్సాహం ఇచ్చేవారని నేను అనుకొనే వాడిని పోలీసు చర్య తర్వాత సైనిక పరిపాలన చాలా కాలంపాటు కొన సాగకూడదు ఎందు చెతనంటే స్వభావతః సైనిక పాలనకు, ప్రజాస్వామిక మార్పులకు, కార్యక్రమాలకు చుక్కెదురు(వ్యతిరేకత). పోలీసు చర్య అనంతరము జిల్లాలలో పర్యటన చేయడానికి, నాకే కొన్ని నెలల వరకూ అనుమతి లభించలేదు. శాంతియుత పరిస్థితులు ఎర్పడినప్పటికి పరిపాలకుల దృక్పథంలో ఏమీ మార్పు కనిపించ లేదు ఒక నాటి ఉదయం మిలిటరీ గవర్నరు జి ఎన్. చౌధరీ నన్ను తన మకాముకు పిలవనంపి స్టేట్ కాంగ్రెస్ వర్కింగ్ కమిటి సభ్యులైన శ్రీ కె. వి. నరసింగ రావు కమ్యునిస్టు అనీ ఆయన తన జిల్లా వదలి కొంత కలంపాటు హైదరాబాదులో నివసించవలసిందని సలహా ఇవ్వవలసిందనీ, సూచించడము నాకు బాగా జ్ఞాపకము. ఆసలహా ప్రకారం ఆయన నడుచుకొనకపోతే ఆయనను వెంటనే అరెస్టు చేయడం జరుగుతుందని కూడా, మిలిటరీ గవర్నరు హెచ్చరించడం కూడా జరిగింది నేను ఆ సూచనలను ఒప్పుకోలేదు. ఆ విషయం చెప్పి, వెంటనే మిలిటరీ ప్రభుత్వం శ్రీ నరసింగరావును అరెస్టు చెయవచ్చుననీ న్యాయస్థానంలో ఆయన కమ్యునిస్టని రుజువు చేయివలసిన బాధ్యత ప్రభుత్వానికి ఉంటుందనీ స్పష్టపరిచాను. బహుశా మిలిటరీ గవర్నరు తన దురుసుతనాన్నీ అనాలోచిత ప్రవర్తననూ గుర్తించాడో ఏమో వెంటనే మాట ధోరణి మార్చి తాను చెప్పిన విషయానికి ఏ మంత ప్రాధాన్యం లేదనే అభిప్రాయం కలిగించి వీడ్కొన్నాడు.

మిలిటరీ పరిపాలన దాని అవసరాన్ని మించి ఎక్కువ కాలం కొనసాగిందనే మాలో ఎక్కువమంది అనుకున్నాము. అది ఇంకా మరికొంతకాలం కొనసాగితే అప్పుడే అంకురించబోతున్న ప్రజాస్వామిక జీవితానికి విఘాతం కలుగుతుందని అనుకున్నాను. ఈ ఖచ్చితమైన అభిప్రాయాలను ఢిల్లీలో ఉన్న నాయకులకు తెలియజేశాను. నా భావ నిశ్చయాన్నీ ఆవేదననీ వారు గుర్తించారు. అందుచేత, మిలిటరీ పరిపాలనకు స్వస్తి చెప్పి శ్రీ ఎమ్. కె. వెల్లోడి I C S ముఖ్యమంత్రిగా పౌర పరిపాలన ఏర్పాటు చేశారు. ఈ మార్పు ప్రజలకు తక్కువ ఉపశమనాన్ని కలిగించేదైనప్పటికీ ప్రజల అవసరాలకూ, కోరికలకూ, తగినదికాలేదు. ఆ మంత్రి వర్గంలో హైదరాబాదు రాష్ట్రంతో ఏ విధంగానూ పరిచయం లేనివారే ఎక్కువమంది ఉన్నారు. బహుశా హైదరాబాదు రాష్ట్రానికి దశలవారీగా ప్రజా పరిపాలన ఏర్పాటు చెయ్యాలని ఢిల్లీలోని పరిపాలకులు, నాయకులు, భావించారు కాబోలు. ఆ ఆలోచనను కొంత సహృదయంతో అర్థంచేసుకోవచ్చు కాని, కొందరైనా హైదరాబాదు రాష్ట్రంలో తెలివైనవారూ, సమర్థులూలేరా? గొడ్డుపోయిందా? ఇతర రాష్ట్రాల నుంచి ఎందుకు ఈ పరిపాలకుల దిగుమతి జరగాలి? అని విమర్శించారు. కొద్దికాలం ఇట్లా జరిగిన తర్వాత నలుగురు ప్రముఖ కాంగ్రెసు నాయకులను శ్రీ వెల్లోడి తన మంత్రి వర్గంలో చేర్చుకున్నారు. ఆ నలుగురూ,

శ్రీ బూర్గుల రామకృష్ణరావు
శ్రీ వినాయకరావు విద్యాలంకార్
శ్రీ ఫూల్‌చంద్ గాంధి

శ్రీ వల్లూరి బసవరాజు అనేవారు వీరు మంత్రి వర్గంలో ప్రవేశించడంతో హైదరాబాదు రాష్ట్ర రాజకీయ జీవితంలో ఒక కొత్త అధ్యాయం ప్రారంభమైంది ప్రజాస్వామ్యం వైపు ఒక అడుగు వేసినట్లైందని, నేను ఆనాడు నా హర్షామోదాలు ప్రకటించాను. ప్రభుత్వ నిర్ణయానికి స్వాగతం చెపుతూ, హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు అధ్యక్షుడైన

శ్రీ దిగంబరరావు బిందూ ఈ మార్పు సుసాధ్యం చేసినందుకు అభినందిం చాను.

ఈ చర్యవల్ల ఎన్నో ఆశలు రేకెత్తడం సహజం. మంత్రివర్గము ఏమిచెయ్యాలో ఎట్లాపనిచెయ్యాలో సలహాలిస్తూ తమ కర్తవ్యాలను బాధ్యతలను విస్మరించకుండా ప్రవర్తించవలసి ఉంటుందని, నేను ఆసందర్భంలో ప్రజలను ఉద్బోధిస్తూ విజ్ఞప్తి చేశాను. ప్రజా స్వామ్యానికి అభిముఖంగా పయనించాలనే ఉద్దేశంతో చేస్తున్న ఈ కొత్త ప్రయోగాన్ని సహృదయతతో గమనిస్తూ అందరూ తోడ్పడాలని అర్థించాను. "పిజన్" అనే ప్రతికలో ఇట్లా వ్రాసి ప్రకటించాను.

"భయభ్రాంతులతో కంపింప చేసిన భూతకాలం గతించి, బూడిదగా మిగిలింది. దాని స్థానంలో నూతన మార్గాలు మిలమిల లాడుతున్న జీవన స్రవంతులూ ప్రత్యక్షమవుతున్నాయి. ప్రకాశవంతమైన భవిష్యత్తు ఇప్పుడే అవతరించింది. ఈ మార్పు ఎట్లా వచ్చిందో జ్ఞాపకం చేసుకుందాం. లక్షలకొద్దీ జనం దానికోసం కష్టించారు. వందలాది త్యాగమూర్తులు తమ ప్రాణాలు అర్పించారు. వారి అందరి లక్ష్యమూ ఈ కొత్తశకం అవతరణమే. నీరసించి బొమికెల గూడులావున్న తెలంగాణా రైతు మనమొగాలవైపు ఏదీ నా దారి ఏదీ నా గమ్యం అంటున్నట్లుగా నిరాశా దృక్కులతో ఏండ్లతరబడి చూస్తున్నాడు. అతని దేహంలో ఉన్న రక్తం పీల్చివేయబడింది. కొత్తగా వచ్చిన ఈ మార్పు, అతన్ని ఏండ్లతరబడి వదలకుండా వెంటాడుతున్న బాధలను శాశ్వతంగా అంతము చేస్తుందా? సామాన్య మానవుడు ఆశా పూర్ణ దృష్టితో చూస్తున్నాడు. ఈ మార్పు అతని మంచికోసం. అతనే దీని వల్ల లభించిన ఫలితాలమీద తీర్పు చెప్పవలసిన న్యాయమూర్తి.

వెంటనే సాధారణ ఎన్నికలు జరిగాయి. కాంగ్రేస్ పార్టీ పూర్తిగా ప్రజా ప్రతినిధులతో మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసింది. శ్రీ బూర్గుల రామ కృష్ణారావు ముఖ్యమంత్రి అయారు. హైదరాబాదు రాష్ట్రం భారత ప్రజాస్వామ్య పటంలో స్థానం పొందింది.

శ్రీ బూర్గుల రామకృష్ణారావు తను నాయకత్వం వహించి ప్రధాన మంత్రిగా ఉన్న కాలంలో ప్రజలకు ఒక స్థిరమైన పరిపాలన కల్పించారు రాష్ట్ర శాసన సభలో జరిగిన చర్చల నివేదికలు పరిశీలించి నప్పుడు ఆయన ప్రజాస్వామ్య పరిపాలనలో సత్సంప్రదాయాలు ప్రతి ష్ఠించేటందుకు కృషి చేసినట్లు స్పష్టమవుతుంది ప్రతిపక్ష సభ్యులు కూడా సభానాయకుడు ప్రవర్తిస్తున్న తీరును గురించి తరచు ప్రశంసా పూర్వకంగా మాట్లాడటమే ఈ అంశాన్ని రుజువుచేస్తుంది

హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు అధినేత (ముఖ్యుడు) (Chief) గా ఆయనతో నేను అనేక ''''' ల గురించి అంటే ప్రజలకు సంబంధిం నవి, పరిపాలనకు సంబంధించినవి, ప్రజాభిప్రాయాల ధోరణులు మొదలై నవి చర్చించడం జరిగేది ముఖ్యమంత్రిగా ఆయనతో జరిపిన వ్యవహారా లన్నిటిలోనూ రాష్ట్ర దైనందిన పరిపాలనా వ్యవహారాలలో ఎన్నడూ, ఎందులోనూ నేను జోక్యం కలిగించుకో లేదు కాని విధానాలకు సంబం ధించిన సామాన్య విషయాలను గురించి నిర్మొహమాటంగా కచ్చితంగా నాదృక్పథాన్ని నేనాయకు తెలియజెసేవాడ్ని ఆనాటి మౌలిక సమ స్యలపట్ల మా ఇద్దరి దృక్పథాలలోనూ, అభిప్రాయ-లలోనూ భేదాలుండేవని స్పష్టంగావేరేచెప్పడం అవసరంలేదు ఆవిభేధాలుకాంగ్రెసుసూత్రప్రాయంగా అంగీకరించిన విషయాలను అమలు చెయ్యడానికి అవసరమైన పథకాలు రూపొందించడంలోను, వాటిని పరిపాలనా యంత్రాంగం ద్వారా అమలు చెయ్యడంలోను మా అభిప్రాయ భేదాలు మరింత స్పష్టంగా బహిర్గత మయేవి ఆకాలంలో చికాకు కలిగించినవి మరికొన్ని అంశాలు కూడా ఉండేవి. వీటన్నిటి ప్రభావం వల్ల ఏ వైషమ్యాల పాలూ కాకుండా మా ఇరువురి మధ్యా పరస్పర స్నేహభావం ఈ నాటివరకూ వెల్లివిరిసింది పరస్పర గౌరవ భావం శాశ్వతంగా ఎప్పటికీ వుంటుంది.

శ్రీ బూర్గుల రామకృష్ణరావు అనేక సంవత్సరాలు హైదరాబాద్ సంస్థాన ప్రజాజీవితంలోని అనేకరంగాలలో పాల్గొని నాయకత్వం వహిం

చారు. హైదరాబాదు స్వతంత్ర పోరాటంలో పాల్గొని తన కర్తవ్య నిర్వహణ చేశారు. ఆయన గొప్పభాషావేత్త, దేశ పరిపాలనా చట్టమర్మాలు ఎరిగిన రాజనీతికోవిదుడు, ప్రజాప్రాతినిధ్య సభల ఉత్తమ సంప్రదాయాలు తనలో జీర్ణం చేసుకొన్న సభానాయకుడు

—:o:—

# 38. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ హైదరాబాద్ సంస్థాన విభజన

దేశ పరిపాలన అర్థవంతంగా సదుపాయకరంగా ఉండాలనే కోరికతో ప్రజలు కొత్త రాష్ట్రాలు ఏర్పాటు చేయవలసిందని గట్టిగా అడగడం ఆ అభ్యర్థనలకు బలం పెరిగి ఉద్యమాలు రూపొందడం జరిగింది. ప్రజాజీవితంతో పెనవేసుకొని ప్రజాస్వామ్య వ్యవస్థముందుకు సాగేటందుకూ పరిపాలనా వ్యవహారాలను ప్రజలు అవగాహన చేసుకొని వాటిలో ఉత్సాహంతో (చురుకుగా) పాల్గొనేటందుకు ప్రజలు మాట్లాడే భాష ద్వారా పరిపాలన జరిగే ఏర్పాటు చెయ్యడానికి ఏమీ ఆలస్యం జరుగ కూడదు. అయితే మనదేశంలో కొందరు ఆ మార్పు దేశ విభజనను ప్రోత్సహించి, ఐకమత్యంతో ఉండవలసిన ప్రజల్ని ముక్కలు చెక్కలుగా ఉండేచిన్న చిన్న రాష్ట్రాలతో విడిపోయేలా చెస్తుంది అని దాన్ని వ్యతిరేకించారు. కాని, తదితరులు ఆ మార్పు, అభిలషణీయమైందనీ అది సాధించడం వల్ల దేశం ప్రగతి పథంలో సరియైన దిశలో నడక సాగిస్తుందనీ, అన్నారు; దేశంలోని రాజకీయ సంస్థలన్నింటిలోనూ అత్యంత ప్రధానమైన కాంగ్రెసుసంస్థ, అనేక సంవత్సరాలకు పూర్వమే, మన దేశపటం భాషాప్రయుక్తంగా తిరిగి చిత్రించడం జరగవలసి ఉందని సూత్రీకరించి, తీర్మానించారు.

రాష్ట్రాలను భాష ప్రాతిపదికల ననుసరించి తిరిగి వ్యవస్థీకరించాలనే ఆలోచనలు హైదరాబాదు రాష్ట్రం త్వరగా విచ్ఛిన్నమయేటందుకు కారణమైనాయి. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమిషన్ నియామకము, వారు సేకరించి పరిశీలించిన సాక్ష్యాధారాలు రాష్ట్రంలోని ప్రజలు వ్యక్తి

కరించిన అచంచల శిలాసదృశమైన ప్రజాభిప్రాయమూ అన్నీ కలిసి చేసిన తుది నిర్ణయ ఫలితంగా హైదరాబాదు రాష్ట్రంలో ఉన్న మూడు భాషా ప్రాంతాలూ ఆయా భాషా ప్రాంతాలతో విలీనమై భారత ప్రజా స్వామికంలో తమ కనుగుణమైన స్థానాన్ని పొందడం జరిగినది. కొన్ని శతాబ్దాలపాటు కలిసి మెలిసి ఉండటం అలవాటైన వారికి ఈ మార్పు హఠాత్తుగా సంభవించిందనే పెద్దమార్పు అనీ అనిపించి, ఒక గాడిలో నడుస్తున్న బండి కుదుపబడినట్టి అనుభవం పొందారు. ఈ మార్పువల్ల రాష్ట్రంలోని కొన్ని వర్గాల వారికి ఆప్తులు దూరం అయినప్పుడు కలిగే మానసిక వేదనలు కలిగాయి. అందువల్ల కొన్ని చెరగని మచ్చలు మిగి లాయనే అనవలసిఉంటుంది వేర్వేరు భాషలు మాట్లాడేవారు కలిసి మెలిసి ఉండటం వల్ల కొంత సత్ఫలితం ఉంటుందని నేను అంగీకరిస్తాను కాని ఆ ఫలితాలపట్ల ఉండే ఆసక్తికి ఉన్న బలంతగ్గి తమ మాతృ భాష మాట్లాడేవారితో కలిసి జీవించాలనే కోరిక ఒకేయుమై ఎవ్వరికీ ఆపడానికి శక్యంకాని పని జరిగిపోయింది ఈ నిర్ణయంయొక్క ఔచిత్యము కొంతకాలం గడిచిన పిమ్మట, ప్రజాస్వామ్య పరిపాలన అలవాటై సాక్షిగా అనుభవంలోకి వచ్చినప్పుడు వెల్లడి [illegible] నేను నిశ్చయంగా నమ్ముతున్నాను

భారత ప్రజాస్వామ్యంలో అధునిక చరిత్రాత్మక ఘట్టాలలో పాత హైదరాబాద్ రాష్ట్రం దేశపటం నుంచి మాయం కావడం ఆకర్షించినంత ఎక్కువగా మరేదీ ప్రజలను ఆకర్షించలేదు. దేశంలో అనేక వర్గాలవారు హైదరాబాద్ రాష్ట్ర విచ్ఛిత్తి నూతనయుగోదయానికి నాందిగా భావించారు ఈ మార్పు మరో కారణంవల్ల కూడా అనివార్యంమైంది హైదరాబాద్ రాష్ట్రంలో స్వతంత్ర పోరాటం రూపొంది వర్ధమానమవుతున్నప్పుడు హైదరాబాదు రాష్ట్రం భారత ఉపఖండంపైన మిలిగిలి ఉన్న సామ్రాజ్య వాదపు చిహ్న మనేదాన్ని తుడిచిపెట్టి వేయడం అవశ్య కర్తవ్యమనీ అది భారతదేశ భవిష్యదభివృద్ధికి పుట్టకురుపు వంటిది కాకుండా చర్యలు తీసుకోవలసి ఉంటుందనీ నిర్ణయించడం జరిగింది.

హిందూదేశంలో ఉన్న కొందరు మతావేశపరులైన ముస్లిమ్‌లకు హైదరాబాదు వైపు ప్రోత్సాహం కోసం, ఆవేశంకోసము చూసే అలవాటుండడము కూడా ఎంతో దురదృష్టకరమైన విషయము. అందువల్లనే ముస్లిమ్ మత రాజకీయాలను ప్రోదిచేసి పెంపొందించిన కార్యక్షేత్రము హైదరాబాద్ రాష్ట్రమే. ఈ దేశారిష్ట ద్రోహకర కార్యకలాపాలకు, ధోరణులకు శాశ్వతంగా తుదిపలుకు తుదిచర్య జరగాలని నేను మనస్ఫూర్తిగా అనుకొన్నాను. అందులో ఏమీ అయథార్థమైన అంశములేదని ఇప్పటికీ నేను నమ్ముతున్నాను. హైదరాబాదు రాష్ట్రం తన ప్రత్యేకతను వ్యక్తీకరిస్తూ ఉన్నంతకాలమూ ఆ పాత ధోరణులు కొనసాగుతూ అప్పుడప్పుడు ప్రజాస్వామిక జీవితంతో అభివృద్ధి చెందుతున్న భారతదేశాన్ని కలుషితం చేసే ప్రమాదం ఉంది. అందుచేత హైదరాబాదు రాష్ట్ర విచ్ఛిత్తి భారతదేశ ప్రజాస్వామ్య పరిరక్షణకు అత్యావశ్యకమైంది.

ఈ విషయాన్ని గురించి నాకు పండిట్ జవహర్‌లాల్‌నెహ్రూతో అభిప్రాయ భేదం కలిగింది. ఆయన అనేక పర్యాయాలు, తాను హైదరాబాద్ రాష్ట్ర విచ్ఛిత్తికి వ్యతిరేకినని చెప్పారు. ఆయన హైదరాబాద్ రాష్ట్ర జీవనంలోని వైవిధ్యాన్ని మెచ్చుకొనేవారు. ఆయన మాటకు తిరుగులేదు. ఎదురులేదు. నాకు ఒకవంక ఆయన నాయకత్వంలో విశ్వాసం ఉంది. మరొకవంక ఆయనకు నేను విశ్వాసపాత్రుడనని నమ్మకం ఉంది. అందువల్ల ఆయనతో నాకు ఈ అంశాన్ని గురించి దృఢమైన భేదాభిప్రాయం కలిగి ఉండడము, అది తప్పనిసరి కావడము నాకు ఎంతో మానసిక వేదన కలిగించాయి. 63వ అఖిల భారతజాతీయ కాంగ్రెసు సమావేశం హైదరాబాదులో ఏర్పాటైన సందర్భంలో ఆహ్వాన సంఘాధ్యక్షుడుగా స్వాగతోపన్యాసం ఇస్తూ, నేను ఇట్లా అన్నాను. "హైదరాబాదు రాష్ట్రం సహజమైన రాష్ట్రంకాదు. అది కృత్రిమమైంది, కల్పితము. అది ఎంత త్వరగా ముక్కలైతే అంత మంచిది. భారత ప్రజాస్వామ్యానికి అది అవశ్యకర్తవ్యము". నా ఉపన్యాసం పూర్తి అయిన వెంటనే పండిత్ జవహర్లాల్ నెహ్రూ తన అధ్యక్షోపన్యాసాన్ని ఇస్తూ, హైదరాబాదు రాష్ట్రం యథా

తథంగా కొనసాగడం వాంఛనీయమని వాదించారు. ఈ సందర్భంలో పండిట్‌జీలో వ్యక్తమైన అత్యంత ప్రశంసనీయ లక్షణాన్ని తెలియజేసే ముఖ్యమైన ఉదంతం ఒకటి చెప్పడం న్యాయము. హైద్రాబాదు కాంగ్రెస్‌లో పాల్గొనేటందుకు నెహ్రూజీ వచ్చీ రాగానే నేను నా ఉపన్యాస పాఠాన్ని (అచ్చైన కాపీని) ఆయనకు అందించాను అది చూసి అందులో ఆయనకు నచ్చని అంశాలను, ఆయన సూచిస్తే అవి తొలగించాలని లేదా పూర్తిగా మరో కొత్త ఉపన్యాసాన్నే ఇవ్వవచ్చుననీ నా ఆకాంక్ష. కాని పండిట్‌జీ కాంగ్రెస్ సభా ప్రారంభ సమయంలో నా ఉపన్యాస పాఠం నాకు తిరిగి ఇచ్చివేశారు ఆయన దాన్ని గురించి ఏమీ మాట్లాడలేదు నాకు ఏ సూచనలూ చెయ్యలేదు. ఆయన హృదయ వైశాల్యము ఇతరుల అభిప్రాయాల ప్రకటనకాయన ఇచ్చే స్వాతంత్ర్యమూ నాకు అవగతమైనాయి అందువల్ల ఆయనపట్ల నాకున్న మెప్పుదల పెరిగి కొండంత అయింది. చివరకు ఆయన హైదరాబాద్ రాష్ట్ర విచ్ఛిత్తికీ, భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకు అంగీకరించారనే విషయం ఆయన నరనరాలా ప్రజాస్వామ్యవాది అనీ, భారతదేశపు భవిష్యత్తు ఆయన హస్త పరిరక్షితమనీ వ్యక్తమైంది.

హైదరాబాద్ ప్రదేశ్ కాంగ్రెస్ కమిటి సర్వ సభ్య సమావేశంలో హైదరాబాద్ స్టేట్ భాషాప్రయుక్తంగా ఇతర రాష్ట్రాలతో విలీనం కావాలని తీర్మానించింది ఆ తీర్మానం ఏకగ్రీవంగా జరిగింది భారత జాతీయ కాంగ్రెసు కార్యదర్శులలో ఒకరైన శ్రీమన్నారాయణ్ ఆ నిర్ణయం జరిగినప్పుడు సభలో ఉన్నారు ఆ తీర్మానం యొక్క సారాంశం ఇంగ్లీషు వార్తాపత్రికలలో కూడ ప్రకటితమైంది అధినివేశ రాజ్యాల (కామన్‌వెల్త్‌నేషన్స్) ప్రధాన మంత్రుల సమావేశానికై ఇంగ్లండు వెళ్ళిన మన ప్రధానమంత్రి జవహర్‌లాల్‌కు ఆ రిపోర్టు విచారం కలిగించింది. ఆయన తనకు దానిని గురించిన వివరాలు తెలుపవలసిందనీ, తీర్మానపు పూర్తి పాఠం పంపవలసిందనీ కోరుతూ వార్తాపత్రికను పంపించారు నేను సమావేశం నిర్ణయించిన తీర్మానపు కాపీ పంపించాను అది పరిశీలించి ఆయన అక్కడ

వార్తాపత్రికలలో తాను చదివిన వార్తల కంటె తీర్మానం కొంత భిన్నంగా ఉందనీ తాను ఈ సమస్యను గురించి మరొక విధంగా ఆలోచించాలని భావిస్తున్నట్లూ తెలియచేశారు.

మా నడుమ ఈ చర్చలకు కారణమైన తీర్మానపు పూర్తి పాఠం ఈ క్రింద పొందుపరుస్తున్నాను. "ఆంధ్ర రాష్ట్రపు ఏర్పాటు, భారత జాతీయ కాంగ్రెసు నానాల్‌నగర్ సమావేశంలో చేసిన తీర్మానాన్ననుసరించి తీసుకొన్న చర్యలలో మొదటి అడుగు (దశ) అని, హైదరాబాద్ ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ భావిస్తున్నది, 16 మే 1953 నాడు వర్కింగు కమిటీ (కార్యవర్గము) చేసిన నిర్ణయానికి ప్రధానమంత్రి రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణను గురించి పరిశీలించేటందుకు ఆంధ్రరాష్ట్రపు ఏర్పాటు తర్వాత ఒక ఉన్నతాధికార కమిషన్‌ను నియమిస్తామని ప్రకటిస్తూ చేసిన ప్రకటనకూ ఈ కమిటీవారు స్వాగతపూర్వకంగా హర్షం వెల్లడిస్తున్నారు. ఆ కమిషను నియామకాన్ని కొంత ముందుగానే చేయడం వల్ల కొత్త రాష్ట్రాల ఏర్పాటుకు సంబంధించిన ప్లాన్ తయారుచేసి సక్రమంగా రూపొందించేటందుకూ సాధ్యమైనంత త్వరగా అమలుచేసేటందుకూ అనుకూలంగా ఉంటుందనే సూచనను భారత ప్రభుత్వం పరిశీలించగలదని ఈ కమిటీ వారు ఆశిస్తున్నారు. మూడు భాషాప్రాంతాలు కూడి ఉన్న హైదరాబాద్ స్టేట్ మనుగడ, దక్షిణ హిందూదేశంలోని రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణతో ముడిపడి ఉంది. నానాల్‌నగర్ కాంగ్రెసు తీర్మానంలో వివరించిన వివిధ అంశాలకు అనుగుణంగా ఆయా భాషాప్రాంతాలను వాటికి ఇరుగుపొరుగుననేవున్న ఆయా భాషా ప్రాంతాలలో విలీనం చెయ్యవలసి ఉంటుందనే నిశ్చితాభిప్రాయాన్ని ఈ ప్రదేశ్ కాంగ్రెసు వెల్లడిస్తున్నది. ఈ అభిప్రాయాలకు సంబంధించిన ఆచరణ కార్యక్రమంగా హైదరాబాదు ప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గానికి ఒక ఉపసంఘాన్ని ఏర్పాటు చేసేటందుకు ఆ ఉపసంఘంవారు ఈ విషయాన్ని సమగ్రంగా చర్చించి, దీనికి సంబంధించిన వివరాలన్నింటినీ సేకరించి, ఉన్నతాధికార కమిషన్‌కు నివేదించి సాధికారిక బాధ్యతను వహించేటందుకు అధికారమిస్తున్నారు."

భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు ఏమీ అల్పమైన విషయంకాదు. ఏ రాష్ట్రంలోనైనా భాషావిషయంగా అల్పసంఖ్యాకులైన వారి భవిష్యత్తును గురించి నాకేమీ భయ సందేహాలులేవు. భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పాటైన కొత్తలో కొన్ని చీలిపోయే ధోరణులు వ్యక్తం అయ్యాయి, అవి సమాజ నిర్మాణంలో ఉన్న సహజ దౌర్బల్యంవల్ల కలిగినవే. అనుశ్రుతంగా పరంపరంగా వస్తున్న ఆచారాలు, నమ్మకాలు, అలవాట్లు, అన్నీ కలిసి ఒక్కుమ్మడిగా పైకి ఉబికి విరుచుకుపడినట్లైంది. అట్లా జరిగిందికదా అని సహజ ధోరణికి అనుగుణంగా నిర్వహించవలసిన కర్తవ్యంలో మార్పులు చెయ్యకూడదు. ఈ పరిస్థితి బహుసంఖ్యాకులుగా ఉన్నవారిలో విశాల హృదయము అల్పసంఖ్యాకులుగా ఉన్న వారిలో సహనమూ, సర్దుకొనిపోయే గుణమూ, ఉండాలని వెల్లడి చేస్తుంది. పాతపరిపాలననుంచి కొత్త పరిపాలనలోకి ప్రవేశించిన వారు దాన్ని సరియైన దృక్పథంతో అవగాహనచేసుకొని దానికనుగుణంగా తమ జీవితాలు కొనసాగించవలసి ఉంటుందనే గుణపాఠాన్ని చరిత్ర వివరిస్తున్నది.

జాతి ఏకీకరణను (Integration) గురించి, అంటే భారతీయులందరూ ఒకే జాతి అనే భావాన్ని ప్రోదచేసి పెంపొందించడానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చి అందరమూ కృషిచేస్తున్నాము. హిందూ దేశపు ఐక్యత, సమగ్రత, పటిష్టంగా ఉండి ఏవైపు నుంచి వచ్చిన దాడినైనా మనం ఎదుర్కొనాలంటే ఏకీకరణ అతి ముఖ్యము. దేశ భక్తి కల ప్రతి పౌరుడికీ అది ప్రథమ కర్తవ్యము. పౌరుల బాధ్యత, ఈ కర్తవ్యపాలన, అట్లాగే ప్రభుత్వాలకు ఒక కర్తవ్యం ఉంది. ప్రతి రాష్ట్ర ప్రభుత్వమూ తనపరిపాలనలోవున్న అల్పసంఖ్యాకులు అసంతృప్తి, నిరాశ, నిస్పృహల పాలుకాకుండా వారి పౌర హక్కులను పరిరక్షించేటందుకు సంపూర్ణమైన బాధ్యత వహించాలి.

ఈ కొత్త వ్యవస్థ గత ఆరు సంవత్సరాలుగా పని చేస్తోంది. ప్రాంతీయ భాషను రాష్ట్ర స్థాయిలో పరిపాలనా భాషగా పరిగణిస్తామని మరికొంత కాలంపాటు ఇంగ్లీషు కూడా అదనపు పరిపాలనా భాషగా

కొనసాగుతుందనీ నిర్ణయించి అమలు చేస్తున్నారు. ప్రతి రాష్ట్రంలోనూ మరో రాష్ట్రీయ భాష మాతృ భాష అయినవారు తగినంత మంది ఉన్నారు. వారు తమ పిల్లల చదువులకు ఎన్నుకోవలసిన భాష ఏది? రాష్ట్రపరిపాలనలో వారేరీతిగా పాల్గొనడం? అనే అంశాలకు సంబంధించిన చర్చలు ప్రాముఖ్యం వహించాయి. అట్లాంటి అల్పసంఖ్యాక భాషావర్గాల వారి కష్ట నిష్ఠురాలు తగ్గించే చర్యలు కొన్ని తీసుకోగలిగినా వారి భయాందోళనలను తొలగించేటందుకు తీసుకొనవలసిన చర్యలు ఎక్కువగా మిగిలిపోయే ఉంటాయి. ప్రతి సంవత్సరమూ లోక్ సభకు (పార్లమెంటుకు) సమర్పించే నివేదికలలో అల్ప సంఖ్యాక భాషా వర్గాల కమిషనరు, అల్ప సంఖ్యాక భాషా వర్గాల వారి సమస్యల్నీ వాటి పరిష్కారాలకు సూచించడం జరుగుతూనే ఉంది. వాటిలో కొన్ని పునరావృత్తమవుతూ ప్రతి ఏడూ అవసరమైన చర్యలను వదలకుండా ఆ నివేదికలలో ప్రత్యక్షమవుతూనే ఉన్నాయి.

ఇటీవల కొందరు ప్రముఖ నాయకులు భాషా ప్రయుక్త రాష్ట్రాలను చీల్చివేయడం అవసరమని హిందూదేశాన్ని వివిధ మండలాలుగా పునర్వ్యవస్థీకరణ చెయ్యాలని నొక్కిచెప్పడం వినిపిస్తోంది. మరికొందరు రాష్ట్రాల సరిహద్దులు ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడు మార్చడానికి ఎంతమాత్రమూ వీలులేదనీ, ఇప్పుడు ఉన్న రాష్ట్రవ్యవస్థను వీలైనంత ఎక్కువ ఉపయుక్తంగా చేసుకొంటూ ముందుకు సాగాలనీ అంటున్నారు. అత్యంత విశాలమైన హిందూదేశం వంటి దేశంలో దాన్ని ఏ పద్ధతిగా వ్యవస్థీకరించినా కొందరికి కొన్ని కష్టాలూ, చిక్కు సమస్యలూ తప్పవు. సహనంతో, అవగాహనతో వాటిని ఎదుర్కొని పరిష్కరించుకోవాలి. కొన్ని సూత్రాలు ఆధారంగా ఇప్పుడు వ్యవస్థీకరించి ఏర్పాటు చేసుకున్న రాష్ట్రాల వ్యవస్థవల్ల లభించే సత్ఫలితాలు బహుశా, కొంతకాలం తర్వాత మాత్రమే పూర్తిగా అందుబాటులోకి రావచ్చు. ప్రజల దృక్పథంలో వచ్చిన మార్పులు గమనించినప్పుడు నాకు ప్రజాస్వామిక తత్త్వము వారి మనస్సుల్లోకి చొచ్చుకొనిపోయిందనీ, పౌర బాధ్యతల గుర్తింపు వారిలో వృద్ధిచెందిందనీ నిస్సందేహంగా అనిపిస్తుంది.

మన జాతీయ నాయకులందరిలోనూ పండిట్ జవహర్లాల్ నెహ్రూ నన్ను ఆకర్షించారు ఆయన ఉత్కృష్టతను, గుణ విశేషాల్ని మాటలలో వివరించడం నాకు అసాధ్యం. ఆయన నిష్కాపట్యము, విశ్వాసపాత్రత పనులుచేయడంలో వెల్లడియైన శక్తిసామర్థ్యాలు నాకు మెప్పుకలిగించాయి. ఆయనకు ప్రజాస్వామ్య సిద్ధాంతం పట్ల, సామ్యవాదం పట్ల, ప్రపంచ శాంతి పట్ల, ఉన్న దృఢ విశ్వాసము, ఆయనకు ప్రపంచంలో ఉన్న అగ్రగణ్య, అగ్రగామి రాజకీయ వేత్తల సరసన గౌరవనీయ స్థానాన్నిస్తుంది. హిందూదేశంలోని సామాన్య ప్రజలలో ఆయనపట్ల వ్యక్తం అయే ఆరాధనాభావం అపూర్వమైనదనీ, అపరిమితమైనదనీ అనవచ్చు భావితరాలవారు ఆయన్ని కృతజ్ఞత పూర్వకంగా స్మరిస్తూ భారత భాగ్యవిధాత యైన శిల్పిగా పేర్కొంటారు. ఆయన నాయకత్వం కింద పనిచేయడం భాగ్యమని నేను భావించాను.

నెహ్రూ తర్వాత ఆయన స్థానాన్ని ఎవరు పూరిస్తారు? అనే ప్రశ్న ఆయన జీవించి ఉన్నప్పుడే తరచు వచ్చేది 'ఆయనకు ఆయనే సాటి; ఆయన వంటివారు రారు: నభవిష్యతి" అనేది ఒక్కటే ఆ ప్రశ్నకు తగిన జవాబు. ప్రఖ్యాత నాయకులను చరిత్ర సృష్టిస్తుంది వారు చరిత్రను సృష్టిస్తారు, నెహ్రూజీ శక పురుషుల కోవకు చెందిన వాడు. ఈ శతాబ్ది సృష్టించిన జాతిరత్నాలలో ఎన్నికైనవాడు ఆయన మానవతావాది. ఆయనలో ఆధ్యాత్మిక భావం ఆధునిక భావాలలో గర్భితమై ఉంది. ప్రపంచశాంతి కోసం కృషిచేసే సత్తాను (శక్తిని) ఆయన భారతదేశానికి కలిగించాడు.

భారతదేశంలో ప్రజాస్వామ్యం లోప భూయిష్టమైనదైనప్పటికీ ఆ లోపాలు అనేకమైనప్పటికి, పండిట్‌జీ తన జీవిత కాలంలోనే ఈ దేశంలోని ప్రజా ప్రతినిధుల సభ (పార్లమెంటు/లోక్ సభ) ప్రజాస్వామిక సంప్రదాయాలకు కట్టుబడి పనిచేసేటందుకు అవసరమైన గట్టి పునాదులు వేసి కీర్తిమూర్తి యైనాడు. గట్టిపునాదులు పడినాయి, దానిపైన నూతన సౌధ నిర్మాణం చేయవలసిన బాధ్యత హిందూ దేశ ప్రజలపైన మన భుజ స్కంధాల మీద ఉంది,

# 39. కాంగ్రెసు - భారతదేశ ప్రజాస్వామ్యము

కాంగ్రెసు సంస్థ కార్యకర్తల దృక్పథంలో పరివర్తనలో త్వరగా మార్పు రాసాగింది స్వతంత్రం రాగానే త్యాగం చెయ్యడానికి ఆవశ్యకత తగ్గిందనే భావం వారిలో పొటమరించింది. స్వరాజ్య సాధనకోసం నడచిన ఉద్యమాలన్నింటిలోనూ ప్రాధాన్యం వహించిన త్యాగనిరతి పట్ల వారిలో అభినివేశం సడలినట్లైంది. అభివృద్ధి పథకాలు ఏర్పాటు చెయడము నిర్వహించడము పూర్తిగా ప్రభుత్వం యొక్క బాధ్యతే అని పౌరులు ప్రభుత్వం యొక్క ఆజ్ఞలను పాలించి ఫలితాలు సాధించి లాభం పొందడమేననీ విరివిగా ప్రచారం చెయ్యడం జరిగింది ప్రభుత్వ యంత్రాంగమే అన్ని రంగాలలో పెత్తనం చెలాయించింది. విమర్శలకతీతమైన నిరంకుశమైన, ప్రభుత్వ నియమాలే ప్రజల వ్యవహారాలన్నింటినీ నియంత్రణ మొనర్చేవి అందువల్ల పరిపాలనా వ్యవస్థలో ఎక్కడ ప్రజల అభిరుచులకూ, ఆశయాలకూ ఆశలకూ తావేలేకుండా ఉంది పంచాయత్ రాజ్ సంస్థల ద్వారా ప్రభుత్వాధికారాన్ని వికేంద్రీకరించే టందుకు జరిగిన ప్రయోగాత్మక ప్రయత్నాలు ఇంకా అత్యంత శైశవావస్థలోనే ఉన్నాయి. వాటి భావి ప్రయోజనాన్ని గురించి కొండంత ఆశలు పెట్టుకొన్నప్పటికి అవి ఇప్పుడున్న పరిస్థితినిబట్టి వాటి ప్రభావం గమనించ తగినంతగాలేదు. ప్రస్తుతం దేశం పరిస్థితి చూస్తే జాతీయ జీవితంలో ఎదురవుతున్న సమస్యలకు పరిష్కారాలు కనిపించటంలేదనే భావం కలిగి ప్రతివ్యక్తిలోనూ నిరాశ, నిస్పృహ క్రమంగా ప్రబలుతున్నట్లు కనిపిస్తోంది

ఈ పరిస్థితి చాలా శోచనీయమైంది, విచారకరమైంది దీనికి తోడు దేశ వ్యవహారాల్లో ధనవంతుల 'ధనం' వహిస్తున్న పాత్ర నానాటికి పెరుగుతూ మరింత విచారం కలిగిస్తోంది. ఒకప్పుడు ఒకే మనిషి వలె ఉండి ఏక వాక్యతతో వ్యవహరించిన కాంగ్రెసు సంస్థ, దాని లోని మెంబర్ల సంఖ్య లక్షలు దాటి వారిలో వ్యక్తమయ్యే విభిన్న భావాలతోటి, విరుద్ధ భావాలతోటీ పరస్పర పోటీలతోటీ అస్తవ్యస్తపు గందరగోళపు సంస్థవంటిదైంది ఏదైనా ప్రాధాన్యతగల పదవిలో ఉన్న ఒక వ్యక్తిని గాని, గ్రూప్‌ను గాని తొలగించడమే కాంగ్రెసు పార్టీలో ఉన్న వారిలో నేడు కనిపించే అభినివేశము అనిపిస్తున్నది. నిజాయితీపరులూ, సేవాపరాయణులూ ఒకరి తర్వాత ఒకరుగా కాంగ్రెసు సంస్థను విడిచి పెట్టి ఇతర చోట్ల సర్దుకున్నారు డబ్బులేని వారందరూ నిరాశ్రయులైనారు వారి సంగతిని ఎవరూ తల పెట్టడమే లేదు ఇది కాంగ్రెసు సంస్థ. బారుగా తలుపులు తెరచి "ఎవరైనా సరే మా కాంగ్రెసులో మెంబర్లుగా చేరవచ్చు మీ పూర్వచరిత్ర, ప్రవర్తన ఎట్లాంటిదైనా పరవాలేదు రండి, మీకు మా స్వాగతము" అంటూ ఆహ్వానించిన చర్యఫలితమే ఈ పరిస్థితి నానాగోత్రాలకు నానా పార్టీలకు చెందిన వారందరు వచ్చిచేరి, అత్యున్నతమైన భవనంవంటి ప్రజాహిత సంస్థను చెద పురుగులు దొలిచినట్లు దుర్బలమైనదిగా చేశారు. హైదరాబాదు స్టేట్ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఈ విషాదకరమైన పరిస్థితులను నేను కళ్లారాచూశాను. అనేక సంవత్సరాలు దేశభక్త్యుద్దీపిత సేవాకార్యక్రమాల్లో నిమగ్నులైన కార్యకర్తలను పదవుల నుండి దింపడానికి ధనం చూపించీ, ఇతర ప్రలోభాలు, ఒత్తిడులు ప్రయోగించీ, మంది మద్దతు సంపాదించడం నేను కళ్లారా చూశాను అందుచేత, కాంగ్రెసు సంస్థ, మెంబర్ల సంఖ్యాబలం దృష్ట్యా విపరీతంగా అభివృద్ధి చెందినప్పటికీ శీలసంపద దృష్ట్యా నైతికస్థాయి దృష్ట్యా పతనోన్ముఖమైందనడం ఎవరికీ ఆశ్చర్యం కలిగించదు ఈ పరిస్థితులను ఇట్లాగే వదలివెయ్యడానికి వీలు లేదు ఏదో చెయ్యాలి. దీన్ని అరికట్టాలి. కాంగ్రెసు సంస్థకు ఏరీతిగా పునర్వికాసం పునరుజ్జీవనం కలిగించడము అనే విషయమే వృద్ధులూ అనుభ

వజ్ఞులూ ఐన కాంగ్రెసునాయకుల చర్చలలో ఇష్టాగోష్ఠులలో ప్రధానవిషయ మైంది. కాంగ్రెసు వర్కింగ్ కమిటీలో సభ్యుడుగా ఉన్నందు వల్ల నేను ఈ చర్చలలో అనేక స్థాయిలలో పాల్గొనడము, కొన్ని సూచనలు చెయ్యడము, అనేక సూచనలు పరిశీలించడము జరిగింది. ఆ పని కోసం ప్రత్యేకంగా అనేక ఉప సంఘాలు (సబ్ కమిటీలు) కూడా ఏర్పడి ఎన్నో ప్రతిపాదనలు తీర్చి దిద్దారు. అయినప్పటికీ, ఈ విస్తృతమైన చర్చల ఫలితంగా సార్థకమైన సూచనలేవీ లభించలేదనే అనాలి. ఒకసారి నేను పండిట్ నెహ్రూకి కాంగ్రెసు సంస్థలోని పదవులకు ఒక నిర్దిష్టమైన, ఎంపిక విధానం ప్రవేశపెట్టడం తగిన విధానం అని సూచించాను కాని అట్లాంటి విధానం ప్రజాస్వామ్య సిద్ధాంతానికి అనుగుణమైంది కాదని ఆయన నిరాకరించారు ఈ కమిటీలన్నీ పట్టుదలతో ఎడతెగకుండా చేసిన ఆలోచనలవల్లా పరిశీలించిన సూచనల వల్లా ఏమీ నిర్ణయాలు అమలు జరుగలేదు. ఈ విషయం కాలప్రవాహ వేగంలో ఎటు పడితే అటు కొట్టుకు పోవడం సంభవించింది

చాలాకాలం పాటు కాంగ్రెసు లక్ష్యం నిర్దిష్టంగా ఇదమిత్థం అని నిర్వచనం చెయ్యడం జరుగలేదు ఆ ఆశయం కాంతిమేఘం వలె అస్పష్టంగా ప్రకాశవంతంగా మాత్రమే ఉంది. అందులో ఉన్న వస్తుతత్త్వం స్పష్టంగా వివరించడం ఎప్పుడూ జరుగిలేదు అందుచేత కాంగ్రెస్‌లో ఉన్న వేర్వేరు వర్గాలవారు, దాన్ని తమకు అనుకూలమైన రీతిగా కాంగ్రెసు ఆశయాన్ని వ్యాఖ్యానించడం జరిగింది దాని ఫలితంగా కాంగ్రెసు ఆశయాల భావ వివరణలలో అస్పష్టతా, వైవిధ్యము, వైరుధ్యము,గందరగోళము, ప్రస్ఫుట మైనవి. అనేక చేదు అనుభావాలు, అనేక సిద్ధాంత పరమైన వాగ్వాదాల మూలంగా కలిగిన లాగానాం పీకానాం ఫలితాలు, మొదలైన వాటి అన్నింటి ఫలితంగా ప్రజాస్వామ్య విధానాత్మక సోషలిజము (సామ్యవాదము) కాంగ్రెసు లక్ష్యమని తీర్మానించడం జరిగింది ఈ నిర్ధారణ మూలంగా అంతవరకు సంచలిస్తున్న కాంగ్రెసు ధృక్పథం కొంతవరకు స్థిరపడింది, వ్యవహారాలు సరియైన దిశలో కొనసాగడం ప్రారంభమైనది కాని, అది

ఆచరణలోకి రావడము, ఫలితాలు కన్పించడము అనేవి నిరాశా జనక మైనంతగా సాగుతూ నిరుత్సాహకరంగా ఉన్నాయి

'డబ్బే అధికారానికి మూలం,' 'అధికారం ధనసంపాదనకే!', అనే మాటలే తరుచు విన్పిస్తున్నాయి అధికార పదవులలో ఉన్న అత్యంత సామాన్యులైన వారు అతి స్వల్ప కాలంలోనే విపరీతంగా ధనం సంపాదించి, ఆస్తిపాస్తులు కల్పించు కొనడం చూచి ప్రజలు నిర్ఘాంత పడటం జరుగుతుంది. బాధ్యతలున్న పదవులు స్వీకరించిన వారు తమ ఆస్తి పాస్తులను ప్రకటించాలంటూ నిర్ణయించి, చేసిన సూచనలను వారిలో అనేక మంది ముఖ్యులు కూడా లెక్కలోకి తీసుకొననేలేదు వారు దాన్ని చిత్తు కాగితం లెక్కన చింపిపారేసినట్లయింది ఈ 'కుళ్లు' అట్లాగే కొనసాగుతూ ఉంది, ఎట్లాంటి పరిణామాలకు దారి తీస్తుందో ఎవరమూ చెప్పలేము. ప్రజలు, తమ ప్రతినిధులమీద విశ్వాసం కోల్పోతున్నారు

ఈ పరిస్థితులు నిజంగా విషాదకరమైనవనే అనాలి కాంగ్రెసు సంస్థ, దానిలో కొన్ని లోపాలు ఉన్నప్పటికీ, అది పూర్తిగా మన జాతీయ జీవితాన్ని ఆవరించి చైతన్యవంతం చేసింది రాజకీయ, పరిపాలన, అధికారాలు హస్తగతం చేసుకొన్న కాంగ్రెసు పార్టీకి ఇంతకంటె ఎక్కువ సత్ఫలితాలు సాధించగల శక్తి ఉంది కాని, సాధనాల లోపం మూలంగా ఆర్థికాభివృద్ధి కార్యక్రమాలు, జాతి పునర్నిర్మాణ కార్యక్రమాలు, ముందుకు కొనసాగటం లేదు. ఉద్యోగుల పరిపాలన మాత్రమే కొనసాగుతోంది అధికారానికే గాని, సే [illegible] పోయింది ఈ విషాదకర పరిస్థితులకు బాధ్యత తనదికాదనేటందుకు కాంగ్రెసు సంస్థకు అవకాశము లేదు ప్రతి పక్ష రాజకియ పార్టీల వారు కూడా ఈ నాటి అవినీతికర ధోరణులకు కొంత బాధ్యత వహించవలసి ఉన్నప్పటికీ దేశ పరిపాలన ఏ అడ్డు లేకుండా నిర్వహిస్తున్న పార్టీదే అందులో పెద్ద వాటా ఈ పరిస్థితి ఇట్లాగే కొనసాగుతుందా ? సామాన్య పౌరుడు నానాటికి మరింత సంశయాత్మకమైన నిస్పృహలో మునిగిపోవలసిందేనా? ఇంతకంటె స్వచ్ఛమైన ప్రజా జీవితము, పరిపాలన మనకు లభిస్తాయని ఆశించగలమా? పరిస్థితులు చెయ్యి దాటే తీరుగా ఉన్నప్పుడు కేవలం మాటలతో ప్రయోజనం ఏమీ ఉండదు.

ఇటీవల కొన్ని ఆశాజనకమైన చిహ్నాలు కనిపిస్తున్నాయి. లాల్ బహద్దూర్ శాస్త్రీజీ నాయకత్వం ఆ ఆశా భావానికి కారణము సామాన్య ప్రజలలో నుంచి వచ్చిన మనిషిగా ఆయన జన సామాన్యం యొక్క అవేదనను బాధలను, అవగాహన చేసుకొని కాంగ్రెసు కార్యాచరణ విధానంలో ఒక కచ్చితమైన పద్ధతి రూపొందించే ప్రయత్నం చేశాడు. హఠాత్తుగా ఆయన పాత్ర ముగిసింది అయినప్పటికీ అదృష్టవశంగా లోకజ్ఞుడు ప్రజల కష్టాలు తెలిసిన వాడూ అయిన శ్రీ కామరాజ్ కాంగ్రెసు అధ్యక్షుడు అవడము వల్ల సంస్థ కార్యకలాపాలు మెరుగుపడతాయేమోననే భావం కలుగుతోంది అయితే, అది ఒక్కటి సరిపోతుందా? ప్రధానిని ఎన్నుకొనవలసినప్పుడు దేశం ఇంతకు ముందు ఎదుర్కొన్న రెండు క్లిష్ట పరిస్థితులలోనూ ఆయన చూపిన ప్రతిభా, నిర్వహించిన ప్రభావవంతమైన పాత్రా ఒక ఆశా కిరణంగా ఉన్నాయి మన దేశంలొ అణగ త్రొక్కబడిన పేదల అగతిక స్థితిని, వారి భావావేశ ఉద్వృతను గుర్తించ గలిగిన నాయకుడు, సామాన్య ప్రజల నుంచి వచ్చినవాడు, ఒకడైనా ఉన్నాడనే సత్యమే ఈ నిరాశాజనక పరిస్థితులలో కనిపిస్తున్న ఆశారేఖకు కారణము సూచనప్రాయంగా కన్పించే ఈ మార్పు నిలదొక్కుకొని బలం పుంజుకుంటుందా?

వ్యక్తులలో ఉన్నతులు అల్పులుకూడా జగన్నాటక రంగం మీదికి వస్తూ ఉంటారు, పోతూ ఉంటారు. కాని ప్రజా జీవితం మీద వారి ప్రభావము, ముద్ర శాశ్వతంగా పడుతాయి. అదొక్కటే చాలునంటామా? వారి ప్రభావం వల్ల తాత్కాలికంగా కలిగే మార్పులు లభించే ఫలితాలు, సమాజంలో వేరుతన్ని మూకుమ్మడిగా కొనసాగే ఉద్యమంగా రూపొందకపోయి నట్లయితే లాభం కలగదనీ ఆ మహోన్నతుల ముద్రా ప్రభావం మిథ్య అవుతుందనీ నేను సంశయిస్తాను ఈ భావాలను అనువర్తించి తమ కార్యక్రమం ప్రజలు నిర్వహించకపోయినట్లయితే కాంగ్రెసు భవిష్యత్తు ఉత్సాహకరంగా ఉండదు. అప్పుడు వచ్చే ఫలితం ఏమిటి? శైశవ దశలో ఉంది అని ప్రజలు ఎన్నో ఆశలు పెట్టుకొన్న మన ప్రజాస్వామ్యము నష్టమవుతుంది. అది సభ్య ప్రపంచానికే విషాదకర__ ది

ఈ నాడు కాంగ్రెసు ఒక్కటే ఏ అడ్డూలేకుండా అధికారం చెలాయిస్తున్న రాజకీయపార్టీ. దానికి ఎదురుగా పేర్కొనడానికి తగిన ప్రతిపక్ష వర్గం ఏదీ రూపొందలేదు. అందు వల్ల కాంగ్రెసు బాధ్యత మరింత ఎక్కువైంది. అది గుర్తించి, సమయం మించిపోకుండా కాంగ్రెసు తన ఇంటిని తాను చక్కబెట్టుకోవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది

అప్పుడప్పుడు మౌనంగా వుండి, ఇప్పటి విషాదమయ పరిస్థితులు ఎట్లా మారుతాయా అని ఆలోచనలు కొనసాగించినప్పుడు ఆ ఆలోచనల (musings) ఫలితంగా మన జాతి యొక్క జీవితంలో నైతిక విలువల ప్రాధాన్యం పెంచడం జరగకపోతే కల్మష రహితమైన పరిశుద్ధ సామాజిక జీవితం లభించదనే నిర్ణయానికి రావడం జరుగుతున్నది అయితే దాన్ని సాధించడం పరిపాలనా యంత్రాంగం ద్వారా సాధ్యం అవుతుందా? నా అనుభవాన్ని బట్టి నేటి పరిస్థితుల పరిశీలన ననుసరించి అట్లాంటి పని సాధ్యం కాదనే అనిపిస్తున్నది. ఆ లక్ష్యం వైపు పురోగమించేటందుకు అధికార వ్యామోహంతోటీ మద మాత్సర్యాలతోటీ ఏ సంబంధమూ లేని సేవాభావము, దృక్పథము అవసరము పదవులవైపే ఆశా పూర్ణ దృక్కులతో ప్రజలు చూస్తూ ఉండకుండే దృక్పథం కలిగించి, దాన్ని ప్రోది చేసేటందుకు ఈ విధానం ఒక్కటే శక్తివంతమైన విధానం ఈ అంశాన్ని గురించి విభిన్నమైన అభిప్రాయాలున్నాయని నాకు తెలుసు కాని, ఈ పద్ధతి యొక్క సామర్థ్యాన్ని గురించి దృఢమైన విశ్వాసం ఉన్నందు వల్లనే నేను నా కార్యక్రమాలకు ఆ విధానాన్ని ఎన్నుకొన్నాను

భవిష్యత్తు ఎట్లా రూపొందుతుందో నాకు అగమ్యగోచరంగా ఉంది కాంగ్రెసు, తానునిర్వహించవలసిన పాత్రకు అనుగుణంగా తనను తాను తీర్చిదిద్దుకొని మారుతుందా? అట్లా చేస్తుందని చేయగలుగుతుందని మనం ఆశిద్దాం. ఈ సమస్య కాంగ్రెసు భవిష్యత్తుతో కంటె ప్రజాస్వామ్య పద్ధతి యొక్క భవిష్యత్తుతో అంటే అది నిలదొక్కుకొనడమా నేతి బీరకాయ వంటిది కావడమా అనేదానితో ఎక్కువ ముడిపడిఉంది.

అదృష్ట వశాత్తు మన ప్రజాసామాన్యం యొక్క దృక్పథం ఏ వంకరలూ లేకుండా సక్రమంగా ఉంది. ప్రజాస్వామిక ఆశయాలే వారిలో క్రమంగా వ్యాపిస్తున్నాయి వారు వాటిని త్రికరణ శుద్ధిగా అంగీకరించి అవి కచ్చితంగా అమలు జరిగేటట్లు చూస్తారనే ఆశ కనిపిస్తోంది ఆ ఆశ ఒక్కటే మన దేశ రాజకీయాల్లోనూ పరిపాలనా వ్యవస్థలోనూ, ప్రవేశించి వాటిని రోగగ్రస్తం చేసిన కుళ్లును క్షాళనం చేసి పరిశుద్ధం చేయగలుగుతుందనే భావానికి పట్టు కొమ్మ అందుచేత ప్రజలలో వ్యక్తం అవుతున్న సహజ స్వభావాన్ని బలపరచి వారికి అన్యాయాలను ఎదుర్కొనే చొరవ, నైతికశక్తి, కలిగేలా ప్రయత్నం చెయ్యవలసి ఉంది. ఆ కార్యసాధన కోసమై మనలో ప్రతి ఒక్కరమూ ఉడతా భక్తితో ఎవరి శక్తి సామర్థ్యాలను అనుసరించివారు ప్రయత్నించి మొత్తం మీద మనం అందరమూ వాంఛించే ఈ మార్పు తెచ్చేటందుకు కృషి చేద్దాము

# 40. మార్పు

చాలా మంది నన్ను తరచు ఇట్లా అడగటం జరిగింది. మీరు సన్యాసాశ్రమం స్వీకరించారు కదా! ఈ రాజకీయ సుడిగుండంలోకి ఎట్లా లాగబడ్డారు? సామాన్యంగా ప్రజలందరూ 'సన్యాసులు ఐహిక విషయాలకు దూరంగా ఉంటారు; వారు అట్లాగే ఉండాలి' అని నమ్ముతారు. కొంతమంది 'మీరు రాజకీయాల నుంచి వీలైనంత త్వరగా తప్పుకోండి' అని నాకు సలహా ఇచ్చారు వారి సలహాను నా పట్ల ఉన్న ప్రేమాభిమానాల వల్లనే ఇచ్చారు. అట్లాగయినప్పటికీ రాజకీయ రంగంలో నేను ఈ నిమిషం వరకూ పని చేస్తూ వచ్చాను బహుశా నేను దాని నుంచి వైదొలగ వలసిన సమయం ఇప్పుడు వచ్చిందని భావిస్తున్నాను రాజకీయ కార్యక్రమాలతో ముడిపడిన ఈ జీవితం, నేను ఎన్నుకొన్నది కాదు ఇట్లాంటిది ఎప్పుడూ నేను అనుకున్నదీ కాదు. మారుమూల నున్న ఒక గ్రామానికి పోయి, సత్యాన్వేషణ సాగిస్తూ ఎవరితోనూ ఏ సంబంధం లేని ప్రశాంతమైన జీవితం గడపుతున్న వాడ్ని. నా జీవితం ఆ కార్యక్రమానికీ, విధానానికి, అనుగుణంగా మలచబడింది ఆ జీవితమే సన్యాసాశ్రమ స్వీకారానికి దారి తీసింది ఆ రోజుల్లో రాజకీయ కార్యకలాపాలలో మునిగితేలవలసి వస్తుందని నేను కలలో కూడా భావించలేదు పరిసరాలు, పరిస్థితులు, నన్ను రాజకీయ కార్యక్షేత్రంలోకి నడిపించాయి నేను సర్వమూ భగవంతుడికి అర్పితం చేశాను హైదరాబాదు స్వాతంత్ర్య పోరాటమే నన్ను రాజకీయ కార్యక్షేత్రంలో కేంద్ర స్థానంలో నిలబెట్టింది

ఆ మార్పును నేను ఏ సంశయాలూ లేకుండా భగవదాజ్ఞగా భావించి శిర సావహించి ఆయన ఆజ్ఞాపాలన చేశాన, అంతే నా కోరిక ప్రకారం నడచు కోనేటందుకు నేనెవర్ని? నా కృషిలోని ప్రతి అంశమూ ఆయన కర్పిం చిన పూజాప్రసూనమే "యద్యత్కర్మకరోమి తత్తదఖిలం-తవారాధనం" అనికదా సద్విజ్ఞుల భావన. సంప్రదాయ దృష్టితో ఆలోచించి పరిశీలిస్తే రాజకీయాలు రాజకీయాలు కావు. అవి సేవా కార్యక్రమాలు అని నేను వినయ పూర్వకంగా అంగీకరించి నిర్వహించిన ధ్యానం, దరిద్ర నారా యణ సేవా అనే కార్యక్రమాలు. ఇది తాత్కాలికమైనదనీ ఏనాటో ఒక నాడు వెరపురుగుకు పోయేదేననీ నేనెఱుగుదును. కార్మికుడైన, కర్మయోగి చేసే పనిలో ఒక పనినుంచి మరోపనిలోకి మార్పు కలగవచ్చు కాని, శ్రద్ధలో అనాసక్త యోగ భావనలో లగ్నమై ఉన్న అతని హృదయం అనవరతము (ఎప్పుడూ) ఒకేతీరుగా ఉంటుంది ఎప్పుడు భగవంతుడు సంకల్పిస్తే అప్పుడు నాకు రాజకీయ కార్యకలాపాల నుంచి తక్షణమే విముక్తి సిద్ధిస్తుందని నాకు తెలుసు

పార్లమెంటరీ కార్యక్రమాలు మానుకోవాలనే కోరిక నాలో క్రమంగా బలపడ సాగింది. నా సహజ స్వభావానికి అనురూపమైన మరో కార్య క్రమం చేపట్టాలని తోచింది. అందుచేత మూడో సాధారణ ఎన్నికలకు కాల నిర్ణయం జరగడానికి చాలా ముందుగానే ప్రధాన మంత్రికి నేను ఎన్నుకొన్న క్రొత్త పంథా గురించి వ్రాత మూలకంగా తెలియ జేస్తూ అందులో అడుగిడి ముందుకు సాగేటందుకు అనుమతి ఇవ్వవలసిందని కోరాను ఆయన సహజ సౌజన్యంతో నా కోర్కెను అంగీకరించారు.

అందుచేత నా పథంలో మార్పు నిర్ధారణ అయ్యింది అంతరాత్మ ప్రగాఢమైన ఏకాంతాన్ని తిరిగి ఎన్నుకోమని అంటోంది ఆ ఏకాంతం కళ్లు మూసుకొని కూర్చునే నిశ్చల ధ్యాన సమాధి కాదు, చైతన్య రహితమైనది

అసలే కాదు దృష్టి గోచరమయే కర్మ స్వరూపం, నిరంతర సాధనా రూపమైన ధ్యానము. అది ఏదైతేనేమిటి, నాకు వివేకానంద స్వామి చెప్పిన "నీ ముందున్నవన్నీ భగవంతుని అనంత రూపాలే వాటిని తోసి పుచ్చి భగవంతుణ్ని ఎక్కడ అన్వేషిస్తావు? ఎక్కువ తక్కువలు మైత్రీ శత్రుత్వాలు లేకుండా సర్వ జీవ కారుణ్యంతో, ప్రేమానురాగాలతో ప్రవర్తించిన వాడే యథార్థంగా భగవంతుణ్ణి ఆరాధిస్తున్న వాడు" వాక్యాలే ధ్రువ తార వంటివి.

---o---

# అనుక్రమణిక (Index)


అక్బర్ హైదరీ, (సర్): 141, 163; 181; 184/185; 196
అకోలా: 110
అఖిల భారత కాంగ్రెసు కమిటీ చూ. ఎ. ఐ సి. సి.
అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్: 58
అఖిలభారత సర్వోదయ సమ్మేళన్: 354.
అచ్యుత్‌రావ్ దేశపాండే: 198
అజాద్ హైదరాబాద్: 220.
అధి నివేశ రాజ్య ప్రతిపత్తి: 303
అనిల్ హక్ సిద్ధాంతము: 187
అమర్నాథ్ (రు): 32; 34; 35; 39; 42;
48; 49;
అయోధ్య: 93.
అయ్యంగార్ కమిటీ: 258.
అల్ప సంఖ్యాక భాషావర్గాల కమిషను: 381.
(నవాబ్) అలియావర్ జంగ్ బహాదూర్: 238, 281.
అలీ సోదరులు: 31; 45
అసాఫియా వంశపు ఔన్నత్య కీర్తన: 161.
అహమ్మద్‌నగర్: 69.
అహమ్మదాబాదు· 42.
అంతర్వాణి సందేశం: 17.
అంతూ: 163.
ఆగ్రా· 59
ఆత్మ విమర్శ సాధనం. 36

ఆధ్యాత్మిక (భక్త) బృందం: 85, 98; 100.
ఆధ్యాత్మిక సాధన (పథం): 2; 5; 46; 68;
86 88; 90; 96; 199; 200.
ఆలిండియా కాంగ్రెసు కమిటీ: చూ ఎ. ఐ. సి. సి
ఆలిండియా ముస్లిం లీగ్: చూ. ముస్లిం లీగ్
ఆసఫ్ జాహి వంశం (నవాబులు): 206; 306; 369.
ఆంధ్ర కేసరి: చూ. ప్రకాశం పంతులు, టంగుటూరి.
ఆంధ్రపితామహ: చూ. హనుమంతరావు, మాదపాటి.
ఆంధ్రమహాసభ: 110; 111; 122; 128; 242 243
ఇత్తెహాదుల్ ముస్లిమీన్ (ఇత్తెహాద్) 182; 187; 220;
254; 259; 265; 275; 276, 285;
304; 305; 308; 312; 313; 321;
322.
ఇన్‌స్పెక్టర్ (డైరెక్టర్) జనరల్ ఆఫ్ ప్రిజన్స్ (పోలీసు)
(ఐ. జి. పి): 168; 171; 172; 173; 295; 330
ఇండియన్ నేషనల్ కాంగ్రెసు: చూ భారత జాతీయ కాంగ్రెసు
ఇండియన్ యూనియన్‌లో విలీనం కావాలి అనే వాదం:
277; 281; 311, 322; 324.
ఉత్తరాదిమఠం మధ్వాచార్య: 4
ఉదయపూర్: 251
ఉపనిషత్తులు: 200
ఉపవాసం: 36; 78, 200
ఉర్దూ 80, 108.
ఉస్మానాబాదు: 71; 72, 128, 329.
ఉస్మానియా విశ్వవిద్యాలయము: 115, 163, 164.
ఎ. ఐ. సి. సి.: 150, 209, 210, 211, 212, 213

(అఖిల భారత కాంగ్రెస్ కమిటి) 249
(ఆలిండియా కాంగ్రెసు కమిటీ)
ఎడ్మండ్ బర్క్ 48
ఎ (అ) లెన్ కాంబెల్ జాన్సన్ 307; 308.
ఏకనాథరావ్ కుల్‌కర్ణి : 133
ఏజెంటు జనరల్ : (భారత ప్రభుత్వపు) 309; 314; 331; 369.
ఏకాంతధ్యానం (వాసం/సాధన) : 16; 175; 201.
ఐ. జి. పి. చూ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు
ఐదవ జార్జి రాజు (చక్రవర్తి) : 9.
ఋషికేశ్ : 93
ఒక శకం (యుగం) ముగిసింది 328, 332
ఔదుంబరవృక్షం (మేడిచెట్టు) : 98.
ఔరంగబాదు : 125, 139, 152, 158, 161,
205, 226, 329.

కఫాని : 90
కబీరు : 39
కమలాదేవి చట్టోపాధ్యాయ 261.
కర్నాటక పరిషత్ : 111, 122, 128, 155, 229, 254.
కర్నాటక (కన్నడ) [ప్రాంతం/దేశం/యూనిట్] .
110, 111, 122, 123, 144, 155, 223,
225, 257, 288.
కరాచీనగరం : 45, 305.
కస్తూరిబా : 42
(డాక్టర్) కంట్రాక్టర్ 59.
కామరాజ్ 387
కార్మికుల సమ్మె 69-70
కార్యాచరణ సమితి 321.

కార్లైల్ : 37.
కాసి(శి)o రజ్వీ: 305, 306, 307, 308, 324.
కాశీ· 93
కాశ్మీర్ : 232, 233, 234, 235, 327.
కాశ్మీర కేసరి (సింహము)· 232
కాశ్మీర్ జాతీయ సదస్సు : 233
కాశేశ్వరరావు, అయ్యదేవర : 289
కాంగ్రెసు వర్కింగ్ కమిటీ : 232, 248, 249, 385
క్వాయిదే ఆజమ్ : 266
[మహమ్మదలీ జిన్నా అనే శీర్షికను కూడా చూడుడు.]
క్రికెట్ ఆట పోటీ: 20
క్విట్ ఇండియా ఉద్యమము : 207, 208, 210, 219, 220, 221, 230, 232, 241. 243. 254. 274. 349.
కువాలా : 53
కృష్ణాచార్య జోషి 294
కేకావళి . 39
కేదార్ : 164.
కేల్కార్. ఎన్ సి : 24
కేశవరావు. ఉమ్మెతల 340
(సర్దార్) కేశవరావు, జమలాపురం 224 225. 254. 287.
కేసరిపత్రిక : 49
కేంద్రశాసనసభ : 58
కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం 323
కైజరు : 8
కైవల్యధామ ఆశ్రమం : 33

కోదండరావు (రావు.ఎన్.కె) · 245
కౌలుదార్ల రక్షణ చట్టం : 353.
ఖమ్మం (ఖమ్మం మెట్టు) · 224. 292.
ఖాజీపేట 291, 292.
ఖాదీ ప్రచారం . [illegible], 362.
ఖాందేశ్ విద్యాసంఘము : 32, 33.
ఖిలాఫత్ · 31
ఖేడికర్, బి బి · 133
గడగ్ : 288, 320
గణేశ ఉత్సవాలు · 139
గద్వాల : 244
గంగాపూర్ : 3
గ్రంథాలయోద్యమము · 243
(డాక్టర్) గాడ్గిల్, డి.ఆర్ · 358
గాయత్రీ మంత్రము · 170
గాంధీ టోపీ · 22, 23.
గాంధీశకం · 22
గ్రామదాన్ · 358, 362
గీత (భగవద్గీత) . 5, 6, 35, 37, 38, 62, 89
168, 198.
గుణె, జె జి · 33, 35
గుణెశాస్త్రి · 62
గుల్జరిలాల్ నందా 345, 366.
గుల్బర్గా 215, 323, 325
గోపాలకృష్ణ గోఖలే : 49

గోవింద దాస్ షరాఫ్ (షరాఫ్) : 139, 158, 161, 162, 200, 226, 237, 238, 255, 287
గోవిందలాల్ నానాల్ (నానాల్) : 123, 147, 148, 155 178, 210, 215
గోవిందరావ్ పన్సారే : 265
ఘనత వహించిన నిజాము ప్రభువు : 108, 143, 145, 189, 196, 197, 206, 207, 217, 218, 220, 247, 248, 250,283, 311.
చదువుతున్నరోజుల్లో : 19.
చంచల్‌గుడా: 157, 221, 293, 294, 326.

చాతుర్మాస దీక్ష : 4.
చార్లీ చాప్లిన్ : 14.
చిత్తరంజనదాస్ (సి. ఆర్. దాస్) : 42, 43
చిల్లేపల్లి : 339, 356.
చౌధురీ, జె. ఎ : చూ. మిలిటరీ గవర్నరు, మేజర్ జనరల్ జె. ఎన్. చౌధురీ.
చౌధురీ, సి.డి : 238
చౌరిచౌరా : 47
జగన్నాథరావ్ చందర్కి : 225.
జనార్దన్‌రావ్ దేశాయ్ : 144, 155.
జబ్బల్‌పూర్ : 164.
జమ్మూ : 232, 233, 235.
జయకర్, ఎమ్. ఆర్ . 58
జయప్రకాశ్ నారాయణ్ : 290
జర్మను సైన్యాలు : 8

(పండిట్) జవహర్‌లాల్ నెహ్రూ: 10, 12, 2 2, 263
265 ,266, 277 ,278, 279, 293
294, 332, 333, 334, 335
338, 345, 351, 352, 366
377, 378, 282
జంఝాలు (జన్నిదాలు) . 169; 170.
జాతీయ కళాశాల : 33
జాతీయ పాఠశాల : 72
(సర్) జాన్ స్టూవర్ట్ మిల్ : 48
జిన్‌వాలా, ఎఫ్. జె : 55
జిన్నా : చూ మహమ్మద్ అలీ జిన్నా
జుహూసముద్ర తీరం : 51
జైలు (ఖైదు) శిక్ష : 70, 167, 127, 199
జైలు సూపరింటెండెంటు ; 171; 172; 174; 323;
325; 330.
జోషి, ఎన్.ఎమ్ : 53; 55; 56; 57; 58; 59;
69; 70; 71; 75,
జోసఫ్‌బాప్టిస్టా : 13.
ఝబ్‌వాలా, ఎన్. హెచ్ : 55
జ్ఞానప్రకాశ్ పత్రికా విలేఖరి : 58
జ్ఞానేశ్వరి : 37
టాకీలు : 14
టోల్‌స్టాయి : 37
డి బేటింగ్ సొసైటీ : 39
డివెలేరా : 24.
డోర్నకల్ : 292
ఢిల్లీ : 58; 59; 224; 266; 280; 294; 297.

302; 306, 315, 333, 369; 371.
తాజ్‌మహల్ 59
తిర్మిజి, సిరాజుల్‌హసన్ చూ సిరాజుల్ హసన్ తిర్మిజీ
(లోకమాన్య) తిలక్ మహారాజ్ . చూ. లోకమాన్యతిలక్
మహారాష్ట్ర విద్యాపీఠ : 48
తుకారాం · 37
తులసీదాసు : 39
తెలంగాణా : 122, 224, 225, 268, 269, 270; 272, 273, 288, 337, 338, 341, 343, 344, 348, 349, 350, 351, 353, 354, 355 356, 265
దామోదర్ పంగ్రేకర్ (దామోదర్) · 292, 293, 340
దిగంబర్ రావ్ బిందు (బిందు) · 106, 114, 126, 134 157, 158, 237, 287, 372.
దివాన్, ఆర్ ఎస్ 214, 215, 216
దేవ్‌రాయ్ చవాన్ 198.
దేవీసింగ్ చౌహాన్ 257
దేశపాండే వి. డి. . 237
దేశమాత పిలుపు 43
దేశసేవాదీక్ష 17, 24, 25.
దొరలు (భూములున్న ధనికులు) 268.
ధుని · 1
ధూళ్‌పేట అల్లర్లు, కొట్లాటలు . 131
నరసింగరావు కె వి 370
నరసింగరావు, (ఎమ్) మందుముల 237, 238, 242, 243.
నరసింహ రావు, వి. వి. 350.
(పండిట్) నరేంద్రజీ 153, 221.

నల్గొండ 244, 270, 317, 338, 340.
నల్‌దుర్గ్ : 329
నందాపూర్‌కర్, ఆర్ జి · 237.
నాగపూరు 164
నాగపూర్ విశ్వవిద్యాలయము : 164
నాద్ 18.
నానల్‌నగర్ : 379
నాబర్, సి ఎన్ 9
నాయక్, ఎస్ వి · 226
నారాయణత్రయం : 244
నారాయణరావు, కళోజి 244
కొమరగిరి 244
[illegible] : 243
నారాయణరావు జోషి · 107
నారాయణరెడ్డి, రావి. 144, 155, 224, 242.
243, 344, '56
నాస్తిక భావాల ప్రభావం : 3
నాంపల్లి · 215
నిజలింగప్ప, ఎస్ · 280
నిజామాబాద్ 89, 198, 199, 313
నిజాము (నైజాము) · 106, 162, 187, 189 198,
214, 215, 216, 219, 222, 223
229, 231, 277, 278, 281, 286,
303, 304, 307, 308, 315, 318,
321, 322, 324, 325, 327, 329,
330, 331, 332, 333, 335, 369.

నిజాం ఫర్మానాలు 275

నెపోలియన్‌బోన పార్టీ : 39

నైజాము చూ నిజాము.

(డాక్టర్) పట్టాభిసీతారామయ్య 209

పర్భాని 215

పరంజపె, ఆర్. జి. (బాబాసాహెబ్). 106, 133, 237, 256

పశ్చాత్తాపం · 6, 7, 38, 65

పహాడే, ఎమ్ కె · 255.

ప్రకాశం, టి (ఆంధ్రకేసరి) 289

ప్రజామండలులు 214.

"ప్రజాస్వామ్య పరిపాలనా వ్యవస్థ – దాని పరిణామము" పరిశోధనాత్మక వ్యాసము · 49

ప్రతిజ్ఞ 86, 106, 107, 161, 201, 327.

ప్రయాగ : 93.

పాకిస్తాన్ 299, 304, 305, 322

పాటిల్, ఆర్.కె 345, 366

పాటిల్, ఎస్ కె · 288

పారాప్లీజియా అనే నరాల దౌర్బల్యపు వ్యాధి · 59

ప్రాణేశాచార్య, జె కె · 195, 225, 287

పుల్లారెడ్డి, వి (పాగ) : 244

పూణె (పూనా) 24, 49, 50, 51, 52, 127, 151

"పెట్టుబడి – శ్రమశక్తి" వ్యాసం 53

పోలీసుచర్య 233, 352, 365, 370

పౌరహక్కులు : 111, 113, 120, 127, 177, 252

పూల్‌చంద్ గాంధి · 371

బఖాలే, ఆర్. ఆర్ 55

బహుదూర్‌యార్‌జంగ్ . 275

బ్రహ్మచారి జీవితం · 37
బ్రహ్మపురి 93
బ్రహ్మానందుడి భక్తిగేయాలు · 168
బాధ్యతాయుత ప్రభుత్వము : 111, 140, 141, 247, 251, 262, 278, 312, 321, 322, 324
బార్డోలి · 42
బాల్య (ఒక సన్యాసి) . 90
బిల్‌గ్రామి · 183
బ్రిటను · 217, 323
బ్రిటీషు పార్లమెంటు ప్రతినిధివర్గము · 274
బ్రిటీషు మంత్రివర్గ కమిషను 260, 277
బ్రిటన్‌లో కార్మిక పార్టీ ప్రభుత్వం 249
బీడ్ జిల్లా · 100
బీదర్ 182, 183, 255
బీబీనగర్ · 313
బెజవాడ · చూ. విజయవాడ
బేగంపేట 102
బొంబాయి : 15, 53, 59, 69, 209, 210, 214, 289, 294, 310, 311, 320, 332, 356
బొంబాయి రాష్ట్ర కాంగ్రెసు కమిటీ . 268
భక్తబృందం · 85
భగవద్గీత చూ గీత
భగవాన్‌దాన్ గంజ్వే . 257
భారత కమ్యూనిస్టు పార్టీ (కమ్యూనిస్టు పార్టీ) 242, 270, 335, 343, 344, 348, 356, 365.

భారత జాతీయ కాంగ్రెసు (ఇండియన్ నేషనల్ కాంగ్రెసు) 22, 143, 149, 223, 232, 377, 379

భారత జాతీయకాంగ్రెసు నానాల్‌నగర్ సమావేశము 379

భారతదేశ సంస్థానాల ప్రజాసదస్సు (సభ) · 209, 210, 214, 232, 251, 266

భారతదేశ సేవాసంఘము (సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటి) 49

భారత రాజ్యాంగ చట్ట నిర్మాణసభ . 260, 262

భీమా అమరజానదుల సంగమము 3

భూకమతాల గరిష్ట పరిమితి 345, 366, 367.

భూదాన ఉద్యమము 356, 357, 358, 360, 361, 362.

భూదాన గంగ : 355

భూసంస్కరణల సమస్య (ప్రతిపాదనలు) 365, 366

మకర సంక్రాంతి 88

మరాధిపతి · 4

మడికొండ 243

మద్రాసు . 291, 300, 301, 302

మధిర 291, 292

మన్ననూరు జైలు 154

మన్మాడ్ . 179

మరాటా పత్రిక 49

మరాట్వాడా (మహారాష్ట్ర ప్రాంతం) · 110, 113, 114, 123, 124, 125, 139, 140, 200, 255, 256, 257

మరాట్వాడా పత్రిక · 127.

మహాత్మాగాంధీ (మహాత్మాజీ, గాంధీజీ) 13, 14, 16, 27, 29,

31, 34, 35, 37, 42, 43, ,49, 50, 51, 5?, 87, 96, 177, 178, 179, 181 184, 185, 186, 187, 188, 191, 192, 193, 194, 195, 196, 198, 200, 205, 206 207 208, 210, 212, 213, 227, 71, 278, 310, 323, 32.

మహారాష్ట్ర పరిషత్ 113, 123, 125, 127, 128, 129, 133, 138, 152, 20', 226, 229

మహారాష్ట్ర పరిషత్‌కార్యదర్శి (జనరల్ సెక్రటరీ) . 126, 133.

మహారాష్ట్రప్రాంతం చూ. మరాట్వాడా

మహారాష్ట్రమండలి (సభ) 255

మాజినీ 24

మాణిక్‌చంద్‌పహాడే : 222

మాంట్‌ఫర్డ్ సంస్కరణలు 13, 267.

మిత్రమండలి · 8, 12.

మిలిటరీ అత్యాచారాల నిరసన : 271

మిలిటరీగవర్నరు, మేజర్‌జనరల్ జె. ఎన్. చౌధురీ . 3 2, 370

మీనన్, వి. పి. 304, 306, 307, 315.

(సర్) మీర్జా ఇస్మాయిల్ 259, 265, 269.

మీరట్‌కుట్ర కేసు · 71

మీర్‌లాయక్ అలీ (లాయక్‌అలీ) : 295, 300, 308, 321, 324, 330.

ముకుందరావ్ పెండ్గాకర్ · 256.

మహమ్మద్‌అలీ జిన్నా : 304 305.

మున్షీ, కె ఎమ్. 309, 311, 314, 317, 320, 3?1, 331, 332, 369.

మురళీధర్‌రావు కామ్‌టి కర్ 255
ముస్లింలీగ్ 265.
మూడోసాధారణ ఎన్నికలు 391
మెకంజీ కమిటీనివేదిక 112.
(డాక్టర్) మేల్కోటె, జి ఎస్ 216, 220, 222, 223, 224
294, 314
మైథిలీ శరణ్ 82
మొదటి జనరల్ (సార్వత్రిక/సాధారణ) ఎన్నికలు 343, 372
మొదటి సత్యాగ్రహోద్యమము 157.
మొదటి సాహసిక కార్యక్రమం 31
(నవాబ్) మొయిన్ నవాజ్‌జంగ్ బహదూర్ . 300
మొహమ్మద్ అఫ్జల్‌బేగ్ 232
మోతీలాల్ మంత్రి 198,
మోతీలాల్ నెహ్రూ 58
మోమీనాబాద్ : 100, 102, 103 104, 105, 106,
115, 119, 121, 128, 133
మోరోపంత్ · 39.
మౌలానా మొహమ్మద్ అలీ · 50 51
మౌంట్‌బాటెన్ ప్రభువు (వైస్రాయి) 296 304, 307 308
యథాతథపు ఒడంబడిక , 303, 306, 309
యరవాడ జైలు 49
యజ్ఞోపవీతాలు 169
"యంగ్ ఇండియా" (యువభారత) : 34, 45.
యావజ్జీవ బ్రహ్మచర్య వ్రతదీక్ష 17, 33.
యు. ఎన్. ఓ : 301
యూత్‌క్లబ్ (యువకుల సంఘం) 24
యూనియన్ జాక్ · 9

యేకాంతవాస కఠిన శిక్ష. 169
యోగేశ్వరీ నూతన్ విద్యాలయ 102, 118, 133.
రజాకార్లు - 307 25 329, 331.
రమణ మహర్షి - 314
రత్నాలీకర్, రంగారావు 134
రస్కిన్ 37,
(ఆచార్య) రంగా. ఎన్. జి. 281
రా ీయ కార్యకర్తల శిక్షణ కేంద్రం 236
రాజప్రముఖ్ 308.
రాజరిక వ్యతిరేక చర్య , 9.
రాజలింగం, ముదిగొండ సిద్ధవీర (ఎమ్. ఎస్.) 244
రాజీ సంభాషణలు (సంప్రతింపులు) . 298 305 324
రాట్నము - 28, 31, 45.
(డాక్టర్) రాధాకృష్ణన్, సర్వేపల్లి ; 86, 293
రామకృషదూత్ 155, 156, 222
రామకృష్ణారావు, బూర్గుల : 3.
రామచంద్రరావు అంతూ (అంటూ) , చూ. అంతూ.
రామచంద్రరావు, మందుముల . 158, 242.
రామచంద్రరావు, మాడపాటి 257.
రామాచారి, జి. 298
రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కమిషన్ , 375, 379
రూసో 48
లండన్ 59, 301.
లాకె 48
లాటూర్ · 125, 126, 128, 129, 130, 133 138, 152
లాయక్ అలీ. చూ. మీర్ లాయక్ అలీ

లాల్ బహదూర్‌శాస్త్రి : 387.
లాలా లజపతిరాయి : 22, 58
లూఢియానా : 209
లోకమాన్య తిలక్ 9, 10, 12, 13, 15, 16, 34, 52.
వర్దూరు : 123, 126, 127
వరంగల్ 224, 243, 244, 317.
(సర్దార్) వల్లభాయిపటేల్ : 297, 307, 309, 310, 314, 321.
326 333, 334, 335
వల్లూరి బసవరాజు : చూ వి. బి రాజు
వందేమాతరం ఉద్యమం : 70
171, 172, 225.
వందేమాతరం రామచంద్రరావు 173
వాఘ్‌మారె, ఎ. కె . 106, 114, 127.
వాడీస్టేషన్ . 215
వామన్‌నాయక్ : 102, 103.
వార్ధా . 185 186, 193
విజయవాడ (బెజవాడ) : 288, 289, 317, 320.
విజయోత్సవం 327.
విఠల్‌భాయిపటేల్ : 58.
విద్యుత్ సన్యాసము : 94.
విద్యార్థి పత్రిక 40
విద్యార్థి లోకం : 117, 160, 162, 164
వినాయక్‌రావు విద్యాలంకార్ : 371
(ఆచార్య)వినోబాభావే(వినోబాజీ)· 194, 354, 355, 356, 357.
వి. బి. రాజు : 288, 371.
విల్లింగ్డన్ ప్రభువు : 11.
విలీనతాదినోత్సవము : 290.

విశ్వనాథం 326
విశాలాంధ్ర : 289
విష్ణుశాస్త్రిచిప్లంకర్ 51
వెల్లోడి, ఎమ్. కె · 288, 371.
వెంకట రామారావు, కాంచనపల్లి 244.
వెంకటరావు · 72, 107
వైద్య, కె ఎస్ 105, 113, 181, 238.
వైశంపాయన్, ఎస్. కె 237, 255.
శంకరాచార్యులవారు 45.
శ్యామ్‌రావ్‌బోధన్‌కర్ 255.
శాంతియుతవుద్యమం 21
శివరాంపల్లి 354
శివాజీ 24
శ్రీమన్నారాయణ్ 378.
శ్రీనగర్ 232.
శ్రీనివాసరావు బోరికర్ · 155, 156.
షేక్ మొహమ్మద్ అబ్దుల్లా (కాశ్మీరకేసరి) 232, 233, 234, 235, 278.
షొలాపూర్ . 4, 9, 11, 13, 24, 27, 69, 70, 71, 106, 177, 214, 215, 287.
షొయబుల్లాఖాన్ · 322.
సకలత్‌వాలా, ఎస్ ఎన్ : 57
సత్యమూర్తి 58
సత్యనారాయణరావు, బొమ్మకంటి 245.
సత్యాగ్రహోద్యమ సర్వాధికారి (డిక్టేటర్) 157.

సత్యాగ్రహోద్యమం
(సత్యాగ్రహం, సత్యాగ్రహి, సత్యాగ్రహులు)
123, 145, 152, 153, 154, 155, 156, 157, 158, 159, 166, 169, 170, 171, 172, 173, 174, 177, 178, 179, 192, 194, 195, 196, 197, 198, 200, 204, 206, 221, 223, 224, 225, 226, 227, 243, 250, 286, 320, 323, 325, 329
సన్యాసి . 2, 17, 86, 89, 95, 116
సమర్ధరామదాస్ 37
సయ్యాద్ మొహమ్మద్‌హసన్ 330
సర్దార్‌గృహం 15
సర్వెంట్స్ఆఫ్ఇండియా సొసైటీ చూ. భారతదేశ సేవా సంఘము
సర్వోదయమార్గాన్ని అనుసరించేవారు 359
సహాయ నిరాకరణోద్యమం 22, 42, 47
స్వదేశ సంస్థానాల పిలీసము 306
స్వపరిపాలన Home Rule ఉద్యమం 12.
స్వరాజ్యపార్టీ 58
సంగారెడ్డి 323.
సంపాదకీయ బాధ్యత 40.
సాధువు . 2, 90
సానెగురూజీ 97
స్వామి కువలయానందులు 33
స్వామి నారాయణ్ 93, 94.
స్వామిరామకృష్ణపరమహంస 68.
స్వామి రామతీర్థ : 5, 7, 60, 63, 86, 92, 93, 94,

స్వామిరామదాసు 91
స్వామి రామానందతీర్థ : 95, 218, 238, 313, 318, 321
స్వామి వివేకానంద 5, 86, 392.
సాంబమూర్తి, బులుసు 301.
సినిమాలు 14.
సిరాజుల్‌హసన్ తిర్మిజి . 159
సుల్తాన్ బజారు : 155, 180, 198, 290, 291, 294, 330.
సుందర భవన్ : 134
సూరదాస్ . 7, 39
సూర్యాపేట . 270
సెనూన్ ఆసుపత్రి 49
సేనాపతి బాపట్ 151
సేవాగ్రామ్ 181, 182, 184, 185, 186, 190, 191, 194,
195, 205, 207, 208, 327
సైనిక పరిపాలన (దౌర్జన్యాలు) · 332, 345.
సోపూర్ 233
హకీమ్ అజ్మల్‌ఖాన్ 43
హనుమాన్ వ్యాయామశాల 326
హనుమంతరావు, కక్కేరి 254, 255
హనుమంతరావు, మాడపాటి
(ఆంధ్ర పితామహ) 113
హనుమంతుడిగుడి · 30
హుమ్నాబాదు 127
హయగ్రీవాచార్య, టి 244
హరిజనపత్రిక : 205
హరిశ్చంద్రహెడా 156, 158, 222, 238.

హాబ్స్ 48.
హిప్పర్గి 71, 72, 75, 79,8 98, 94, 97, 98, 100, 107
183, 256, 257.
హిప్పర్గి ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయుడు 71.
హిందూమహాసభ 150, 154
హిందూపౌరహక్కుల సంఘము : 153, 158.
హీరాలాల్ కోటీచా 198.
హుజూరునగర్ 338.
హోమ్‌రూలు ఉద్యమం · చూ. స్వపరిపాలన ఉద్యమం
హైదరాబాదు నగరానికి ప్రయాణం (జూన్ 9, 1938) : 133.
హైదరాబాదు (నగరం/ సంస్థానం) · 101, 105, 107,
111, 113, 115, 117, 133, 134,
135, 136,137, 147,148 156, 164, 165,
177, 183, 212, 218, 220, 233, 240,
251, 263, 269, 283, 298, 303, 306,
313, 314, 324, 327, 329, 331, 334,
345, 368, 370, 372, 373, 374, 375,
376 377, 378, 379.
హైదరాబాదు నేషనల్‌కాన్ఫరెన్సు (హైదరాబాదు ప్రజాసభ)
187, 188, 210, 248
హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు · 123, 138, 141, 143, 144, 146,
147, 148, 152, 154, 155, 156,
166, 177, 179, 182, 187 190,
191, 192, 193, 194, 195, 196,
200, 205, 215, 216, 219, 220, 221,
225, 229, 230, 236, 246, 247. 249,
251, 254, 259, 260, 279, 280, 284,

3, 318, 350,

హైదరాబాద్ సంస్థాన విద్యావేత్తల సమావేశము, 1937 లో : 105, 112.

హైదరాబాద్ ప్రజాసభ, చూ. హైదరాబాద్ నేషనల్ కాన్ఫరెన్సు.

హైదరాబాద్ సంస్థానంలోకి ఒకసారి తొంగిచూస్తే అనే చిన్న పుస్తకం . 150.

# సవరణలు

| పేజీ | లైనులో | |
|---|---|---|
| 15 | 25 | "ఎట్లాగైతే నేమి" అన్నది తొలగించండి. |
| 50 | 25 | 'ఆయన' తర్వాత 'ముఖంలో' అని చేర్చండి. |
| 54 | 22 | 'భావించి" అన్నది "అనుభవించి" గా సవరించండి |
| 61 | 12, 13 | చివరి వాక్యాన్ని "ఈ ఆలోచనలు అన్నీ నాకు అప్పుడు వచ్చేవి. అయినా ఆయనను వదలకుండా ప్రార్ధన చేసేవాడ్ని" అని సవరించండి. |
| 107 | 1, 2 | "శ్రీనారాయణరావు జోషి, దేశాభ్యుదయానికై దీక్షవహించిన వారూ హిప్పర్గి గ్రామం వారూ అయిన శ్రీ వెంకటరావు సోదరులు" అని సవరించండి |
| 137 | 3 | "సాగడానికి తగిన బలం పొంది ఫలితాలు సాధిస్తుందనే తత్వాన్ని" అని సవరించండి. |

ఆ

3-9-2

21

4/13

## ... ఈ గ్రంథాన్ని గూర్చి ...

హైదరాబాదు రాష్ట్రాన్ని ప్రజాస్వామీకరించి, భారత యూనియన్‌లో విలీనంచేసే నిమిత్తం నైజాంకు వ్యతిరేకంగా జరిగిన పోరాటం చరిత్రాత్మకమైనది స్వామి రామానందతీర్థ ఈ పోరాటానికి స్ఫూర్తినిచ్చారు. వ్యవస్థీకరించారు, నాయకత్వం వహించారు. ఆధునిక భారతదేశచరిత్రలోని సుదీర్ఘము, సుప్రసిద్ధము అయిన ఈ అధ్యాయానికి సంబంధించిన స్వామిజీ జ్ఞాపకాలను ఈపుస్తకంలో గ్రంథస్థం చేశారు.

స్వామీజీ చిన్నతనం నుండే వైరాగ్యం వైపు ఆకర్షితులైనారు నవయవ్వనం లోనే సన్యాసాశ్రమాన్ని స్వచ్ఛందంగా స్వీకరించారు అయినప్పటికి హైదరాబాదులో ఆనాడు నెలకొని యున్న పరిస్థితుల ప్రాబల్యం కారణంగా రాజకీయ కలాపాలలో నిమగ్నులు కావలసివచ్చింది.

మోమినాబాదులో స్వామీజీ 1937లో స్థాపించిన విద్యాలయం నుండే నైజాం నిరంకుశ పరిపాలనకు ప్రతిఘటన ఆ[illegible] తరువాత క్రమేణా గాంధీమహాత్ముని నాయకత్వంలో మిగతా భారతదేశంలోజరిగిన స్వాతంత్ర్యోద్యమం వల్లస్ఫూర్తిని పొంది, ప్రతిఘటనా ప్రే[illegible] ఇతర రంగాలకు కూడా విస్తరించింది

భారతదేశానికి స్వాతంత్ర్యం లభించటం, హైదరాబాదు రాజ్యాన్ని భారత దేశంలో [illegible] వ్యతిరేకించడం హైదరాబాదు ప్రజాపోరాటాన్ని తీవ్రతరం జేసినవి మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మీన్ మత దురభిమానంతో సైన్యం మోస్తరు సాయుధంగా తయారయి ప్రజలను హింసలకు గురిచేస్తూ భారత ప్రభుత్వం జోక్యం చేసికోవటానికి దారి తీసినది భాషాయుక్తంగా రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ తర్వాత హైదరాబాదు రాష్ట్రం విచ్ఛిన్నం అయింది. భారత దేశ చరిత్రలో ముఖ్యమైన ఈ ఘట్టానికి సంబంధించిన సన్నివేశాల వెనుక నడచిన తతంగాలను పాఠకుని దృష్టికి మొట్ట మొదటి సా[illegible]కం—.